# ADMISSIONS OPEN - 2013

## COURSES OFFERED

### UG Programmes

- Electronics & Communication Engg.
- Electronics & Computer Engineering
- Electrical & Electronics Engineering
- Computer Science & Engineering
- Mechanical Engineering
- Civil Engineering
- Information Technology
- Mechatronics
- Agricultural Engineering
- Automobile Engineering
- Biotechnology*
- Chemical Engineering
- Textile Technology

* Bi.PC Candidates are also eligible for admission into Biotechnology Programme.

### BBM + MBA

5 Year INTEGRATED COURSE

**Eligibility**: Intermediate with **MEC, CEC, MPC** or **Bi.PC** group with minimum **60%** aggregate

### PG Programmes

**School of Electronics**
- Embedded Systems
- VLSI
- Communication & Signal Processing
- Digital Electronics & Communication Systems
- Data Communication & Networking

**School of Electrical**
- Power Electronics & Drives
- Power Systems

**School of Chemical**
- Chemical Engineering
- Food Processing Technology
- Petroleum Engineering

**School of Computing**
- Computer Science & Engg.
- Information Technology

**School of Mechanical**
- Machine Design
- CAD/CAM/CAE
- Thermal Engineering

**School of Biotechnology**
- Biotechnology & Bioprocess Engineering

**School of Management** MBA | **School of Computing** MCA | **Ph.D Programmes**

INNOVATIVE PROGRAMMES: **B.Tech+Civil Services | BBM+Civil Services**

## B.Tech Admission Test: V-SAT 2013 - Online Test

### SCHOLARSHIPS+

- **Full Fee Waiver for** Top 100 Rankers of V-SAT '13
- **50% Fee Waiver for** 101-300 Rankers of V-SAT '13
- **25% Fee Waiver for** 301-500 Rankers of V-SAT '13

+ Applicable for 1st year only

**The scholarships are also available for top rankers of EAMCET & JEE (MAINS)-2013**

### How to Apply

- Applications are available at selected branches of Post Offices & Branches of all Vignan Institutions in A.P.
- Download the application from the university website www.vignanuniversity.org
- By sending a DD for Rs. 800/- along with self addressed and stamped envelope.
- DD should be drawn in favour of Vignan University, payable at Guntur on any scheduled bank and sent to:Director Admissions, Vignan University, Vadlamudi, Guntur Dist.-522 213. A.P.

### WHY VIGNAN

**Well Qualified Faculty:** With M.Tech & Ph.D qualification backed by research experience from IITs, NITs and other Premier Institutions

**Focus and Flexibility:** Our courses have been designed with the flexibility to meet the ever - changing demands of industry

**Internships:** Semester long internships with public sector as well as private sector companies

**Industrial Research & Training Centre:** Established in collaboration with AAS Technologies and IBM centre of excellence for training & project work.

**Campus Recruitment Training:** A 200 hours comprehensive campus recruitment training by qualified trainers and a 150 hours domain training in association with reputed finishing schools.

**Campus Placements:** Close Industry-institutions associations ensure upto 90% placement opportunities in all engineering streams. The highly professional placements department has network with a number of fortune 500 companies.

**Faculty Mentors:** Senior Professors from IITs / NITs as faculty mentors for each department to promote best practices in teaching / research.

### Important Dates

Last date for receipt of applications **05-4-2013**

V-SAT'13 On-line Test Dates: **14-4-2013** to **20-4-2013**

For details of **V-SAT 2013** test centres / availability of applications and other information visit our website: **www.vignanuniversity.org**

Contact +91 863 2118 487/88 +91 866 6593777/888

INFORMATION CENTRES

**VIJAYAWADA:** 40-5-5, Opp: Hotel D.V.Manor, Behind Hotel Adhikari, Bundar Road Ph: 0866 - 6593777/6593888/6593111 Cell: 9949983666

**GUNTUR :** 4/7, Brodipet, Near Sindhoori Hotel Ph: 9701051280

**HYDERABAD:** 503, Babu Khan Estate, Basheerbagh Ph: 040-66756708

**VIZAG:** Vignan High School, Siripuram Junction, Opp:Andhra University, Ph: 9912333673



**VIGNAN**
UNIVERSITY
Foundation for Science, Technology & Research
(Estd u/s 3 of UGC Act of 1956)
VADLAMUDI, GUNTUR (Dt.)

FMC/VNU/402

2

KRSA101M241

# అక్షర లక్షలు...



**ముఖాముఖీ**



పోటీలకు ఆహ్వానం



**పెద్దల మాటలు**



**ఈ నెల కథాపారిజాతం..**



ప్రత్యేక శీర్షికలు




రామోజీ ఫౌండేషన్

# తెలుగు వెలుగు

సంపాదకుడు: **రామోజీరావు**

**సంపుటి : 1 , సంచిక : 6**

**ఫిబ్రవరి 2013**

**పుటలు :** 100, **వెల :** రూ. 20

అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా

**ముఖచిత్రం :** శ్రీధర్, కార్టూనిస్ట్

**పత్రాలంకరణ :** రవిశంకర్

**సహకారం :** రామోజీ విజ్ఞానకేంద్రం

**ప్రకటనల కోసం :** +91 80081 51599, +91 90001 80608

**వివరాలకు :** సంపాదకుడు, తెలుగువెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, అనాజ్‌పూర్, రంగారెడ్డి - 501 512.

**ఫోను:** +91 8415 246 999

**మొబైల్:** +91 800 800 1656

**ఫ్యాక్సు:** +91 8415 305 018







**Telugu Velugu**

Owned, Printed, published and Edited by Ramoji Rao on behalf of Ramoji Foundation, Ramoji Film City, Hayathnagar Mandal, Ranga Reddy District, Andhra Pradesh. Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally, Rangareddy District -500 072.

RNI No: APTEL/2012/45352




**విన్నపం:** తెలుగు భాషాభివృద్ధి, పరిరక్షణ, మేధోమథనం 'తెలుగువెలుగు' ముఖ్య ఆశయాలు. మన భాషకు పుష్టి చేకూర్చే రచనలకు పత్రికలో అగ్రతాంబూలం లభిస్తుంది. ఈ రచనల్లో వెల్లడయ్యేవి రచయితల అభిప్రాయాలు మాత్రమేనని మనవి. ఇవన్నీ పత్రిక యాజమాన్యం, సంపాదకవర్గ అభిప్రాయాలు కానక్కర్లేదు. భిన్న భావజాలాలకు నిష్పక్షపాత వేదికగా ఈ పత్రిక నిలుస్తుంది.

# నడుద్దాం... తెలుగులోకి.. వెలుగులోకి!



వాడుకలో లేని భాష వెనకబడుతుంది. వాసి తరిగి, వాడి కోల్పోయి, గాడి తప్పి... క్రమేణా మరుగున పడిపోతుంది. మన భాషకు అటువంటి దుర్దశ దాపురించకూడదని ప్రతి తెలుగువాడూ ప్రతిన పూనాల్సిన తరుణమిది. ఈనెల 21న మాతృభాషా దినోత్సవం. జాతి కట్టుబాటును మతంకన్నా మిన్నగా భాష శాసిస్తుందని బంగ్లాదేశ్ అనుభవం లోకానికి చాటింది. అక్కడి స్వాతంత్ర్యోద్యమానికి పునాది పడిన ఫిబ్రవరి 21ని మాతృభాషా దినోత్సవంగా పాటించాలని ఐక్యరాజ్యసమితికి చెందిన విద్యా సాంస్కృతిక మండలి (యునెస్కో) 1999లో పిలుపిచ్చింది. 'భాషకు ముప్పు' గురించి వచ్చినప్పుడు... 'మన భాషకు ఏమైందిప్పుడు.. భేషుగ్గానే ఉందికదా!' అని దీర్ఘాలు తీసే నిక్షేపరాయుళ్లతో ఉద్యమకారులకు నిమిత్తం లేదు. ప్రమాద తీవ్రత, పర్యవసానాల సంగతి తెలిసి ఆందోళన చెందుతున్న భాషాభిమానులకు మనమెంతటి ఉత్పాతం ఎదుర్కొంటున్నామో లోతుగా విపులీకరించాల్సిన పనీ లేదు. దేశంలో హిందీ తరవాత అత్యధికులు మాట్లాడే భాష ఏమిటి? కొన్నాళ్లక్రితం వరకు తెలుగు; ఇప్పుడు కాదు! స్వరాష్ట్రంలోనే ఆదరణ కోల్పోతున్న భాషకు జాతీయస్థాయిలో ప్రాభవ పునరుద్ధరణ సులభసాధ్యమేనా అన్నది గడ్డుప్రశ్న. దీటైన పరిష్కార మార్గాల బాట పట్టి తెలుగుదనం కోసం తెలుగుధనం కోసం వేట సాగించడానికి మాతృభాషా దినోత్సవాన్ని మించిన సుముహూర్తం ఉండదు!

తలచుకోవాలేగాని, ఎవరైనా ఎన్నెన్ని అద్భుతాలైనా సృష్టించగలరు. ఇక్కడ కొన్ని ఉదాహరణలను ప్రస్తావించాలి. ఆధునిక సమాచార విప్లవ యుగమిది. తెలుగులో ఎటువంటి సమాచారం కావాలన్నా చిటికెలో అందుబాటులోకి తెచ్చే అంతర్జాల విజ్ఞాన సర్వస్వం గురించి మీరు విన్నారా? అవును... 'తెలుగు వికీపీడియా' రూపేణా కొన్నాళ్లుగా అది సంచలనం సృష్టిస్తోంది. అందులో పండితులు, పామరులు ఎవరైనా రాయవచ్చు. వేల సంఖ్యలో పొందుపరచిన వ్యాసాలను ఉచితంగా చదువుకోవచ్చు. చరిత్ర, సంస్కృతి, సంగీతం, సాహిత్యం, భాష, రాజకీయాలు, నదులు, క్రీడలు... ఎన్నో అంశాలపై ప్రపంచవ్యాప్తంగా తెలుగువారెందరో రాసిన, రాస్తున్న వ్యాస సంకలనమది. నచ్చినవి, మెచ్చినవి ఉచితంగా ప్రతులు తీసి పంచుకోనూవచ్చు. ఉత్సాహం, చొరవ ఉండి, కొద్దిమందే అయినా చేయీ చేయీ కలిపితే సాధించగల అద్భుతానికి 'తెలుగు వికీపీడియా' మచ్చుతునక. విదేశాల్లో తెలుగు కుటుంబాలెన్నో ఇక్కడికన్నా మెరుగ్గా మన పండుగలను పద్ధతిగా జరుపుకొంటున్నాయి. మూలాలు చెడిపోకుండా ప్రణాళికాబద్ధంగా తెలుగు తరగతులు నిర్వహించుకుంటున్నాయి. ప్రవాసంలో ఉండి వారంతా ఎంతో చేయగలుగుతున్నప్పుడు- ఈ నేలపై తిరుగాడుతూ, ఇక్కడి గాలిని శ్వాసిస్తున్న మనం... మరెంత చేయాలో- ఆలోచించండి!

భాషను బతికించుకుని, కొత్తగా జిలుగులు అద్దడానికి- వ్యక్తులు శక్తులై ఎంతైనా చేయగల అవకాశముంది. ఇళ్లల్లో, కార్యాలయాల్లో, నిత్యజీవన వ్యవహారాల్లో విరివిగా తెలుగు వాడకం పెంపొందించడం అందులో మొదటిది. భాషాభిమానం పేరిట కృతకమైన అసహజ ప్రయోగాలను, అసంబద్ధ పద్ధతులను ప్రోత్సహించకుండా ఎవరికివారు జాగ్రత్తపడటమూ అవసరమే. పునాది స్థాయి నుంచి ఉన్నత విద్య వరకు పాఠాల్లో, పాఠ్యాంశాల్లో తెలుగుదనం నింపుకోవడం మరింత ముఖ్యం. ప్రాంతీయ వైవిధ్యానికి జడలో మల్లెపూదండలు తురిమే పదసంపదను పదిలపరచుకునే యత్నం ఉద్యమస్థాయిలో ఊపందుకోవాలి.

పునాది గట్టిగా ఉంటేనే భవంతికి మన్నిక. రేపటి పౌరుల నోట తెలుగు ఊట ఊరడానికి అలాంటి పునాది, చిరునామా- పాఠ్యపుస్తకాలే. వాటిలో భాష విద్యార్థులను బెంబేలెత్తించేలా ఉండకూడదు. వారిలో తెలుగుపట్ల ఆసక్తి, అనురక్తి ఇనుమడింపజేసే సరళ ప్రయోగాలతో అవి తొణికిసలాడాలి. అకాడమీలు, విశ్వవిద్యాలయాలు కొంతలో కొంత చేసిన కృషి ఏ మేరకు ఫలించిందీ చూస్తూనే ఉన్నాం. అవి యాంత్రికంగా, హడావుడిగా పాఠ్యపుస్తకాల్లో ఇమిడ్చిన పదజాలం జనసామాన్యం వాడుకలోకి వెళ్లలేదని, వేళ్లూనుకోలేదని తరచూ ఫిర్యాదులు వెల్లువెత్తుతున్నాయి. ఇప్పుడు కావల్సిందల్లా... వ్యక్తిస్థాయిలో చేతన, చొరవ, పట్టుదలలే!

మాతృభాషపై పట్టులేని ఏ జాతీ పరిపూర్ణ ప్రగతిని సాకారం చేసుకోలేదు. ఈ మర్మాన్ని గ్రహించే- చైనా, జపాన్, స్పెయిన్, ఇటలీ, జర్మనీ, పోలెండ్, ఈజిప్ట్ సహా దేశాలెన్నో మాతృభాషలో విద్యాబోధనకు పెద్దపీట వేస్తున్నాయి. మన ఇరుగుపొరుగు రాష్ట్రాలూ అమ్మభాషను కంటికి రెప్పలా కాచుకుంటున్నాయి. దేశంలో ప్రజల భాషను పాలన భాషగా పూర్తిస్థాయిలో అమలుపరచని ఏకైక రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ అప్రతిష్ఠ మూటకట్టుకుంటోంది. మాతృభాషా పరిరక్షణ దినోత్సవ సందర్భంగా- మనమంతా పూర్తిస్థాయి తెలుగువాళ్లం కావాలని ప్రతిన పూనుదాం.

ఒక దీపం మరెన్నో దీపాలను వెలిగించినట్లు, వ్యక్తిస్థాయిలో రాజుకున్న అభినివేశం లక్షలాది పౌరుల్లో ఉద్యమస్ఫూర్తి రగిలించినప్పుడు- సందేహమే లేదు... మన తెలుగు భాష కొత్త పుంతలు తొక్కుతుంది, అగ్రగామిగా నిలుస్తుంది.

పదండి నడుద్దాం... తెలుగులోకి, వెలుగులోకి!

రామోజీరావు




తెలుగే మాట్లాడాలి

తెలుగును కాపాడుకోవాలంటే.. మనం పలికే మాటల్లో సాధ్యమైనంత వరకు ఆంగ్లపదం రాకుండా ఉండాలి. తెలుగు వెలుగు సంచికను ఇంటికి తీసుకొచ్చిన వేళ, చిన్న పిల్లవాడు తాయిలం అందుకున్నంత సంబరంగా ఉంది. సంచికలు విరివిగా దొరక్కపోవడంతో నిరుత్సాహపడుతున్నాం. చందా కట్టి నేరుగా పొందే అవకాశం కల్పించాలి.

- కావూరి శ్రీనివాస్, బెంగళూరు

నిజానికిది వారి పని!

'పదపంచాయితీ' అద్భుతమైన ఆలోచన. భాషాసంఘాలు, విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వ కార్యాలయాలు చేయాల్సిన పనిని 'తెలుగు వెలుగు' చేస్తోంది. యువతకు, కొత్త రచయితలకు అవకాశం కల్పించాలి.

- దూడల రాములు, ఏలూరు

అర్థవంతం

'తెలుగువెలుగు' ముఖచిత్రం చాలా అర్థవంతంగా ఉంది. పత్రికలోని అంశాలన్నీ ఆలోచింపజేస్తున్నాయి. ఇంత మంచి పత్రికను మాకందిస్తున్నందుకు ధన్యవాదాలు.

- శిష్ఠా మాధవి, హైదరాబాద్

రాజీలేని ప్రచురణ

అన్ని పేజీలను రంగుల్లో ఇచ్చి చక్కగా ముస్తాబు చేయటం, ప్రింటింగ్, నాణ్యతలో రాజీపడకపోవడం అద్భుతం. పత్రికలోని శీర్షికలు, కథలు, వ్యాసాలు... అన్నీ గాజుతొట్టిలోని రంగుల చేప పిల్లల్లా భలే కనుల (పఠన) విందుగా ఉన్నాయి. పాఠకులకు ప్రహేళిక (క్విజ్) పోటీలు పెట్టాలి.

- పారేపల్లి అంజు, దేవులపల్లి, ప.గో. జిల్లా

ఏమీ హాయి!

తెలుగు వెలుగు చదువుతుంటే ఎంతో హాయిగా ఉంటోంది. పత్రికలో తెలుగుదనం ఉట్టిపడుతోంది. ఆన్‌లైన్ ద్వారా చందా కట్టే అవకాశం కల్పించాలి.

- డా॥ సుజనీత్, ఈ-మెయిల్

ఆంగ్లపదాలు వద్దు

పత్రిక బాగుంది. అయినా.. అక్కడక్కడ ఆంగ్లపదాలు కనిపిస్తున్నాయి. అవి ఉంటే భాషాభివృద్ధి కష్టం.

- ఆర్.శ్రీనివాస్, బెంగళూరు

ఆణిముత్యాల మాలిక

మీరు ప్రచురించే అన్ని అంశాలూ ఆణిముత్యాలే. తెలుగు చలనచిత్రాల్లోని మంచి గీతాలను నెలకొకటి ఇస్తే బాగుంటుంది.

- ఎం.మహాలక్ష్మి, తుని, ప.గో. జిల్లా

అవి మనకే సొంతం!

అవధాన ప్రక్రియ తెలుగు భాషకే సొంతం. అందుకే అవధానాలపై వ్యాసాలు ఇవ్వాలి. 'సమస్యా పూరణం' శీర్షిక నిర్వహిస్తే బాగుంటుంది.

- కె.చిన్మయి, దొప్పలపూడి

బోధనోపకరణం

భారతి, ఆంధ్రభారతి తదితర సాహిత్య పత్రికల స్థానాన్ని 'తెలుగువెలుగు' భర్తీ చేస్తోందనడంలో సందేహం లేదు. ఇది తెలుగు పండితులకు చక్కని బోధనోపకరణం.

- కె.సత్యనారాయణమూర్తి, రాజమండ్రి, తూ.గో

అందరి బాధ్యత

తెలుగుకు వెలుగులద్దాలన్న 'తెలుగువెలుగు' ప్రయత్నం అందర్నీ ఆలోచింపచేస్తోంది. కలాలు పుచ్చుకుని, గళాలు విప్పేలా చేస్తోంది. అయితే.. పత్రిక ప్రయత్నం 'చాళ్లలో గింజలు విత్తడం'. విత్తుల్ని పెంచడం అందరి బాధ్యత.

- తాడిమళ్ల రామకృష్ణ, హైదరాబాద్

### వరాల తల్లికి వందనం

అక్షరాలు యాభైఆరే  
పద మధురములెన్నెన్నో  
నన్నయ్య నుడికార జడివానలో  
తెనుగు చినుకై  
తిక్కన్న చేతిలో తీయతేనియ  
పలుకు వెలుగై  
ఎఱ్ఱాప్రగడ కవిత్రయమున  
కొత్తపుంతల తెలుగు వెలుగై  
శ్రీశ్రీకి ప్రగతి శంఖారావంబై  
ఆరుద్రకు కొండపూసే అంతరంగమై  
సినారె జ్ఞానసిరులు శిఖలో  
కవిపుట్టుకకు నెలవై  
రసగుళికలు సుధాధారలై  
అమ్మ అందించె కమ్మని తెలుగు  
భావి వసంతాలకు తరగని వెలుగు  
తెలుగు జాతికి వెలుగుజాతరలందించిన  
వరాల తల్లి వాగ్దేవికి  
తెలుగు వందనం వెలుగు అభివందనం.

- నెప్రూ.జె.ఎన్, రాజమండ్రి

ఎప్పటికీ ఇలాగే...

తెలుగు వెలుగు సంచికలు.. అచ్చ తెలుగు అతివల్లా, బాపు బొమ్మల్లా, గోదావరి గలగలల్లా, పున్నమి వెన్నెల్లా ఉంటున్నాయి. ఇదే పంథాను కొనసాగించాలని ఆశిస్తున్నా.

- భమిడిపాటి గౌరీశంకర్, శ్రీకాకుళం

మంచిరోజులొచ్చాయి

మీ పత్రిక చదువుతుంటే మన భాషకు మంచి రోజులు వచ్చాయని ఆనందంగా ఉంది. రాష్ట్ర సరిహద్దు ప్రాంతాల్లో వారికి 'తెలుగువెలుగు' అందేలా చర్యలు తీసుకోవాలి.

- వి.విజయరామగోపాల్, విశాఖపట్నం

మన ఆటలు

తొలిసంచికలో 'పరమపద సోపానం' అందించినట్లు ప్రతి సంచికలో ఒక్కో తెలుగు ఆట గురించి ఇవ్వాలి. దాడి, పులి-మేక, చదరంగం తదితరాలను గురించి వివరించాలి. నన్నయ నుంచి ప్రస్తుత కవుల వరకూ అందరి పద్యాలు, శతకాలు, కవితలను ఇస్తూ ఉంటే బాగుంటుంది.

- బి.ధనవర్మరాజు, విశాఖపట్నం

ఔన్నత్యానికి ప్రతీక

తెలుగు భాషౌన్నత్యాన్ని మీ పత్రిక గుర్తు చేస్తోంది. భాషలో సొగసును, అందాన్ని, గొప్పదనాన్ని, మాధుర్యాన్ని, మెరుపుల్ని 'తెలుగు వెలుగు'లో చూస్తున్నాం.

- కంఠంరాజు వెంకటేశ్వరశర్మ, నెల్లూరు

వారి మాట చద్దన్నం మూట

'తెలుగువెలుగు' సంచికలో అన్ని కథలూ, కవితలూ, వ్యాసాలూ చదువరులను సంతోష సంద్రంలో ఈదులాడిస్తున్నాయి. పెద్దల అభిప్రాయాలు జనరంజకంగా ఉంటున్నాయి.

- వి.ఎస్.పారిజాత, హైదరాబాద్

విశ్వమంతా వెదజల్లాలి

పత్రిక సంపాదకీయం మమ్మల్నెంతగానో ముగ్ధుల్ని చేసింది. మాతృభాష విశిష్టతను అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినంత సులువుగా వివరించారు. మీ పత్రిక ద్వారా మాతృభాష వెలుగులు విశ్వవ్యాప్తం కావాలని ఆకాంక్షిస్తున్నాం.

- సత్యపుత్ర మేడిచర్ల, రామరాజులంక, తూ.గో

**ధ్రువతార తెలుగువెలుగు'**
నాగళ్లతో దున్నాల్సింది భూమిని కాదు.
పరభాష మోజులో ఉన్న వారి మెదళ్లని.
అప్పుడు చల్లండి కల్తీలేని 'తెలుగుభాష'
విత్తనాలను. అవి మొలకెత్తటానికి తొలకరి
జల్లులాంటి తెలుగు వెలుగు మనకుంది.

**- టి.శామ్యూల్, ప్రకాశం**

**ప్రతిన బూనుదాం**

పత్రిక గత నెల సంచిక సంపాదకీయంలో చెప్పినట్లు తెలుగు వారందరూ 'ప్రతిన బూనితే' తెలుగు భాషను ప్రపంచవ్యాప్తంగా విస్తరించడం ఖాయం. 'మా తెలుగు తల్లి' గీత రచయిత శంకరంబాడి సుందరాచారి, తెలుగు తల్లికి తొలిసారి రూపమిచ్చిన కొండపల్లి శేషగిరిరావులకు జోహార్లు.

**- కె.మల్లయ్యచౌదరి, గంగావతి, కర్ణాటక**

**'ఋ'ను మరవద్దు**

శబ్దరత్నాకరం పరిశీలిస్తే 'ఋ'తో ప్రారంభమయ్యే తెలుగు పదాలు 29 దాకా ఉన్నాయి. అందులో 10, 12 మాటలే ప్రస్తుతం వాడుకలో ఉన్నాయి. రానురాను వాటినీ వాడటల్లేదు. ఋణమును రుణము అని, ఋతువుని రుతువు అనీ రాస్తున్నారు. ఇది సరైన పద్ధతి కాదు.

**- శాంతమూర్తి, హైదరాబాద్**

**అచ్చతెలుగు వీచిక**

సంక్రాంతి ప్రత్యేక సంచిక బాగుంది. 'పదపంచాయతీ' మెచ్చుకోతగ్గది. అచ్చ తెలుగు పదాలతో సంచికను తెస్తున్నందుకు అభినందనలు. ఆంగ్ల పదాలు లేకుండా కథలు రాయమని యువ రచయితలను ప్రోత్సహించడం ముదావహం.

**- పాండురంగవిఠల్, హైదరాబాద్**

**పునాదికి బీటలు**

ఇంటికి పునాది ఎంత ముఖ్యమో విద్యార్థికి తెలుగు భాషా పరిజ్ఞానం అంతే ముఖ్యం. బోధనా భాషగా తెలుగును అమలు చేయకుండా ఎన్ని మహాసభలను నిర్వహించినా ప్రయోజనం లేదు.

**- కె.హరినాథ్, విశాఖపట్నం**

ప్రతి పుటయు తెల్గుదనపు దర్పణమేకాగ
ఒడుపయిన తెల్గుగుండె చప్పుడులె కాగ
ఎలమి యువతకు కనువిప్పు కలుగజేసి
వెలుగు చుండెను పత్రిక తెలుగు వెలుగు

**- ఆర్.నాగమణి, గుంటూరు**

ఈ సంచికలోని 'రెక్కలు' కవితల రచయిత
**కత్తుల కిషోర్‌కుమార్,**
నూజివీడు, కృష్ణా జిల్లా 9298901571

**శ్రీపాద ముద్ర**

'గులాబీ అత్తరు' కథ చదివాక ఉత్తేజం, ఉత్సాహం ఉప్పొంగింది. శ్రీపాదవారి ముద్ర మరోమారు ప్రభావితం చేసింది. రాచరికపు వ్యవస్థలో నికార్సయిన కళాకారుడు ఎలా కాలిపోయి మసై కాలగర్భంలో కలిసిపోతాడో చూపెట్టారు. కానీ, కళాకారుడు సృష్టించిన కళాఖండం అగరు పొగలతో అజరామరమవుతుంది. సంక్రాంతి సంచికలో సంపాదకీయం అత్తరులద్దింది.

**- ఎ.శంకరరావు, గరికపర్రు, కృష్ణా జిల్లా**

**విరబూసిన పారిజాతం**

'జై కొట్టు తెలుగోడ'! బాగుంది. 'జో అచ్యుతానంద.. జోజో ముకుందా' మనసుకు ఎంతో హాయినిస్తూ జోలపాడింది. 'గులాబీ అత్తరు' కథ పారిజాతంలాగా విరబూసి అత్తరు సొబగులద్దింది.

**- తంగిరాల ప్రభాకరశాస్త్రి, నెల్లూరు**

# మీరెప్పుడైనా ప్రేమలేఖ రాశారా?

తెలుగు వెలుగు ప్రేమలేఖల పోటీ!

రామోజీ ఫౌండేషన్

ప్రేమ... ఓ అద్భుత భావన. ఈ రెండక్షరాల గుణంతో ప్రపంచాన్నే జయించవచ్చని మహాత్ములెందరో నిరూపించారు. సరే... మనబోటి మనుషుల సంగతి మాట్లాడుకుందాం. ప్రేమంటే ఒకబ్బాయి, అమ్మాయిల మధ్య ఏర్పడేది మాత్రమే కాదు? అమ్మానాన్నలు, అక్కాచెల్లెళ్లు, అన్నాదమ్ములూ, తాతయ్యలు, మామ్మలు, అత్తయ్యలు, మామయ్యలు, స్నేహితులు... ఎందరినో గాఢంగా ఇష్టపడతాం. అదంతా ప్రేమే కాదా! మరి అమ్మాయికో, అబ్బాయికో రాసేది మాత్రమే ప్రేమలేఖ అంటే ఎలా? ఎవరిపట్లనైనా మన ప్రేమను వ్యక్తీకరించే జాబు ప్రేమలేఖే అవుతుంది. భర్తకు భార్య రాయవచ్చు. విదేశాల్లో ఉన్న కూతురు తండ్రిపై తన ప్రేమను వ్యక్తం చేస్తూ రాయవచ్చు! సెల్‌ఫోన్లు వచ్చాక రాయడం ఎందుకంటారా? కొన్ని విషయాలు వినడం కన్నా చదివితే అపురూపంగా ఉంటాయి. తీపి జ్ఞాపకాలుగా భద్రపరచుకోవడానికీ వీలుంటుంది. అందుకే 'తెలుగు వెలుగు' ప్రేమలేఖల పోటీ నిర్వహిస్తోంది. కలం పట్టండి... మీరు అమితంగా ఇష్టపడే ఎవరికైనా సరే అద్భుతమైన లేఖ రాయండి! మీ భావాలను సున్నితంగా, హృదయానికి హత్తుకునేలా సృజించండి... అదీ అచ్చ తెలుగులో మాత్రమే!

- కవరు మీద 'ప్రేమలేఖల పోటీకి' అని స్పష్టంగా రాయాలి.
- రచన హుందాగా ఉండాలి. అసభ్యత, శృంగార వర్ణనలకు తావివ్వరాదు.
- ప్రత్యామ్నాయం లేకపోతే తప్ప ఆంగ్లపదాలు వాడకూడదు.
- పూర్తి మాండలికంలోనూ రాయవచ్చు. కాకపోతే అందరికీ అర్థం కావాలి కాబట్టి కష్టమైన పదాలకు విడిగా అర్థాలు రాయండి.
- రచన 500 పదాలకు మించకూడదు. చేతి రాత లేదా కంప్యూటర్ ప్రింట్ పంపవచ్చు. జిరాక్సులు చెల్లవు.
- రచన పూర్తిగా మీ సొంతమని, దేనికీ అనుకరణ లేదా అనుసరణ కానీ కాదని, గతంలో ఏ పత్రిక, వెబ్‌సైట్లు, బ్లాగుల్లోనూ ప్రచురితం కాలేదని, ప్రస్తుతం ఏ ప్రచురణ/ప్రసార మాధ్యమం వద్దా పరిశీలనలో లేదనీ హామీ పత్రాన్ని జత చేయాలి. మీ రంగుల పాస్‌పోర్ట్ చిత్రాన్నీ జోడించాలి.
- మీ రచన ఎంపికైతే మీ పేరు, ఫొటో, ఫోన్ నంబరు ప్రచురించవచ్చా లేదా అన్నదీ హామీ పత్రంలో పేర్కొనాలి.
- రచనతో పాటు మీ పేరు, నివాస చిరునామా, ఫోన్ నంబరు వివరంగా ఉండాలి.
- ఎంపికైన ప్రతి లేఖకూ రూ. 1116 బహుమతి ఉంటుంది.
- ఎన్ని బాగుంటే అన్నీ ఎంపిక చేస్తాం. వీలువెంబడి ప్రచురిస్తాం.
- ఈ పోటీ తదుపరి ప్రకటించే వరకూ కొనసాగుతుంది. ఎప్పుడైనా నిలిపివేసే అధికారం సంపాదకవర్గానిదే.
- ఎంపిక నిర్ణయం పూర్తిగా సంపాదకవర్గానిదే.
- ప్రచురణకు వీలుగా రచనలో మార్పులు చేసే అధికారం సంపాదకవర్గానికి ఉంటుంది.
- ఎంపిక, ప్రచురణల విషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు, ఫోన్ విచారణలకు తావు లేదు.
- నిబంధనలకు లోబడని రచనలను తిరస్కరించే హక్కు సంపాదకవర్గానికి ఉంటుంది.
- రచనను teluguvelugu@eenadu.netకు మెయిల్ చేయవచ్చు. మా చిరునామా 4వ పేజీలో చూడవచ్చు.



# ఆంగ్లాంధ్రప్రదేశ్



ఏ భాష ప్రజలైనా తమ భాషకే పరిమితం కాకూడదు. దానివల్ల అభివృద్ధి ఆగిపోతుంది. అభివృద్ధికి అందరితో సంబంధాలు కీలకం. సంబంధాలు మెరుగవ్వాలంటే అందరికీ అనుసంధాన భాష ఒకటి ఉండాలి. ఆ పని నేడు ఆంగ్లం చేస్తోంది. ఆంగ్లానికి ప్రాముఖ్యమిచ్చి తెలుగును విస్మరించడం తప్పే. అయినా తెలుగుకు ఏదో ప్రమాదం వస్తుందని అనుకోను. తెలుగు ఒక సజీవ స్రవంతి. ప్రవహిస్తూ ఉంటుందే తప్ప నిలిచిపోదు. అది క్షీణత కాదు. భాషా ప్రయాణంలో అది ఒక స్థితి మాత్రమే! మళ్లీ తన ప్రస్థానాన్ని కొనసాగిస్తుందే తప్ప నశించదు. అయితే ఆంగ్ల ప్రభావాన్నీ కాదనలేని పరిస్థితి. ఎందుకంటే నేడు ఉపాధి ఆంగ్లం వల్లనే లభిస్తోంది మరి! దీనికి ఆంగ్లేయులు పునాది వేశారు. అప్పట్లో ఆంగ్లం వస్తేనే ఉద్యోగం.. అందుకే అందరూ ఆంగ్లం నేర్చుకున్నారు. అదే విధంగా తెలుగు నేర్చుకున్న వారికే ఉద్యోగాలిస్తాం అని మన ప్రభుత్వం ప్రకటించిన రోజున తెలుగు అందరూ నేర్చుకుంటారు. తెలుగువాళ్లను తెలుగు రాజులకన్నా పరాయి వాళ్లే ఎక్కువగా పాలించారు. అప్పటి నుంచి బానిసత్వానికి అలవాటుపడ్డాం. అదే ఇప్పుడూ కొనసాగుతోంది. తెలుగు మార్పు చెందటం లేదు. తెలుగువాళ్లు మార్పు చెందుతున్నారు. కాలంతో పోటీ పడుతున్నారు. కంప్యూటర్‌తో ప్రపంచాన్ని శాసించే స్థితికి చేరుకున్నారు. దాని ప్రభావమే భాషమీద పడుతోంది. భాష, సమాజం పరస్పర ప్రభావితాలు. సమాజం మారుతుంటే భాష కూడా ప్రభావితం అవుతుంది.

### అర్థాలు మారిపోతున్నాయి

ప్రస్తుతం ప్రతిదానికి అర్థాలు మారుతున్నాయి. ప్రజలకు సరైన న్యాయం జరగటం లేదంటే పాలకులకు, వారికి సమన్వయం లేదనే అర్థం. కారణం ప్రజల భాష పాలకులు వినియోగించడం లేదు. ప్రతీ విషయాన్ని రాజకీయం చేస్తున్నారే తప్ప సానుకూలంగా ఆలోచించడం లేదు. 'రాజ్‌పుటానా' అంటే రాజపుత్రులు నివసించే ప్రాంతమని అర్థం. అలాగే 'తెలంగాణ' అంటే తెలుగువాళ్లు నివసించే ప్రాంతం. అందరి తెలుగూ ఒక్కటే. యాస తేడాలు ఉన్నంత మాత్రాన తెలుగు... తెలుగు కాకుండా పోదు. అది నిరంతర స్రవంతి.. ఎవరూ ఆపలేరు. అయితే దానిని వినియోగించాల్సిన విధానాలు నేడు మారుతున్నాయి. స్వచ్ఛమైన తెలుగు నేడు గ్రామీణ ప్రాంతాల్లో ఇంకా మిగిలి ఉంది. నేటి విద్యావిధానాలు దానిని భ్రష్టు పట్టించాలని చూస్తున్నాయి. మానవునికి జ్ఞానం పూర్తిగా వికసించాలంటే మాతృభాషలోనే అది సాధ్యం. విద్యార్థి ప్రాథమిక స్థాయిలో కచ్చితంగా మాతృభాషలోనే చదవాల్సి ఉంటుంది. అతని భావవ్యక్తీకరణ స్థాయి పూర్తిగా వికసించేది అప్పుడే. కానీ ఆ స్థాయిలో ఆంగ్లాన్ని ప్రవేశపెట్టడం వల్ల రెండు భాషల్లోనూ సరైన జ్ఞానం సంపాదించలేకపోతున్నారు. ఆంగ్లం నిత్యావసరమే, కానీ దానికోసం ప్రాణమైన మాతృభాషను విస్మరించాల్సిన పనిలేదు.

### చాదస్తాలు పనికిరావు

ఆధునికీకరణ పేరుతో అక్షరాలను కుదించాలని అనుకోవడం సరికాదు. భాష, లిపి పరస్పర ఆధారాలే కానీ లిపి మార్చినంత మాత్రాన వినియోగం పెరగదు. తెలుగు పుట్టినప్పుడు లిపి లేదు. అయినా చాలా ఏళ్లవరకూ తెలుగు బాగానే కొనసాగింది. ఇప్పుడూ అంతే. భాష ఎవరో మారిస్తే మారదు. కాలానుగుణంగా మారుతుంది. ప్రస్తుతం భాష నాశనం చెందుతోందని అంటున్నారు. అది నాశనం చెందడం కాదు. అది కూడా మార్పే. కొంత కాలం తర్వాత మళ్లీ మారుతుంది. ఏదీ ప్రాచీనంగా ఉండదు. కాలవశాన అది ఆధునికతను సంతరించుకుంటుంది. తెలుగు కూడా అంతే. తెలుగు వినియోగానికి పదసృష్టి చేసినంత మాత్రాన సరిపోదు. దానిని ప్రజలు ఆమోదించి వినియోగించాలి. మహానిఘంటువు నిర్మాణంలో మరీ చాదస్తాలు పనికిరావు. అందులో ఆంగ్ల పదాలను నిరభ్యంతరంగా చేర్చుకోవచ్చు. ఇప్పటి వరకూ వినియోగంలో ఉన్న ఆంగ్ల పదాలకు తెలుగు పదాలను సృష్టించాలనుకోవడం మంచిది కాదు. తెలుగు వినియోగం పెరగాలంటే పాఠశాలల కన్నా తల్లిదండ్రులే పూనుకోవాలి. పిల్లలకు ఇంట్లో కచ్చితంగా తెలుగు నేర్పిస్తే వారి భావవ్యక్తీకరణ అభివృద్ధి చెందుతుంది. తర్వాత భాషను వాళ్లే బతికించుకుంటారు. ప్రస్తుతం అంతా ఆంగ్ల వ్యామోహంలో ఉంటున్నారన్నది నిజం కాదు. ఉపాధి అందులో ఉంది కాబట్టి వాళ్లు దానిని నేర్చుకుంటున్నారు. కాలంతో పాటు తెలుగును కూడా ఆధునిక వ్యవహారాల్లో వినియోగిస్తే తెలుగునూ నేర్చుకుంటారు. భాషను కాపాడుకోవాలంటే ముందు అందరిలోనూ చైతన్యం రావాలి. ప్రజల్ని ప్రభావితం చేసే పత్రికలే దీనికి పూనుకోవాలి.

***(గుంటూరు శేషేంద్రశర్మ తన చివరి రోజుల్లో 'ఈనాడు-తెలుగు విభాగం'తో పంచుకున్న అభిప్రాయాలివి....)***

# నిరాసక్తతే అసలు జాడ్యం




కొన్ని సంఘటనలు దేశ కాల పరిస్థితులకు అతీతంగా ప్రపంచానికంతటికీ స్ఫూర్తి నందిస్తూనే ఉంటాయి. కాంతిపథం వైపు కదిలిస్తూనే ఉంటాయి. మాతృభాషా దినోత్స వానికి మూలమైన 'బంగ్లా పరిరక్షణోద్యమం' ఇలాంటి క్రాంతిదర్శే. మనుషులకు మతం కంటే 'మాటే' ముఖ్యమని నిరూపించిన ఈ పోరాటం.. అమ్మభాషా ప్రేమికుల హృదయాలను సదా ఉప్పొంగిస్తూనే ఉంటుంది. (బంగ్లా భాషోద్యమంపై సమగ్ర వ్యాసం జనవరి 2013 'తెలుగువెలుగు' పత్రికలో ప్రచురితమైంది)

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు హైదరాబాద్ రాష్ట్రంలో ఉర్దూ మాతృభాషగా కలిగిన వారు 3 - 4 శాతం మందే. పాలకులు మాత్రం ఉర్దూను అధికార భాషగా అమలు చేశారు. రాష్ట్రంలో అత్యధిక సంఖ్యలో ఉన్న తెలుగు వారు ఆ నిరంకుశపాలనకు తలొగ్గారు. భాష కోసం బంగ్లాదేశీయుల్లా ఆందోళనకు దిగలేదు. చివరి దశలో రాజకీయ విముక్తి కోసం పోరాటం జరిగిందే కాని భాష విషయంలో కాదు. సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంత రావు, బూర్గుల రామకృష్ణారావు వీరందరూ ఉర్దూలో మంచి పండితులే అయినా తెలుగు భాషకు ఔన్నత్యం రావాలని ఆకాంక్షించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి 1912లో నవాబు ప్రకటన చేశాడు. యుద్ధప్రాతిపదికన పనులు చేయించి వైద్యశాస్త్రం, ఇంజినీరింగ్ పుస్తకాలన్నింటినీ ఉర్దూలోకి తర్జుమా చేయించాడు. 1918 నుంచి విశ్వ విద్యాలయంలో అన్ని ఉన్నత విద్య కోర్సులను ఉర్దూలోనే బోధించారు. ఉర్దూ కన్నా అత్యంత అధిక పారిభాషిక పదాలనందించే సంస్కృతం దన్ను ఉన్న తెలుగులో సాంకేతిక విద్యను అందించాలన్న ఆలోచననే మనం ఇప్పటి వరకూ చేయలేదు. తెలుగులో శాస్త్ర సాంకేతిక విద్య బోధించేందుకు అనువైన పాఠ్యపుస్తకాల తయారీ లక్ష్యంతో 1968లో తెలుగు అకాడమీ ప్రారంభమైంది. డిగ్రీ, కొన్నింటికి పీజీ వరకు తెలుగు మాధ్యమంలో బోధించడానికి పుస్తకాల రూపకల్పన జరిగింది. తెలుగు మాధ్యమ విద్య మాత్రం తొలి ఉత్సాహం ముగిసిన కొద్దిరోజులకే నీరుగారిపోయింది.

ఒక దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది అని చెప్పడానికి ఉండే ప్రమాణాలలో ఒకటి... దేశ పౌరుడు ఏ ప్రభుత్వ కార్యాలయానికైనా వెళ్లి తనకు అర్థమయ్యే తన భాషలో అన్ని పనులు చేసుకుని రావాలి.. ప్రభుత్వ కార్యకలాపాలన్నీ అతని భాషలోనే సాగాలి. తన పిల్లల విద్యాభ్యాసం తన భాషలోనే జరగాలి. అప్పుడే అతనికి, అతని దేశానికి పూర్తిగా స్వాతంత్ర్యం వచ్చినట్లు. హైదరాబాదు రాష్ట్రంలో పాలకులు తమ భాషలోనే పనులు చేశారు. ఇటు సర్కారు జిల్లాలోనూ పాలకులు వారి భాష ఆంగ్లంలోనే అధికారిక కార్యక్రమాలన్నీ జరిపారు. అయితే, తెలుగు నేలకు స్వాతంత్ర్యం వచ్చి, ప్రత్యేక భాషాప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడి 56 ఏళ్లు అయింది. అయినా.. ఇప్పటికీ అప్పటి పాలకుల భాషలోనే అధికార కార్యకలాపాలన్నీ జరుగుతున్నాయి. దీన్నిబట్టి తెలుగు వారికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చిందా లేదా అని అనుమానించాల్సి వస్తోంది. భౌగోళికంగా బంగ్లాదేశ్ ఆంధ్రప్రదేశ్ కన్నా చిన్నదే. జనసంఖ్య కూడా మన కన్నా చిన్నదే. కాని వారు పరాయి భాషను అధికార భాషగా మూడేళ్లు కూడా భరించలేకపోయారు. మరి మనమెందుకిలా ఉండిపోతున్నామన్నది ప్రశ్నించుకోవాలి.

ఒక భాషలో విద్యాబోధన కనీసం 45 శాతం కన్నా తక్కువ ఉంటే ఆ భాష త్వరలో అంతరించిపోయే ప్రమాదంలో ఉన్నట్లేనని యునెస్కో అధ్యయనాలు చెబుతున్నాయి. రాష్ట్రంలో తెలుగులో విద్యాబోధన అన్నది నానాటికీ తీసికట్టు నాగం బొట్టు అన్నట్టుంది. అసలు తెలుగు మాధ్యమంలో చదువెందుకని ప్రశ్నించే వాతావరణం వచ్చింది. మాతృభాషలో విద్యార్థికి చదువు చెబితే ఉండే ప్రయోజనాన్ని ఇంకా అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్నారు తెలుగు వారు. విద్యారంగాన్ని ప్రైవేటు రంగానికి వదిలి క్రమంగా చేతులు దులుపుకుంటోంది ప్రభుత్వం. ధనసంపాదనే ఏకైక లక్ష్యంగా కార్పొరేట్ విద్యా సంస్థలు పనిచేస్తున్నాయి. తెలుగు భాషా బోధన, తెలుగు మాధ్యమ అమలుపై మాట్లాడవలసిన అవసరం వాటికి ఏమాత్రం లేదు. పైగా అది వారి వ్యాపారానికి గండికొడుతుందని భావిస్తున్నారు వాటి నిర్వాహకులు.

ఫిన్లాండు దేశ జనాబా 60 లక్షలకు మించదు. అంటే దాదాపు మన హైదరాబాదు నగరంలోని ప్రజలంత. అక్కడ పూర్తిగా ప్రభుత్వ సంస్థలే విద్యనందిస్తాయి. ఫిన్నిష్ భాషలోనే బోధన జరుగుతుంది. ఇంత చిన్న దేశం అంత మంచిపని చేస్తుంటే మనం ఎందుకు చేయలేకపోతున్నాం!

10 కోట్ల మంది మాట్లాడే భాష, రోజుకు కనీసం 50 లక్షల ప్రతులు వచ్చే దినపత్రికల్లో



ప్రచురితమయ్యే, 50 ఛానళ్లు 24 గంటలూ ప్రసారం చేసే తెలుగుభాష ఎందుకు చచ్చి పోతుందంటూ వితండవాదాలు చేస్తున్నారు కొందరు. కానీ వీరు ఒక విషయాన్ని గమనించడం లేదు. అదేమంటే తెలుగులో విద్యాబోధన జరగకపోతే, తెలుగు ఒక భాషగా కూడా చెప్పకపోతే... సమీప భవిష్యత్తులో తెలుగు మాట్లాడటమే కాని రాయడం, చదవడం రాని తరం తయారవుతుంది. ఏ గిరిజన భాషలాగో మౌఖిక స్థితిలోనే ఉండిపోతుంది. అప్పుడు తెలుగు పత్రికలు చదివేదెవరు, తెలుగు పుస్తకాలను కొనేదెవరు? మన భాష బోధన పద్ధతి ఇలాగే సాగితే ఆ భయంకరమైన పరిస్థితి రావడానికి ఎంతో కాలం లేదు.

మనకు త్రిభాషా సూత్రం ఉంది. దీనిప్రకారం మన రాష్ట్రంలో పనిచేసే కేంద్రప్రభుత్వ కార్యాలయాలు తెలుగుకు ఊతం ఇవ్వాలి. వాటి కార్యకలాపాలన్నీ తెలుగులోనూ ఉండాలి. బ్యాంకులు, ఇతర కేంద్ర ప్రభుత్వ సంస్థలేవీ తెలుగును పట్టించుకోవు. చివరికి ఆంధ్రాబ్యాంకుకు వెళ్లినా పత్రాలన్నీ ఆంగ్లం, హిందీల్లోనే ఉంటాయి. తెలుగులో ఉండవు. ఏ రైల్వేస్టేషన్‌లోనైనా నామఫలకాలలో తప్ప మరెక్కడా తెలుగు కనిపించదు. టికెట్లుపైన హిందీ, ఆంగ్లం అచ్చు అవుతుంటాయి. తెలుగు ఎందుకు కాదు? దీన్ని ప్రశ్నించడానికి మన ప్రభుత్వం కన్నా పెద్ద అధికారిక సంస్థ ఏముంది?

మన వారి నిరాసక్త ధోరణి వల్లే భాష పరిస్థితి ఇలా ఉంది. పరాయి పాలనభాషకు అలవాటు పడ్డ మనం ఆ ఊబిలో నుంచి బయటికి రాలేకపోతున్నాం. అన్ని స్థాయిల్లో మన న్యాయాలయాలన్నిటా తెలుగే పనిచేయాలి. ఆ దిశగా తెలుగువారు ఉద్యమించాల్సిన సమయమిదే. భాషాక్షేమమే దేశ క్షేమానికి పునాది అన్నది వేదం వేంకటరాయశాస్త్రి గారి మాట. దీని పరమార్థాన్ని ఎంత త్వరగా గుర్తిస్తే మన జాతికి అంత మేలు.






**ఆచార్య పులికొండ సుబ్బాచారి**
అధ్యక్షుడు, జానపద విజ్ఞాన గిరిజన అధ్యయన శాఖ, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం. 94404 93604




# నిర్భయగీతం

ఈ దేశం మౌనగంగ
వాకిట ప్రత్యక్షమయిన గులాబిరెమ్మ
సగం కాలిన
గతకాలపు ఉత్తరం
నిద్రిస్తున్నావా? క్షమయాధరిత్రీ!
నక్షత్రాల మధ్య ఒంటరి దీపస్తంభంలా
-
రాత్రి
అన్నాల దగ్గర
అన్నమ్మెతుకు ఉరివేసుకున్నది
కాంక్షాతీరంలో
అవయవాల్లో
మాంసపు ముద్దలు మాత్రమే
కనబడతాయా
అమ్మ ఒడిలోని తొలి ఏడుపు
రహదారంతా కలయతిరిగింది -
నగరం నిద్రలో ఉన్నది
ఆపాప తన శరీరభాగాలను
ఒక్కొక్కటిగా భూమిపై విడిచింది -
భూమి రెండుగా చీలలేదు
ఆకాశపు గొడుగు మూతపడలేదు
నెత్తుటివాన కురియలేదు
అయినా
ఓ నా భూమి పుత్రికా!
వరికంకి నిటారుగా నిలబడింది
జీవనది అలల వల తనలో దాచుకుంది
సముద్రం ఎర్రసిరా అయింది
కలువపూలలా వికసించిన ప్రజలు
రహదారులపై నిరసనజ్వాలల్లా
నిలబడ్డారు
అందరి కంఠనాళాల్లోకి
ఆమె ప్రవాహంలా ప్రవేశించింది -
పల్లెలో చిననాటి పాఠశాల
తిను బండారాల అంగడి
ఉద్యానవనంలోని తూనీగ
ఆమెకు శాశ్వతంగా కనబడవు -
అత్యాచారసర్పం కాటువేసిన,
మృత్యువని తెలియదు-
పసిపాప బోసినవ్వు దగ్గర మొదలై
యవ్వన సమయం దగ్గర తీరం
దాటింది.
తుపాను రాత్రి
మంచుబొమ్మలా కనిపిస్తుంది.
దయచేసి
కరవాలాన్ని సిద్ధం చేయకండి
మంచు బొమ్మ కరిగి
లాలాజలంలా ఈ దేశం
దేహాలలోకి ప్రవహిస్తుంది.
కదులుతున్న సజీవశిల్పం -
ప్రతి రాత్రి
ప్రతి వేకువ
దేశం ముంగిట ముత్యాల ముగ్గులా
నిలబడ్తుంది
ఆమెను
రోజూ చూస్తూనే ఉంటాం
ఒక నక్షత్ర కాంతిలా
సగం తిని వదిలేసిన
ఆ పాపకు ఇష్టమైన తీపి పదార్థంలా -

(ఢిల్లీలో జరిగిన సామూహిక అత్యాచారాన్ని నిరసిస్తూ..)


**- అరసవిల్లి కృష్ణ, విజయవాడ,**
**92472 53884**

# నాటి తెలంగాణ జీవనచిత్రం

స్వయంకృషితో వంటబట్టించుకున్న విజ్ఞానం తప్ప పెద్దగా చదువుకోని వట్టికోట ఆళ్వారుస్వామి తెలంగాణలో తొలి నవలా రచయితగా ప్రఖ్యాతుడయ్యారు. 1914లో పుట్టి 1961 ఫిబ్రవరి 5న మరణించిన ఈయన తన స్వల్ప జీవిత కాలంలోనే కథ, నవల, విమర్శ, నాటకం, కవిత్వం వంటి విభిన్న సాహిత్య ప్రక్రియల్లో కృషి చేశారు. హోటల్ కార్మికుడిగా జీవితాన్ని ప్రారంభించి స్టేట్ కాంగ్రెస్, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీ, అభ్యుదయ రచయితల సంఘం, పౌరహక్కుల ఉద్యమం, గ్రంథ ప్రచురణ, గ్రంథాలయ నిర్వహణ వంటి అనేక కార్యకలాపాల్లో అపురూపమైన కృషి చేశారు. నిజాం వ్యతిరేక తెలంగాణ ఉద్యమంలో పాల్గొని జైలు శిక్షను అనుభవించారు. దేశోద్ధారక గ్రంథ మండలి వ్యవస్థాపకులు. 'గంగు' వీరి మరో ప్రముఖ నవల. 'జైలు లోపల' కథా సంపుటి. ఆయన కలం నుంచి వెలువడ్డ అపూరూప నవలే ఈ 'ప్రజల మనిషి'.

నిజాం రాచరిక వ్యవస్థ హైదరాబాద్ సంస్థాన ప్రజల జీవితంలో ఓ పీడకల. జనం జీవితం నికృష్టం. వారు దున్నే భూమి, పండించే పంట, పెంచే పశువులు అన్నింటి పైనా దొరలు కన్నేసి కాజేసేవారు. వాళ్లు ఆడింది ఆట పాడింది పాట. దీనికి వ్యతిరేకంగా తెలంగాణ తిరగబడింది. గౌరవప్రద జీవితం కోసం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటం సాగింది. కాలమనే చరిత్రలో యథార్థ ఘట్టంలోని పాత్రలు, సంఘటనలకు, పోరుబాటకు అద్దం పట్టిన రచన 'ప్రజల మనిషి'

ఈ నవల కథా కాలం 1938 ప్రాంతం. భూమిక తెలంగాణా జన జీవితం. ఒక్క మాటలో చెప్పాలంటే.. 'ప్రజల మనుషులు' ఎలా ఉండాలి. ఎలా ఉండకూడదు, ఎలా ఉంటారు.. అనే అంశాలకి నిశిత చిత్రణ. తెలంగాణ మాండలికానికి నవలా రూపం ఇచ్చిన తొలి నవల ఇది. తెలంగాణలో వాడే పలుకుబడులను, పదబంధాలను విరివిగా వాడుకుని రాసిన నవల ఇది. కాల్పనిక రచనల వరకూ చూసినా, మొత్తం మాండలికంలో సాగాలా? పాత్రల సమగ్రరూపం తెలిపేలా సంభాషణల వరకే ఉంటే మేలా? అనే మీమాంస ఉంది. దీనికి ఆళ్వారుస్వామి 1952లోనే పూర్తి న్యాయం చేశారు. ఆ ప్రాంతంలో, ఆ కాలంలో అక్కడి జనం మాట్లాడుకుంటూ, వాడుకలో ఉన్న అన్ని భాషా పదాల్ని అదే రంగు, అర్థాలతో వాడి, పఠనాసక్తి ఎంతమాత్రం తగ్గని శైలి ఎంచుకున్నారు. ఈ విషయంలో ఈ నవల ఓ మార్గదర్శనం లాంటిది.

జాతీయ స్థాయిలో తెల్లవారి అధికారం వల్ల ఆంగ్లం, స్థానికంగా మహమ్మదీయుల పాలనతో ఉర్దూలది ప్రాబల్యం. ప్రాంతీయ వాడుకలో తెలంగాణా అచ్చతెనుగు. పుట్టి పెరిగిన వైష్ణవ సంప్రదాయం వల్ల సంస్కృత భాషా ప్రభావం అంతేకాక కమ్యూనిస్టు కార్యకర్త, విప్లవాభిలాష. రాజకీయ నైశిత్యం ఉన్న వస్తువు. ఇలాంటి అనేక కారణాల వల్ల, 'ప్రజల మనిషి' రచనలో ఆళ్వారుస్వామి మీద తీవ్రమైన ఒత్తిడి. దీని వల్లే ఈ నవల చిరస్మరణీయంగా రూపుదిద్దుకుందేమో!

డిచ్‌పల్లి దగ్గరి దిమ్మెగూడెం దొర రామ భూపాలరావు. ఆయనింటికి అల్లుడు వస్తున్నాడు. పిల్లని కాపురానికి పంపుతున్నాడు. అందుకుగాను ఊర్లో తలొకరికి తలొకరకం భారం. కొమరయ్య తండ్రి కోటయ్యని బాగా పాలిస్తున్న ఆవుని తోలమన్నారు. కంఠీరవం తండ్రి రఘునాథాచార్యులు గొప్ప పండితుడు. తల్లి అండాళమ్మ. ఆమెకి 20 విస్తళ్లు కుట్టి ఇచ్చే పని. ఇది నవలారంభం.

దొర ఇంట్లో జరిగే కార్యానికి ఊరి జనానికి తార్కిక సంబంధమేం లేదు. తరతరాల అధికార ఆచారం. పై పరిపాలకులకి తొత్తులుగా ఉంటూ, తమ కింది వారి మీద జులుం చేస్తున్న దొరల స్వభావాన్ని ఈ సంఘటనతో ఆరంభించి, దానివల్ల ప్రజలకి ఎన్ని రకాలుగా ఇబ్బందులు కలుగుతున్నాయో తెలిపేలా సాగిన నవల రానురాను చిక్కబడుతూ సాగింది.

గొట్టం కోటయ్య కాపు. అతని కొడుకు కొమరయ్య. కంఠీరవం, కొమరయ్య స్నేహితులు. ఈ ఇద్దరి కథగా, వేర్వేరు నేపథ్యాలలో సమాంతరంగా సాగే రచనా పద్ధతిని ఆళ్వారుస్వామి ప్రణాళికగా చేసుకున్నారు.

తండ్రి మరణించాక, అన్నగారి దౌష్ట్యం తట్టుకోలేక ఇల్లు వదిలి నిజామాబాద్ చేరాడు కంఠీరవం. వేదాంతాచార్యుల గారి ఇంటిలో ఆశ్రయం దొరికింది. చదువు, వైద్యం నేర్చుకున్నాడు. గ్రంథాలయానికి అలవాటు పడి, క్రమేపీ గ్రంథాలయ ప్రధాన కార్యదర్శి స్థాయికి ఎదిగాడు. అతని ఎదుగుదల ఆ స్థాయికే పరిమితం కాలేదు. నిజాం పరిపాలనా విధానం, చట్టం, అధికార దుర్వినియోగం, అట్టడుగు ప్రజల మీద సాగుతున్న దోపిడీ అతన్ని అలజడికి లోను చేశాయి. కుల భేదాలు చేస్తున్న చెడుపు, మత మార్పిడుల రాజకీయం, ఆర్య, వైష్ణవ ధర్మాల బలాబలాలు, వ్యక్తి ధర్మంలాంటి అన్ని



## మంచి పుస్తకం

విషయాల్ని ప్రజాహిత దృక్పథంతో విశ్లేషించి మనసుకి పట్టించుకున్నాడు. తరతమ భేదం లేని నిస్వార్థ, నిజాయితీ కార్యాచరణకి కట్టుబడ్డాడు.

కంఠీరవం, కొమరయ్యల వ్యక్తిగత జీవనస్థాయి నుంచి, గ్రామస్థాయి నుంచి కథ ముందుకి సాగి గ్రంథాలయోద్యమం, ఆంధ్ర భాషోద్యమం, నిజాం వ్యతిరేక తెలంగాణా ఉద్యమం వరకూ సాగి చివరికి హైదరాబాద్‌లో కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొనటానికి వెళ్లిన కంఠీరవం నిర్బంధం వరకూ కొనసాగింది. 'ప్రజల మనిషి' కొందరు వ్యక్తుల కథ కాదు. కొన్ని గ్రామాల కథ కాదు. కొన్ని సంఘటనల కూర్పు కాదు. వీటన్నింటి పరిధిని దాటిన ప్రాంతీయ జాతీయ ఉద్యమాల చిత్రణ. వైష్ణవ సంప్రదాయంలో పెరిగి జాతీయ విప్లవ స్థాయికి ఎదిగిన ఆళ్వారు స్వామి జీవితంలో ఎంత విస్తృతి ఉందో, 'ప్రజల మనిషి' నవలలోనూ అంత విస్తృతి ఉంది. రచయిత జీవితం, రచన మమేకం అయిన నవలాకృతి 'ప్రజల మనిషి'.

మత, అధికార భయాలు ప్రజల్లో ఎలా ఉంటాయో ఈ నవల్లో తెలుస్తుంది. కులం తాలూకు ప్రభావం ఆర్థికపరంగా ఎటువంటి మార్పులు తెస్తుందో 'ప్రజల మనిషి' చూపించింది. సంస్కృత భాషా సాహిత్యం కేవలం కావ్యాలు, తాత్విక మీమాంసలే కాదని, ప్రజాహిత పరిపాలన మౌలికంగా ఎలా ఉండాలో తెలిపిందన్న విజ్ఞానాన్ని అందించింది. 1938కి పూర్వం తెలంగాణ ప్రాంతపు రాజకీయ, సామాజిక, సాంస్కృతిక స్థితిగతులను చిత్రించిన నవల ఇది. ఆ కాలపు పరిపాలన, భాష, న్యాయవ్యవస్థ తీరుతెన్నుల్ని క్షుణ్ణంగా పరిశీలించి నవలా రూపంలో గ్రంథస్తం చేశారు రచయిత.

గిదగిద ఉరికి, సుంకరి, కచ్చరం, ముంజాత, హర్రాజు వంటి మనం మరిచిన మన తెలుగుపదాలు ఈ నవలంతా పరుచుకుని ఉంటాయి. వ్యక్తి - ఆత్మగౌరవం - దుష్టపాలనలాంటి పరస్పర ఆధారిత అంశాలని ఆళ్వారుస్వామి నిశితంగా చర్చించారు.

నిజానికి కథాస్థలం తెలంగాణలోని ఓ మారుమూల పల్లెటూరే కావచ్చు. కానీ దీప్తిరీత్యా, స్ఫూర్తి దృష్ట్యా అత్యంత ప్రభావితమైంది. ప్రధానంగా గ్రామీణ తెలంగాణకు ఈ చిన్న ఊరు ప్రతిబింబం, ప్రతిధ్వని. గ్రామీణ తెలంగాణలో పరస్పరం సంఘర్షించిన సామాజిక శక్తులు, మౌలిక సమస్యలు, లక్ష్యాలు, అంతిమ ఫలితం అన్నీ ఒక్కటే. వాటన్నింటికీ ఈ దిమ్మెగూడెం గ్రామం అద్దం పట్టింది.

అప్పటి కులాచారాలు, భావాలు 'ప్రజల మనిషి'లోని కంఠీరవంలాంటి వ్యక్తుల అనుభవాలతోనే మార్పు చెందాయి. ఈనాటి ప్రగతి స్థాయిని అర్థం చేసుకోవటానికి, అప్పటి ఈ నవల చదివి తీరాలి. 'ప్రజల మనిషి'లో ఓ గ్రామం మౌలికతో, ప్రపంచ మత భావరీతుల వరకూ విస్తరించింది. ఒకే నవలలో ఇటువంటి విస్తరణ చాలాచాలా అరుదు.

నవలంతా సులువైన ఉపన్యాస ధోరణిలో సాగిన భాషాశైలి ఆకట్టుకుంటుంది. పఠనాసక్తికి ఇది గొప్ప పనిముట్టు. ఆ పనిముట్టు పదును అర్థమవటానికి 'ప్రజల మనిషి' ఓ అధ్యయన గ్రంథం.



వి.రాజారామమోహనరావు
హైదరాబాద్. 93947 38805



## హరిత గీతం

చెట్లు నాటుదాం అక్కల్లారా। - అడవి పెంచుదాం అన్నల్లారా।
పల్లెలన్ని బీడులాయే - ఏటేటా కరువులాయే
వాన వరపు లేదాయే - వల్లకాడయి పోయే ॥చెట్లు॥

మంచి గాలి లేక మనమూ - మంచాన పడుతున్నామూ।
మండు టెండలోన మనమూ - మలమల మాడుతున్నామూ।
చెలమ లూటలెండి పాయే - దప్పికేస్తే సచ్చుడాయే ॥చెట్లు॥

తోవెంట బోయేటప్పుడూ - దారెంట బోయేటప్పుడూ
పచ్చని చెట్టైనా పలకరించలేదు - చల్లని నీడైన కనిపించలేదూ
కమ్మనీ పండ్లు ఫలాలూ - తియ్యని జుంటి తేనియలు
మచ్చుకైనా కానరావూ - మందుల కసలే దొరకవూ ॥చెట్లు॥

కాలు మీద కత్తి బడితే - మోదుగు చెక్కలేదాయే
పెయ్యన్నీ గడ్డలు లేస్తే - మేడిపాలు దొరకవాయే
కడుపులో క్యాన్సరు అయితే - బిళ్ల గన్నేరు చెట్లు ఏవీ?
అధిక రక్తపోటు వస్తే - సర్పగంధీ చెట్లు ఏవీ?
కొండలు గుట్టలు పాయే - మందుల మొక్కలు మునిగే ॥చెట్లు॥

పట్నం నుంచి మా బావా - ఆలు పిల్లలతోని వస్తే
అడవి అందచందాలు - తనవితీరా చూద్దామంటే
సిలకాల పలుకులు లేవూ - కోయిలమ్మ పాట లేదూ
చిరుతలు సింహాలు లేవూ - నెమళ్లు జింకలు లేవూ
అడవి అగ్గయిపోయే - పల్లె బుగ్గయిపోయే ॥చెట్లు॥

మోటారు పొగలతో మనకూ - ఉబ్బసం రోగమొచ్చేనూ
ఫ్యాక్టరీ పొగలతో మనకూ - ప్రాణానికే ధోక వచ్చూ
నీడనిచ్చు చెట్లు మనకూ - గాలినిచ్చు చెట్లు మనకూ
జీవరాశులన్నీ మనకూ - ప్రాణదాత లేరా।

అడవి జంతువులను వేటాడవద్దురా।
పచ్చని చెట్లను పడగొట్టవద్దురా।
మానవ జాతి మనుగడకే ముప్పు తేవద్దురా ॥చెట్లు॥

- పట్లోళ్ల విఠల్‌రెడ్డి,
నిజామాబాద్. 93999 13758

# వెటకారం మానండి మమకారం పెంచుకోండి

చదువుల్లో ఇద్దరిదీ వేర్వేరు దారులు,,,
అన్నయ్యది గణితం, భౌతికశాస్త్రమైతే....
తమ్ముడిది వృక్ష, జంతుశాస్త్రాలు...
కానీ ఆ ఇద్దరినీ కలిపింది తెలుగు.
పెద్దబ్బాయ్‌లో తెలుగుపై మమకారానికి చిన్నప్పటి నాటకాలు బీజం వేస్తే... అన్నయ్య తెచ్చిచ్చిన ప్రబంధకావ్యాలు తమ్ముడిని తెలుగుతోటలోకి నడిపించాయి. ఇద్దరినీ సినీవ్యవసాయంలోకి దింపాయ్! అది మొదలు.... 25 సంవత్సరాలుగా ఇద్దరూ కలసి అప్రతిహతంగా... అద్భుతమైన కథలతో.... పదునైన మాటలతో తెలుగు సినీమాగాణిలో జోడెడ్లలా దున్నేస్తున్నారు నేటి వరకూ.



**ఒక్కొక్కర్నీ కాదు షేర్‌ఖాన్.... వందమందినీ ఒకేసారి పంపు** అంటూ రక్తం ఉరకలెత్తించినా... **కంటిచూపుతో చంపేసినా...**

**ఎవర్నో చూసి చప్పట్లు కొట్టడం కాదురా.... నిన్ను చూసి చప్పట్లు కొట్టే రోజు తెచ్చుకో....** అంటూ స్ఫూర్తి రగిలించినా వారికే చెల్లింది....

పరుచూరి సోదరులు తెలుగువారందరికీ పరిచయం అక్కర్లేని వారు. ఏజీ కార్యాలయంలో పనిచేసిన వెంకటేశ్వరరావు (అన్నయ్య), తెలుగు అధ్యాపకునిగా పనిచేసిన గోపాలకృష్ణ (తమ్ముడు)లకు. పదునైన సంభాషణలెలా పడతాయ్? సినీసాహిత్యం తెలుగుకు చేస్తున్న నష్టమెంత? మన భాషకు నిజంగా హాని చేస్తున్నదెవరు? లాంటి ఆసక్తికర అంశాలపై వారి మనసులో మాటల్ని విందాం రండి....

**సంభాషణల కోసం సాధనేమైనా చేస్తారా?**

అబ్బే లేదండీ... అలా అలవోకగా అవే వచ్చేస్తాయి. కనురెప్ప కిందికి దిగితే వినయం... పైకి లేస్తే విప్లవం... రెప్పపాటు దూరంలో దోపిడీ జరిగిపోతుంది.... అలా దాస్ కాపిటల్‌ను ఒక డైలాగ్‌లో చెప్పేశాం. ఇక ఆ పూటంతా అన్నం తిన్లేదు. మంచి డైలాగ్ పడిందంటే కడుపునిండిపోతుంది. ఇంత మంచి మాట ప్రజలకు ఇవ్వగలిగామనే సంతృప్తి ఇచ్చే ఆనందం అంతా ఇంతా కాదు. కానీ... విజయవాడలో థియేటర్‌కెళ్ళి చూస్తుంటే... ఆ డైలాగ్‌కు జనాలు చప్పట్లు కొట్టలేదు. అదే రవీంద్రభారతైతే కొట్టేవారు. అప్పుడు ఆలోచించాం... సినిమా చూసేవాళ్ళలో చదువుకోని వారు కూడా ఉంటారు. వాళ్ళ స్థాయికి దిగి రాయాలని గుర్తించాం. అప్పుడదే డైలాగ్‌ను వజ్రాయుధం సినిమా కోసం మార్చిరాశాం. ఏంట్రా నోరు లేస్తొంది అంటాడు పి.ఎల్.నారాయణను ఉద్దేశించి... నూతన్‌ప్రసాద్! అప్పుడు పి.ఎల్. నారాయణ... పేదోడికి నోరుంటుంది బాబూ.. ఆకలేసినప్పుడు అమ్మా అంటుంది.. కోపమొచ్చినప్పుడు నీయమ్మా అంటుంది.. అంటాడు. అంతే థియేటర్ చప్పట్లతో అదిరిపోయింది! అప్పుడర్థమైంది... అద్భుతమైన సాహిత్యాన్ని రాయగలిగిన వేటూరి, ఆత్రేయలాంటి మహానుభావులు... 'ఓలమ్మి తిక్కరేగిందా' అని ఎందుకు రాశారో! 'శంకరా నాదశరీరాపరా' అని రాసిన మనిషి 'ఆరేసుకోబోయి' అని ఎందుకు రాశాడో? మామూలు జనాల కోసం. వాళ్ళకూ ఆనందమిద్దామనే భావన వారినలా రాయించింది.

**కానీ... ఇలా అని బూతుపదాలను చలామణిలోకి తెస్తున్నారనే విమర్శ ఉంది!**

మీరన్నదానితో సగమే ఏకీభవిస్తాం... నీయమ్మ , తొక్కలో అని అనని తెలుగువాడెవరైనా ఉన్నారా? తొక్కలో అనేది త్వక్ (తోలు) అనే పదం నుంచి పుట్టింది. అవి వాడటం తప్పేమీ కాదు. అయితే సందోర్భోచితంగా వాడాలి. విలన్ నీయమ్మ అనొచ్చు. కానీ నాయికానాయకులతో అనిపించకూడదు.

**ఆ ఔచిత్యాన్ని పాటిస్తున్నారా?**

మా మేరకైతే... పాటిస్తాం. హీరోలకు ఇలాంటి డైలాగ్స్ రాయం. కానీ ఈ మధ్య కాలంలో మేం రాసిన సినిమాల్లో కూడా... మాకు సంబంధం లేకుండా కొన్ని డైలాగ్‌లు పెట్టేస్తున్నారు. మేం రాయనివి కూడా మా పేరు మీద చెప్పేస్తున్నారు. ఇదివరకు అలా ఉండేది కాదు. రామారావుగారి రోజుల్లో... ఒక డైలాగ్ మార్చాలంటే రచయితను సంప్రదించేవారు. నాదేశం సినిమాలో.... జయసుధ అన్నగారి గురించి అనే మాటలు కాస్త ఘాటుగా ఉంటాయి. బాపినీడుగారు చూసి.... ఇది కాస్త ఇబ్బందిగా ఉన్నట్లుంది... మీగురించి ఎక్కువగా మాట్లాడుతున్నట్లుంది.... తీసేద్దాం అని రామారావుగారితో అన్నారు. ఆయన... వెంటనే... ఇక్కడ ఇంత ఘాటుగా అన్పించారంటే... మునుముందు మాతో మరింత ఘాటుగా అనిపించే ఉంటారు... ఉండనివ్వండి అన్నారు. అన్నట్లే... అయిదారు సన్నివేశాల తర్వాత కొద్దిసేపటికి.... మొన్న ఏమన్నావ్... అంటూ ఆయన సంభాషణ చాలా శక్తివంతంగా మొదలవుతుంది. చూశారా బాపినీడుగారూ... మొదట డైలాగ్‌లో అంత ఘాటు లేకుంటే ఇప్పుడు నన్ను అకారణంగా ఆడవారిపై విరుచుకుపడ్డానని నిందించేవారు కదా... అని అన్నగారు గుర్తుచేశారు. అదీ... అప్పట్లో రచయితలపై ఉన్న నమ్మకం!





**ఇప్పుడా గౌరవం, స్వేచ్ఛ ఎంతమేరకున్నాయ్?**

రచయితకేంటి ... అందరికీ స్వేచ్ఛే.... చిత్రీకరణ స్థలంలో ఉన్నవారందరికీ స్వేచ్ఛే. అరే... వాడేదో అన్నాడు.. ఆ మాట బాగుంది... వేసేయండి.... అనేంత స్వేచ్ఛ. పాటలో ఒక వాక్యం తెలుగు... ఇంకో వాక్యం ఆంగ్లం,... ఇంకోటి హిందీ.... ఆంగ్ల చిత్రాల్లో ఉండే బూతుమాటలు కూడా మన సినిమాల్లో వినిపిస్తున్నాయి. ఇవాల్టి యువతకు ఇవే కావాలని అడుగుతున్నారు. మేం రాయలేమంటే.... వాళ్ళే రాసుకుంటున్నారు. దిద్దేసుకుంటున్నారు.

**ఈ పరిస్థితి ఎందుకొచ్చిందంటారు?**

మనకు వెటకారం ఎక్కువైంది. తెలుగు మాట్లాడితే వెటకారం.... మన సాహిత్యాన్ని... మన భాషను మనం వెటకారం చేశాం. మన ప్రముఖుల్ని మనం వెటకారం చేశాం. తమిళంలో ఏందిరన్ అని పెట్టిన వాడు ... మనకొచ్చేసరికి రోబో అన్నాడు. ఏం ఎందుకని? ఎందుకంటే అక్కడ ఏందిరన్ అని పెట్టకుంటే ఒప్పుకోరు... సెన్సార్ ఇవ్వరు. మనం ఆంగ్లంలో ఉన్నా ఇచ్చేస్తాం. మమ్మల్ని కథ, మాటలు రాసేవారని ఎవరూ అనరు... స్టోరీ రైటర్ అని ఒకడంటే... మరొకడు డైలాగ్ రైటరంటాడు.

**సినిమా పాటలు, మాటలు తెలుగుభాషకు మేలు**

> " డాడీ ఓ టూథౌజెండ్ ఇవ్వండి...
> కాలేజీ ఫీజు కట్టడానికివాళ లాస్ట్‌డేట్...
> కారు తీసుకెళ్తాను డ్రైవర్‌కు చెప్పండి... ఆన్ ది వే మా ఫ్రెండ్‌ను పికప్ చేసుకుంటాను... బైది బై లంచ్‌కి ఇంటికిరాను. కాలేజీ క్యాంటీన్‌లోనే ఫినిష్ చేస్తాను. ఓకే అమ్మా.... బై...
> అంటుంది బిడ్డ.... ఓకేనమ్మా అంటుంది తల్లి...
> బిడ్డ మాట్లాడింది తెలుగు...
> తల్లికది అర్థమైంది....
> రాబోయే భాష ఇదే! "

**చేస్తున్నాయా? హాని చేస్తున్నాయా?**

భాషకు తెలుగు సినిమా, టీవీరంగం ఎక్కువ నష్టం చేస్తున్నాయి. ముఖ్యంగా టీవీరంగం. ఎందుకంటున్నానంటే... సినిమా డబ్బెట్టుకొని వెళితేనే చూస్తారు. కానీ ఆ అవసరం లేకుండానే ఇళ్ళలో ఉచితంగా టీవీల్లో చూస్తారు. మొన్న ఒకాయన మా ఇంటికొస్తూ గోపాలకృష్ణ ఇల్లెక్కడ అన్నాడంట.... స్ట్రెయిట్ తీసుకో.... లెఫ్ట్ టర్న్ఆయి... రైట్ తీసుకో.... సెకండ్ హౌజ్.... రెడ్‌కలర్లుంటది.... పైన ఫ్లాగుంటది.... ఇది చదువుకోని ఓ మనిషి చదువుకున్నవాడికిచ్చిన సమాధానం. పల్లెటూరు వెళితే... ఏబీసీడీలు చదవని వాళ్ళు కూడా రైస్ వడ్డించమంటారా... కూల్ వాటర్ ఇమ్మంటారా అని అడిగేస్తున్నారు. ఏం క్రరీస్ లైక్ చేస్తారండీ.... అని అడుగుతున్నారు. ఎక్కడి నుంచి వస్తున్నాయివన్నీ! ఛానళ్ళ నుంచి! 'టీవీ వాళ్లు కూడా ముందు తమను తాము సంస్కరించుకోవాలి. మనం ఏ సంస్కృతి నేర్పుతున్నాం... ఏ భాషను నేర్పుతున్నాం... పునరాలోచించుకోవాలి. సినిమా సాహిత్యం... టీవీల్లో మాట్లాడుతున్న మాటలు తెలుగు భాషకు చాలా నష్టాన్ని కలుగజేస్తున్నాయి. దయచేసి సూత్రధారులు (యాంకర్లు) అంతా కూడా తమిళ, కర్ణాటక వాళ్ళను గమనించండి. ఒన్ను ...

రెండు ... పూజ్యం... అంటారు వాళ్లు. మనం వన్ టూ... డాట్... అని పలుకుతాం. యాంకర్ల భాషలో 90 ఆంగ్ల పదాలు... 10 తెలుగు పదాలు దొరుకుతున్నాయి. అదే ప్రమాదం.

**దీన్నుంచి బయటపడటానికి మార్గాలేంటి?**

సాధ్యమైనంత వరకు ఆంగ్ల పదాల్ని నోట్లోంచి రాకుండా చూసుకోవాలి. జంధ్యాలగారి సినిమాల్లో ఎన్ని తెలుగుపదాలుంటాయో. మరచిపోయినవి గుర్తుకొస్తుంటాయి. తిట్లు కూడా... సినిమా వాళ్ళు... ముఖ్యంగా టీవీవాళ్ళు.... ఆంగ్ల పదాల స్థానంలో తెలుగుపదాలు వాడాలి. అలాగని మూఢంగా ఉండాల్సిన అవసరం లేదు. బస్‌ను బస్సుగా చేసి వాడుకుందాం... తత్సమం చేసేద్దాం.... ఇంగ్లిష్ వాడు పండిట్‌ను అలాగే వాడుకుంటున్నాడు. వాడుకలో అలవాటు



ఫొటోలు: రమేష్

పడినవాటిని మన భాషలో సమానార్థకాలు లేనివాటిని వాడుకుందాం.

**పదేళ్ళ తర్వాత తెలుగు పరిస్థితి ఎలా ఉండొచ్చు?**

ఇప్పుడున్నట్లే ఉంటే మాత్రం అంతే సంగతులు! తెలుగుమహాసభల సాక్షిగా తెలుగువాళ్ళం మారకుంటే మన భాష చచ్చిపోయినట్లే! ప్రభుత్వం చర్యలు మొదలెట్టి.... ఆచరణలో చిత్తశుద్ధి చూపిస్తేనే అది బతుకుతుంది. పాఠశాలలు ప్రారంభమయేటప్పుడు తెలుస్తుంది ... ప్రభుత్వ చిత్తశుద్ధి.

ప్రజల్లోనూ చైతన్యం రావాలి. తరువాతి తరాలకు భాష అందాలంటే అమ్మానాన్నల ఒడి నుంచే నేర్పటం మొదలవ్వాలి. భారత దేశంలో మనం మధ్యలో ఉన్నాం.... పైనున్నవాళ్ళంతా హిందీ మాట్లాడతారు... కింద కన్నడిగులు కన్నడ... తమిళులు తమిళం... కేరళ్లో మలయాళం మాట్లాడతారు. మనం మధ్యలో ఉన్నాం... మనం తెలుగును ప్రేమించు కోకుంటే... 'అసమర్థులు'గా మిగిలిపోతాం.

**గోపాలకృష్ణ గారూ... మీరు అధికారభాషా సంఘం (అభాసం) అధ్యక్షుడిగా కూడా చేశారు గదా... ఆ బాధ్యత మీకు సంతృప్తినిచ్చిందా?**

అభాసం సంకల్పం చాలా మంచిది. కానీ ఆచరణలో కష్టం. ఎందుకంటే అధికారభాషా సంఘం అని పేరులో ఉన్న అధికారం నిజానికి లేదు. ఎవరిమీదా చర్య తీసుకోలేం. ఆ అధికారం సాధారణ పరిపాలన విభాగంలో ఉంటుంది. అంటే ముఖ్యమంత్రి దగ్గరుంటుంది. ఇప్పుడు ప్రత్యేక మంత్రిత్వ శాఖ అన్నా నాకదే అనుమానం కలుగుతోంది. ఎందుకంటే మన రాష్ట్రంలో 33 శాఖల మంత్రులున్నారు. వీరందరి దగ్గరా తెలుగులో వ్యవహారాలు జరగాలి. లేదంటే వారిపై ఎవరు చర్య తీసుకోవాలి? ఉదాహరణకు దేవాదాయ శాఖను తీసుకుందాం.... తిరుమలలో తెలుగులో బోర్డులు లేవేంటని అడిగా... ఇక్కడికి అన్ని ప్రాంతాలు, భాషల వాళ్ళు వస్తారు కాబట్టి తెలుగులో ఉంటే వారికి అర్థం కావన్నారు. తెలుగును ముందు రాసి... మిగతా భాషలో కూడా రాసుకోవచ్చుగదా? కానీ విన్నవారు లేరు. అప్పుడు నేను... ముఖ్యమంత్రికి రాసి... దేవాదాయ శాఖ వారిపై చర్య తీసుకోండని కోరటం తప్ప ఏమీ చేయలేని పరిస్థితి.

**అంటే అభాసం ఉన్నా లేనట్లేనా?**

అలాగని కాదుగాని ప్రస్తుత స్థితిలో నామమాత్రమే. ఈ సంఘం ద్వారా తెలుగు అమలయ్యేలా చేయలేం. కానీ... తెలుగు అమలుకు దోహదపడే చర్యలు మాత్రం తీసుకునే అవకాశముంది. నా హయాంలో విద్యుత్ ఉత్పాదక సంస్థ.... విద్యుత్ ప్రసార సంస్థ అని పెట్టండని సూచించా. కానీ చివరకు ఏపీ ట్రాన్స్‌కో... ఏపీ జెన్‌కో అని ఆంగ్లాన్ని తెలుగులో రాసి పెట్టారు. పదాలు మొదట్లో తెలియక పోవచ్చు. కానీ వాడుతుంటే అర్థమైపోతాయి. 'ఈనాడు' పత్రిక ఇంటర్నెట్‌కు అంతర్జాలం అనీ.. డ్రిప్ ఇరిగేషన్‌కు బిందు సేద్యం అనీ నేర్పేసింది. ఇప్పుడు తెలుగు ప్రపంచం అందరికీ అవి తెలిసిపోయాయిగా! అలాగే విద్యుత్ ఉత్పాదక సంస్థ, ప్రసార సంస్థలు కూడా అలవాటయ్యేవి. మొండిగా అలవాటు చేయకుంటే ఏవీ కావు.

**తెలుగుకు ప్రత్యేక మంత్రిత్వశాఖ వచ్చినా పరిస్థితిలో మార్పు రాదంటారా?**

మంత్రిత్వ శాఖ వచ్చాక మరి ఆ మంత్రి ఎవరిపై అధికారం చెలాయిస్తారో... ఎలా చేస్తారో చూడాలి. మరి తెలుగు శాఖ మంత్రి దేవాదాయ శాఖ సిబ్బందిపై ఎలా చర్య తీసుకుంటారో చూడాలి. మళ్ళీ ఆయనా ముఖ్యమంత్రికే రాయాలి. తమిళనాడులో ముఖ్యమంత్రులకు తమిళమంటే అభిమానం. అందుకే అక్కడలా సాగుతోంది. అంతెందుకు ఎన్టీరామారావుగారు ఉన్నప్పుడు తెలుగు ఎందుకని మన రాష్ట్రంలో వెలిగింది? సంకల్ప బలం వల్లే! అధికారం ఉండగానే సరిపోదు... అభిమానం... చిత్తశుద్ధి ఇవి రెండు ఉండాలి.

**తెలుగు కోసం ప్రభుత్వం, ప్రజల్లో రావాల్సిన మార్పు ఏంటి?**

చట్టం ప్రభుత్వం చేస్తుంది. ప్రజలు దాన్ని అమలు చేయాలి. కట్నం తీసుకోవద్దని ప్రభుత్వం చట్టం చేస్తుంది. దాన్ని అమలు చేయాల్సింది ప్రజలే. లంచం తీసుకోవద్దు.... మరి ఇచ్చేవాడున్నాడు తీసుకునేవాడున్నాడు. ప్రజల తప్పా... ప్రభుత్వం తప్పా! ఇలా ప్రశ్న వేసుకొని సమాధానం వెతుక్కుంటే విషయం అర్థమవుతుంది. శిక్షవేస్తే తప్ప తెలుగు మాట్లాడాల్సిన దుస్థితి ఎందుకు? మరి అలాంటప్పుడు తప్పెవరిది? ప్రజలదేగదా? భాషమీద సంస్కృతి... సంస్కృతి మీద నాగరికత ఆధారపడి ఉంటుంది కాబట్టి ప్రజల్లో భాష

అంటే అవగాహన పెరగాలి. చైతన్యం రావాలి. ఇది నా తల్లి అనే అభిమానం, ప్రేమ పెరగాలి. తెలుగు అనే పదంలో మూడక్షరాలున్నాయి. ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్కరిని బాధ్యుల్ని చేయాలి మొదటి అక్షరానికి అమ్మానాన్నల్ని బాధ్యుల్ని చేద్దాం... ఇంతకుముందు అత్తమామ... అమ్మ... నాన్న అని నేర్పేవాళ్ళం.. ఇప్పుడు డాడీ మమ్మీ ఆంటీ అంకుల్ అని నేర్పుతున్నాం. ఇది తప్పు. ఇక రెండో అక్షరానికి.... మనం అంటే ప్రజలందరం బాధ్యత వహించాలి. మనం మాట్లాడే భాషలో నూటికి కనీసం 50 పదాలు ఆంగ్లపదాలు దొర్లుతున్నాయి. కావాలంటే పరీక్షించి చూడండి.... రెండు నిమిషాలు వరుసగా మాట్లాడండి సులభంగా పట్టేయవచ్చు. మొన్నీ మధ్య ఓ టీవీ అమ్మాయి నాతో మాట్లాడటానికి వచ్చారు. ఢిల్లీలో జరిగిన ఇన్సిడెంట్ మీద మీ రియాక్షన్ ఏంటి అని అడిగారు. ఢిల్లీ సంఘటన మీద మీ స్పందనేంటి అనొచ్చు. అలాగే... తప్పనిసరి అనేబదులు కంపల్సరీ అంటున్నారు. ఈ తీరు మారాలి. ఇక మూడో బాధ్యత ప్రభుత్వానిది.

**ప్రపంచ తెలుగు మహాసభలు... భాషాభివృద్ధికి ఉపయోగపడతాయా?**

మహాసభల పేరిట కోట్ల రూపాయలు ఖర్చు చేశారు. వీటివల్ల ఉపయోగం ఎంతుంటుందో తెలియదుగాని.... మొత్తానికి 8 కోట్ల మంది తెలుగువాళ్ళలో ఒక చైతన్య బీజమైతే నాటుకుంది. చాలామంది తెలుగు విశ్వవిద్యాలయానికి వెళ్ళి తెలుగుపై వేసిన పుస్తకాల్ని కొని తెచ్చుకుంటున్నారు. మేమూ తెచ్చుకున్నాం. ఇంటికి రాగానే... మా మనమడు వాటిని తిరగేస్తున్నాడు. అప్పుడు అనిపించింది.... సాహిత్యాన్ని అందుబాటులోకి తెస్తే చూస్తారు. లేదంటే వాటికి దూరంగా ఉండిపోతారు. ఇలా అందుబాటులోకి తీసుకురావటం ప్రధానం

**పాఠ్యాంశంగా తెలుగుకు ఆదరణ లేకపోవడానికి కారణమేంటి?**

(గోపాలకృష్ణ) నా మనవడు... మనవరాలే ఉన్నారు... తెలుగులో సిద్ధాంత వ్యాసం రాసినవాడిగా... తెలుగు నేర్పిన వాడిగా... వారి ముందు నేనోడిపోయా! "మీరు తెలుగు చదవమంటారు తాతయ్యా... చదివితే మాకు మార్కులేమో నలభయ్యో... యాభయ్యో వస్తాయి... అదే సంస్కృతమైతే మాకు 95 శాతం మార్కులొస్తాయి" అన్నారు. అందుకే ప్రభుత్వానికి ఈ మధ్య ఓ లేఖ రాశా. అసలు తెలుగు, ఆంగ్లం భాషల్ని చదువుకోవటం మేరకే పెట్టండి.. గ్రేడింగ్ లెక్కల్లో మాత్రం కలపొద్దు... అని సూచించా. అలా చేస్తే ప్రతి ఒక్కరూ తమ మాతృభాషనే ఎంచుకుంటారు. అంతేగాని తెలియని భాషను ఎంచుకొని... ఫ్రెంచ్, జర్మనీ, జపాన్ అక్షరాలు నేర్చుకోవటానికి తపించడు. ఇది పూర్తిగా ప్రభుత్వ బాధ్యతే. తెలుగులో చదివిన వాడికి ఏమిస్తున్నామనేది ముఖ్యం.

**తెలుగును ఒక పాఠ్యాంశంగా పెడితే సరిపోతుందా? తెలుగు మాధ్యమం మాటేంటి?**

మాధ్యమం విషయంలో కొన్ని కష్టాలున్నాయి. కానీ... తెలుగును పాఠ్యాంశంగా చదవకపోవటం మాత్రం పూర్తిగా ఆక్షేపణీయం. మార్కుల కోసం తెలుగును వదిలేసి వేరే భాషలు చదవమేంటి? భాషను కాపాడటానికి అదే మాధ్యమంలో చదవాల్సిన అవసరం లేదు. కాకుంటే... ఆ భాషను పీజీ దాకా మాత్రం ఒక అంశంగా చదవాలి. అలా ఉండనివ్వండి. ఆంగ్లాన్ని చదవొద్దని అనట్లేదు... ఆంగ్ల మాధ్యమంలో చదవొద్దనీ అనట్లేదు... మాతృభాష బదులు వేరే భాష నేర్చుకోవద్దంటున్నాం....

ఎదుటి వారికి అర్థమయ్యే భాషలో మాట్లాడితే... ఆ మాటల భావం వారి మెదళ్ళలోకి వెళ్తుంది. అదే వారి మాతృభాషలో మాట్లాడితే... నేరుగా వారి హృదయాలను తాకుతుంది.
– నెల్సన్ మండేలా

నా భాషకు ఉన్న పరిమితులు ఏంటంటే... ఈ అనంత విశ్వానికి ఉన్న పరిమితులే.
– లుడ్విగ్ విట్గెన్‌స్టీన్, ఆస్ట్రేలియన్ తత్వవేత్త

**మన ప్రాచీన సాహిత్యం, సంస్కృతులను తరువాతి తరాలకు అందజేయటంలో మనం ఎందుకని వెనకబడుతున్నాం?**

అన్ని దేశాల్లోనూ... వారి సంస్కృతి... చరిత్ర, సాహిత్యాన్ని భావి తరాలకు అందజేస్తారు. కానీ మనదగ్గరే అది జరగట్లేదు. మహాసభల సందర్భంగా అందరికీ అందుబాటులో ఉండేలా తెలుగు కథలు, జానపద గాథలను సాహిత్యాన్ని సుమారు 70 పుస్తకాల దాకా చిన్నచిన్నవి ప్రచురించారు. స్థాలీపులాకన్యాయంలానైనా నేర్చుకుంటాడనే ఉద్దేశంతో వేశారు. ఇది అద్భుతం. ప్రతీదీ తక్కువ ధరలో లభిస్తున్నాయి... తెలుగు విశ్వవిద్యాలయంలో. వాటిని తెస్తే నా మనమడు... బొమ్మలు చూసుకుంటూ... వాళ్ళెవరు వీళ్ళెవరు అంటూ అడిగి తెలుసుకుంటున్నాడు. అంటే... అందుబాటులో ఉంటే... ఈ తరం కూడా మన సాహిత్యంపై ఆసక్తి పెంచుకుంటుంది... అభిరుచి పెంచుకుంటుంది. ప్రభుత్వం చేయాల్సిన చర్యల్లో రెండోది ఇది. ఆనాడు సాహిత్య అకాడమీ వాళ్ళు చేసినట్లుగా... మన సాహిత్యాన్ని, కథలు... పూర్వగాథాలహరిలు... ఇలాంటి వాటన్నింటినీ తక్కువ ధరలకు జనాలకు అందేలా చేయాలి. రూపాయికి కిలో బియ్యం ఇవ్వగా లేనిది రూపాయికి పుస్తకం వేయలేమా? నీ భాషను బతికించటానికి ఈ మాత్రం చేయలేమా?

**ఎవరికీ రాని సమస్య మనకే ఎందుకు తీవ్రంగా తలెత్తుతోంది?**

చైనా వెళితే ఆంగ్లం ఉండదు.... జపాన్ వెళితే ఉండదు... చాలా ఐరోపా దేశాల్లోనూ అంతే. కానీ... వారివారి దేశాల్లో నాలుగు మూలల్లోనూ ఒకే భాష మాట్లాడతారు. మనకా పరిస్థితి లేదు. కన్యాకుమారి నుంచి కాశ్మీర్ దాకా బోలెడన్ని భాషలు మాట్లాడుతున్నాం. ఒకే భాష కోసమని హిందీని అందరి భాషగా చేయాలని చూశారు. అదే హిందీ స్థానంలో సంస్కృతాన్ని చేసుంటే మనకీ రోజు ఈ సమస్య ఉండేది కాదు. ద్రవిడులు హిందీ వ్యతిరేక ఉద్యమం చేసి మనకు రాకుండా చేశారు. మిగిలిన వారందరికీ హిందీ వచ్చు. కనీసం హిందీ నేర్చుకొని ఉంటేనైనా దేశంలో చాలా చోట్ల ఉద్యోగాలు దొరికేవేమో! భిన్నత్వం ఏకత్వం అన్నాంగాని... భిన్నత్వంలో భిన్నత్వమే ఎక్కువగా కనిపిస్తోంది. బీహారీలకు మహారాష్ట్రలో ఏమవుతుందో చూస్తున్నాం కదా. మా చిన్నప్పుడు యావద్దేశాన్ని ఒకజాతిగా ప్రేమించాం... అది భాషకు కూడా రావాలి. ఈ సందర్భంలో... తెలుగు కోసం 'ఈనాడు' చేస్తున్న కృషిని అభినందిస్తున్నాం.


రేగళ్ళ సంతోష్‌కుమార్,
హైదరాబాద్ 80087 09816

# జ్ఞాపకం



సాయంత్రం ఆరున్నర కావొస్తోంది... సికిందరాబాదు నుంచి గుంటూరు వెళ్ళే 'గోల్కొండ' రైలు అప్పుడే మధిర స్టేషన్ దాటుతోంది. శ్రావణమాసమేమో, ముసురు పట్టినట్టుగా పొద్దుటి నుంచి వాన పడుతూనే ఉంది. ప్లాట్‌ఫాం పక్కనే గుడిసెలో ఉంటూ గుడుంబా అమ్ముకునే సావిత్రి, ఎవరితోనో గొడవపడుతోంది.

"ఎదవ సచ్చినోడా, డబ్బుల్లేవని ఇంకా ఎన్ని రోజులు చెప్తావురా? ఇప్పటికి నాలుగొందలైంది నీ బాకీ. డబ్బులు కట్టి ఈడ నుంచి కదులు..." అని అతని చొక్కా పట్టుకుంది. అతనేమో "ఓసినీ... తప్పుడు లెక్కలు చెప్తున్నవేందే? మూడొందలేబై అయింది. రేపు జీతం పడగానే డబ్బులు నీ మొహాన కొడతా. గల్లా ఒదులు. నాగ్గానీ తిక్క రేగిందంటే నువ్వు ఈ ఏరియాలోనే లేకుండా చేస్తా..." అని ఊగిపోతున్నాడు.

"ఇప్పుడు తాగిన గుడుంబా మీ అయ్య సొమ్మనుకున్నవురా?" అంటూ అతని జేబులు వెతుకుతోంది సావిత్రి.

వాళ్ళిద్దరి గొడవ, రైలుదిగి, వర్షం వల్ల ఇళ్ళకి వెళ్ళలేక ప్లాట్‌ఫాం మీదున్న షెడ్ల కింద చేరిన కుర్రవాళ్ళకి మాంచి వినోదంగా ఉంది. వాళ్ళంతా మధిర, ఇంకా పొరుగూళ్ళ నుంచి ఖమ్మం వెళ్లి చదువుకునే పిల్లలు. ఆ పిల్లల మధ్య ఒక మనిషి మాత్రం సావిత్రి గొడవతో సంబంధం లేనట్టుగా తదేకంగా ప్లాటుఫారం చివరన వర్షంలో తడుస్తున్న ఖాళీ సిమెంటు బెంచి వంక చూస్తూ ఉన్నాడు.

అతను, షావుకారు భూషణం గారబ్బాయి మోహన్, ఇప్పుడే గోల్కొండ దిగాడు. నాలుగేళ్ల తర్వాత మధిర వచ్చాడు.

వాళ్లనాన్నగారు చనిపోయి పదేళ్ళు అవుతోంది. భూషణం గారు బతికున్న రోజుల్లో అయన తన స్నేహితులతో వాహ్యాళికి వచ్చి అక్కడే ఆ బల్ల మీదనే సేదతీరేవారు. ఆయన స్నేహితులంటే విశ్రాంత అధ్యాపకుడు కృష్ణమోహన్, డాక్టర్ సీతారాం.

వాళ్ళు ముగ్గురూ బాల్యమిత్రులు. ఎస్సెల్సీ వరకు మధిర ప్రభుత్వ పాఠశాల్లోనే కలిసి చదువుకున్నారు.

ఆ తర్వాత పై చదువుల కోసం కృష్ణమోహన్, సీతారాం చెరో దిక్కుకు పోగా, ఆ స్తోమత లేక భూషణంగారి తండ్రి ఆయన్ని వ్యాపారంలో పెట్టారు. భూషణం గారి దక్షత వల్ల కొన్ని సంవత్సరాల్లోనే వ్యాపారం బాగా వృద్ధి చెందింది. కానీ ఆయన మాత్రం ఆడుతూ పాడుతూ చదువుకోవాల్సిన విలువైన కాలాన్ని కోల్పోయారు.

చదువులు పూర్తయ్యాక కృష్ణమోహన్ మధిర కాలేజీలో అధ్యాపకుడిగా ఉద్యోగం సంపాదిస్తే, సీతారాం ఇక్కడే వైద్యవృత్తి మొదలు పెట్టారు. వాళ్ళకి పెళ్ళిళ్ళు అయ్యాయి, పిల్లలు పుట్టారు. ఎన్ని పనులున్నా రోజూ ఉదయం రైల్వేస్టేషన్ దగ్గర నడకకి వెళ్ళడం మాత్రం తప్పేవారు కాదు... ముగ్గురూ కలిసి ప్లాట్‌ఫాం మొదలు నుంచి చివరిదాకా రెండు మార్లు తిరిగి చివరన ఉన్న సిమెంటు బల్లమీద కూర్చునేవాళ్ళు. రాకెట్ల నుంచి రాగిపిండి దాకా అన్ని విషయాల మీదా వాళ్ళ మధ్య చర్చ నడిచేది. అలా రోజులు గడిచిపోతున్న సమయంలో ఒక శివరాత్రి, భూషణంగారి కుటుంబంలో చీకటి మిగిల్చింది.

మధిరలో శివరాత్రి తిరునాళ్ళంటే చుట్టుపక్కల ఇరవై ఊళ్ళల్లో తెలియని వారు ఉండరు. ఐదు రోజుల ఆ కన్నుల పండువకి ఎక్కడెక్కడి నుంచో జనం ఎడ్లబండ్లు, ట్రాక్టర్లు వేసుకొని మరీ వస్తారు.

ఆ రోజు ప్రతియేడు లాగానే ఆయన తెల్లవారుజామునే వాళ్ళింటి నుంచి బయల్దేరి గొల్లబజారు మీదుగా శివాలయానికి వెళ్తున్నారు. రామాలయం మలుపు దాటాక తుమ్మచెట్ల దగ్గర రోడ్డు మధ్యలో ఏదో పడుంటే బండరాయేమో అనుకొని తీసి పక్కన పడెయ్యబోయారు. కానీ అది రాయి కాదు... ఉంగలు చుట్టుకుని పడుకున్న తాచు. చుక్కపొద్దు చీకట్లో రాయిలా కనిపించింది. అదేంటో తెలుసుకుని షావుకారుగారు చెయ్యి వెనక్కి లాక్కునేలోపే కాటేసింది ఆ విషపురుగు. పాపం... భూషణంగారు అక్కడికక్కడే చనిపోయారు.

అప్పటికే మోహన్ డిగ్రీ పూర్తి చేసి హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. తండ్రి చనిపోయిన తర్వాత తల్లిని ఒంటరిగా మధిరలో ఉంచలేకపోయాడు. దుకాణం అమ్మేసి, ఇల్లు అద్దెకి ఇచ్చేసి ఆమెను తనతో హైదరాబాద్ తీసుకెళ్ళిపోయాడు. ఎవరితోనైనా "మాది మధిర" అని చెప్పుకోవడానికి ఉన్న చివరి ఆధారం ఆ ఇల్లు. పుట్టిన ఊరితో ఉన్న ఆ ఆఖరి బంధాన్ని కూడా తెంచుకోవడానికి ఇప్పుడు వచ్చాడు మోహన్. ఇల్లు అమ్మడం... అసలు తను కల్లో కూడా ఊహించని మాట. దానికి కారణభూతమైన సంఘటన పదిహేను రోజులకింద జరిగింది.

ఆ రోజు ఆఫీసు నుంచి రజిత ఎందుకో చిటపటలాడుతూ వచ్చింది. వస్తూనే

కథ



అపార్టుమెంటు నడవాలో ఆడుకుంటున్న చిట్టిని రెక్కపుచ్చుకుని ఇంట్లోకి లాక్కొచ్చింది.

ఆటచెడిందని ఏడుస్తున్న చిట్టికి ఇంకో రెండు తగిలించింది. ఇవన్నీ చూస్తూ తను ఊర్కోగలిగాడు కానీ అమ్మ ఉండలేకపోయింది. "ఎందుకమ్మా పసిదాన్ని బాదుతున్నావు? ఊర్కో... ఏమైంది ఇవ్వాళ?" అడిగింది అమ్మ.

"దెయ్యం పట్టింది" అని బదులిచ్చి విసవిసా గదిలోకి వెళ్ళిపోయింది రజిత.

ఎప్పుడూ పరుషంగా మాట్లాడని కోడలు ఒక్కసారిగా అలా అనడంతో మనసు చివుక్కుమంది అమ్మకి. చిన్నబోయిన మొహంతో చిట్టిని ఎత్తుకొని బాల్కనీలోకి నడిచింది. తను మౌనప్రేక్షకుడిగానే మిగిలిపోయాడు.

రజిత కోపానికి కారణం మర్నాటి ఉదయం తెలిసింది. అమ్మకి ఇష్టమైన ఇడ్లీ, కొబ్బరిపచ్చడి చేసింది రజిత. తొమ్మిదైనా అమ్మ గదిలోంచీ రాలేదు. చివరికి రజితే వాటిని పళ్లెంలో పెట్టుకుని అమ్మ దగ్గరికి వెళ్ళింది.

"క్షమించండి అత్తయ్యా, రాత్రి అలా మాట్లాడాల్సింది కాదు. కానీ, అప్పుడు నా మనసేం బాగుండలేదు. ఇంటి అప్పుకి ఈ నెల నుంచి వాయిదా పెరిగింది.

మా ఇద్దరిలో ఒకళ్ల జీతం దానికే పోతుంది. మిగిలిన ఖర్చులు కూడా కొండలాగా పెరిగి పోతున్నాయి. ఆ చికాకులతో కొంచెం మాటతూలాను. ఏమీ అనుకోకండి. మీరు నాకు అత్త కాదు, అమ్మ అని మీకు తెలుసు కదా! లేవండి, లేచి తినండి" బతిమాలింది రజిత. ఆ మాటలతో తేలికపడిన అమ్మ,

"పిచ్చి పిల్లా, ఇంత చిన్న విషయానికి మీరు ఇబ్బంది పడాలా? మధిరలో ఉన్న మనిల్లు అమ్మేద్దాం. ఆ డబ్బుతో అప్పు కొంత తీర్చెయ్యండి. అప్పుడు కిస్తీ తగ్గుతుంది. ఆ ఇంట్లో మనం ఉండబోయేది లేదు కదా. దాని మీద వస్తోందీ అంతంతే. అమ్మేస్తే కాస్త వెసులుబాటుగా ఉంటుంది కదా!" అంది.

రజిత, "అయ్యో అదేంటి అత్తయ్యా, అది మీ కష్టార్జితం. దాన్ని అమ్మడమేంటి? భలే వారే... బ్యాంకు అప్పుకి ఏదో ఒకటి చేద్దాం. ఇంకెప్పుడూ ఆ ఇల్లు అమ్ముతాననకండి" అని మరోమాటకి ఆస్కారమివ్వకుండా వచ్చేసింది.

ఆ రోజు రాత్రి మోహన్‌కి నారాయణ అనే దళారి మధిర నుంచి ఫోన్ చేశాడు. "అమ్మగారు చెప్పారండీ, ఇల్లు అమ్ముతున్నారట కదా? ఏమాత్రంలో ఉన్నారో చెప్తే బేరం చూస్తా" అన్నాడు.

అమ్మ ఇల్లు అమ్మడానికే నిర్ణయించుకుందని మోహన్‌కి అర్థమైంది. ఒక్కసారి నిశ్చయించుకుంటే ఎవరిమాటా వినదు అమ్మ. చేసేది లేక పన్నెండులక్షలకు నారాయణ తీసుకొచ్చిన వాళ్లతో మాట్లాడటానికి వచ్చాడు తను. కుదిరితే బయానా తీసుకుని ఒప్పందం రాసుకోవడానికీ సిద్ధమయ్యే వచ్చాడు. ఆ ఇల్లు అమ్మడం తనకు సుతరామూ ఇష్టంలేదు.

షావుకారు భూషణం గారి ఇల్లంటే 'లక్ష్మీ సరస్వతీ నిలయం' అనే వాళ్ళు ఆ రోజుల్లో. దానికి కారణం... తనలాగా డబ్బులేక చదువు ఆపేసిన పదిమంది పేదపిల్లల్ని భూషణంగారు చదివించేవారు. వాళ్లందరూ ఆ ఇంట్లోనే ఉండి, చదువుకునేవారు. పూట గడవడమే కష్టంగా ఉన్నవాళ్లు, ఆయన పుణ్యమాని చదువుకొని వాళ్ల కాళ్ళమీద వాళ్లు నిలబడగలిగారు. అలాంటి జ్ఞాపకాలెన్నో ఆ ఇంటితో పెనవేసుకుని





ఉన్నాయి. ఇప్పుడు ఆ ఇల్లు కొనేవాళ్ళు దానిని పడగొట్టి షాపింగు కాంప్లెక్సు కడతారట, నారాయణ చెప్పాడు! ఇల్లు కూల్చేస్తారన్న ఊహనే భరించలేకపోతున్నాడు తను..

***

వాన వెలిసింది.... అరగంట గొడవ తర్వాత తాగినవాడి చేతి గడియారాన్ని గుంజుకొని బాకీ జమేసుకుంది సావిత్రి. అతను బండ బూతులు తిడుతూ వెళ్ళిపోయాడు. నెమ్మదిగా స్టేషన్ బయటికి వచ్చాడు మోహన్. ఆగకుండా పడ్డ వానకి రోడ్లన్నీ బురదమయం అయిపోయాయి. ఆ బురదలో ఎలా వెళ్ళాలా అని చూస్తున్న మోహన్‌కి వాళ్ళ పక్కవీధిలోనే ఉండే రిక్షా సాంబయ్య కనిపించాడు.

మోహన్ని చూడగానే "బాగున్నారా అబ్బాయి గారూ"? అంటూ వచ్చి చేతిలోని బ్యాగు అందుకున్నాడు.

"బాగున్నాను తాతా... నువ్వెట్లా ఉన్నావు?" అడిగాడు మోహన్.

"నాదేముంది బాబూ, జీవుడున్నంత కాలం రిక్షా సవారీ తప్పదు. కొడుకులిద్దరూ చెరోదారి చూసుకుని పోయారు. ఒంటరిగాడిని. ఓపికున్నప్పుడు రిక్షా వేస్తా, లేదంటే ముసుగుతన్ని పడుకోవడమే... అమ్మగారెలా ఉన్నారు బాబూ?" అన్నాడు సాంబయ్య.

దానికి మోహన్ "బాగానే ఉంది తాతా, ఇల్లు అమ్మేద్దామని చూస్తున్నాం. బేరం మాట్లాడటానికి వచ్చా. రేపు సాయంత్రం బండికి వెళ్లిపోవాలి." బదులిచ్చాడు. సాంబయ్య నిట్టూర్చడం మోహన్ చూపు దాటిపోలేదు.

అరకిలోమీటర్ వెళ్లాక కృష్ణప్రసాద్ గారు నడుచుకుంటూ వెళ్లడం చూశాడు మోహన్. సాంబయ్యని రిక్షా ఆపమని దిగి కృష్ణప్రసాద్ దగ్గరికి వెళ్లి "నమస్తే సార్, బాగున్నారా"? అని పలకరించాడు.

వాళ్ళ నాన్నకి స్నేహితుడే అయినా కృష్ణప్రసాద్ అంటే చనువు కంటే భయం, గౌరవం ఎక్కువ మోహన్‌కి. అందులోనూ తను ఆయన శిష్యుడే ఒకప్పుడు. అందుకని ఆ అలవాటు అలా ఉండిపోయింది.

ఆయన ఒక్కక్షణం ఆగి "మోహన్ కదా? బాగున్నానోయ్... నువ్వెలా ఉన్నావు? అమ్మ బాగుందా? నాలుగు రోజులు ఉంటావా? రేపొకసారి ఇంటికిరా" అన్నారు.

రాకతప్పదు అన్న ఆదేశం స్ఫురించింది ఆయన మాటల్లో. ఆయన మాటే అంత. అధ్యాపకుడు అవడం వల్లేమో ఒక రకమైన గాంభీర్యం ఉంటుంది ఆయన మాటల్లో.

మొదటి నుంచీ ఆయనతో మోహన్ సంభాషణలన్నీ ఏకపక్షమే, ఆయన వక్త... మోహన్ శ్రోత! ఇంకేమీ చెప్పలేకపోయాడు. ఎలాగూ తెల్లవారాక ఆయనింటికి వెళ్లాలి కదా అని తను మధిర ఎందుకు వచ్చాడో చెప్పలేదు. మళ్లీ కలుస్తానని చెప్పి తిరిగొచ్చి రిక్షాలో కూర్చున్నాడు మోహన్.

"ఏం బాబూ, ఏమాలోచిస్తున్నారు? ఆ రాతి మనిషి మారడు బాబూ. తల్లి కాబోతున్న కూతుర్ని అన్యాయంగా చంపుకున్నాడు. ఈయన పిల్లలకి ఏం పాఠాలు చెప్పేవాడో ఏమో" అని నిట్టూర్చాడు సాంబయ్య.

ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడ్డాడు మోహన్. రాగిణి రూపం కళ్ల ముందు



కదలాడింది. రాగిణి అంటే కృష్ణప్రసాద్‌గారి అమ్మాయి. తనకన్నా రెండేళ్లు పెద్దది. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ అందరికీ తల్లోనాలుకలా ఉండే రాగిణక్క చనిపోయిందా? ఎలా?

అదే అడిగాడు మోహన్. "రెండేళ్ల కింద అనుకుంటా బాబూ, ఆయమ్మ తనతో పాటే పనిచేసే సుందరం అనే కుర్రాణ్ని పెళ్లి చేసుకుంది. ఆ బాబుది వీళ్ల కులం కాకపోయినా పంతులుగారు అడ్డుచెప్పలేదు. అంతా బాగుంది అనుకుంటుండగా అల్లుడు కారు కొంటానికి డబ్బులు సాయం అడిగాడంట. ఉంటే ఇవ్వాలి. లేకపోతే లేవని చెప్పాలి. ఈయన మాత్రం కూతుర్ని నానా మాటలు అని పంపించాడట. పాపం ఆయమ్మ ఆదేరోజు రాత్రి ఉరిపోసుకుని చచ్చిపోయింది. రిటైరయ్యాడు, అప్పులున్నాయి. ఏం పోయేటప్పుడు మీదేసుకుని తీసుకుపోతడా ఆ డబ్బుల్ని?" ఆవేశం, ఆవేదన కలిసిన స్వరంతో చెప్పాడు. ఇంతలో ఇల్లొచ్చింది. రిక్షా దిగి సాంబయ్యకి డబ్బులిచ్చి పంపేశాడు. ముందుగానే చెప్పడంతో అద్దెకుండేవారు మోహన్ వాళ్ళు తమ కోసం అట్టిపెట్టుకున్న వాటాని శుభ్రం చేయించి పెట్టారు. తాళం తీసి లోపలకి వెళ్లి లైట్లు వేశాడు. ఆ కాంతిలో గదులన్నీ తృప్తిగా చూసుకుని ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఆ ఇంట్లో తన చిన్నతనమంతా గడిచింది. డిగ్రీ పాసయ్యినప్పుడు, తర్వాత కొద్దిరోజులకే ఉద్యోగం వచ్చిందని చెప్పినప్పుడు నాన్న ఎంత సంతోషించారని!! ఇంటికి రంగులు వేయించి పెళ్లికూతురులా ముస్తాబు చేశారు. స్నేహితుల్ని, బంధువుల్ని పిలిచి భోజనాలు పెట్టారు. అందరూ నా పెళ్లి అనుకున్నారు. ఎప్పుడూ చుట్టాలు పక్కాలతో, పైన ఉండి చదువుకునే పిల్లలతో ఇల్లు ఎంత సందడిగా ఉండేదో! అలాంటి ఇల్లు కాలగర్భంలో కలవబోతోంది. ఎలాగైనా ఇల్లు అమ్మడం ఆగిపోతే బాగుండు... కానీ దాన్ని ఆపడం తన వల్ల అయ్యే పనేనా? ఒంటరిగా... ఆలోచనల్లో మునిగిన మోహన్‌కి ఒక తోడు దొరికింది. ఆ తోడు పేరు 'ఆకలి'. ఎప్పుడో మధ్యాహ్నం రైలెక్కకముందు ఇంట్లో తిన్న అన్నం. అప్పటి నుంచి ఏమీ తినలేదు.

గంట తర్వాత... బయటికెళ్లి భోజనం చేసి వచ్చి మంచం మీద వాలిన మోహన్‌కి రాగిణక్క గుర్తొచ్చి దిగులుగా అనిపించింది. తండ్రి తిట్టాడని ఆత్మహత్య చేసుకునేంత పిరికిది కాదు రాగిణి. అలా చేసిందంటే ఏదో బలమైన కారణం ఉంటుంది. అదేంటో రేపు కృష్ణప్రసాద్ గారిని కలిస్తే తెలుస్తుందేమో... ఆలోచనల్లోనే నిద్రలోకి జారుకున్నాడు.

మర్నాడు పదింటికల్లా తయారై నారాయణకి ఫోన్ చేశాడు. అతను వాళ్ళ స్నేహితుడెవరికో ప్రమాదం జరిగితే గంపలగూడెం వెళ్లాడట. ఇవ్వాళ రావడం కుదరదన్నాడు. వచ్చిన పనే అవలేదనుకుంటూ బయటికి బయల్దేరాడు. కొంచెం దూరం వెళ్లాక గుర్తొచ్చింది. కృష్ణప్రసాద్‌గారి సంగతి. వడివడిగా అడుగులేస్తూ ఆయనింటికి చేరుకున్నాడు మోహన్.

వెళ్లేసరికి ఆయన వరండాలో వాలుకుర్చీలో కూర్చుని పేపర్ చదువుతూ ఉన్నారు. కుశలప్రశ్నలు అయ్యాక మోహన్, రాగిణి గురించి అడిగాడు. ఆ పేరు వింటూనే ఆయన కళ్ళల్లో కన్నీటి పొర! ఈ ముప్పయ్యేళ్ళల్లో

ఎన్నడూ ఎదురవని సంఘటన అది. కృష్ణప్రసాద్ గారి కళ్ళల్లో కన్నీరు!! ఒక్క క్షణం ఆగి ఆయన చెప్పడం మొదలుపెట్టారు.

"నేను రాగిణిని అమ్మాయిలా కాదు కొడుకులానే పెంచాను మోహన్. తను ఇష్టపడిందని ఏ పట్టింపులూ లేకుండా తనతో పనిచేసే సుందరానికి ఇచ్చి పెళ్లి చేశా. కానీ పెళ్లయ్యాక తెలిసింది. నేను చేసింది కన్యాదానం కాదు, అపాత్రదానం అని. వాడికి లేని వ్యసనం లేదు. పెళ్లి తర్వాత వాడు సరిగ్గా ఉద్యోగం చేసింది లేదు. ఏ నెలా పూర్తి జీతం అందుకున్న వాడూ కాదు.

తన ఖర్చులు కూడా రాగిణి జీతంలో నుంచే! ఇక ఇంటి ఖర్చుల సంగతి సరేసరి. బ్యాంకు లెక్కలేవో తారుమారు చేశాడని సస్పెండ్ చేశారు. ఆ కేసుకి నేనే డబ్బులు కట్టా. కానీ ఆ కుక్కతోక సరైతే కదా! మరో నేరం చేసి ఈసారి ఏకంగా జైలుకే వెళ్ళాడు. జామీను ఇవ్వడానికి రమ్మంటే నేను జన్మలో వాడి మొహం చూడను, వస్తే బయటికొస్తాడు లేదా జైల్లోనే పోతాడని రాగిణిని కోప్పడ్డాను. వాడు పెట్టే హింసలకు తోడు నా మాటలు కూడా కలిశాయేమో నా చిట్టితల్లి ప్రాణం తీసుకుంది..." దుఃఖంతో ఆయన గొంతు మూగబోయింది. చాలాసేపు ఆయన ఏడుస్తూనే ఉన్నారు. ఎన్ని రోజుల నుంచి ఉగ్గబట్టుకున్న శోకమో... ఉబికుబికి వస్తోంది.

చెట్టంత మనిషి, తామంతా 'ఐరన్ మేన్' అని పిలుచుకునే కృష్ణప్రసాద్‌గారు అలా చిన్న పిల్లాడిలా ఏడుస్తుంటే మోహన్‌కి గుండె పిండేసినట్లయింది. కానీ ఆయన్ని అనునయించే ధైర్యం తనకి లేకపోయింది.

చివరికి ఆయనే తెప్పరిల్లి "రాగిణి పోయాక తెలిసింది... తను గర్భవతి అని. ముందే తెలిస్తే నా తల్లిని ఏదోలా తెచ్చుకుని కళ్లల్లో పెట్టుకు చూసుకునేవాడిని. ఆ సుందరానికి రాగిణి మరణం జనం దృష్టిలో నన్నొక రాక్షసుడిలాగా చిత్రీకరించడానికి పనికొచ్చింది... అప్పటిదాకా నన్ను గౌరవించేవాళ్ళు, నేను నా మనుషులు అనుకున్న వాళ్లు కూడా మెల్లగా తప్పుకుని తిరగడం మొదలుపెట్టారు.

రాగిణి పోవడానికి వారం ముందే సీతారాం అమెరికా వెళ్ళిపోయాడు. కొడుకు దగ్గరికి. దాంతో, నా అన్నవాళ్లు ఎవరూ లేక, నా ఘోష చెప్పుకోవడానికి కూడా దిక్కులేక ఇంకా ఎందుకు బతికున్నానా అనిపించింది. బంధువులంతా నేనెప్పుడు పోతానా, నా ఆస్తి ఎప్పుడు దక్కుతుందా అని చూసేవారే.

అందుకే, ఈ మధ్యే నా తర్వాత ఈ ఆస్తి మంచి పనులకు ఉపయోగపడేలా ధర్మసంస్థ పెట్టాను. అనాథ పిల్లలకి, పేద పిల్లలకి నీడనిచ్చి, నాలుగక్షరాలు నేర్పే మంచి బడి కడదామని. ఇదంతా ఈ వయసులో నా శక్తికి మించిన పనే... కానీ తప్పదు." అన్నారు. ఆ మాటలు వినగానే మోహన్ మనస్సులో ఒక ఆలోచన మెరిసింది.

"సార్, ఏమీ అనుకోనంటే ఒక మాట! ఇప్పుడు బోలెడంత ఖర్చు, శ్రమలతో వేరే కట్టించడం దేనికి? మన ఇల్లు ఉంది కదా! అది తీసుకోండి. నాన్న జ్ఞాపకంగా మిగిలున్న ఆ






వరుణదేవుడి
కుండపోత
అన్నదాతలకు
గుండెకోత



బతుకుబాటలో
మెతుకుకోసం
నష్టాలసేద్యం
కష్టాలపంట



పడుచుదనం
పండువెన్నెల
ముసలితనం
మూగకోయిల

**కాకరపర్తి సుబ్రహ్మణ్యం**
తెనాలి. 98482 97711

ఇల్లు అమ్ముదామని వచ్చాను. దేవాలయం లాంటి ఆ ఇల్లు అమ్మడం నాకు ఇష్టం లేదు. కానీ తప్పనిసరైంది. ఇల్లు అమ్మడం నాన్నకి కూడా ఇష్టం లేనట్టుంది. అందుకే మీరు కనిపించేలా చేశారు. మీ స్నేహితుడు ఎంతో ఇష్టపడి కట్టించిన ఆ ఇల్లు, మీరు చేయబోయే మంచి పనికి ఆయన జ్ఞాపకంగా ఉపయోగపడటం కంటే కావలసింది ఏముంది?" అన్నాడు.

"లేదు మోహన్, మీ నాన్న స్నేహాన్ని ఇలా వాడుకోదల్చుకోలేదు. ఆ ఇల్లు కట్టించడానికి వాడెంత కష్టపడ్డాడో, ఆ ఇంటిని ఎంతగా ప్రేమించాడో నాకు తెలుసు. నీ ఆలోచన బాగానే ఉంది. కానీ ఇల్లు ఉచితంగా వద్దు. మార్కెట్ ధర చెప్పు. ఇస్తాను."... నచ్చజెప్పబోయారు.

కానీ మోహన్ ... "అయితే మీతో మా నాన్న స్నేహానికి, మీరు మాకు నేర్పిన విద్యాబుద్ధులకి, మీరు చేయబోయే మహత్కార్యానికి వెల కట్టండి సార్. కట్టగలరా? లేదు కదా... అందుకే ఇంటికి కూడా రూపాయి ఇవ్వక్కర్లేదు. దస్తావేజులు అన్నీ నాతోనే ఉన్నాయి. రేపే రిజిస్ట్రేషన్. మీరింకేం మాట్లాడకండి" అన్నాడు.

స్నేహితుడి కొడుకు, తన దగ్గర చదువుకున్న కుర్రాడు, తను తలపెట్టిన సత్కార్యానికి సాయంగా ముందుకు రావడం చూసి కృష్ణప్రసాద్ కళ్లు మరొకసారి చెమర్చాయి. కృష్ణప్రసాద్ గారింట్లోనే భోజనం చేసి ఆయన దగ్గర సెలవు తీసుకుని ఇల్లు చేరాడు. అమ్మకి, రజితకి ఫోన్ చేసి జరిగింది చెప్పాడు. ఇల్లు అమ్మడం లేదన్నదానికి అమ్మ బాధపడింది కానీ, రజిత సంతోషించింది. వెంటనే నారాయణకీ ఫోన్ చేసి చెప్పేశాడు.

ఇల్లు అమ్మకపోతే ఏమవుతుంది? మహా అయితే నెలకిస్తీ కింద ఇద్దరిలో ఒకరి జీతం మొత్తం ఖర్చవుతుంది. కానీ తను చేసిన పని ఎందరో చిన్నారుల జీవితాల్లో వెలుగు నింపుతుంది. నాన్న జ్ఞాపకానికి ఇంతకంటే అందమైన సజీవ రూపం ఇంకేముంటుంది! ఆ రాత్రి, తను చాలా రోజులు తర్వాత హాయిగా నిద్రపోయాడు. మరుసటిరోజు రిజిస్ట్రేషన్ పూర్తయ్యాక రైల్వేస్టేషనుకి బయల్దేరాడు మోహన్. మబ్బులు విడిపోయాయి... ఆకాశంలోనూ, మోహన్ మనసులోను!

ప్లాటుఫారం మీదికి రైలొచ్చి ఆగింది. సావిత్రి గుంజుకున్న గడియారాన్ని విడిపించుకోవడానికి డబ్బులు తెచ్చాడు, మొన్న గొడవ పడినవాడు. అదిస్తూ కూడా ఇంత గొంతేసుకుని వాణ్ని తిడుతోంది సావిత్రి.

అప్పుడు చూశాడు మోహన్, సావిత్రిని... ఈమె మారదు... మారలేదు కూడా అనుకుంటూ లేచి నిలబడ్డాడు. రైలెక్కబోతూ ప్లాటుఫారం చివరనున్న ఖాళీ సిమెంటు బల్ల వైపు చూశాడు.

వాళ్ళ నాన్న భూషణంగారు ఆ బల్ల మీద కూర్చుని తనని చూసి గర్వంగా, తృప్తిగా నవ్వుతున్నట్టనిపించింది.





**వరుణ్ పారుపల్లి**
సాఫ్ట్‌వేర్ ఇంజినీర్
హైదరాబాద్
98490 71914



# అమ్మభాషలకే అగ్రతాంబూలం



'ఆంగ్లాన్ని ప్రపంచ భాషగా అంగీకరించేందుకు రెండు సమస్యలు ఉన్నాయి. ఒకటి... ఆ భాష ఉచ్చారణకు, రాతకు సంబంధముండదు. రెండు... సంక్లిష్ట పదజాలం'

ఈ మాటలన్నది ఆంగ్లేతరుడు కాదు. ప్రసిద్ధ ఆంగ్లాచార్యులు, 18 ఏళ్ల పాటు రాలిన్సన్ & బోస్వర్త్ ప్రొఫెసర్ ఆఫ్ ఆంగ్లో-సాక్సన్ (ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం)గా వ్యవహరించిన సి.ఎల్.వ్రెన్.

'భాషా సామ్రాజ్యవాదంతోనే ఆంగ్లం ప్రపంచ భాషగా ఎదిగింద'ని కోపెన్‌హెగన్ బిజినెస్ స్కూల్ ఆంగ్ల విభాగంలో పరిశోధనాచార్యులుగా పని చేసిన రాబర్ట్ ఫిలిప్సన్ (జన్మత: ఆంగ్లేయుడు) కుండబద్దలు కొట్టారు.

'ప్రతి రెండు వారాలకు ఒక భాష అంతరించిపోతోంది. ప్రస్తుతం ప్రపంచంలో చెలామణిలో ఉన్న భాషల్లో సగం... వచ్చే శతాబ్దంలో కనిపించవు. చాలా ఆందోళన కలిగించే అంశమిది. ఈ పాపంలో ఆంగ్లానికీ వాటా ఉంది'... ప్రఖ్యాత భాషావేత్త, కేంబ్రిడ్జి ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ ఇంగ్లీష్ లాంగ్వేజ్ తదితర గ్రంథాల రచయిత రాబర్డ్ క్రిస్టల్ అభిప్రాయం.

ఆంగ్లానికి ఉన్న పరిమితులు, దాని విచ్చలవిడి వాడకం వల్ల కలుగుతున్న దుష్పరిణామాలను గురించి ఆ భాషీయులే నెత్తీనోరు కొట్టుకుంటున్నారు. అయినా... మనం మాత్రం అమ్మభాషకు దూరమవుతున్నాం. సుమతీ శతకకారుడు చెప్పిన ఓ ముఖ్యమైన విషయాన్ని మర్చిపోతున్నాం.

అప్పుగొని సేయు విభవము
దెప్పరమై మీద గీడు దెచ్చుర సుమతీ!

ఈ ప్రమాదాన్ని కొన్ని ఆంగ్లేతర అగ్రరాజ్యాలెన్నడో

> ప్రతి ఒక్కరూ తమ మాతృభూమిని, సంస్కృతిని, మాతృభాషను గౌరవించాలి. ఎందుకంటే... అవి మనకు ఆనందాన్ని కలిగించేవి. - ఋగ్వేదం

పసిగట్టాయి. మారుతున్న కాలానికనుగుణంగా తమ మాతృభాషలను పరిపుష్టం చేసుకుంటున్నాయి. పైగా తమ పలుకును ప్రపంచవ్యాప్తం చేయడానికి విస్తృతంగా కృషి చేస్తున్నాయి. మాతృభాషా దినోత్సవం సందర్భంగా... ఆయా దేశాల మాతృభాషాసేవను 'తెలుగు వెలుగు'ను పరిశీలించింది. తెలుగు భాషాభిమానులకు స్ఫూర్తినిచ్చే అంశాలను గుర్తించింది.

## పాలకుల కార్యదక్షత

రూ.4899.72 కోట్లు... 'జపాన్ ఫౌండేషన్' మూలధనమిది. తమ భాష, సంస్కృతులను సంరక్షించుకుంటూ, అదే సమయంలో విశ్వవ్యాప్తంగా వాటికి ప్రాచుర్యం కల్పించడానికి జపాన్ ప్రభుత్వమే ఈ సంస్థను ఏర్పాటు చేసింది. మూలధనాన్నీ సమకూర్చింది. 'జపనీస్ సంస్కృతిని ప్రపంచానికి పరిచయం చేయడానికి మాత్రమే ఆంగ్లాన్ని నేర్చుకోండ'న్న నినాదంతో ముందడుగేస్తోంది.

'మన మాతృభాషలో విద్యాభ్యాసం చేస్తున్న విద్యార్థులందరినీ ప్రపంచంలోని విజయవంత మైన స్థానాల్లోకి తీసుకెళ్తామని హామీ ఇస్తున్నాం...' చైనా ప్రభుత్వం సగర్వంగా చేసిన ప్రకటన ఇది. ఈ హామీని నిలబెట్టుకోవడానికి నిబద్ధతతో వ్యవహరిస్తోంది. మాండరిన్ (చైనీయుల భాష)లో బోధన చేస్తున్న ఒక్కో పాఠశాలకు ఏడాదికి రూ.16.47 లక్షల చొప్పున ఆర్థిక సాయం చేస్తోంది. పాఠశాలల్లో ఉత్తమ ప్రమాణాలు నెలకొనేలా చూస్తోంది.

సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైన తర్వాత రెండు దశాబ్దాలపాటు రష్యన్ భాషకు రాజాశ్రయం లేదు. రష్యా పాలకులెవరూ భాషాభివృద్ధిపై దృష్టి సారించలేదు. కానీ, వ్లాదిమిర్ పుతిన్ అధికారంలోకి వచ్చాక పరిస్థితి పూర్తిగా మారింది. 'జాతీయ రష్యన్ భాషా సమాఖ్యను ఏర్పాటు చేయాలంటున్న భాషావేత్తలకు మనం మద్దతివ్వాలి. దేశీయంగా మన భాషను అభివృద్ధి చేసుకోవాలి. విదేశాల్లో రష్యన్ భాషా బోధన కార్యక్రమాలకు సాయం చేయాలి. మన భాష, సాహిత్యాలకు ప్రపంచవ్యాప్తంగా ప్రాచుర్యం కల్పించాలి' అని పుతిన్ 2007లో ప్రకటించారు. తర్వాత కొద్దిరోజులకే 'రస్కీ మిర్ ఫౌండేషన్'ను ఏర్పాటు చేశారు. పంచవర్ష ప్రణాళికలను అమలు చేస్తూ తన మాటలకు వాస్తవ రూపమిస్తున్నారు.

పుస్తక ప్రచురణల విభాగానికంటూ ప్రత్యేకంగా మంత్రి ఉంటారా! మన రాష్ట్రంలోనైతే భాషకే మంత్రిత్వ శాఖ లేదు. ఇక ప్రచురణల మాట దేవుడెరుగు. ఇటలీలో మాత్రం సాక్షాత్తూ ప్రధానమంత్రి కార్యాలయ పర్యవేక్షణలోనే 'ప్రచురణల విభాగా'న్ని నిర్వహిస్తున్నారు. ఇటాలియన్ భాషా పుస్తకాల ప్రచురణ, విదేశీ భాషల్లోకి వాటి అనువాదం, ప్రచారంలోకి తీసుకురావడం తదితర బాధ్యతలను ఈ విభాగం వహిస్తోంది.

### భాషతో సంపద వృద్ధి

పోర్చుగల్, స్పెయిన్ స్థూల జాతీయోత్పత్తిల్లో 17 శాతం, 15 శాతం సంపద... భాషా ప్రధానమైన సాంస్కృతిక పరిశ్రమలతోనే సమకూరుతోంది. దేశ విదేశాల్లో స్పానిష్, పోర్చుగీసు భాషలకు కల్పిస్తున్న ప్రచారం, ఆ భాషా మాధ్యమంలో విద్యాభ్యాసం చేస్తున్న వారికి ఇస్తున్న ప్రోత్సాహంతోనే ఈ సంపద సృష్టి సాధ్యమవుతోంది.

ప్రోత్సహిస్తే ఆదాయం ఎలా వస్తుందని ఆలోచించక్కర్లేదు. స్పానిష్, పోర్చుగీసులను నేర్చుకున్న వారెవరైనా ఆయా భాషల పుస్తకాలను కొంటారు. టీవీ ఛానళ్లను చూస్తారు. ఆ దేశాల్లో పర్యటించడానికి ఆసక్తి చూపిస్తారు. ఇవన్నీ ఆదాయవనరులే కదా.

భాషాభివృద్ధిని సంపద సృష్టితో అనుసంధానించడం వల్ల ఈ రెండు భాషలకూ ఎంతో మేలు జరుగుతోంది. యునెస్కో నివేదిక కూడా ఇదే విషయాన్ని స్పష్టం చేసింది. ఆ నివేదిక ప్రకారం... ఆంగ్లం తర్వాత అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న యూరోపియన్ భాషలు స్పానిష్, పోర్చుగీసులే.

### ఐకమత్యమే మహాబలం

తమిళనాడులో తెలుగు మాట్లాడేవారు దాదాపు 42 శాతం మంది ఉన్నారని అంచనా. తెలుగు భాషను అభివృద్ధి చేయడానికి మన రాష్ట్ర ప్రభుత్వంతో కలిసి తమిళనాడు సర్కారు కూడా కృషి చేస్తే! ఊహే అద్భుతం కదా. దురదృష్టవశాత్తూ ఇక్కడ ఆ పరిస్థితి లేదు. కానీ, యూరోపియన్, దక్షిణ అమెరికా దేశాలు ఇదే పని చేస్తున్నాయి. ఏ రెండు దేశాల్లోనైనా ఒకే భాష మాట్లాడేవారు గుర్తించదగిన సంఖ్యలో ఉంటే... ఆ ఉభయ దేశాలు భాషాపరంగా ఏకతాటిపైకి వస్తున్నాయి. పలుకును పరిరక్షించుకోవడానికి కృషి చేస్తున్నాయి.

పోర్చుగల్, బ్రెజిల్‌లతో సహా ఎనిమిది దేశాల భాగస్వామ్యంతో ఏర్పడ్డ కమ్యూనిటీ ఆఫ్ పోర్చుగీస్ లాంగ్వేజ్ కంట్రీస్, కౌన్సిల్ ఫర్ జర్మన్ ఆర్థోగ్రఫీ (జర్మనీ, ఆస్ట్రియా, స్విట్జర్లాండ్, బెల్జియం తదితర ఆరు దేశాలు), డచ్ లాంగ్వేజ్ యూనియన్ (నెదర్లాండ్స్, బెల్జియం) లాంటి కూటములు మాతృభాషలను కంటికి రెప్పలా కాచుకుంటున్నాయి. వాటి అభివృద్ధికి చిత్తశుద్ధితో కృషి చేస్తున్నాయి.

'దేశీయ భాషలను సంరక్షించుకునే బాధ్యత ప్రభుత్వాలదే. పాలనలో వాటికి ప్రాధాన్యమివ్వాలి. దేశీయ భాషలు, పరిజ్ఞానం, సంగీతం, నృత్యం తదితరాల మేధోసంపత్తిని మనం గుర్తించి తీరాల్సిందే'నని అంటారు ఇజ్రాయిలీ భాషావేత్త, అడిలైడ్ విశ్వవిద్యాలయ ఆచార్యులు జి.జుకెర్మన్. పాలకులందరూ ఇదే కోణంలో ఆలోచిస్తే ఏ జాతి మాతృభాష కూడా కనుమరుగవ్వదు.

| దేశం/ భాష | జనాభా (కోట్లలో) | ప్రభుత్వం చేస్తున్న ఖర్చు | భాషా ప్రచారం జరుగుతున్న విదేశాలు | భాషా ప్రచార కేంద్రాలు |
|---|---|---|---|---|
| ఫ్రాన్స్ | 6.56 | రూ.19 వేల కోట్లు | 136 | 1040 |
| జర్మనీ | 8.14 | రూ.1996 కోట్లు | 93 | 180 |
| జపాన్ | 12.73 | రూ.1000 కోట్లు | 21 | 22 |
| స్పెయిన్ | 4.70 | రూ.738 కోట్లు | 44 | 77 |
| రష్యా | 14.29 | రూ.181 కోట్లు | – | – |
| పోర్చుగల్ | 1.06 | రూ.107కోట్లు | 36 | – |
| చైనా | 133.97 | రూ.16.47 లక్షలు (ఒక్కో పాఠశాలకు) | 96 | 500కు పైగా |
| ఇటలీ | 6.12 | రూ.3 కోట్లు | – | 400 |
| తెలుగు | 8.55 | ? | ? | ? |

పైన పేర్కొన్న ప్రభుత్వ ఖర్చు 'భాష, సంస్కృతి' ప్రచారానికి చేస్తున్నదే! ఇటలీకి సంబంధించిన ఖర్చు కేవలం పుస్తకాల ప్రచురణకు మాత్రమే

### అధికార భాషలు ఆరు

ఐక్యరాజ్యసమితి అధికార భాషలు... ఆంగ్లం, ఫ్రెంచి, స్పానిష్, రష్యన్, మాండరిన్, అరబిక్. మొదట్లో ఆంగ్లం, ఫ్రెంచిలకు మాత్రమే ఈ హోదా ఉండేది. ఆ తర్వాత కొద్దికాలానికి మిగిలిన భాషలనూ 'అధికార' జాబితాలోకి చేర్చారు. సమితి కార్యక్రమాల రాతకోతలన్నీ ఈ భాషల్లోనే జరుగుతాయి. ప్రపంచంలో అత్యధికులు మాట్లాడే భాషల్లో 5/ 6 స్థానాల్లో ఉన్న బెంగాలీని కూడా అధికార భాషగా గుర్తించాలనే డిమాండ్ చాలా కాలంగా ఉంది. ఈమేరకు స్థానిక చట్టసభల్లో ఏకగ్రీవ తీర్మానాలనూ (2009లో) చేశారు బంగ్లాదేశ్, పశ్చిమబెంగాల్, అస్సాం, త్రిపుర ప్రజాప్రతినిధులు.

**మాటల మూట - మాండరిన్**
అమెరికాలోని నార్త్ కరోలినా రాష్ట్రానికి చైనా ప్రభుత్వం రూ.27.45 కోట్లు ఇచ్చింది. ఎందుకంటే, అక్కడి 45 ప్రభుత్వ పాఠశాలల్లో మాండరిన్‌ను బోధించడానికి ఆ రాష్ట్ర విద్యా మండలి అంగీకరించింది కాబట్టి. తమ భాషాభివృద్ధిపై తొమ్మిదేళ్ల నుంచి ప్రత్యేక దృష్టి పెడుతున్నారు చైనా పాలకులు. విద్య, విదేశీ వ్యవహారాలు, ఆర్థిక తదితర 12 మంత్రిత్వ శాఖల ఆధ్వర్యంలో 'హన్‌బన్' అనే సంస్థను స్థాపించారు. విద్యా సంస్థల్లో మాండరిన్ భాషాబోధన కార్యక్రమాలను ప్రోత్సహించడం, విదేశాల్లో భాషకు ప్రచారం కల్పించడం, భాషాబోధన వనరులను పెంచడం, మాండరిన్‌ను బోధించే వెబ్‌సైట్లను రూపొందించడం తదితర లక్ష్యాలతో 'హన్‌బన్' పని చేస్తోంది. ప్రస్తుతం 96కు పైగా దేశాల్లో ఏటా 26 లక్షల మందికి మాండరిన్‌ను నేర్పుతోంది.



**స్ఫూర్తి శిఖరం - స్పానిష్**
భాష బోధన పద్ధతులను, బోధకుల నైపుణ్యాలను మెరుగుపరచడం, భాషావేత్తలకు అండగా నిలబడటం, భాషాభివృద్ధికి నిరంతరం పరిశోధనలు కొనసాగించడం, ప్రజా గ్రంథాలయాల ఏర్పాటు తదితర కార్యకలాపాలను నిర్వహిస్తోంది 'సెర్వెంటెస్ ఇనిస్టిట్యూట్'. స్పానిష్ భాష సర్వతోముఖాభివృద్ధి కోసం 1991లో స్పెయిన్ ప్రభుత్వమే ఈ సంస్థకు ప్రాణం పోసింది. నేడు 44 దేశాల్లో 77 నగరాల్లో దీని శాఖలు ఉన్నాయి. ఈ సంస్థ 2011 వార్షిక బడ్జెట్... రూ.738.50 కోట్లు. ఆర్థికమాంద్యం వల్ల అసలు బడ్జెట్‌లో రెండు శాతం కోత పెట్టారు. ప్రపంచవ్యాప్తంగా ప్రతి సంవత్సరం 14 వేల భాషా కోర్సుల ద్వారా 1.87 లక్షల మంది విద్యార్థులను స్పానిష్‌లో ప్రవీణులను చేస్తోంది ఈ సంస్థ.



**ఆత్మాభిమాన జ్వాల - జపనీస్**
ఏడాదికి పాతిక లక్షల మంది విదేశీయులు జపనీస్‌ను నేర్చుకుంటున్నారని అంచనా. ఈ భాషా వెలుగుల వెనుకనున్న మూలవిరాట్ 'జపాన్ ఫౌండేషన్'. భాషాభివృద్ధి కోసం సంవత్సరానికి రూ.వేయి కోట్లకు పైగా ఖర్చు చేస్తోంది. జపనీస్ విద్యా వ్యాప్తి, దేశీయ కళలకు ప్రోత్సాహం, విదేశాల్లో జపనీస్ బోధన ప్రమాణాలను పెంచడం తదితరాలు ఈ సంస్థ బాధ్యతలు. 1972లో ఏర్పాటైంది. దీనికి ప్రత్యేక మూలధనమూ ఉంది.



**జాతి జాగృతి - జర్మన్**
గోథే ఇనిస్టిట్యూట్... మన రాష్ట్రంలోనూ కొందరికి ఈ సంస్థ తెలిసే ఉంటుంది. జర్మన్ భాషకు విదేశాల్లో ప్రాచుర్యం కల్పించేందుకు ఆ దేశ ప్రభుత్వ ఆధ్వర్యంలో 1951లో ఏర్పాటైన సంస్థ ఇది. 93 దేశాల్లో దీనికి అనుబంధ శాఖలు ఉన్నాయి. మన దేశంలో హైదరాబాద్‌తో సహా పది నగరాల్లో కార్యకలాపాలు నిర్వహిస్తోంది. విదేశీ విద్యార్థులకు జర్మన్ భాష నేర్పడం, తమ దేశ సంస్కృతిపై వారిలో ఆసక్తి పెంచడం తదితర లక్ష్యాలతో పని చేస్తోంది. ఈ సంస్థ వార్షిక బడ్జెట్ రూ.1996 కోట్లు. జర్మన్‌ను నేర్చుకునే వారికి ఉపకారవేతనాలను కూడా అందజేస్తోంది.



### పొందికైన పదజాలం - ఫ్రెంచి

లాజిసీల్, కోరియల్... సాఫ్ట్‌వేర్, ఈమెయిళ్లకు ఫ్రెంచి మాటలివి. ఇవే కాదు ఆంగ్లంలో కొత్తగా చేరే ప్రతి మాటకూ తమదైన పదాన్ని సృష్టిస్తోంది 'ఫ్రెంచి అకాడెమీ'. కొత్త మాటలకు ప్రచారం కల్పిస్తూ, వాడుకలోకి తెస్తోంది. ఫ్రెంచ్ భాషను స్వచ్ఛంగా ఉంచడం... సైన్సు, కళలకు సంబంధించిన అన్ని అంశాలను వివరించడానికి తగిన సామర్థ్యాన్ని కల్పించడం ఈ అకాడెమీ విధి. భాషకు సంబంధించిన అత్యున్నత నిర్ణ యిక మండలి అయిన ఈ సంస్థ నాలుగు శతాబ్దాల కిందటే (1635) ఏర్పాటైంది. ఇప్పటి వరకూ తొమ్మిది సార్లు సమగ్ర ఫ్రెంచ్ నిఘంటువులను (మొదటిది 1718లో, ఆ తర్వాత కాలానుగుణంగా కొత్త పదాలను చేరుస్తూ) ప్రచురించింది. 40 మంది సభ్యులుండే ఈ సంస్థ స్వతంత్రంగా పని చేస్తుంది. మరోవైపు... దేశవిదేశాల్లో ఫ్రెంచి భాషకు ప్రాచుర్యం కల్పించేందుకు 'అలయన్స్ ఫ్రాంఛైజ్' కృషి చేస్తోంది. ప్రముఖ శాస్త్రవేత్త లూయీపాశ్చర్ తదితరులు 1883లో ఈ సంస్థను స్థాపించారు. దీనికి ఏటా దేశ బడ్జెట్‌లో 5 శాతాన్ని (తాజా బడ్జెట్ ప్రకారం రూ.19 వేల కోట్లు) కేటాయిస్తోంది ఫ్రెంచి ప్రభుత్వం. 'అలియన్స్'కు 136 దేశాల్లో 1040 కార్యాలయాలు ఉన్నాయి. వీటి ద్వారా ఏటా 4.50 లక్షల మందికి ఫ్రెంచ్‌ను చేరువ చేస్తోంది.



### రమణీయాక్షరం - రష్యన్

రష్యన్ భాషను అన్ని కోణాల్లో అభివృద్ధి చేయడానికి అయిదేళ్ల (2011 -2015) ప్రత్యేక ప్రణాళికను అమలు చేస్తున్నారు. దీని కోసం రూ.455 కోట్లు వ్యయం చేయనున్నారు. ప్రణాళిక సమయం పూర్తయ్యేనాటికి రష్యన్ ఉపాధ్యాయుల సంఖ్య 3.5, పాఠ్యపుస్తకాలు, బోధన సామగ్రి 2.25, భాషా సమాచార వనరులు 2.7 రెట్లు పెరుగుతాయని అంచనా. అలాగే, విదేశీ విద్యా సంస్థల్లో రష్యన్ భాషా బోధనను ప్రోత్సహించడం, రష్యన్ ఖ్యాతిని దిగంతాల్లో వ్యాప్తి చేయడం కోసం 'రస్కీ మిర్ ఫౌండేషన్' పని చేస్తోంది. ఈ సంస్థ ఏడాదికి రూ.90 కోట్లతో (పంచవర్ష ప్రణాళిక వ్యయానికి ఇది అదనం) వివిధ కార్యక్రమాలు చేపడుతోంది. రష్యన్ పుస్తకాల అనువాదకులు, రష్యన్‌ను బోధిస్తున్న విదేశీ పాఠశాలలు, కళాశాలలు, రష్యన్ సంస్కృతి కాపుగాస్తున్న సంస్థలకు ప్రత్యేకంగా నిధులు సమకూరుస్తోంది.



### ఇలలో మరో అజంతం - ఇటాలియన్

కాలగతిలో కనుమరుగయ్యే పదాలను సంరక్షించుకోవడానికి 'పదాల దత్తత' అనే వినూత్న కార్యక్రమాన్ని నిర్వహిస్తోంది ఇటాలియన్ భాషా (ఇది మన తెలుగు లాగానే అజంత భాష) సంస్థ 'డాంటే అళిఘీరి'. వాడుకలో లేకుండా పోతున్న పదాలను గుర్తించి తమ వెబ్‌సైట్లో పెడుతోంది. ఆ జాబితా నుంచి ఎవరైనా ఒక పదాన్ని దత్తత తీసుకోవచ్చు. అయితే... దాన్ని ఉపయోగిస్తూ వాక్యాలు, చిట్టికథలు, గేయాలు తదితరాలను రూపొందించాలి. అలా తయారు చేసిన వాటిని తిరిగి వెబ్‌సైట్లో ఉంచాలి. ఈ ప్రక్రియను నిరంతరం కొనసాగించాలి. భాషావేత్తల నుంచి విద్యార్థుల వరకూ అన్ని వర్గాల వారూ ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. ఇటాలియన్ భాషా పరిరక్షణకు 1889లో ఏర్పాటైన 'డాంటే అళిఘీరి'కి ప్రభుత్వం నిధులు సమకూరుస్తోంది. భాషాభివృద్ధిలో ఆ దేశ పాలకులూ ప్రత్యక్షంగా భాగస్వాములవుతున్నారు. ప్రధాని కార్యాలయం ఆధ్వర్యంలోని ప్రచురణల విభాగం ఏటా రూ.3 కోట్ల ఖర్చుతో వంద ఇటాలియన్ పుస్తకాలను వివిధ ప్రపంచ భాషల్లోకి అనువదింపజేస్తోంది. ఇటాలియన్‌పై విదేశీయుల్లో ఆసక్తి పెంచడానికే అనువాదాలను ప్రోత్సహిస్తోంది.



### పలుకే బంగారం - పోర్చుగీసు

విస్తీర్ణంలో మన రాష్ట్రంతో పోల్చుకుంటే మూడు రెట్లు చిన్నది పోర్చుగల్. కానీ, మాతృభాషాభివృద్ధిలో మాత్రం మనకంటే మెరుగైన స్థానంలో ఉంది. 1992లో కామోస్ ఇన్‌స్టిట్యూట్‌ను ఏర్పాటు చేసి పోర్చుగీసు భాషావ్యాప్తికి నిరంతరం కృషి చేస్తున్నారు అక్కడి పాలకులు. భాషాభివృద్ధికి దోహదపడే అన్ని కార్యక్రమాలను కొనసాగించడం, భాషాబోధనకు మెరుగైన సదుపాయాలు కల్పించడం, భాషా పరిశోధనల్లో భాగస్వామ్యం వహించడం తదితరాలు ఈ సంస్థ బాధ్యతలు. దీని వార్షిక బడ్జెట్ దాదాపు రూ.107 కోట్లు. 36 దేశాల్లో అనుబంధ శాఖలు ఉన్నాయి.

**- తెలుగు వెలుగు బృందం**



# తెలుగుదనపు సుగంధం



దాహం వేసినప్పుడు చల్లని నీళ్లు గొంతులోకి దిగుతుంటే ఎంత హాయిగా ఉంటుంది. మనదైన భాష, యాస, పలుకు వింటుంటే అంత హాయిగానూ ఉంటుంది. రాష్ట్రంలో ప్రతి ప్రాంతానికి ఒక పలుకుబడి ఉన్నట్లే, గోదారి సీమకూ ఉంది. అక్కడ పలుకుబడే కాదు, పదాలు కూడా ప్రత్యేకంగా ఉంటాయి. తెలుగు సినిమాల్లో అప్పుడప్పుడు ఈ యాసలో మాట్లాడే పాత్రలు కనిపిస్తుంటాయి. కానీ తొలిసారి అన్ని పాత్రలూ గోదారి యాసలో మాట్లాడే సినిమా ఒకటి వచ్చింది. అదే సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు. ఈ సినిమా వచ్చిన నేపథ్యాన్ని చూద్దాం.

1991

ఒక ఇంటిలో ఉండే బంధాలు, అనుబంధాలు గుర్తు చేస్తూ వచ్చిన సినిమా..

'సీతారామయ్యగారి మనవరాలు'

నదులకు పన్నెండేళ్లకు పుష్కరాలు వచ్చినట్లు.. దగ్గర దగ్గర రెండు పుష్కరాల కాలం దగ్గరపడ్డాక, మానవ సంబంధాలను, అనుబంధాలను స్పృశిస్తూ వచ్చింది 'సీ.వా.సి.చె' అదేంటో రెండు సినిమా పేర్లలోని అక్షరాలూ పన్నెండే.

పక్కవాడిని చిరునవ్వుతో పలకరిస్తే, పోయేదేముంది? అని, సదా పెదవులపై నవ్వు కదలాడే.. మంచాయన (ప్రకాష్‌రాజ్) ఉన్నాడు. దీన్నే కవి సిరివెన్నెల ఏమంటాడంటే.. 'చెమటలే చిందించాలా? శ్రమపడే పండించాలా? పెదవులపై చిగురించవా చిరునవ్వులు' అని. అలా నవ్వులు చిగురించే ఇంట్లో, తన దారే తనది.. ముక్కుసూటి తనమే తన మతం అనుకునే పెద్దోడు (వెంకటేష్), కొంచెం ముందు వెనుక ఆలోచించాలి.. లౌక్యంగా తప్పుకు తిరగగలగాలి అనుకునే చిన్నోడు (మహేష్), ఈ ఇద్దరి అన్నలకు ఓ చెల్లి (అభినయ). వీరిని చూస్తూ తమ సమస్యలను నిట్టూరుస్తూనే, నెట్టుకొచ్చే తల్లి (జయసుధ), బామ్మ (రోహిణి హట్టంగడి). ఇదీ కుటుంబం.

వీరికి బంధువులదే మరో కుటుంబమూ ఉంది. 'రాత్రి పడుకునే ముందు రేపు బావుండాలన్న ఆశతో, పొద్దున్న లేచాక రోజెలా గడుస్తుందో అన్న బెంగతో.. ఇలా ఆశకు-భయానికి మధ్య తిరుగుతూ బతకడం కాదు.. బతుకంటే' అనే రకం. ఇంకా కచ్చితంగా చెప్పాలంటే, తిప్పే రకం ఈ రావురమేష్ వగైరా విజయవాడ జనాభా. ఈ రెండు కుటుంబాలను కలిపే రెండు పాత్రలు. ఒకటి తల్లిదండ్రులను పోగొట్టుకుని, మంచోడి పంచన పెరిగిన సీత (అంజలి). రెండవది విజయవాడ జనాభాలో గీత (సమంత).

సీత అచ్చమైన గోదారి పిల్ల. గడుసుతనం, మంచితనం కలగలిసిన అమ్మాయి. గీత విజయవాడ చురుక్కుకు చిరునామా. ఇలాంటి పాత్రల మధ్య జరిగే చిన్ని సంఘటనలు, అలకలు, కోపాలు, అంతలోనే కలిసిపోవడాలు.. ఇదే సినిమా. అంతకన్న ఏమీ లేదు ఇందులో. కానీ కళ్ల ముందు గోదారి బతుకులు గలగలలాడుతూ కనిపిస్తాయి.

'నిన్ను చంపేసి నీ కిష్టమైన కూరతో బోయినాలెట్టేస్తాను' బామ్మతో మనవడి మాట సరదా. 'నాకిష్టమైన కూర పులస. దాంతో బోయినాలెట్టాలంటే, మాటలు కాదు' మనవడికి బామ్మ చురక. 'పోతు బొప్పాయి చెట్టులా పెరిగావ్' ఓ పల్లెటూరు మైనరు బాబులాంటోడికి చిన్నోడి దీవెన. 'సీతకు ఎవరైనా మంచే చేయాలనుకుంటారు.. ఎందుకంటే అది సీత కాబట్టి' మంచాయన మాట. 'మనిషి గొప్పోడురా.. అసలు మనిషంటేనే గొప్పోడు' అని అమాయకంగా, మెల్లగా చెప్పిన మాట వింటే, శ్రీశ్రీ.. 'మానవుడే మహనీయుడు' అన్న వాక్యాలు గుర్తుకొస్తాయి.

'రెండు కండువాలు తెప్పించండి.. ఇద్దరి భుజాలపై కప్పండి.. చాలు నిశ్చితార్థం అయిపోయినట్లే' ఓ పెళ్లిపెద్ద ఆత్రం. ఇలా ఎన్నని అచ్చ తెలుగు మాటలు ఏరుకోవడం. ఇలాంటి సినిమా అడుగడుగునా, తెలుగు సినిమా పడికట్టు సూత్రాలకు ఎదురీదుతూ నడుస్తుంది. అనుబంధాల సినిమా అని చెప్పి, మెలోడ్రామా అన్నది మచ్చుకైనా కానరాదు. కళ్ల ముందు పక్కింట్లోనో, ఎదురింట్లోనో జరుగుతున్న వ్యవహారాల్లా సాగిపోతాయంతే. పైగా సినిమా తీసిన ప్రదేశాలన్నీ నిత్యం మనమో, మరొకరో తిరిగేవే. పంటచేలు, గోదారి లాకులూ, కొబ్బరి తోటలో పెళ్లిళ్లూ, సున్నుండలూ, ఇలా ఎన్నో పలకరిస్తాయి సినిమా పొడవునా.

సిరివెన్నెల, అనంత్‌శ్రీరామ్ రాసిన పాటల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఇద్దరు అన్నదమ్ముల స్వభావాలు వివరిస్తూ.. 'ఏం చేద్దాం.. అనుకుని మాత్రం ఏ పొడిచేస్తాం' అంటూ జీవన వ్యవహారాలను పొదిగిన పాట ఒకటి, కష్టాలొస్తే, కన్నీళ్లు పెట్టుకున్నంత మాత్రాన ఏం ప్రయోజనం అంటూ సుద్దులు చెప్పే పాట ఒకటి సిరివెన్నెల అద్భుతంగా రాశారు. 'వేకువజామున గోదారి ఎరుపెక్కింది.. ఆ ఎరుపేమో గోరింట పంటయ్యింది' అంటూ అనంత్‌శ్రీరామ్.. హరికీ.. సిరికీ పెళ్లి పాటను అక్షరాల్లో రంగరించి అందించారు. ఇలాంటి పాటలకు తోడు, నేపథ్య సంగీతం, గోదారి అందాలను అద్భుతంగా ఒడిసిపట్టిన కెమేరా పనితనం ఆకట్టుకుంటాయి. అన్ని శాఖల చక్కటి సమన్వయంతో రూపొందిన ఈ సినిమా ఆద్యంతం గుండెల్ని తాకేలా కనిపిస్తుంది.

**- తెలుగు వెలుగు బృందం**

# మమతానురాగాల మిథునం

అరవై నాలుగు కళలను తనలో ఇముడ్చుకున్న అరవై అయిదో కళ చలనచిత్రం. ఇప్పుడు కాసుల గలగల మధ్య ఆ కళ అరుదై పోతోంది. అమ్మ, నాన్న, బంధం అనే మాటలను, తెలుగు సంస్కృతిలోని సున్నిత అనుబంధాలను, మానవీయ విలువలను, మన మూలాలను వెండితెరపై చూడాలనుకోవడం, ఎడారిలో పడవ ప్రయాణం చేయాలనుకోవడం రెండూ ఒక్కటే. ఈ పరిస్థితుల్లో... ఇది మన కథ, ఇదీ మన సంస్కృతి, ఇదీ మనిషి గొప్పదనం అని చెప్పే అరుదైన చలనచిత్రం ఒకటొచ్చింది. అదే 'మిథునం'.

సీతారాములు, పార్వతీపరమేశ్వరులకే అసూయ తెప్పించే అనుబంధం... అప్పదాసు-బుచ్చిలక్ష్మిలది. ఊరవతల పచ్చని మొక్కల మధ్య, వయసైపోయిన చిలకాగోరింకల్లా కాపురం చేస్తుంటారు. అప్పదాసు భోజన ప్రియుడు. అరిటాకు ఘనంగా కనిపించాలి. కొబ్బరి పచ్చడితో మొదలెట్టి, గడ్డ పెరుగుతో పూర్తవ్వకపోతే ఆ పూటకు భోజనం చేసినట్టుండదు. ఆ పళ్ల కింద నిత్యం ఏదో ఒకటి నలుగుతూ ఉండాలి. భర్తకు వండి పెట్టడమంటే ముల్లోకాలలోనూ ఉన్న దేవుళ్లందరికీ నైవేద్యం పెడుతున్నంత సంబరం ఆ భార్యకు. అర్ధరాత్రో అపరాత్రో మేలుకొని 'బుచ్చీ... ఆకలేస్తోందే' అంటే అందివ్వడానికి తలగడ కింద మామిడి తాండ్ర పెట్టుకొనేంత ప్రేమ. లక్కాబంగారంలా కలిసిపోయారు. ఇద్దరన్నమాటే గానీ ఊరంత సందడి ఉంటుంది వారి మధ్య. కబుర్లు చెప్పుకోవడానికి పెరట్లో కిష్టప్ప (నిమ్మ), మాధవుడు (కొబ్బరి), గోవిందుడు (మామిడి) ఉన్నారాయే. అప్పదాసూ-బుచ్చిలక్ష్మి నిజంగా సీతారాములే అన్నట్టు... కాపలా కాయడానికి హనుమంతులోరి విగ్రహం కూడా ఆ మొక్కల మధ్యనే ఉండి... వీరిద్దరి దాంపత్యాన్ని చూస్తూ మురిసిపోతోంది. వీరిద్దరి కోపతాపాలు, అలకలూ, చిర్రుబుర్రులూ వినేది ఆ మట్టి బొమ్మే.

దండెం మీద చీర ఆరేస్తూ - 'నువ్వూరెళ్లినప్పుడు ఓ రాత్రివేళ నువ్వు గుర్తొస్తే నీ చీర చుట్టుకొని పడుకున్నా... అదేంటో ఏ చీర చుట్టుకుంటే అదే చీరలో ప్రత్యక్షమయ్యేదానివి... కలలో' అని అప్పదాసు సిగ్గుగా కోకని చుట్టేసుకొన్నప్పుడు ఆ భార్యాభర్తలిద్దరూ ఇరవై ఏళ్ల కొత్త దంపతులైపోయారు. చిలుకను చూపించి 'అదిగో ఉడుత కావలిస్తే చూడు.. రాములోరి చేతి గుర్తులు స్పష్టంగా కనిపిస్తుంటే..' అని భార్య చూపు మరల్చి - పాచికలు జరిపేసి, తొండాట ఆడుతున్నప్పుడు ఒక్కసారిగా పదేళ్ల పసిపాపలైపోయారు. 'పిపిపీ...' కొబ్బరాకుని బూరగా చుట్టుకొని సన్నాయి మేళం వాయిస్తోంటే ఆరేళ్లకు తగ్గిపోయారు. ఎనభై ఏళ్ల జీవిత చక్రాన్ని మళ్లీ వెనక్కి తిప్పి... పసితనంలోకి, యవ్వనంలోకీ వెళ్లిపోవడం వాళ్లకే సాధ్యమైంది.

"కలతలన్నీ కలిపి - కలనేతలా నేసి, కన్నీళ్లు ఒంపేసి కలిసి నవ్వేసి" బతికేయడం ఎలాగో... వీరిద్దరినీ చూసి ఆ దేవుడు కూడా నేర్చుకోవచ్చు. అయితే ఇదంతా ఆయన ఓర్చుకోలేక ఓ ఆట ఆడాడు. అప్పదాసుని తన దగ్గరికి తీసుకెళ్లిపోయాడు. బుచ్చి గుండేమీ ఆగిపోలేదు. "ముందు నన్నెక్కడ తీసుకెళ్లిపోతావో... నేను లేక ఈ జీవుడు ఎంత అవస్థపడేవాడో అని కంగారుపడిపోయాను. మొత్తానికి మంచి పనే చేశావ్" అని ఆ దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకుంది. పుణ్యస్త్రీ అనే పదానికి సరికొత్త అర్థమిచ్చింది. ఇదీ కథ.

కొన్నేళ్ల కిందట శ్రీరమణ రాసిన 'మిథునం' కథకు తెరరూపం ఈ చిత్రం. ఈ కథను వెండితెరపై ఆవిష్కరించాలనుకోవడం, కేవలం రెండే పాత్రలతో దాన్ని నడిపిద్దాం అనుకోవడం మొండితనంతో కూడిన సాహసం. ఈ పనిని అత్యంత చాకచక్యంగా పూర్తి చేశారు తనికెళ్లభరణి. నవ్విస్తూ, నవ్విస్తూ.... పనిలో పనిగా ప్రేక్షకుల గుండె బరువెంతో కిలోల్లెక్కన కొలిచేశారాయన. అడుగంటిపోయిన కన్నీళ్లన్నింటినీ... బాల్చీవేసి తోడేశారు. అప్పదాసుగా బాలు నటన - మామిడి టెంక వేసి బాగా మరగేసి కాచిన సాంబారులో వేడన్నం కలుపుని తిన్నట్టు మహా రుచిగా అనిపించింది. లక్ష్మీ అభినయమైతే - ఘన పంచరత్నాలతో వడ్డించిన విందు భోజనమే. సంగీతం - సాహిత్యం కిళ్లీల్లా మారిపోయాయి.

'మనిషిలా పుట్టడం తేలికే. బతకడం మాత్రం కష్టం' ఇంత బరువైన మాటను సందర్భానికి తగినట్టు భలే వాడుకొన్నారు. 'బెస్టు టేస్టేశ్వరీ, లోక ప్రాణేశ్వరీ, ఉష్ణపానేశ్వరీ, బ్రూకు బాండేశ్వరీ' అంటూ జొన్నవిత్తుల అందుకొన్న కాఫీ దండకం... పొగలు కక్కుతూ ఘుమఘుమలాడిపోయింది. మన పల్లె, మన బంధాలు ఎంత హాయిగా ఎంత కమ్మగా ఉంటాయో... ఈ సినిమా చూస్తే అర్థమవుతుంది. పులిహార మరుసటి రోజు తింటే మహారుచిగా ఉంటుంది కానీ... ఇలాంటి సినిమాలు పాయసాలు. వెంటనే తాగేయాలి.

**- తెలుగు వెలుగు బృందం**






# మా ఊళ్లో మంచి పేరుంది

ఈ పేర్లన్నీ చదువుతుంటే, వింటుంటే భలే వింతగా విచిత్రంగా ఉన్నాయి కదా! ఏ మాంత్రికుని చేతిలోని వస్తువులో, జీవుల పేర్లో అని ఊహించుకోకండి! ఇవన్నీ ఆదిలాబాద్ జిల్లాలోని ఊర్ల పేర్లేనండి బాబూ! నమ్మండి!

సాధారణంగా తెలుగు నేలలో పల్లె, ఊరు, గూడెం, వాడ, నగరం, పేట పదాలతో అంతమయ్యే ఊర్ల పేర్లే ఎక్కువగా కనిపిస్తాయి. ప్రాంతాన్ని బట్టి కోస్తాంధ్ర అయితే పాడు, లంకలు, గుట్టల ప్రాంతాలైతే 'లొద్ది' అక్కడక్కడా కనిపించడం సహజం. కాని ఆదిలాబాద్ జిల్లాలో గ్రామనామాలు ఈ విధంగా ఉండటానికి పెద్ద చరిత్రే ఉంది.

ఆదిలాబాద్ జిల్లా ఉత్తర భాగం పదహారు, పదిహేడు శతాబ్దాల్లో సుమారు 200 సంవత్సరాలు గోండ్వానా రాజ్యంలో భాగంగా గోండురాజుల పాలనలో ఉంది. తర్వాత కొంతభాగం నిజాం రాజుల కిందికి వస్తే, మిగిలిన భాగం పొరుగు వారైన మహారాష్ట్రీయులతో నిండింది. దేశాన్ని పరిపాలిస్తున్న ఆంగ్లేయుల ప్రభావం అక్కడక్కడా పడింది.

స్వాతంత్ర్యానంతరం భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటులో రాజురా తాలుకా మహారాష్ట్రలో కలిసింది. కిన్వట్ తాలుకా కొంత నాందేడ్ ప్రాంతంలోని ముథోల్ తాలుకా ఆదిలాబాద్ జిల్లాలో కలిసింది. ఈ నేపథ్యంలో 'స్థాలీపులాక' న్యాయంగా కొన్ని గ్రామాల పేర్ల వెనుక దాగిన చరిత్రను పరిశీలిద్దాం!

ముథోల్ తాలుకాలోని జ్ఞానసరస్వతీ ఆలయం వ్యాస ప్రతిష్ఠితమవ్వటం చేత వ్యాసర గ్రామం పేరైంది. కాలక్రమంలో 'వ, భ యోరబేధః' అన్న వ్యాకరణ సూత్రం మేరకు వాసర- బాసరగా స్థిరపడింది. మహిషాసురమర్దినీ మాత పేరిట వెలసిన పట్టణం - మైంసా - భైంసాగా మారింది. పైసూత్రం కాకుండా ముంబాయి- బొంబాయిగా మారినట్లు 'భైంసా' అయింది. అంతేకాకుండా మహ్మదీయులు ఉర్దూలో మహిషాన్ని 'భైంస్' అంటారు. వారి ప్రాబల్యం ఎక్కువగా ఉండటంతో 'భైంసా' పేరు ఖాయమైంది.

జిల్లా కేంద్రమైన ఏదులపురం 'ఆదిల్‌షా' అనే రాజు, తాలుకా కేంద్రమైన జునుగామ 'ఆసిఫ్ అలీ' అనే రాజుల గుర్తుగా ఆదిలాబాద్, ఆసిఫాబాద్‌లుగా మారాయి. నిమ్మలనాయుడు అనే ఏలిక వల్ల 'నిర్మల్' పేరు, గోదావరీ నదీ తీరంలోని 'సువర్ణపురం' 'సోన్'గా మారాయి. శకుంతలా దుష్యంతుల ప్రణయకేంద్రంగా భావిస్తున్న జలపాతం 'కుంటాల జలపాతంగా', ఊరు 'కుంటాల'గా స్థిరపడ్డాయి. మహారాష్ట్రలో 'లోహెస్తా'గా పిలిచే మండల కేంద్రం ఇటీవలే 'లోకేశ్వరం' అయింది. పళ్లు, ధాన్యాల పేరుతో కొత్తిమీర, నేరేడిగొండ, బబ్బెర చెలుక, ఈదులవాడ, మోడి వంటి గ్రామాల పేర్లు వచ్చాయి.

మరాఠీ సంస్కృతిలో అదే భాషలో వాంకిడి, లాల్‌టేక్డి, తుమ్డిహట్, టొంకిణి, పిప్రి, అందర్‌బంద్, మొఘడ్‌ధగడ్, నిగ్వా వంటి లెక్కలేనన్ని గ్రామాల పేర్లు వినడానికి వింతగా ఉంటాయి. మరాఠీలో 'గాం' అంటే తెలుగులో గ్రామం. ఇలా కమ్మర్‌గాం, మహాగావ్, ఈసుగాం, దహెగాం, కెనర్‌గాం, ఖైర్‌గాం, కెడెగాం, గోయగాం వంటి ఎన్నో ఉన్నాయి. గోండు రాజుల ప్రభావంతో గోండ్వానా రాజుల









## 'మా'తో రథసప్తమి



రథసప్తమికి సంబంధించిన కొన్ని ప్రశ్నలను ఈ దిగువ ఇచ్చాం. సమాధానం మధ్యలో ఉన్న సూచన ఆధారంగా జవాబులు తెల్సుకోగలరేమో ప్రయత్నించండి.
(జవాబుల కోసం 98వ పేజిని చూడగలరు)

1. రథసప్తమి ఈ మాసంలో శుద్ధసప్తమి తిథినాడు వస్తుంది ... ... మా ... ...
2. ఈ రోజు జిల్లేడు ఆకులను శరీరంపై ఉంచుకుని స్నానం చేస్తాం. జిల్లేడుకి ఉన్న మరో పేరు చెప్పగలరా ... ... ... ... ము
3. రథసప్తమినాడు రవికి నివేదించే పదార్థం ... ... మా ... ...
4. ఈ పండుగనాడు ఇంటి ముందర తప్పకుండా ఉండేది ... ... ము ...
5. వీటితో పిడకలు చేసి నైవేద్యాన్ని వండటం ఆనవాయితీ ... ... మ్మ ...

(జవాబులు 98లో...)

పరిపాలన రాజధానులుగా సూర్యాపురం, చంద్రాపురం ఉండేవి. నాటి చంద్రాపురం నేడు మహారాష్ట్రలో జిల్లా కేంద్రంగా ఉంది. సూర్యాపురం - సిరిపురంగా ఒకటి తూర్పున సిర్పూర్(టి) (టౌన్) మరొకటి ఉట్నూర్ సమీపంలో సిర్పూర్(యు) అయింది. సిర్పూర్(యు) ప్రాంతంలో ఎక్కువ మొత్తంలో గోండులే నివశిస్తారు. కొమురం భీం వీరమరణం చెందిన గుట్ట మరాఠీ మాటలో 'జోడెన్‌ఘాట్'గా పేరొచ్చింది. అలాగే గూడెన్‌ఘాట్, సజ్జన్‌ఘాట్ వంటి పేర్లున్నాయి. సహ్యాద్రి పర్వత శ్రేణుల ప్రభావంతో ఈ ఘాట్ పేరు స్థిరపడింది. కనిగిరి, యాదగిరి, భద్రాచలం, తిరుమల అన్నీ గుట్టలు, కొండల పేర్లుండటం తెలుగు నేలపై సహజం.

54 ఇళ్లతోనే ఉన్న గ్రామాన్ని చౌపన్‌గూడ (మరాఠీ) అని పిలుస్తారు. డాబా, డబ్బా, సవాట, కెరమెరి, పిప్రి, గోండ్ పిప్రి, పిప్పర్‌గోండ్- వంటి వింత పేర్లు వినిపిస్తాయి. తెలుగే అనిపించే రేచిని, రెబ్బెన, తిర్యాణి, ధనోరో, బంబారా, బెండారా, భీమిని, సోమిని, కేతిని కూడా విచిత్రమైన పేర్లే. ఇక అంతగా మరాఠీ, గోండుల ప్రభావం లేని ప్రాంతాల్లో సహజంగా దేవుళ్ల, గొప్పవాళ్ల పేర్ల మీద ఊళ్లు కనిపిస్తాయి. అర్జున్‌గుట్ట, దేవులవాడ, సుందరశాల, వేమనపల్లి, కేశవాపురం, కన్నెపల్లి భీంపూర్ వంటివి. తెలుగు సంస్కృతీ సాహిత్య సంప్రదాయాల ప్రభావంతో కొందరు కవులు 'నవ్వుగాం'ను 'హాస్యపురి', 'స్మితపురి' అని, తాడూరును సూత్రపురి అని బెజ్జూరు, పొక్కురులను 'శూన్యపురి' అని కవిత్వాల్లో వాడటం కనిపిస్తుంది. చెన్నూరు, చెన్నుపురి - జయపురం, భీమారం -వంటివి పోల్చి రాశారు.

పోడు వ్యవసాయంతో, చిన్న సంఘర్షణలతో తరచూ స్థావరాలు మార్చే గోండులు, కొలాంలు తమ కులపెద్దల పేరిట గూడేల పేర్లు మార్చటమూ కనిపిస్తుంది. భీంరావుగూడ, అంబారావుగూడ, బల్లార్షా, మంగి, మోవాడ, బేల, అడ, జంబుల్‌దరి, వంటి పేర్లు ఉన్నాయి. ఇటువంటి ఊర్ల పేర్ల చరిత్రలు, వింతలు విశేషాలు శోధించిన కొద్దీ ఎన్నో వెలుగు చూస్తాయి. ఇవి కొన్ని మాత్రమే. కాగితాల పరిశ్రమ నెలకొల్పడంతో కొత్తపేట కాగజునగరమైంది. అధికారుల విశ్రాంతి గృహం కట్టడంతో (ఇన్‌స్పెక్షన్ బంగ్లా) ఐ.బి. ఊరైంది. 'బొగ్గు పరిశుద్ధి' కర్మాగారం ఏర్పాటుతో ఏర్పడిన (కోల్ కెమికల్ కాంప్లెక్స్) సిసిసి ఊరైంది, సిమెంటు కర్మాగారంతో సీసీఓ ఊరైంది. కుంతలేశ్వర ఆలయం వల్ల 'కొటిల' కొట్ల, కొటా ఏర్పడ్డాయి. హత్నూర్, ముత్నూర్, జాతర్ల, బోత్, బేల ఇవన్నీ గ్రామాలు, మండలాల పేర్లే.





మాడుగుల నారాయణమూర్తి
ఆసిఫాబాద్, ఆదిలాబాద్.
94411 39106

ప్రేమ లేఖల పోటీలో
రూ.1116 గెలుచుకున్న లేఖలు

# శ్రీవారికి ప్రేమలేఖ

ప్రియమైన శ్రీవారికి
ఉభయ కుశలోపరి

ఏవండీ.. మీరు చెప్పినట్టుగానే, వారానికి రెండు ఉత్తరాలు రాస్తున్నా. అయినా మీ నుంచి జవాబు లేదు. మేమంతా హాయిగా ఉంటే మీరు మాత్రం విధి నిర్వహణలో అడవుల్లో తిరగడం బాధగా ఉంది.

పెద్దమ్మాయి నళిని నెల తప్పిందని వాళ్ల అత్తగారు కబురు చేశారు. పెళ్లైన పదేళ్లకు సంతోషకరమైన వార్త తెలిసింది. వెళ్లి చూసొద్దామనుకుంటే దూరాభార మాయె! ఒక్కర్తినే, మీరు లేకుండా ఎలా వెళ్లను..?

రెండో అమ్మాయి నిహారిక భర్తకు వ్యాపారంలో నష్టమొచ్చిందట. అయిదు లక్షలు సర్దమని అడగలేక అడిగింది పాపం. మన రఘు కళాశాలలో పదిహేను వేలు కట్టాలట. ఇలా కష్టాలు ఏకరువు పెడుతూ ఉత్తరం రాస్తే మీకు కోపమొస్తుందని తెలుసు. కానీ ఏం చెయ్యను. ప్రతీసారి ప్రేమలేఖలా రాయాలంటే ఎలా కుదురుతుంది చెప్పండి. వయసులో రాసుకునేవే ప్రేమలేఖల వుతాయా? మన మధ్య ప్రేమ జీవితాంతం ఉంటుంది. భార్యాభర్తలు రాసుకునే ప్రతీ లేఖ ప్రేమలేఖే అవుతుందని మీరోసారి అన్నారు గుర్తుందా..!

మీ ఉద్యోగ రీత్యా మనలాంటి వాళ్లు ప్రేమలేఖలు రాసుకోక మరేం చేస్తారు. మొదట్లోనే మీకు, మా నాన్న ఇప్పిస్తానన్న బడిపంతులు, పురపాలక సంస్థల్లో ఉద్యోగాలు వద్దని దేశంలో ఉద్యోగాలే కరవన్నట్టు ఏపీఎస్పీ (ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక భద్రతా దళం)లో చేరారు. ఓ సంవత్సరం గడిస్తే ఎలాగూ పదవీ విరమణే కదా, కష్టాలు కూడా ఎంతో కాలం ఉండవు, ఆపై అన్నీ సుఖాలే. మొన్న మీ అన్నయ్యగారొచ్చారు. మామయ్యగారికి కంటికి శస్త్రచికిత్స చేయించాలంటే మీరు చెప్పినట్టే పక్కింట్లో అడిగి మూడు వేలు ఇచ్చా. అత్తయ్యగారికి కూడా ఒంట్లో బాగోలేదట. మందులు వాడుతూనే ఉన్నారట. మీరేం కంగారు పడొద్దు. అన్నింటికీ ఆ దేవుడే ఉన్నాడు.

రాత్రి కలలో కొచ్చారు. లేచి అంతా గుర్తు తెచ్చుకొని బాధపడ్డా. ఈ మధ్య తీవ్రవాదులో, ఉగ్రవాదులో మెరుపు దాడులు చేస్తున్నారని పత్రికల్లో చూసి భయపడ్డా. జాగ్రత్తగా ఉండండి. ఏం ఉద్యోగాలండీ. ఓ ముద్దా ముచ్చటా..! విద్యార్థులు, ఉద్యోగులు, నాయకులు, ఎవరు గొడవలు చేసినా మీరే కావాలి. వినాయక నిమజ్జనం, ఎన్నికలు, బోనాల పండుగ, నేతల పర్యటనలు అన్నింటికీ మీరే. కానీ మీ కష్టాలు ఎవరికీ పట్టవు. మీరొక్క రోజు సమ్మె చేస్తే కానీ మీ విలువెవరికీ అర్థం కాదు. ఎక్కడేం జరిగినా మీదే తప్పని తేలుస్తారు. మీ జీతభత్యాల గురించి ఎవరూ పట్టించుకోరు. "కరివేపాకు" జీవితాలండీ! ఓ పండుగ లేదు, పబ్బం లేదు. తీర్థయాత్రలకు తీరికే ఉండదు. ఇంటి మరమ్మతులు పట్టించుకోరు. అంతా హడావుడి జీవితాలు. ఈ ఉత్తరం అందితే చదివి కోపం తెచ్చుకోకండి, మనం ఇంతకాలం ప్రేమలేఖల్లాంటి ఉత్తరాలు రాసుకుంటూనే కదా సంసారం సాగిస్తున్నాం. పెళ్లైన కొత్తలో ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నాం. పిల్లల్ని కన్నాం. తృప్తిగానే సంవత్సరాలెన్నో గడిచాయి.

మన విషయం పక్కనపెడితే, మన సైనికులు దేశ సరిహద్దుల్లోనూ, లోపలా ఎండ, వాన, చలి వీటన్నింటినీ లెక్క చేయకుండా, కంటికి కునుకు లేకుండా దేశాన్ని కంటికి రెప్పలా కాపాడుతూ తల్లిదండ్రులకు, భార్యా బిడ్డలకు దూరంగా విధి నిర్వహణలో అప్రమత్తంగా ఉండబట్టే కదండీ, మన నాయకులు, మనం ప్రశాంతంగా ఉంటున్నాం. అందుకేనండి, అలాంటి సేవలో మీరూ భాగమైనందుకు, మీలో భాగమైన నేను కూడా అర్ధాంగిగా గర్వపడుతున్నాను. సైనికులే నిజమైన 'దేశభక్తుల'ండీ. దేశం కోసం ప్రాణాలర్పించే వాళ్ల కోసం ఎంత చేసినా తక్కువే కదండీ! మన 'రఘు'ని కూడా చదువు పూర్తి కాగానే దాన్లోనే చేర్పిద్దామండీ. వాడికి కూడా ఇష్టమే కదా..!

చివరిగా ఓ మాట, ఇంకా ఓ సంవత్సరం ఆగితే ఈ కష్టాల ప్రేమలేఖలు రాసుకునే అవసరం ఉండక పోవచ్చు. పదవీ విరమణ తర్వాత మనదిక ప్రశాంత జీవితమే. బాధ్యతలన్నీ తీరిపోతాయి. అప్పుడే ప్రేమయాత్రల పేరుతో బృందావనాలు, కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు చూసొద్దాం.

అప్పుడే కదా మీలా 'రక్షణ' బాధ్యతల్లో ఉన్న వారికి విశ్రాంతి దొరికేది.

**ఇట్లు**
**మీ రాకకోసం ఎదురుచూసే**
**మీ జీవన సహచరి**
**బచ్చు లక్ష్మి, కొత్తగూడెం**



# అక్కా! బాగున్నావా...

ప్రియాతి ప్రియమైన అక్కా,

ఎలా ఉన్నావ్? నేను బ్రహ్మాండంగా ఉన్నా. అబ్బ... ఉత్తరం రాసి ఎన్నాళ్లయిందో! ఈ కంప్యూటర్లు, సెల్‌ఫోన్లు వచ్చాక ఉత్తరాలు రాసుకోవడమే గగనమైపోతోంది. కానీ ఎన్ని గంటలు ఫోన్‌లో మాట్లాడినా ఉత్తరాలు ఇచ్చే సంతృప్తి లభించదు కదా. అందుకే రాయాలనిపించింది. ఎందుకో ఒక్కసారిగా మన చిన్నప్పటి విషయాలన్నీ గుర్తుకొచ్చాయి. వాటితోపాటే నువ్వూ...!

అక్కా... నీ చిటికెన వేలు పట్టుకుని బళ్లో అడుగుపెట్టిన రోజు నాకింకా గుర్తే! మొదట్లో మధ్యాహ్న భోజనాలప్పుడు నువ్వు గోరుముద్దలు తినిపించావు. తరువాత నువ్వు కలిపి పెడితే నేను చెంచాతో తినేదాన్ని. ఆ విషయాన్ని నీ స్నేహితులకు చెప్పి సంతోషపడ్డం.. గుర్తున్నాయా?

తోటలో నాన్నగారు పూయించిన చేమంతులు, కనకాంబరాలు, గులాబీలు, మల్లెలు జడల నిండా పెట్టుకుని ఎంచక్కా బడికి వెళ్లేవాళ్లం. పంతులమ్మలకూ కాసిన్ని పట్టుకుని మరీ! అందరికీ మనమంటే ఎంత అసూయో! భలే కుళ్లుకునే వాళ్లు కదా!

ప్రతి వేసవి సెలవులకూ మనింటికి పిన్నివాళ్ళు, వాళ్ళ పిల్లలు రాగానే ఎంత సందడిగా ఉండేది! రాత్రి భోజనాల తరువాత ఆరు బయట మంచాలు వేసుకుని, పిల్లలందరం ఆవకాయ ముక్కలు నోట్లో పెట్టుకుని నాన్నగారి చుట్టూరా కూర్చుని కథలు వినేవారం! ఆ తరువాత మంచాల మీద చేరి... కబుర్లు చెప్పుకుంటూ ఏ అర్ధరాత్రో నిద్రపోయే వాళ్లం! పొద్దున్న లేచేసరికి మంచాల కింద పిల్లులు చంపి పడేసిన పాములో ఎలకలో కనిపించి హడలిపోయేవాళ్లం! ఆ ఆనందాలు, వెన్నెల నిద్రలు ఇప్పటి పిల్లలకు ఏవి?

తమ్ముడు తన కిష్టమైన కథానాయకుడి సినిమా చూసొచ్చి... అతని నటనను గొప్పగా చెప్పుకుంటూ, నచ్చని వాళ్ల నటనను అనుకరించి చూపిస్తోంటే కడుపుబ్బా నవ్వేవాళ్లం! కసరత్తులంటూ వాడి పిడిగుద్దుల బారిన ఎన్ని నవారు మంచాలు పడ్డాయో కదా!

ఇక సాయంత్రం స్నేహితులతో ఆటలు. అవి చెప్పడానికి మాటలు చాలవు! పరుగాట, కుంటాట, తొక్కుడు బిళ్ల, వామన గుంటలు... వాటిలో చిలిపి తగాదాలు, కలుసుకోవడాలు. అవి తలచుకున్నప్పుడల్లా ఆనందం, గడిచిపోయినందుకు బాధ!

వేసవి రాగానే తాటిముంజలు, సీమ చింతకాయలు తినడం ఒక ఆనందం. సీమ చింతకాయలను రాళ్లతో కొట్టడం ఒక పోటీ. ముంజలు తిన్నాక టెంకలను బళ్ళలా కట్టి ఆడుకోవడం. ఆ సరదాలు మళ్ళీ రావు కదా!

అక్కా... నాకు సైకిల్ నేర్పాలని ఎంత ప్రయత్నించావ్! కానీ నిలపడం రాక నేను నీ మీదకు ఒరిగిపోతుంటే ఎంత కోపమొచ్చేదో నీకు, సరిగ్గా నేర్చుకోవడం లేదని. ఒక్కోసారి అలిగి వెళ్లిపోయేదానివి. అయినా పాపం, ఎంత శ్రమపడ్డావో నేను నేర్చుకునే దాకా! దాని వల్లే ఇప్పుడు నేను చాలా తేలిగ్గా స్కూటీ నేర్చేసుకున్నా. దాని మీద రోజూ కళాశాలకు వెళ్తున్నా. నా పనులు నేను చేసుకోగలుగుతున్నా, ఎవరి మీదా ఆధారపడకుండా. కానీ ఇప్పుడు ఆనాటి నీ కోపం, అలక గుర్తుకొచ్చి, నువ్వు నా వల్ల ఎంత చిరాకు అనుభవించావో అనుకుంటాను.

ఇక సంక్రాంతి నాడు తెల్లవారుజామున లేచి పిడకలతో భోగి మంటలు, సాయంత్రం చిన్న పిల్లలకు భోగి పళ్లు పోయడం. కానీ డిసెంబరు 15 నుంచే నువ్వు మన ఇంటి ముందర ఎంతో ఓపిగ్గా పెద్ద పెద్ద ముగ్గులు పెట్టేదానివి. అందంగా తీర్చేదానివి. ముగ్గుల మీద గొబ్బెమ్మలు పెట్టి, పూలతో అలంకరించే వాళ్లం కదా! వాటి చుట్టూరా స్నేహితురాళ్ళతో తిరుగుతూ గొబ్బి పాటలు పాడేవాళ్ళం. అబ్బా! ఆనాటి సంక్రాంతే సంక్రాంతి.

అలాగే, శ్రీరామ నవమికి శ్రీరామచరిత్రను నాటకంగా పిల్లలందరం వేసే వాళ్లం గుర్తుందా! నేనోసారి తాటకి పాత్ర వేశా కదా? తర్వాత నాకే భయమేసింది ఎలా వేశానా ఆ పాత్ర అని!

ఒక శివరాత్రికి నువ్వు నీ స్నేహితులు కలిసి జాగారం ఉండాలనుకున్నారు. నేను కూడా వస్తానని పేచీ పెట్టాను. అది భరించలేక నన్నూ తీసుకెళ్లావు గుర్తుందా? కానీ నేను రాత్రి 11 గంటలకే ఇంటికెళ్తానని గోల చేశా. ఇక తప్పక నన్ను అంత రాత్రి పూట ఇంట్లో దిగబెట్టి తిరిగి వెళ్లావు కదా!

ఆనాటి దివిసీమ ఉప్పెన ఎంతటి భయంకరమైంది. మన ఇంటి బయట గదిలో అద్దెకుంటున్న విద్యార్థులకు భోజనం ఇద్దామని తలుపు తీస్తే నాన్నగారిని గాలి తోసెయ్యడం, మన ఇల్లు కారిపోతుంటే పొడిగా ఉన్న చోట మంచమేసుకుని మునగ తీసుకుని పడుకోవడం, ఉదయం ఊరిలో తిరుగుతూ అక్కడి బీభత్సాన్ని చూసి భయపడడం - అవన్నీ తలచుకుంటుంటే ఇప్పటికీ ఒళ్లు జలదరిస్తుంది.

అమ్మో! చాలా రాసేశాను. రాస్తూ ఉంటే ఎన్నో... మళ్లీ తీరికున్నప్పుడు రాస్తాను! ఇక ఉంటానే మరి.

**ఇట్లు**
**నీ చెల్లి.**

**డా॥ పి.శర్వాణి, విజయనగరం**



# మట్టిలో మాణిక్యం మల్లయ్య

"సాహిత్యంతో సాంగత్యం లేదు... ఆ మాటకొస్తే అక్షరాలతో కనీస పరిచయమూ లేదు. కానీ, ఆయన నోటివెంట రామకీర్తనలు రమ్యంగా జాలువారతాయి. కృష్ణలీలలనూ కర్ణప్రియంగా గానం చేయగలదాయన గళం. కళకు దగ్గరగా, గుర్తింపునకు దూరంగా జీవిస్తున్న ఆ జానపదుడి స్వరమాధుర్యం... మెతుకుసీమలో పది, పన్నెండు గ్రామాలకు సుపరిచితం."

పురాణేతిహాసాలు, గాథలు, చరిత్రల ఆధారంగా వివిధ కళారూపాలను ప్రదర్శించే జానపద కళాకారులందరూ అక్షరాస్యులు కారు. మౌఖికంగా ఔపోసన పట్టిన సాహిత్యాన్ని రాగ, తాళయుక్తంగా పాడుతూ ప్రజల హృదయాలను గెలుచుకుంటారు. కళారూపాలను తరచి చూస్తే కనపడేవి... భారతీయ సంస్కృతి, సామాజిక విలువలు, మానవ సంబంధాలు తదితర విశిష్టాంశాలే. అద్భుతమైన భావాలను తత్వాలుగా కూర్చి అలవోకగా ఆలపించడంలో జానపద కళాకారులందరిదీ అందెవేసిన చేయే. అలాంటి వారిలో ఒకరు, ఏడు పదుల వయసులోనూ ఇప్పటికీ గానామృతాన్ని పంచిపెడుతున్న మన మట్టి బిడ్డ... మల్లయ్య. మెదక్ జిల్లా చిన్న కోడూరు మండలం గంగాపూర్ గ్రామవాసి.

నిరుపేద కుటుంబంలో పుట్టిన మల్లయ్య ఏనాడూ పలాకాబలపం పట్టుకుని బడికి వెళ్లలేదు. గొర్రెలు, మేకలను మేపడానికి చిన్నప్పటి నుంచే తండ్రి వెంట అడవికి వెళ్లేవాడు. ఆ కోనలోనే ఆయనకు ప్రకృతిలోని శబ్దమాధుర్యాలతో పరిచయం ఏర్పడింది. పశువుల, పక్షుల అరుపుల్ని అనుకరించేవాడు. పిట్టలోళ్లు, బాలసంతులు, సాధువులు, ఒగ్గోళ్ళు, బీర్నోళ్ళ పాటలను ఆకళింపు చేసుకొని సాధన చేసేవాడు. అంతేకాదు, ఆయన పరమ రామభక్తుడు. రామదాసు కీర్తనల్ని కాలమాన పరిస్థితులకు అన్వయించి గానం చేస్తాడు. ఏ పాటనైనా నిండైన భక్తిభావంతో ఆలపిస్తాడు. అంత భక్తి ఎలా వచ్చిందంటే చిన్నప్పటి జ్ఞాపకాన్ని ఒకదాన్ని గుర్తు చేసుకుంటాడు.

బాగా చిన్నతనంలో ఉన్నప్పుడు ఒకసారి మల్లయ్య, తన అమ్మమ్మ గారి ఊరైన వరంగల్ జిల్లా నర్మెట్టకు వెళ్లాడట. అక్కడ ఒకరోజు ఆరుబయట ఆడుకుంటున్నప్పుడు, రజాకార్లు ఊరి మీద పడ్డారట. దొరికిన మగవాళ్లను దొరికినట్టు, పిల్లల్ని కూడా వదలకుండా ఊచకోతకోస్తూ, మహిళలపై అత్యాచారాలు చేస్తూ విధ్వంసం సృష్టించారట. దాన్ని చూసిన అమ్మమ్మ... తనను ఇంటి వెనకాల దాచి పెట్టిందట. తాను వచ్చే వరకూ అక్కడి నుంచి కదలవద్దని చెప్పిందట. మూడు నాలుగు గంటలపాటు ఊళ్లో స్వైరవిహారం చేసి రజాకార్లు వెళ్లిపోయారు. ఆ తర్వాత అమ్మమ్మ పరుగెత్తుకొచ్చి మల్లయ్యను గుండెలకు హత్తుకొని, ఆ రాముడే నిన్ను కాపాడాడని అన్నదట. ఆ క్షణం నుంచి తన మనస్సులో రాముడు కొలువయ్యాడని చెబుతాడు మల్లయ్య.

పదేళ్ల వయసులో ఓ వీధిభాగోతంలో హనుమంతుడి వేషం వేయడంతో మల్లయ్య కళాజీవితం ప్రారంభమైంది. ఊళ్లో, పరిసర గ్రామాల్లో జరిగే ఏ భాగోతంలోనైనా ఏదో ఒక వేషం సంపాదించే వాడు. రాత్రిళ్లు ఊళ్లో భాగోతం మొదలయ్యిందంటేచాలు 'సాందిరి'లో ముందుగా కనిపించేది మల్లయ్యనే. భాగోతంలో ఏ పాత్రధారి అయినా అనివార్య కారణాలవల్ల రాలేకపోతే నిర్వాహకులకు గుర్తొచ్చేదీ మల్లయ్యే! అప్పటికప్పుడు వేషం వేసి రక్తికట్టించేవాడు. అలా అలా చుట్టుపక్కల పది పన్నెండు గ్రామాల్లో మంచి కళాకారుడిగా పేరు తెచ్చుకున్నాడు. బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని మల్లయ్య నోటి వెంట

విన్నవారెవరైనా సరే తన్మయత్వంతో మైమరచిపోవాల్సిందే!

నేను ఏడవ తరగతి చదివే సమయంలో నా ఆసక్తిని గమనించి, 'కృష్ణలీలలు' భాగోతంలో చిన్నప్పటి 'కృష్ణుని' పాత్ర ఇప్పించాడు మల్లయ్య. పద్యాలూ నేర్పించాడు. అక్షరజ్ఞానం ఉంటే ఆయన మరింత వెలుగులీనగలడన్న భావన నాలో ఉండేది. నేను డిగ్రీ చదివే రోజుల్లో వయోజన విద్యాకేంద్రం నడిపే అవకాశం వచ్చింది. అందులో తొలి అభ్యాసకుడు మల్లయ్యే, తనే ముప్పైరెండు మందిని ఒక చోట చేర్చి తన ఇంటినే 'రాత్రిబడి' చేశాడు. అక్షరాలతోపాటు అన్నింటినీ రెండు నెలల్లోనే చదవగలిగిన పట్టుదల ఆయనది. మల్లయ్య కఠోరసాధకుడు. ఏక సంథాగ్రాహి. రోజూ చదువు పూర్తికాగానే తబలా, తాళం, చిడతలు, ముందేసి భజన మొదలు పెట్టేవాడు. అర్ధరాత్రి దాటేవరకూ దాన్ని కొనసాగిస్తూనే ఉండేవాడు.

భుక్తి కోసం ప్రస్తుతం మల్లయ్య వ్యవసాయ కూలీగా వెళుతున్నాడు. ఆయన భార్య మల్లవ్వ. పిల్లలు... శ్రీరాములు, విష్ణుమూర్తి. తన ఆఖరి పిలుపు కూడా రాముడిదే అవ్వాలన్న కోరికతోనే పిల్లలకు అలా

**మేలిముత్యాల్లో ఒకటి...**

ఆశువుగా పాటలను కట్టి, పాడటంలో మల్లయ్య నేర్పు అనుపమానం. రైతుల మీద, వారి నిస్వార్థ గుణం మీద మల్లయ్య కట్టిన ఈ పాటను చూడండి... లోతైన భావంతో గుండె బరువెక్కిపోతుంది.

సుక్కపొద్దున లేసి
మూటలంత గట్టి
పాతాళగంగనే పైకి రప్పిస్తివి
సాగుభూములనెల్ల వాగులే పారించి
కర్రనాగలి కాని ఘనంగా కట్టి
ములుకోలు కట్టెతో ముంతెడు అంబలితో
ముంగటా నాలుగెడ్లు ముదముతో నడవగా
పన్నెండు ఎకరాలు పరగ దున్నంగా
పచ్చిపేడ వేప ఆకులలములేసి
తీరొక్క దినుసులు తీరుగా పండించి
పంట సిరులన్నియు తానను భవింపక
తోటి వృత్తుల జూసి
తోచినంతా పంచె
కాపు కొడుకా నీకు జాగు జయీభవ!!!

పేర్లు పెట్టుకున్నానని చెబుతాడు మల్లయ్య. బతుకుదెరువు కోసం కొడుకులిద్దరూ మస్కట్‌కు వలసెళ్లారు.

తియ్యని తెలుగుపదాలను, జానపద కళలను భావితరాలకు అందించడానికి ఇలాంటి ఒక్కో కళాకారుడూ ఒక్కో తాళపత్ర గ్రంథంలా ఉపయోగపడగలరు. అచ్చమైన తెలుగు నుడికారాన్ని, స్పష్టమైన ఉచ్చారణతో, పాటలు, కీర్తనలు, గేయాల రూపంలో జనబాహుళ్యంలోకి తీసుకువెళుతున్న ఈ గ్రామీణ కళాకారులకు మనమేమివ్వగలం. గుర్తించి, గౌరవించడం తప్ప!

**ఇది మన బాధ్యత**

ఇలాంటి కళాకారుల్ని గుర్తించి... వారి జ్ఞాపకాలను, వారు రాసిన పాటలు, పద్యాలు వంటి వాటిని అక్షరబద్ధం చేయాలి. మన ఘన చరిత్రను కాపాడుకోగలిగే మార్గమిదే.





**కొండి మల్లారెడ్డి**
ఉపాధ్యాయుడు, అధ్యక్షులు,
యువసాహితి సమితి,
మెదక్. 94419 05525

## మనవడికి జిందాబాద్

అప్పుడెప్పుడో భూమి పుట్టిందట.
ఇదే మాట మాతాత అన్నాడు.
నేనూ అదే మాటనంటున్నాను.
అప్పుడంటే ఎప్పుడని.
నా మనుమడు నన్నడిగాడు
నేనీ ప్రశ్నను అడగలేదు మాతాతని
అడిగుంటే వైవస్వత మన్వంతరాలన్నీ
చక్కని కథల్లా లెక్కల్లో ప్రకాశించేవి
అప్పుడికి ఎప్పుడుకి సమాధానం
సాంప్రదాయ సుమ వనిలో
నిగనిగల చందమామలా నివసించేది
అర్థవంతంగ ప్రశ్నించేతత్త్వం
నాడెంతన్నది చర్చనీయాంశం
నాడదధికంగ ఉంది ఉన్నట్లయితే.....
మన పురాణ స్వరూపమిలా ఉండేదికాదు.
పద్నాలుగుమంది మనువులుంటే...
భూమి పూర్ణాయువన్న విషయం తెలిసేది.
మనమున్నది ఏడవ మనువుకాలం అంటే...
భౌతికశాస్త్రాదులలో "మనవిశ్వం" తెలిపే
తతంగం
అందంగ తెలిసేది మరింత
వ్యాసుని దుష్యంతుడు
కాళిదాసు దుష్యంతుడు
నన్నయ్య దుష్యంతుడు
పినవీరభద్రుని దుష్యంతుడు
ఎవరసలు దుష్యంతుడు?
ఇలాంటి అనవసర చర్చలకు
ఆనాడే తెరపడేది... ...
కాబట్టి మనవడికి జిందాబాద్...
మన గణనకి జిందాబాద్...
అదే మన'వడి'కి జిందాబాద్.

**వాగుమూడి లక్ష్మీరాఘవరావు**
కరీంనగర్.
98494 48947



# విడాకులు



ఉదయం పదిగంటలు. రెండో అదనపు న్యాయస్థానంలో పిలుపులు అయిపోయాయి. న్యాయమూర్తి అనుమతి ఇవ్వడంతో బెంచి గుమస్తా మొదటి కేసులో వాది, ప్రతివాదుల పేర్లు, కేసు సంఖ్య పెద్దగా చదివాడు.

కోర్టు వాకిలి దగ్గరున్న బిళ్ళబంట్రోతు వరండాలోకి వెళ్లి వాది, ప్రతివాదులను మూడు సార్లు బిగ్గరగా పిలిచాడు. ఆవరణలో బీడీ కాలుస్తున్న వాది సందెల గోవిందం చటుక్కున బీడీ పారేసి కోర్టు హాల్లోకి వెళ్లాడు. న్యాయమూర్తికి దణ్ణం పెట్టి ఒక పక్కగా నిలబడ్డాడు.

మనిషి పొడుగ్గా ముతకపంచ, చేతుల బనీనులో వెర్రిబాగులవాడిలా కనిపిస్తున్నాడు.

న్యాయస్థానం బయట చెట్టు కింద కూచుని సావాసకత్తెతో కబుర్లు చెబుతూ, తేగ వలుచుకు తింటున్న సందెల నారాయణమ్మ, మిగిలిన తేగ తన సావాసగత్తె చేతిలో పెట్టి, పక్కనున్న సిల్వరు కేరేజిని "ఒకపాలి సూత్తుండప్పా" అని ఆమెకి అప్పజెప్పి ఒక్క పరుగులో కోర్టుహాల్లోకి ప్రవేశించింది. న్యాయమూర్తికి దణ్ణం పెట్టి ఒక పక్కగా నిలబడింది.

సందెల నారాయణమ్మ ఊచలాగా వంగిపోయి ఉంది. బాగా కష్టం చేసి బతికే మనిషని చూడగానే తెలుస్తోంది. ముదురు ఎరుపురంగు నేత చీర మీద ఎరుపురంగు అంచున్న పసుపు జాకెట్టు తొడుక్కుని ఉంది తైలసంస్కారం లేని బిర్రజుట్టుని బలంగా లాగి వేలుముడి వేసింది. రెండు చేతులకీ పట్టు దారాలున్నాయి. మెడలో పసుపు బాగా రాసిన పసుపుతాడు ఉంది. చెప్పులు లేని పాదాలు దుమ్ము పట్టి బీడు భూమిలాగా విచ్చిన పగుళ్లతో ఉన్నాయి. చెవులకి, ముక్కుకీ చీపురు పుల్లలున్నాయి.

న్యాయమూర్తి అనుమతితో, వాది విచారణ అంతకుముందే ముగియడంతో, వాది భార్య సందెల నారాయణమ్మను విచారణ కోసం బోనులోకి పిలిచారు. కోర్టుజవాను నారాయణమ్మ చేత భగవద్గీత మీద ప్రమాణం చేయించాడు.

వాది తరపు న్యాయవాది విచారణ ప్రారంభించాడు.

"నీ పేరు?"

"సందెల నారాయణమ్మ బాబూ"

సందెల గోవిందాన్ని చేతితో చూపిస్తూ అడిగాడు, "అతడు నీకేమవుతాడు"

"ఆ దిక్కుమాలినోడు సొయానా నా పెనిమిటి బాబు"

"మీ పెళ్లి పెద్దలు చేయించిందా? లేక మీరే చేసుకున్నారా?" అడిగేసాక నాలిక కరుచుకున్నాడు.

"పెళ్లైన పది సమచ్చరాలకి ఇంటన్నాను బాబూ ఈ పెళ్ళ. నాకే సొతంతరం ఉంటే ఈడ్నెందుకు కట్టుకుంటానయ్యా?"

గోవిందు తరపు న్యాయవాది ఈ జవాబును రాయించమని కోరాడు.

నారాయణమ్మ తరపు న్యాయవాది తన అభ్యంతరం తెలియజేశాడు.

గోవిందు న్యాయవాది "దేనికండి అభ్యంతరం. భర్త పట్ల ఆమె నిరసన ప్రతీ మాటలోను వ్యక్తమవుతుంటేను" అన్నాడు.





"ఏమిటి అభ్యంతరం" ప్రశ్నించారు న్యాయమూర్తి

"యువరానర్, ఆమె పల్లెటూరి అమాయకురాలు. ఆ మాటలు ఆమె ఉద్దేశపూర్వకంగా అన్నవి కావు. ఆ భర్తతో ఆమె పడుతున్న బాధల కారణంగా అన్న మాటలు గానీ, అతణ్ణి కించపరచడానికి అనలేదని మనవి" అన్నాడు నారాయణమ్మ తరపు న్యాయవాది.

"నేనేం బాధలు పెట్టేసినానే నిన్ను!" అని గొంతెత్తబోయాడు గోవిందు.

"ష్! నీ వంతు అయిపోయింది. మాట్లాడకు" అన్నాడు న్యాయమూర్తి.

గోవిందు వినయంగా మూతి మీద వేలేసుకుని తలూపాడు.

న్యాయమూర్తి "ప్రొసీడ్" అన్నారు గోవిందం న్యాయవాదితో.

చిన్నబుచ్చుకున్న ముఖంతో గోవిందు తరపు న్యాయవాది తిరిగి ప్రశ్నించాడు నారాయణమ్మను, "నువ్వు నీ భర్త అంటే ఇష్టపడక పోవడానికి గల కారణాలేవిటీ"

"ఆణ్ణి నేనెందుకిట్టపడను బాబూ. నాకున్న కట్టసుకాలన్నీ ఆడే కదండీ"

"నీకు మరొక వ్యక్తితో గల అక్రమ సంబంధాల కారణంగా నీ భర్త నీ నుండి విడాకులు కోరుతున్నాడు. ఇందుకు నీ సమాధానం?"

"ఏ సెప్మంటారు బాబూ, ఆడుత్తి ఎర్రిబాగులోడండి. ఎలా బతకాలో తెలీనాడికి మరింక ఇట్టాంటి యిసయాలు ఎట్టా తెలుత్తాయి సెప్పండి. నిజం సెప్పాలంటే ఇది ఆడి పుర్రెకి పుట్టిన బుద్ధి మాత్రం కాదండి"

"నేను అడిగిన ప్రశ్నకి సమాధానం అది కాదమ్మా" న్యాయవాది కొంత విసుగ్గా అన్నాడు.

"అదంతా సుద్ద అబద్ధవండి, నా నుంచి ఇడిపొమ్మని, ఇడిపోతే నా పీడా వదిలిపోద్దాని ఎవరో ఆడికి అదే పనిగా సెప్పుంటారండి. ఆడి పుర్రెలో ఎర్రిమొర్రి ఆలోచనలు సానా ఉంటాయి బాబూ. అందుకే అట్టా అంటన్నాడండీ."

"ఏ కారణం లేకుండా భార్య మీద అలాంటి దావా తేరు కదమ్మా?" ప్రశ్నించాడు న్యాయవాది.

"కారనాలాడికి సవాలచ్చ పుట్టుకొత్తాయండి. ఈ పూట తానం సెయ్యనీకి సబ్బిల్ల నేదనుకోండి, నేను డబ్బులన్నీ ఎవలకో ఎట్టేసానంతాడు. తాగనీకి టీసుక్క లేదనుకోండి, నాను ఇల్లిడిసి తిరగతన్నానంతాడు. ఆ సోకులవీ సాలక తాగుడు నేర్చుకున్నాడండి ఈ మద్దెల"

అంతసేపూ నారాయణమ్మనీ, ఆమె మాటలనీ శ్రద్ధగా పరిశీలిస్తున్న న్యాయమూర్తి నారాయణమ్మని ప్రశ్నించారు. "నీ భర్త నిన్ను నిష్కారణంగా అవమానించి ఈ దావా తెచ్చాడని అంటావా?"

"బాబూ, తమరు నాయం సెప్పేటోరు. నేనా ఆడకూతుర్ని. ఈడ్ని కట్టుకున్న కాన్నించి పసిబిడ్డ మాదిరి సాక్కొత్తన్నానండి. రేత్రిపొగలూ కట్టపడితే గానీ ఆడికెట్టి నేను తినలేకపోతున్నాను. అట్టాంటిది మరొకల్లతో సోపతెట్టుకునే టయమేడదండి నాకు"

"నువ్వింత జాగ్రత్తగా నీ భర్తను చూసుకుంటుంటే అతడు ఎందుకలా అంటున్నాడు?"

"అయ్యా ఎందుకనడండీ, కట్టుకున్నోడు ఎలాటోడయినా బరిత్తన్నాను కాదాండీ? అందుకనండీ. తమకి తెలవని సంగతులేముంటాయండి మారాజా. నా మొగుడుకి తెల్లార్లేస్తే దినావూc తాగనీకి టీసుక్క, రెండుపూట్ల తానానికి సబ్బెల్ల, కాల్చుకోడానికి బీడి కావాలండి. అదయిపోదాకా ఇల్లంత ఆగం సేసి మరీ సాదిత్తాండి. నేదంటే నడీదిలకెక్కి అరుత్తాడు సావీc. అదయినంక మద్దేలపేల ఆడికి కక్కోముక్కో కావాలండి. ఇదో ఈ రెండు సమచ్చరాల నుంచే సందడడిందంటే మాయదారి తాగుడు క్కావాలండయ్యా. రెక్కాడితేగానీ డొక్కాడని మాకు ఎట్టా కుదురుద్దండి. ఆయాల కూడా సారాకి డబ్బులియ్యనేదని కొట్నాడాడు సావీc!"

నారాయణమ్మ మాటలకి మధ్యలో అడ్డుతగులుతూ ప్రశ్నించాడు గోవిందం న్యాయవాది, "కొట్లాట అంటున్నావు కదా. నువ్వే నీ భర్త చేతిలో డబ్బులు లాక్కుని పచ్చడిబండతో తల పగలు కొట్టావు అని నేనంటున్నాను. దీనికి నీ సమాధానం?"

నిష్ఠూరంగా అంది నారాయణమ్మ, "నేనెందుకు కొడతాను బాబూ. ఆడ్ని కొడ్తే సచ్చినట్టు కూలి పని సేసి ఆ దెబ్బ నేనే బాగు సేయించుకోవాల కదా."

"మరి ఆ దెబ్బ ఎలా తగిలిందంటావు?" కటువుగా అన్నాడు గోవిందం లాయరు.

"ఎలా తగిలిందాండి. ఆ రోజు మద్దన్నపేల నేను పెసిరెంటు గారింటి నుండి పిండి దంచి తెచ్చిన డబ్బులు పిడతలో ఎయ్యడం సూసాడండీ ఆడు" నారాయణమ్మ మాటలకు అడ్డు తగులుతూ, "దెబ్బ గురించి చెప్పమ్మా చాలు" అన్నాడు గోవిందం లాయరు.

"దెబ్బ తగిలింది అని సెప్తే ఎట్టండయ్యా. అదెట్ట తగిల్నాదో, దెబ్బ తగలడానికి కారనవేటో సెప్పొద్దాండీ" అంది నారాయణమ్మ.

న్యాయమూర్తి నవ్వుతూ అన్నారు, "చెప్పమ్మా దెబ్బ తగలడానికి కారణమేమిటో... చెప్పు"

నారాయణమ్మ న్యాయమూర్తికి దణ్ణం పెట్టి చెప్పడం ప్రారంభించింది. "అట్ట డబ్బులు పిడతలెయ్యడం సూసి బయటకెల్లి పోనాడండి. నాను సందడదేదాకా మిరపకాయలు దంపుకున్నానండి. సందడద్దాక ఈడొచ్చి డబ్బులు గావాల ఇయ్యమన్నానండి."

అవకాశం దొరికిందని సంబరపడిపోతూ గోవిందం న్యాయవాది అడ్డు తగిలాడు. "అప్పుడు నువ్వు పచ్చడిబండతో నీ మొగుడి తల పగలు కొట్టావు."

నారాయణమ్మ తన మాటలకు మధ్యలో అడ్డొచ్చిన న్యాయవాదిని చురచుర చూస్తూ అంది. "బాగుంది నాయరు బాబూ మీ పెశ్న. కారం రోకలితో దంపుతారు కానీ, పచ్చడిబండతో దంపతారా. నిజంగా నేనాడి బుర్ర పగలుగొట్టుంటే సేతులున్న రోకలొదిలేసి పచ్చడి

బండకోసం ఎల్లానంటారా? నేక ఇందాకల మీర న్నట్టు ఆడి సేతుల డబ్బులు నేనే లాక్కున్నాక ఎల్లి పచ్చడిబండ తెచ్చి కొట్నానంటారా? అబద్దపు దావాలేత్తే ఇట్టాంటి పెశ్నలే వొత్తాయి మరి"

గోవిందం న్యాయవాది మండిపడుతూ అన్నాడు. "నువ్వు హద్దు మీరి మాట్లాడుతున్నావు!"

న్యాయమూర్తి నారాయణమ్మని "నోటికొచ్చినట్టు మాట్లాడద్దమ్మా" అని మందలించారు.

"తెలవకన్నాను సావీ, చమించండి. ఆ నాయరుగారు పూర్తి గినకుండ నన్ను అన్నాయంగా అంటున్నారన్న బాధలో అట్టనేసినాను" వినయంగా అంది నారాయణమ్మ.

"సరే తరవాత ఏం జరిగిందో చెప్పు" అన్నారు న్యాయమూర్తి దయగా చూస్తూ.

నారాయణమ్మ తిరిగి ప్రారంభించింది. "అప్పుడన్నానండి. 'నాకాడనేవు. గూట్ల గిన్నెల కూడుంటది. తినేసి వల్లకుండు'అన్నానండి. దాని మీద ఆడు మండిపడి 'పిడతలున్న వేటి సిల్ల పెంకులా' అన్నాడండి.

"నేనేమో 'అయ్యి రేపు గింజలు కొంటాకి కావాల ఇయ్యను' అని లోపలికి పోనానండి. కొంచేపయినంక సూత్తే లేడండీడు. ఏటా, ఎప్పుదరిసేవోడు లేడనుకుని, కొంచేపు చూసి నా మట్టుకు వొన్నం తినేసి తలుపులోన గడేసుకుని తొంగున్నానండి.

"మెల్లగ కునుకట్నాదండి. ధడాల్న సప్పుడయితే గబుక్కొన లేచి చూద్దును కదండి! ఈడు ఈదికి మద్దెనున్న గోడ మీద కూకునున్నాడండి.

"మయాన నిద్దర్లో లెగిసిన మీద నాకరదం కాక ఏట్రా గోడ మీనెక్కేసినావు అనడిగానండి. దాని మీద ఈడు గోడ మీంచి గెంతేసి లోన గదిలో నడిపోనాడండి. మనిసి పుల్లుగ తాగేసి ఏటో మాటాడతన్నాడండి. ఆ పడ్డం మంచం కోడు మీన పడిపోనాడు. తలకి దెబ్బ తాకేసినాది బాబూ."

"అప్పుడే బయట ధడాల్న సప్పుడయితే ఏటో సూద్దారని గెడ తీసి బయటకెల్లి సూద్దును కదా, బయట సారాకొట్ల పన్జేసే పాపిగాడు పడిపోయున్నాడండి. ఆడి మీన సిన్న నిచ్చెన పడున్నాదండి"

"ఇదేటీడు ఇలగ పడిపోనాడని నిచ్చెన తీసి ఆడ్ని పిల్సానండి. 'ఆడు ఏడీ నీ మొగుడు, నన్ను నిచ్చెనెక్కిచ్చి గదిలోకి దిగమని ఆడెక్కడికి పోనాడు' అన్నాడండి.

"దాని మీద నాకు సెడ్డ కోపమొచ్చేసి, పక్కనున్న కర్రతో రెండు నూకానండి. బాబూ. ఆడదే పరుగున ఎల్లిపోనానండి.

"తరువాత ఈడి దెబ్బకి కట్టుకట్టిపిచ్చినానండి. తరువాత నాల్రోజులకి నాయరుబాబు దగ్గర నుంచి కోరట్ల కాజరవ్వమని కాయితాలొచ్చినాయండి. అంతే బాబు"

"ఆ కాయితాలు ఎవరికి చూపించావమ్మా?" ప్రశ్నించారు న్యాయమూర్తి.

"మా పెసిరెంటుగారికండి. ఆయనే ఈ నాయరుబాబు దగ్గరకి ఎల్లమన్నారండి. డబ్బులిచ్చుకోలేనండయ్యా అంటే పర్నేదులే అన్నారండి"

"మీ న్యాయవాదితో భర్త నుంచి విడిపోతానని చెప్పావా?"

"నేదు బాబు. ఆడు అమాయకపోడండి.



ఆడ్నిసి పెట్నేకి నేనొప్పను బాబూ."

న్యాయమూర్తి సందెల గోవిందాన్ని గద్దిస్తూ అడిగారు. "ఏం అమె చెప్పిందంతా నిజమేనా?"

గోవిందం తల అడ్డం ఊపుతూ ఏదో నసిగాడు. న్యాయమూర్తి కోపంగా అన్నారు. "నిజమేమిటో ఎలాగూ తెలుస్తుంది. ఇది అబద్ధపు దావా అని తేలిందా, నిన్ను మూడేళ్లు జైల్లో పెడతాను"

గోవిందం హడలిపోయి, "అయ్యో సామీ, నా తప్పు నేదు బాబు. పాపిగాడే అట్టాజేత్తే నీ పెల్లం సెప్పినట్టింటది. తమాసాకే కదా, కోరట్ల ఇడాకులియ్యర్లే, కుంత కేకలేసి, బరత మాటిన మని బయ్యం సెపతారంతే అనంటే, అలాగే అన్నానయ్యా!" తర్వాత నారాయణమ్మ వైపు చూస్తూ ఏడుపుగొంతుతో, "మరింకో పాలి ఇట్ట సెయ్యను నువ్వు సెప్పే నారాయనా!" అన్నాడు.

"నేనేటికి సెప్పాల్రా సచ్చినోడా. మొన్న గోడమించి అడినట్టు శుభ్రంగెల్లి జైల్లనడిపో. ఆ దిక్కుమాల్ని తాగుడలవాటయినా పోద్ది" అంది నారాయణమ్మ.

మేజిస్ట్రేటు "తాగుడు మానేస్తావా, లేదా" అని గద్దించారు. "మానేత్తాను బాబూ బుద్దొచ్చేసినాది" అన్నాడు చేతులు నలుపుకుంటూ.

"ఇంకోసారి తాగినట్టు తెలిసినా, నీ భార్యని సతాయించినట్టు తెలిసినా, తిన్నగా జైలుకే!" అన్నారు.

"నేదు బాబూ, మల్లింకెప్పుడూ తాగను" చెంపలు వాయించుకున్నాడు గోవిందం.

"ఏమ్మా రాజీపడతావా?" అడిగారు మేజిస్ట్రేటు నారాయణమ్మని.

"కట్టుకున్న కాన్నించి రాజీపడతానే ఉన్నానుగాదా బాబు, ఇప్పుడెనక్కి తియ్యనాకి. ఆడ్నించిపోయి నేను మాత్తరం బాగుపడేది ఏటుంటది. ఆడు ఎర్రిబాగులోడేగానీ సెడ్డోడు కాదండయ్యా. తాగి ఆడి గోల్లో అడుంటాడు గాని నన్నేనాడు కొట్లేదు బాబు" అంది నారాయణమ్మ.

న్యాయమూర్తి ఇరుపక్షాల న్యాయవాదులతోనూతోనూ, "వచ్చే వారానికి వాయిదా వేస్తాను. కాంప్రమైజ్ పిటిషన్ పడెయ్యండి" అని, తర్వాత దంపతులిద్దరితోనూ చెప్పారు, "మీ న్యాయవాదులిద్దరితోనూ చెప్పి రాజీ కాగితం పడెయ్యండి. వచ్చేవారం దావా తీసేస్తాను."

ఇద్దరూ న్యాయస్థానం బయటకు వచ్చారు. గోవిందం భయంగా "యిడాకులవుతాయేటే" అన్నాడు.

"నేదునేరా" అని గోవిందానికి నచ్చచెప్పానే తన సావాసగత్తెను వెతుక్కుని సిల్వరు కారేజీ తెచ్చుకుంది నారాయణమ్మ.

కేరేజీ చూస్తూ అడిగాడు గోవిందం, "ఏటుందందల?"

"ఏటుందిరా, అటుకుల మిచ్చరు" మూత తెరిచి గుప్పెటతో తీసి, "సయ్యాట్టు" అంది.

"దెబ్బనావవుతాదేమోనే" తల మీద కట్టు తడిమి చూసుకుంటూ సందేహించాడు గోవిందం.

"ఏటవత్తిను" ప్రేమగా కసిరి మొగుడి దోసిట్లో అటుకుల మిచ్చరు పోసింది నారాయణమ్మ.





**ఫణిహారం నిర్మలాకాంత**
హైదరాబాద్. 93904 29718

# మాటకట్టు 2

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ★ | 3 | ★ | 4 | 5 | ★ | 6 | ★ |
| | ★ | | ★ | 7 | | | ★ | 8 | | | |
| 9 | 10 | ★ | 11 | | | ★ | 12 | | ★ | | ★ |
| ★ | 13 | | ★ | | ★ | 14 | | ★ | 15 | ★ | 16 |
| 17 | | ★ | 18 | ★ | 19 | | ★ | 20 | | | |
| | ★ | 21 | | 22 | | ★ | 23 | ★ | | ★ | |
| ★ | 24 | | ★ | | ★ | 25 | | 26 | ★ | 27 | |
| 28 | ★ | 29 | | ★ | 30 | | ★ | 31 | | | ★ |
| 32 | 33 | | ★ | 34 | | ★ | 35 | | ★ | 36 | 37 |
| ★ | | ★ | 38 | | ★ | 39 | ★ | 40 | 41 | ★ | |
| 42 | | | | ★ | 43 | | | ★ | 44 | 45 | |
| ★ | | ★ | 46 | | | | ★ | 47 | | | ★ |

ఆధారాలు

## అడ్డం:

1. వాలం ఇముడ్చుకున్న నెలవు (4)
4. దూడను కట్టేందుకు ఉపయోగించే కొయ్య (2)
7. పాదాలకు చేసే అలంకారం (3)
8. అడవికి కుడి ఎడమల అక్షరాలతో తెర! (4)
9. ఖనిజంలో సత్యం! (2)
11. పోరాటాన్ని గుర్తుకు తెస్తుంది, పరితాపం (3)
12. విక్రయించు, బాణం! (2)
13. పాము పూత్కారం (2)
14. పడక (2)
17. సొమ్ము (2)
19. చెల్లించాల్సిన ఖరీదు (2)
20. అడవిలో వేరేవిధంగా (4)
21. తెలుగు సినీగీతాల పాఠశాల ఈ అమర గాయకుడు! (4)
24. వంతు, భాగం (2)
25. కుచ్చుల మీను (3)
27. కొద్దిపాటి వాన (2)
29. రాజు పాలించేది? (2)
30. రోజులో భాగం (2)
31. అడుగు నుంచి కొమ్మల మొదళ్ల వరకు వృక్షభాగానికి ఈ పేరు! (3)
32. అసంభవం కాదు!! (3)
34. శుభం, ప్రయోజనం (2)
35. నూతిలోంచి నీరు తోడేందుకు ఉపయోగించే బొక్కెనను ఇలా కూడా అంటారు... (2)
36. మనదేశంలో ఒక జీవనది! (2)
38. గ్రీవం? (2)
40. బోధి వృక్షమంటే ఏ చెట్టు? (2)
42. నాతాహతు చెదిరింది. (4)
43. వెన్ను చూపే వాళ్లు కాదు, నెగ్గుకొచ్చే శూరులు! (3)
44. చందా (3)
46. కల్యాణ శ్రీనివాసుడికి రుణమిచ్చిన దిక్పాలకుడు (4)
47. వాహనం పరుగులు తీయాలంటే ఈ ధనం ఉండాల్సిందే! (3)

## నిలువు

1. వసంత రుతువు (3)
2. పలుకు (2)
3. యుద్ధం (3)
5. '.... నిశ్చయమ్మురా భయమ్ము లేదురా!' (3)
6. శోధన, ఏదో ఉందని అనుమానించి చేపట్టే వెతుకులాట (3)
7. దోగాడు (3)
10. జంతికలు దొరకబుచ్చుకొన్నా కంగారేనా - 1, 8, 12 నక్క (3)
12. నాన్న (2)
14. ఎముక; ఇలా కావడమంటే బక్కచిక్కిపోయారని అర్థం! (2)
15. దృష్టిని, దిశను మళ్లించు (3)
16. యోచన అంటే? (4)
17. పంట (2)
18. తిరగబడిన టపా అడ్డం 21 నోట! (2)
19. రెండు గోడలు కలిసేచోటు - ఒక నక్షత్రం! (2)
21. గంటగంటకు ఈటీవీ-2లో సమాచార మాలిక (4)
22. ఎంకి చాలు అంటున్నట్లుందేగాని, నిజానికి అది సంవత్సరం! (2)
23. తృతీయ (2)
25. అరవై నిమిషాల కాలం? (2)
26. వినాయకా! (4)
27. చక్కదనం (3)
28. సంవత్సరం కన్నా చిన్నది, పక్షం కన్నా పెద్దది! (2)
30. వీటిని ముడిచి కొప్పులో తురిమితే ఘుమఘుమ! (2)
33. శతకత్రయం (నీతిశతకం, శృంగారశతకం, వైరాగ్యశతకం) రాసిందెవరు? (4)
34. సౌధం (2)
37. శివుడు గళంలో బంధించిన హాలాహలానికి ఇంకో పేరు (3)
38. అన్నకణం! (3)
39. దొంగది (3)
41. అనేక రకాల (3)
43. క్రికెట్ ఆటగాడు వీరేంద్ర సెహ్వాగ్ ముద్దుపేరు! (2)
45. రానంటున్నా సగమే మిగిలింది! (2)




**బాలు**

హైదరాబాద్ 80080 01670


సమాధానాలు 98లో...

## ఆహ్వానం

భాషాభిమానాన్ని పెంచేలా, తెలుగు మాధుర్యాన్ని పంచేలా గళ్ల నుడి కట్టును మీరూ రూపొందించి పంపవచ్చు. బాగున్న వాటిని ప్రచురిస్తాం. తగిన పారితోషికమూ ఉంటుంది.

# భాషలో జీవం... సాహిత్యానికి ప్రాణం

## కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత పెద్దిభొట్ల సుబ్బరామయ్య

జన జీవన చిత్రణ ద్వారా పాఠకుల్లో ఆలోచన, మానవీయ స్పందనను రేకెత్తించడమే పెద్దిభొట్ల సుబ్బరామయ్య ఆశించే సాహిత్య ప్రయోజనం. జీవితానుభవమే పెద్దిభొట్లను రచయితగా తీర్చిదిద్దింది. పెద్దిభొట్ల కథలు రాసినప్పుడు ఆ కథన రీతిని ఆయన గురువు విశ్వనాథ సత్యనారాయణ మెచ్చుకున్నారు. అంతే పెద్దిభొట్ల వెనుదిరిగి చూడలేదు. 200 పైచిలుకు కథలు అందించారు. కొన్ని నవలలూ వెలువరించారు. ఆయన కథల్లో మంచి పాత్రలు, చెడు పాత్రలు ఉండవు. ప్రతి పాత్రలోనూ మంచి, చెడు తారట్లాడుతుంటాయి. సమకాలీన వ్యవస్థలోని లోపాలను చురుక్కు మనిపించే శైలిలో ఎత్తిచూపడం ఆయన ప్రత్యేకత. ఆయన కథలు మానవ జీవితాల్లోని విషాదాలను చిత్రించేవైనా అవి కేవలం విషాదాంతాలు కావు. చదువరుల హృదయాల్లో కాస్తంత కరుణ, ఆర్ద్రత కలిగించడానికి ఆయన ప్రాధాన్యం ఇస్తారు. తెలుగు అధ్యాపకుడిగా, విశ్వనాథ శిష్యుడిగా తెలుగు భాషపై ఉన్న పట్టును తన కథల్లోకి అలవోకగా తర్జుమా చేశారు. 2012 డిసెంబరు 15న 75 ఏళ్లు నిండిన పెద్దిభొట్లకు ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. ఆ సందర్భంగా తెలుగు భాష, సాహిత్యాల గురించి ఆయనతో ముఖాముఖీ...



ఫోటో: వి.మురళియ్య

**సాహిత్యం అంతా భాషే... కానీ భాష సమస్తం సాహిత్యం కాదు... మరి సాహిత్యాన్ని మనం ఎలా గుర్తించటం?**

సాహిత్యం భాషలోనే ఉంటుందనటం నిజం. అయితే భాష మొత్తం ఒకటి కాదు. భాష అనేక రకాలు... మనం మన ఇంట్లో ఒక రకమైన భాష మాట్లాడతాం... కార్యాలయానికెళ్తే మరోరకం భాష... అలాగే దేవాలయాల్లో ఒకరకం. విద్యాలయాల్లో ఒక రకం... సాహిత్యంలో ప్రయోగించే భాషలో వీటన్నింటి కన్నా భిన్నమైంది.

**ఆ తేడా లేదా ప్రత్యేకత ఎలాంటిది వివరిస్తారా?**

సాహిత్యం సృజింపబడేది భాషలోనే. అయితే కేవలం భాష మాత్రమే సాహిత్యం కాజాలదు... భాష అనేది ఒక వాహిక. మన భావాలను బట్వాడా చేసే ఒక బలమైన సాధనం భాష... సమాజంలో మనుషుల మధ్య భాష పరస్పరం సమాచార వినియోగం కోసం ఉపకరిస్తుంది. దాని ప్రయోజనం అంతవరకే పరిమితం. కానీ సాహిత్యం జీవితాన్ని ఉన్నతీకరిస్తుంది... అలాగే భాషను శాశ్వతీకరిస్తుంది. కవి లేదా రచయిత తన భావాలు, విలువలనే గాక తన అనుభూతులు ఉద్వేగాలతో పదాలను దట్టిస్తాడు. దీంతో అవి ఒక ప్రత్యేకతని సంతరించుకుంటాయి. ఆ ప్రత్యేకతే భాషకు శాశ్వతత్వాన్ని సమకూరుస్తుంది. తద్వారా సాహిత్యంలో కొన్ని కావ్యాలు లేదా రచనలు చిరస్థాయిగా నిలిచిపోతాయి.

**అంటే ఎలా?**

వరవిక్రయం, కన్యాశుల్కం... ఇవి రెండూ రెండు ప్రసిద్ధ నాటకాలు... వరవిక్రయం సమస్య ఇప్పటికీ అలానే ఉంది... కానీ వరవిక్రయం నాటకం మిగల్లేదు. ఆ నాటకాన్ని తలచుకునే వాళ్లేలేరు... ఈనాటి సమాజంలో కన్యాశుల్కం సమస్య మనకు ఎక్కడా కనిపించదు. కానీ కన్యాశుల్కం నాటకం నిలిచి ఉంది... కారణం భాష... జీవద్భాష... జీవద్భాషతో పాత్రల్నీ, జీవితాల్నీ మలిచిన తీరు... ఒక అర్థంలో సాహిత్యం అంటే అంతిమంగా భాషా వ్యవహారం... అనుమానం లేదు. అయితే కేవలం భాష మాత్రమే కళ కాదు. సాహిత్య సృజనలో ఇంకా అనేకాంశాలు మిళితమై ఉంటాయి. మరీ ముఖ్యంగా మానవుని సంవేదన, మానవ ప్రవృత్తి... వీటిచుట్టూ ఉండే వివిధ అంశాలు. విశిష్టమైన భావాలను వ్యక్తం చేయటం కోసం విశిష్టమైన పదాలను రచయిత ఎంపిక చేసుకుని ప్రయోగిస్తాడు.

**కవిత్వం, కథ, నవల - ఈ మూడు ప్రక్రియలకు భాష ప్రాతిపదికగా మీరు ఎలా విశ్లేషిస్తారు?**

ఈ మూడు ప్రక్రియల్లోనూ భాషకీలకమైందే. ముందు మనం కవిత్వం గురించి ఆలోచిద్దాం. ప్రాచీన కాలంలో కవులు రకరకాల పోకడలు పోయారు. భాషా భేషజాన్నీ, పదాల పటాటోపాన్నీ ప్రదర్శించారు. కొందరు అద్భుతమైన రీతిలో తమ ప్రతిభా సామర్థ్యాలను చూపించారు...

జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం

దొలగం ద్రోచె లతాంగి...
పారిజాతాపహరణంలో ముక్కు తిమ్మన్న పద్యం ఇది.

సత్యభామ కృష్ణుని మీద కోపంతో అలిగి ఉన్న సందర్భం... ఆమె ఎడమ పాదం శ్రీకృష్ణుని తలను తాకుతుంది... ఈ సంఘటనను రక్తి కట్టించటం కోసం శ్రీకృష్ణుని తలకు అని అనకుండా బ్రహ్మ, ఇంద్రుని వంటి దేవతల పూజలకు అర్హమైన, మన్మథుని తండ్రి అయిన విష్ణుమూర్తి శిరస్సు అని వర్ణించాడు. శిరస్సు గొప్పతనాన్ని వర్ణించి, అంత గొప్పదైన ఆ శిరస్సును ఆమె తన ఎడమ కాలితో తొలగించిందని అన్నాడు. ఇదీ పూర్వ పద్ధతి...

ఇక ఆధునికుల విషయానికి వద్దాం... మిత్రుడు వేగుంట మోహన ప్రసాద్ 'అట్లా అని పెద్ద బాధా ఉండదు' అని ప్రారంభించాడు ఒక పద్యం. అది 'భారతి'లో అచ్చయింది. ఆధునిక తెలుగు కవిత్వంలో అది ఒక అద్భుతమైన ప్రారంభం. ఒక గదికి సంబంధించిన వర్ణన అది. ఇది వట్టి చమత్కారం కాదు.. ఒక కొత్త పద్ధతి... అనూహ్యమైన ఒక ఆధునిక అభివ్యక్తి...

ఇంతకీ ఈ ఉదాహరణల ద్వారా నేను చెప్పదలచింది ఏంటంటే సందర్భాన్ని బట్టి మానసిక స్థితినీ, వాతావరణాన్నీ బట్టి హృదయాన్ని హత్తుకునే విధంగా చెప్పటం కోసం కవి లేదా రచయిత ఒక రకంగా, ఒక పద్ధతిలో భాషను ఉపయోగిస్తాడు... అంతిమంగా కవి లేదా రచయిత చెప్పదలచుకున్న అంశం లేదా భావం ఎంత బాగా, ఎంత బలంగా బట్వాడా చేశాడన్నదే ప్రధానం. ఎలా చెప్పాడన్నది ప్రధానమైనదే. కాదనను. ఏం చెప్పాడనేది అంతకన్నా ప్రధానమైంది. భాషకన్నా భావమే ప్రధానం. భాష అంతిమ లక్ష్యం సమాచార ప్రసారమే. రూపం ప్రధానమైందే. నిజానికి కళకు ఒక ఉనికిని ప్రసాదించేది రూపమే. అంతమాత్రాన రూపమే సర్వంకాదు. సారం అంతకన్నా ప్రధానం. సరే... అసలు విషయానికి వద్దాం. కవిత్వంలో ఉపయోగించే భాష వేరు. వచనంలో వాడే భాష వేరు. కవిత్వంలో కఠినమైన భాష ఉంటుంది. కాఠిన్యం అనే పదం బాగా లేదనుకుంటే గహనమైన భాష అనుకోవచ్చు. కవిత్వంలో క్లుప్తత, సంక్షిప్తత ప్రధానం. కవిత్వంలో ప్రయోగించే భాషతో పోల్చినప్పుడు వచనంలో వాడే భాష సాధారణ వాడుక భాషకు కొంత ఎక్కువ దగ్గరగా ఉంటుందని చెప్పవచ్చు...

**మీరు కవిత్వం, వచనం అని వర్గీకరించారు... వచనంలో వివిధ ప్రక్రియలున్నాయి. ఉదాహరణకు కథ, నవల. మీరు కథలు రాశారు, నవలలు కూడా రాశారు. అయితే మీరు ఈ రెండు ప్రక్రియల్లోనూ ఒకే రకమైన భాషను ప్రయోగించారా?**

లేదు... కథ, నవల రెండు భిన్నమైన సాహిత్య ప్రక్రియలు... నేను ఇంతకుముందు చెప్పినట్లు కవిత్వానికి అత్యంత గహనమైన, చిక్కనైన, సాంద్రతరమైన భాష అవసరం. నవలకు చాలా వరకు సాధారణ భాష సరిపోతుంది. ఎంతో వెసులుబాటుకు అవకాశం ఉన్న ప్రక్రియ నవల. ప్రవాహ సదృశ్యమైన భాష నవలకు బాగా నప్పుతుంది. ఇక కథ విషయానికి వస్తే అటు కవిత్వానికీ, ఇటు నవలకీ మధ్య మనం కథానికా క్షేత్రాన్ని గుర్తించవచ్చు. కథ పరిధి చాలా పరిమితమైంది. నవలా రచయితకున్న వెసులుబాటు కథా రచయితకు ఉండదు. అతి పరిమిత పరిధిలో రచయితకథని పండించాలి. కథారచన నిజంగా కత్తిమీద సాము. లేకపోతే, కవిత్వంలో ప్రయోగించేంత సాంద్రతరమైన భాషగానీ, నవలలో ఉపయోగించే పూర్తిస్థాయి సాధారణ భాషగానీ కథకి నప్పదు. అటు కవిత్వం, ఇటు నవల. ఈ రెండు ప్రక్రియల మధ్య సంచరించే కథలో ఉపయోగించే భాషకూడా కుడీఎడంగా అలాగే ఉంటుంది.

**మీ రచనల్లోని భాష...?**

నేను సాధ్యమైనంత వరకు అతి సాధారణ భాషలోనే రాస్తాను. పదాడంబరం అనేది నా రచనల్లో మీకు మచ్చుకైనా కనిపించదు. నిత్యం నేను కృతకమైన భాషకు దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తాను. భాషాపరంగా రచనను రక్తి కట్టించే ప్రయత్నం నేను ఎన్నడూ చేయను.

**మీ కథల్లో వివిధ సందర్భాల్లో వాతావరణాన్ని సృష్టించడానికి, మానసికంగా సన్నద్ధం చేయటానికి భాషాపరంగా మీరు ప్రయత్నం చేస్తారనటానికి మీ రచనలే ఉదాహరణలు. ఉదాహరణకి 'గాలి' కథ. ఈ కథలో భాష ద్వారా మీరు పాఠకులను ఉక్కపోతకు గురి చేశారు. కాదంటారా?**

మీకు ఒక్క విషయం మనవి చేస్తాను. నేను కథని అల్లుకునే పద్ధతిని గురించి చాలా సందర్భాల్లో వివరంగా చెప్పాను. మళ్లీ ఇపుడు దాన్ని తిరిగి చెప్పను. ఒక కథని రాయాలని అనుకోటానికీ, ఆ కథని కాగితం మీద పెట్టడానికీ మధ్య చాలా సమయం తీసుకుంటాను. నా మట్టుకు నాకు కథారచన అనేది ఒక వింత అనుభవం. అది మన మననం... ఒక ధ్యానం... ఒక ప్రక్రియ. ఒక్కమాటలో చెప్పాలంటే నేను రాయటానికి ముందే నేను ఆ కథని అనుభవిస్తాను. అనుభవించినదాన్నే అక్షరాల్లో పెడతాను. నేను అనుభవిస్తూ రాయటం వల్ల అలా అనిపిస్తుంది తప్ప నేను భాషాపరంగా పనిగట్టుకుని చేసిన ప్రయత్నం అంటూ ఏమీ లేదు. మీరు చెప్పిన 'గాలి' కథ దీనికి మినహాయింపు కాదు...

**తెలుగు భాష అంతరించిపోతుందన్న దానిపై మీ వ్యాఖ్య?**

యెనెస్కో వాళ్ల నిర్ధరణలు, కొలమానాలను అలా ఉండనీయండి.. మన ప్రమేయం లేకుండా మన మాతృభాషను ఎవరూ అంతం చేయలేరు. మనం పట్టించుకోకుండా, ఉదాసీనంగా వ్యవహరిస్తే ఏమైనా జరుగుతుంది. తెలుగు భాష దుస్థితికి ప్రధాన

### పాలుపోవడం లేదా

'పాలు' అన్నమాటకు క్షీరము, భాగము, వంతు, వశము, సమీపము అన్న నానార్థాలు ఉన్నాయి. 'పాలు'తో ఈ కింది అర్థాలని సూచించే పదాలు ఏమున్నాయో కనుక్కోండి:



1 - వృథా
2 - వేడుకోలు
3 - దిక్కుతోచక
4 - భాగస్వామ్యం
5 - సగభాగం
6. పూనుకొను

(జవాబులు 98లో...)

కారణం విలువలు లేని మన విద్యావ్యవస్థ. విద్యావ్యవస్థలో మార్పు తీసుకురాకుండా, మన ఆలోచనా విధానంలో మార్పు రాకుండా భాష పేరు మీద చేసే పనులు ప్రచార ఆర్భాటాలు తప్ప మరింకేమీ కావు... వీటివల్ల తెలుగు భాషకు వీసమెత్తు ప్రయోజనం సిద్ధించదు.

తెలుగు భాషను బతికించుకోవాలనే చిత్తశుద్ధి గనుక మీలో ఉంటే ముందు మీరు తెలుగు నేర్పు పద్ధతిని సరిదిద్దండి. గత అయిదారు దశాబ్దాలుగా తెలుగు భాషని నేర్పించే పద్ధతిని భ్రష్టు పట్టించారనే వాస్తవాన్ని గుర్తించనిదే దాని దిద్దుబాటు సాధ్యం కాదు. ఇంగ్లీషు భాషలాగ నేర్పిస్తే తెలుగు భాష రానేరాదనే నిజాన్ని తెలుసుకోవాలి. ఇంగ్లీషు అక్షరాలకు నాలుగు బడులున్నాయి. ఆ నాలుగు బడుల అక్షరాల ప్రయోగానికి సంబంధించిన ఒక పద్ధతి ఉంది. విలువలను నేర్పేది పార్లమెంట్లు, శాసనసభలు కాదు. ఆ పని సారస్వతం చేస్తుంది. సాహిత్యం చేస్తుంది. మాతృభాషని నేర్పించే క్రమంలో పిల్లల్ని సాహిత్యానికి దగ్గరగా తీసుకెళ్లాలి. సాహిత్యాన్ని పిల్లలకు బాల్యంలోనే పరిచయం చేయాలి. సాహిత్యం పట్ల పిల్లల్లో అభిరుచిని పెంచాలి. ప్రస్తుతం మనం ఆ పని చేయటం లేదు. విలువలు కోల్పోయిన విద్యావ్యవస్థ విలువలు లేని విద్యార్థుల్ని మాత్రమే ఉత్పత్తి చేయగలదు. ధనార్జనే అంతిమ లక్ష్యంగా పనిచేస్తున్న విద్యాసంస్థలు ధనాన్ని ఆర్జించే యంత్రాలను ఉత్పత్తి చేయగలవేమోగానీ ఉత్తమ విద్యార్థుల్ని ఎన్నటికీ ఉత్పత్తి చేయలేవు. విద్యావ్యవస్థలో సమూలమైన మార్పు రావాలి. విలువలతో కూడిన విద్యావ్యవస్థ తక్షణావసరం...

**మీ భాష చాలా అద్భుతంగా ఉంటుంది.**



**ఒత్తులు తెలిశే!**

తమ పిల్లలు ఒత్తులు సరిగా రాయలేకపోతే 'తలకొట్టేసినట్లుగా ఉంది' అని విసుక్కుంటారు కొందరు పెద్దలు. కానీ చాలా హల్లులకి ఒత్తులు రాయాలంటే వాటి తలకట్టు తీసేస్తే చాలు. కావాలంటే ఈ దిగువ హల్లులని గమనించండి.

గ వత్తు కావాలంటే ్గ, ద వత్తుకి ్ద... ఇలా తలకట్టు తీసివేస్తే వచ్చే ఒత్తులు ఏమున్నాయో తెల్సుకోండి చూద్దాం. మరికొన్ని హల్లులని అలాగే ఒత్తుగా ఉపయోగించడం ఉంది ఉదా॥ బ ఒత్తు కావాలంటే బ్బ, ఇలాంటి హల్లులు ఏమిటో కూడా తెల్సుకోండి.

(జవాబులు 98లో...)

ఇప్పటికీ ఆంగ్ల విద్యాబోధనలో అదే పద్ధతిని అనుసరిస్తున్నారు. అలాగే తెలుగు భాష నేర్పే పద్ధతి ఒకటి ఉంది. అది గుణింతం పద్ధతి. గుణింతాల ద్వారా తెలుగు నేర్పే పద్ధతిని వదిలేశారు. ఆంగ్లేయులు తమ అక్షరాల్లోంచి వాళ్లు దేన్నీ జార్చేసుకోలేదు... కానీ మనం...! మన వర్ణమాలలోంచి ఎన్నింటిని ఇలా వదిలేసుకున్నాం! ఇక్కడి మన శీతోష్ణస్థితికి తగిన ఉచ్చారణలతో మన పూర్వీకులు దిద్దితీర్చిన వర్ణమాల అది. అందులోని అక్షరాలను మనం ఒక్కొక్కటిగా జార్చేసుకుంటూ వెళ్తున్నాం...

సజీవమైన ఏ భాష అయినా నిరంతరం మార్పులు, చేర్పులకు లోనుకావటం సహజం. అయితే ఈ మార్పులు, చేర్పులు ఆ భాష పునాదులను మరింత పరిపుష్టం చేయాలి తప్ప బలహీన పరచకూడదు.

ఈ సందర్భంగా నేను ఒక విషయం స్పష్టం చేయాలనుకుంటున్నాను. మానవీయ

**ఇంత మంచి భాష మీకు ఎలా అబ్బింది?**

నా భాష అద్భుతంగా ఉంటుందా లేదా అన్నది పక్కన పెడదాం. నిజానికి అతి సాధారణమైన, సజీవమైన భాష నా లక్ష్యం. సాహిత్య రంగంలో, మరీ ముఖ్యంగా వచన సాహిత్యంలో కృషి చేస్తున్న వాళ్లు ఎవరైనా సరే సజీవమైన భాషను సొంతం చేసుకోవాలంటే వివిధ వృత్తులు, వివిధ జీవిత విధానాలకు సంబంధించిన, విభిన్న వర్గాలకు సంబంధించిన ప్రజల భాషను పనిగట్టుకుని వినాలి. శ్రద్ధగా ఆలకించాలి. సజీవమైన భాష మరెక్కడో ఉండదు. మన చుట్టూ ఉన్న ప్రజల దగ్గరే ఉంటుంది. అలాగే వినటం ఎంత ముఖ్యమో చదవటం కూడా అంతే ముఖ్యం. నిరంతరమైన అధ్యయనం రచయితలకు చాలా అవసరం. విభిన్నమైన కథనాలనీ, వైవిధ్యాన్నీ నిశితంగా అధ్యయనం చేయాలి. నిరంతర అధ్యయనం వల్ల కంటికీ, అక్షరానికీ మధ్య సంయోగం కుదురుతుంది. తద్వారా భాషా సంపద మనకు సొంతమవుతుంది.

**తెలుగు భాష మీదా, సాహిత్యం మీదా మీకు ఆసక్తి ఎలా పెరిగింది? అలాగే మీకు స్ఫూర్తినిచ్చిన తెలుగు రచయితలు ఎవరు?**

ప్రాథమిక దశలో అధ్యాపకులు నన్ను ఎంతగానో ప్రభావితం చేశారు. తెలుగు భాష మీద నా ఆసక్తిని పెంచిన నా తొలి ఉపాధ్యాయుడు భారతుల మార్కండేయ శర్మ. నాలుగో తరగతిలో ఉండగా ఆయన నీతి చంద్రిక చెప్పారు... "మిత్రలాభం" కథ "మగధ దేశమునందు మందారవతియను వనం కలదు" అని ప్రారంభమవుతుంది. నీతి చంద్రిక దాదాపుగా నాకు కంఠతావచ్చు. ఇది బట్టీ పట్టటం వల్ల వచ్చింది కాదు. మార్కండేయ శర్మ చెప్పిన పద్ధతి వల్ల అబ్బింది. నీతి చంద్రిక నన్ను చందమామ, బాలమిత్ర వంటి పత్రికలకేసి నడిపించింది. అక్కడి నుంచి కొవ్వలి, జంపన... ఆ తరువాత అడవి బాపిరాజు... తరువాత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చింతా దీక్షితులు, కరుణ కుమార, విశ్వనాథ సత్యన్నారాయణ... ఇలా సాగింది నా పఠనం. చాలా కాలంపాటు నేను విశ్వనాథ వారి శిష్యరికంలో ఉన్నాను. విశ్వనాథ వారి సాహిత్యం వల్ల నాకు పద స్వరూపం తెలిసి వచ్చింది. నిజానికి అధ్యయనం అనేది ఒక నిరంతరమైన ప్రక్రియ. చిన్నప్పుడు మా గురువుగారు నన్ను విరాటపర్వం చదవమన్నారు. ఎంతో భక్తి శ్రద్ధలతో విరాటపర్వం తెరిచాను... "భీష్మ ద్రోణ కృపాది ధన్వి నికరాభీలంబు..." ప్రారంభ వాక్యంతోనే బెదిరిపోయాను. చాలా కాలంపాటు దాని జోలికి వెళ్లలేదు. పెద్దయ్యాక చాలా కాలానికి విరాటపర్వం చదివాను. అప్పటికి గాని విరాటపర్వం విశిష్టత నాకు అర్థం కాలేదు. ఏదీ దానంతట అది అర్థం కాదు. మనమే అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. అవసరమైతే శ్రమించాలి. మరో ముఖ్యమైన విషయం - వచన రచయితకి భాషాలౌల్యం, పద చాపల్యం పనికిరాదు.





**ఖాదర్ మొహియుద్దీన్**
కవి, పాత్రికేయులు,
విజయవాడ. 90009 76999

# వెలుగై నిలవాలి!



సంగనభట్ల నరసయ్య

భారతదేశంలో ఏ భాషీయునికి లేని ఒక సామాజిక సమస్య తెలుగు జాతి ఎదుర్కొంటోంది. అది భాష అతి వేగంగా అంతరించి పోతోందన్న బాధ. ఇంకో రెండు దశాబ్దాలలో స్వల్ప భాషీయుల వర్గంగా, గ్రంథాల్లో మాత్రమే మిగిలేలా, చేవలేని జాతిలా మిగిలిపోనుందనేది. ప్రపంచీకరణ నేపథ్యం, ప్రజల భావదారిద్ర్యం, సంస్కృతి ప్రేమికులు కాని పాలకుల విధానాలు, అమలుకు నోచుకోని చట్టాలు, చేవ చచ్చిన భాషా సంఘాలు, బుల్లితెర, చలనచిత్రాలు మూకుమ్మడిగా తెలుగు భాషను ధ్వంసం చేస్తున్నాయి. తొలి దోషం ప్రజలదే. ఆంగ్ల దాస్యం తొలుత అధికారుల్లో ఉండేది. ఇప్పుడు పల్లెలకు పాకి, ఆంగ్లంలో నేరిస్తేనే విద్యలు డబ్బు సంపాదించి పెడతాయనే భ్రాంతిలో పేద తల్లిదండ్రులు కూడా అప్పులు చేసి, ఆంగ్ల మాధ్యమ పాఠశాలలకు పంపుతున్నారు. ఆంగ్లం వస్తే ముందర ఉద్యోగాలు వస్తాయనే వీరికి ఆంగ్ల మాతృభాషీయ దేశాల్లో నిరుద్యోగ భూతం తాండవమాడుతోందని తెలియదు. సోదర కన్నడ, తమిళ రాష్ట్రాల్లో, స్థానిక భాషను (మాతృభాషను) తిరస్కరిస్తే జరిమానాలు. ప్రజలంతా తిరగబడతారు. అక్కడ ఏ పార్టీ అయినా వారి విధాన పత్రాల్లో (మానిఫెస్టోల్లో) భాషాభివృద్ధికి పెద్దపీట. మన రాష్ట్రంలో తెలుగులో ఉత్తర్వులుండవు. అధికారులు తెలుగు రాకనో, ఆంగ్లం నిరంతరం వాడటం వల్లనో గ్రామస్థాయి సభల్లో ఆంగ్లం వాడతారు. 'సిక్సోక్లాక్'కు వస్తానంటాడు. ఆరు గంటలకు వస్తాననవచ్చుగా. 'పే' చేసి, 'రిజిష్టర్' చేసికొని, 'వెయిట్' చేసి, తరువాత 'రిఫండ్' కోసం 'క్లెయిమ్' చేసుకోవాలని ఓ అధికారి జవాబు. ఎన్ని క్రియా పదాలు? వ్యాపార సంస్థల నామ ఫలకాలపై తెలుగు ఉండదు. కనీసం ప్రభుత్వ స్థాయిలో అనుమతి రద్దు లేదా జరిమానాలు వేస్తామంటే అమలు చేస్తారుగా. ప్రజా రవాణ సంస్థల్లో కొంత మెరుగే. పల్లెల్లో నిరక్షరాస్యులు గమ్యం గురించి నాడు అడిగేవారు. నేడు ఇంగ్లిషులో ఉంటే అడుగుతున్నారు. రేపు తెలుగులో ఉంటే విద్యావంతులే బస్సు ఎక్కడికి వెళుతుందని అడుగుతారు. ఆది నుంచి ఆంగ్ల మాధ్యమంలో చదివిన తరం రాబోతోంది గదా. కర్ణాటక రవాణ సంస్థ బస్సులో ప్రయాణిస్తున్న నేను బస్సులో తెలుగు సినిమా వెయ్యమన్నాను. కన్నడ హద్దులు దాటి అనంతపురం జిల్లాలో ప్రవేశించే వరకు కన్నడేతర చిత్రాలు ప్రదర్శిస్తే కన్నడ ప్రభుత్వం జరిమానా వేస్తుందని వచ్చిన జవాబు నన్ను నిర్ఘాంతపరిచింది. తెలుగు నేల మీద, ఒక్క రోజైనా బళ్లో తెలుగు మాట్లాడకుండా డిగ్రీ చదవగలిగే దౌర్భాగ్యం ఈ దేశంలో ఒక్క తెలుగు రాష్ట్రంలోనే ఉంది. కంటికి విష కీటకం కుట్టి, కన్నువాచి, తన బాధ ఆంగ్లంలో పంతులమ్మకు చెప్పలేక, తెలుగులో చెపితే అదనంగా దెబ్బలు తినే దౌర్భాగ్య స్థితి ఒక్క తెలుగమ్మాయికే తెలుగు నేలపై ఆంగ్ల మానస పుత్రుల బడిలో ప్రపంచం మొత్తంపై జరిగిన అపురూప సందర్భం. చేవలేని తెలుగు జాతికే ఇది సొంతం. తమిళ, కన్నడ, మరాఠీ రాష్ట్రాల్లో స్వీయ భాషల ప్రోత్సాహం ఆదర్శవంతం. తెలుగుపై తెలుగువారికి ప్రేమ ఉంటే మిగతా భారత దేశానికి ఏమైనా అభ్యంతరమా? ఎవరిని చూసి భయపడుతున్నాం? తిరుపతిలో కృష్ణరాయల విగ్రహాన్ని ఆవిష్కరించి, తరువాత ఆ సభలో రాయలు తెలుగవాడు కాదన్న నాయకుల మానసిక స్థితిని ఏమందాం? ఇతర రాష్ట్రాల్లో భాషాభివృద్ధికి ప్రత్యేక మంత్రిత్వ శాఖలుంటే మనం సాంస్కృతిక వ్యవహారాలు, గ్రంథాలయాల మంత్రిత్వశాఖలకు అనుబంధంగానైనా తెలుగు బాషాభివృద్ధి శాఖ అదనపు బాధ్యతగా పెట్టుకొని బాషాభివృద్ధికి పనిచేయలేని స్థితి ఉందా? తెలుగు వేషంలో కానీ, భాషలో కానీ ప్రదర్శించని బుల్లితెర కార్యక్రమాలు, పేర్లు కూడా తెలుగులో దొరకని విష సంస్కృతి వ్యాపింపజేసే వెర్రి సినిమాలు కొంత మేరకు తెలుగును చంపే బాధ్యతను తమవంతు కృషిగా కొనసాగించడం లేదా? కొంతవరకు ముద్రణా మాధ్యమం నయం. తెలుగును బతికించుకొంటోంది. కొత్త తెలుగు పదాలు, కొత్త వ్యక్తీకరణలు, కొత్త సమాసాలు (సంస్కృతాన్ని ఆశ్రయించైనా సరే) ప్రజలకు పరిచయం చేస్తున్నాయి. తెలుగును ఇలా అన్ని వైపుల క్షీణింపచేసే పనిలో అందరూ ఉన్నా ప్రభుత్వం పాత్ర పెద్దదే. నాలుగు దశాబ్దాల కిందట ప్రపంచ తెలుగు మహాసభలు జరిపినప్పుడు ఉన్న తెలుగు వాతావరణం ఇప్పుడు లేదు. ఇరవై ఐదు కోట్లు కాదు రెండు వందల యాభై కోట్ల రూపాయలు ఖర్చు చేసి తెలుగులో సభలు పెట్టినా, భాష, చరిత్ర, కళలు, సంగీతం లుప్తమై పోతుంటే సభల్లో పాల్గొనేదెవరు? మొన్న పాల్గొన్నదెవరు? ఎవరు శ్రోతలు, ప్రేక్షకులుగా ఉంటారు? ఇప్పటికే చాలా సభల్లో ఐదు వదుల వయసు దాటిన ప్రౌఢులే, వృద్ధులే ఉంటున్నారు. యువతకు ప్రాతినిధ్యం లేదు. ఈ విధ్వంసం ఇలాగే కొనసాగితే తెలుగు వెలుగు తగ్గడానికి ఇరవై ఏళ్లు కూడా ఎక్కువే. ప్రభుత్వం ఇకనైనా కళ్లు తెరవాలి. చట్టాలు, సభలు, నిర్వహణ, ప్రభుత్వం యంత్రాంగం తెలుగులో కావాలి. 'ఏ దేశమేగినా, ఎందు కాలిడినా' అన్నట్లు ఏ గడ్డపైనైనా (ఆఖరుకు ఢిల్లీ సభల్లో) తెలుగు మాత్రమే మాట్లాడాలి. పాఠశాల స్థాయిలో మాతృభాషలోనే అన్ని సబ్జక్టులకు విషయ బోధన జరిపి, సమర్థులైన విద్యార్థులను మలచాలి. తెలుగును పరిహరించే బడులను నిర్దాక్షిణ్యంగా రద్దుచేయాలి. తెలుగు సాహిత్య భాషా బోధనలో ఎనలేని కృషిని ఆచరిస్తూ అంతరించనున్న ప్రాచ్య కళాశాలల అభివృద్ధికి కృషి చేయాలి. తెలుగును ఆదరించని అధికారులకు శిక్షలు ఉండాలి. తెలుగు భాషను బోధించే అధ్యాపకులకు శిక్షణ తరగతులు ఏటా నిర్వహించాలి. భాష లేకుండా సంస్కృతి, కళలు, చరిత్ర, కవులు, చరిత్ర నిర్మాతలు, వేషభాషలు, ఆచార వ్యవహారాలు ఏమీ మిగలవు. మూడువేల సంవత్సరాల సగర్వ సంస్కృతీ, చరిత్రగల భారతదేశపు అత్యుత్తమ తెలుగు జాతి, వందల సంవత్సరాల చరిత్రలేని జాతుల కంటే వెలుగులు తగ్గవద్దు. తెలుగు వెలుగై నిలవాలి.



# గురువులు కావాలంటే గురి కుదరాలి



మూలాలపై శ్రద్ధ పెట్టి పాఠ్యాంశాలను సునిశితంగా అధ్యయనం చేసినప్పుడే ఏ పోటీ పరీక్షల్లోనైనా విజయం సాధించగలం. తెలుగు భాషా పండితులు, ఆదర్శ పాఠశాలల పీజీ తెలుగు ఉపాధ్యాయులు, ఆదర్శ పాఠశాలల తెలుగు ఉపాధ్యాయుల నియామకాలకు ప్రభుత్వం సంసిద్ధమవుతున్న తరుణంలో... అభ్యర్థులు ఏయే అంశాలపై, ఎంత మేరకు దృష్టి కేంద్రీకరించాలో వివరించే ప్రయత్నమిది.

తెలుగు చదివిన విద్యార్థులంటే ఉద్యోగ అవకాశాలు లేక ఆత్మన్యూనతతో తలవంచుకొన్న పరిస్థితి ఒకనాటిది. ఎంఏ తెలుగు పూర్తి చేశామంటే తల ఎత్తుకొని ఆత్మవిశ్వాసంతో ముందుకెళ్తున్న రోజులివి. కేంద్రప్రభుత్వంలో అత్యున్నత స్థాయి ఉద్యోగాల నుంచి, రాష్ట్ర ప్రభుత్వ గ్రామకార్యదర్శి ఉద్యోగాల వరకూ తెలుగు చదువుకున్న అభ్యర్థుల హవా కొనసాగుతున్న సందర్భమిది. తెలుగు మాధ్యమంలో చదువుకొన్న వారే కాదు తెలుగు సాహిత్యాన్ని అధ్యయనం చేసిన అభ్యర్థులందరూ ఏదో ఒక ఉద్యోగంలో చేరడానికి అనుకూలమైన పరిస్థితులున్నాయి.

ఇటీవల వరకు ప్రభుత్వం నిర్ణయించిన పాఠ్యాంశాన్ని, సమగ్రంగా చదివితే తెలుగు పండితుల ఉద్యోగాన్ని సొంతం చేసుకోవడం చాలా సులభంగా ఉండేది. కానీ గతేడాది మారిన పాఠ్యాంశాలను చూసి అభ్యర్థులు బెంబేలెత్తిన మాట వాస్తవం. అనుకున్నట్లుగానే 2012 డీఎస్సీ ప్రశ్నపత్రాలు తెలుగు అభ్యర్థులను తికమక పెట్టాయి. మన తెలుగే కదా! అని గతంలోలాగా సాదాసీదాగా చదివిన అభ్యర్థులకు చుక్కలు కనిపించాయి. తెలుగు భాషా సాహిత్యాల్లో ఇంతలోతు ఉందా? అనే ఆశ్చర్యానికి గురి చేశాయి.

ఈ డీఎస్సీతో పాటు ప్రభుత్వం ప్రారంభించిన ఆదర్శ పాఠశాలల్లో తెలుగు ఉపాధ్యాయుల కోసం నిర్వహించిన పరీక్ష పత్రంలోని కొన్ని ప్రశ్నలకు తలపండిన విశ్లేషకులు కూడా స్పష్టమైన సమాధానాలు సూచించలేని పరిస్థితి. అయితే దీనికి కారకులు పాఠ్యాంశం రూపొందించిన వారు కానీ, ప్రశ్నపత్రాలు సిద్ధం చేసిన వారు కానీ ఏ మాత్రం కాదు. పాఠ్యాంశాలను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయిన అభ్యర్థులే ఈ పరీక్షల్లో విఫలమయ్యారు.

**2012 డీఎస్సీ, ఆదర్శ పాఠశాలల పరీక్ష రాసిన వారి సమస్యలు:**

కొన్ని సంవత్సరాలుగా ఉన్న ఒకే రకమైన పాఠ్యాంశాలు, ప్రశ్నపత్రాల నమూనా ఒక్కసారిగా నెలల వ్యవధిలో మారిపోయింది. తెలుగు పాఠ్యాంశాలు ఒక్కొక్క పరీక్షకు ఒక్కొక్క విధంగా నిర్ణయించారు. ఆయా పాఠ్యాంశాలు, వివిధ అధ్యాయాల్లో ఉన్న సమాచారం ఏ పుస్తకాల్లో దొరుకుతుందో కూడా చాలామంది అభ్యర్థులకు తెలియలేదు. ఎందుకంటే పరీక్ష రాసే అభ్యర్థులందరూ విశ్వవిద్యాలయాల్లో నేరుగా ఎంఏ తెలుగు చదివినవారు కాదు. దూరవిద్య ద్వారానో, స్వతంత్ర విద్య ద్వారానో డిగ్రీలు పూర్తి చేసినవారు. అందువల్ల వారికి సిలబస్‌లో శీర్షికలే కొత్తగా అనిపించాయి. తీరా సంబంధిత పుస్తకాలు సమకూర్చుకొనేసరికి పరీక్ష తేదీలు దగ్గరపడ్డాయి. అందువల్ల తెలివైన అభ్యర్థులు కూడా తెలుగు భాషా సాహిత్యాలపై

లోతైన అవగాహన లేక విజయానికి దూరమయ్యారు. అందుకే ఈ పరీక్షలకు ఎలా సిద్ధం కావాలో తెలుసుకుందాం.

**డీఎస్సీ సిలబస్ మారితే!**

ఇటీవల ప్రభుత్వం నిర్దేశించిన డీఎస్సీ పాఠ్యాంశాలను కూడా మార్చి టెట్, డీఎస్సీ రెండింటినీ కలిపి 'టెస్ట్' పేరుతో సరికొత్త పరీక్ష విధానాన్ని తెచ్చేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయని వార్తలు వస్తున్నాయి. అయితే అభ్యర్థులు గమనించాల్సిన విషయం ఏమంటే పరీక్ష తత్వం మాత్రం మారదు. కాలం మారింది. మూస ప్రశ్నలకు కాలం చెల్లింది. అభ్యర్థుల మేధస్సును పరీక్షించడానికి ప్రశ్నపత్రంలో అనేక మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ప్రశ్నకు సమాధానం ఒక్కటే ఉన్నప్పటికీ, మిగిలిన ఐచ్ఛిక సమాధానాలు పరిశీలించాకే కచ్చితమైన సమాధానాన్ని గుర్తించాలి. దీనికోసం తెలుగు పరీక్షకు సిద్ధమయ్యే అభ్యర్థులు పాఠ్యాంశంలోని అన్ని కోణాలను లోతుగా చదవాల్సిన అవసరం ఉంది.

ప్రభుత్వం త్వరలో భారీ ఎత్తున ఉపాధ్యాయ ఉద్యోగాలు భర్తీ చేస్తోందని వార్తలు వస్తున్నాయి. ఈ నేపథ్యంలో గతేడాది జరిగిన తెలుగు ఉపాధ్యాయుల పరీక్షలను విశ్లేషించుకొని భవిష్యత్తులో ఎలా ముందుకెళ్లాలో తెలుసుకుందాం!

**గత సంవత్సరం తెలుగు అధ్యాపకుల పరీక్షల ప్రశ్నపత్రాల విశ్లేషణ**

**అ) పాఠశాల తెలుగు సహాయకులు**

2012 డీఎస్సీ పాఠ్యాంశంలో మొదటి రెండు విభాగాలు అభ్యర్థులందరికీ సాధారణమైనవే. మూడో విభాగం (44 మార్కులు), నాలుగో విభాగం (16 మార్కులు) మాత్రం తెలుగు అభ్యర్థులకు సంబంధించినవి. మూడో విభాగంలో పది అధ్యాయాలున్నాయి.

1. కవులు - రచయితలు - కావ్యాలు - రచనలు, 2. ప్రక్రియలు - లక్షణాలు - వివరణలు, 3. ఆధునిక సాహిత్యం - ధోరణులు; ఉద్యమాలు - జానపద సాహిత్యం, 4. తెలుగు భాషా సాహిత్యాలపై ఇతర భాషా సాహిత్యాల ప్రభావం., 5. భాషా రూపాలు

6. సాహిత్య విమర్శ, 7. భాషాంశాలు, 8. భాష - సమాజం - సంస్కృతి పరస్పర ప్రభావాలు, 9. అనువాదం - ఆవశ్యకత - రీతులు, 10. పఠనావగాహనం

అలాగే నాలుగో విభాగంలో తెలుగు భాషా బోధనకు సంబంధించి ఆరు అధ్యాయాలు ఉన్నాయి అవి.

1. భాష - వివిధ భావనలు, 2. భాషా నైపుణ్యాలు, 3. ప్రణాళిక రచన - పాఠ్య గ్రంథాలు, 4. విద్యా సాంకేతిక శాస్త్రం - సహ పాఠ్య కార్యక్రమాలు, 5. సాహిత్య ప్రక్రియలు - బోధన పద్ధతులు, 6. మూల్యాంకనం - పరీక్షలు

ఈ పాఠ్యాంశాలను క్షుణ్ణంగా చదివి, మస్తిష్కంలో బంధించిన అభ్యర్థి మాత్రమే ప్రశ్నాపత్రానికి సరైన సమాధానాలు ఇవ్వగలడు. 2012 డీఎస్సీ ప్రశ్నపత్రంలో భాషాశాస్త్రంపై ఎక్కువ ప్రశ్నలు వచ్చాయి. దానికి కారణం నాలుగో అధ్యాయం నుంచి తొమ్మిదో అధ్యాయం వరకు అన్నీ తెలుగు భాషకు సంబంధమున్న అంశాలను కలిగి ఉన్నాయి. వీటిపై మంచి అవగాహన ఉన్న అభ్యర్థి విజయం సాధించాడు. కాబట్టి ఇకనుంచి అభ్యర్థులు తెలుగు భాషా విషయాలపై దృష్టిపెట్టాల్సిన అవసరం ఉంది.

**భాషపై వచ్చిన ఒక ప్రశ్నకు ఉదాహరణ**

**ప్రశ్న:** 'ప్రాణ సమానుండవైన చెలివి' అనే శాసన ప్రయోగం

1. నామవాచకం మీద ఉత్తమ పురుష ఏకవచన ప్రత్యయం చేరింది, 2. నామవాచకం మీద ప్రథమ పురుష ఏకవచన ప్రత్యయం చేరింది, 3. నామవాచకం మీద ప్రథమ పురుష బహువచన ప్రత్యయం చేరింది, 4. నామవాచకం మీద మధ్యమ పురుష ఏకవచన ప్రత్యయం చేరింది. (జవాబు: 4)

**వివరణ:** మంచి స్థాయి కలిగిన పాఠ్య పుస్తకాలను చదవడం వల్ల తెలుగులో మూడు రకాలైన పురుషలు ఉంటాయనీ, 'నీవు', 'మీరు' వంటి సర్వనామాలతో కూడి మధ్యమ పురుష ప్రత్యయాలనీ తెలిసిన అభ్యర్థి మాత్రమే ఈ సమాధానం రాయగలడు. 'చెలివి' అనేది మధ్యమ పురుష ఏకవచన ప్రత్యయంగా అర్థం చేసుకొని సరైన సమాధానాన్ని గుర్తించగలడు. ఇలాంటి ప్రశ్నలన్నింటికీ సమాధానం విశ్లేషణాత్మకమైన అధ్యయనం చేయడమొక్కటే మార్గం.

**ఆ) తెలుగు భాషా పండితులు (ఎల్.పి. తెలుగు)**

2012 డీఎస్సీ పాఠ్యాంశాల్లో I, II అందరికీ సమానం కాగా, III విభాగం (44 మార్కులు), IV విభాగం (16 మార్కులు) మాత్రం తెలుగు అభ్యర్థులకు సంబంధించినవి. III విభాగంలో మొత్తం ఏడు అధ్యాయాలున్నాయి.

1. కవులు - రచయితలు - కావ్యాలు - రచనలు, 2. ప్రక్రియలు - లక్షణాలు - వివరణలు, 3. ఆధునిక సాహిత్యం - ధోరణులు - ఉద్యమాలు - జానపద సాహిత్యం, 4. తెలుగు భాషా సాహిత్యాలపై ఇతర భాషా సాహిత్యాల ప్రభావం, 5. భాషా రూపాలు, 6. భాషాంశాలు, 7. పఠనావగాహనం

IV విభాగంలో భాషా బోధనకు సంబంధించిన ఆరు అధ్యాయాలు ఉన్నాయి.

ఈ పాఠ్యాంశాల్ని చదివి పరీక్షలకు సిద్ధమయ్యే అభ్యర్థి, తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించి సంపూర్ణమైన అవగాహన కలిగి ఉండాలని గత ప్రశ్నపత్రాన్ని చూస్తే అర్థమవుతుంది. సాహిత్య చరిత్ర నుంచి వచ్చిన ప్రశ్నకు ఉదాహరణ:-

**ప్రశ్న:** 'ఈ దేశం క్యాలెండర్లపై తారీఖులా' అని ప్రకటించింది.

1. దిగంబర కవులు, 2. అభ్యుదయ కవులు, 3. స్త్రీవాద రచయిత్రులు 4. విప్లవ కవులు (జవాబు: 1)

**వివరణ:** సాధారణంగా పోటీ పరీక్షల్లో ఈ గ్రంథాన్ని ఎవరు రాశారు? ఆ బిరుదు ఏ కవిది? అనే స్థాయిలో తక్కువ ప్రశ్నలు ఉంటున్నాయి. ఏదైనా పద్యపాదాన్నిగానీ, కవితా ఖండికలోని పంక్తినిగానీ ఉదహరించి ఎవరు రాశారో కనుక్కోమని అడగడం ఇటీవల ప్రశ్నపత్రాల్లో కనిపిస్తుంది. అలాంటి కోవకు చెందినదే ఈ ప్రశ్న. దిగంబర కవులు నెలల్ని, రుతువుల్ని, తమ పేర్లను మార్చి సరికొత్త పేర్లను ప్రకటించారు. ఆ సందర్భంలో చెప్పిన వాక్యాన్నే ఈ ప్రశ్నగా ఇవ్వడం జరిగింది. దిగంబర

**శరత్ నవలలు**



మంచి సాహిత్యం ఎక్కడున్నా ఆదరించడం మన సంప్రదాయం. ఇదే కోవలో ప్రసిద్ధ బెంగాలీ రచయిత శరత్ చంద్ర చటర్జీ నవలలు కొన్నింటిని తెలుగు చిత్రాలుగా తీర్చిదిద్దారు. ఈ కింద ఇచ్చిన మాతృకలని బట్టి రూపొందిన చలనచిత్రాలను కనుక్కోండి!

మాతృక నవల
1 - విప్రదాస్
2 - దేవదాస్
3 - స్వయంసిద్ధ
4 - నిష్కృతి
5 - బడదీది
6 - దత్త

(జవాబులు 98లో...)

సాహిత్యంపై సంపూర్ణ అవగాహన ఉంటేనే ఈ ప్రశ్నకు సమాధానం రాయగలం. సాహిత్యంలో ఇలాంటి లోతైన ప్రశ్నలకు అభ్యర్థులు సిద్ధమై ఉండాలి.

**ఇ) ఆదర్శ పాఠశాలల పీజీ తెలుగు ఉపాధ్యాయులు:**

2012లో తొలిసారిగా ఈ ఉపాధ్యాయుల కోసం ప్రభుత్వం పరీక్ష నిర్వహించింది. ఈ పరీక్ష కోసం నిర్ణయించిన పాఠ్యాంశాలలో I, II, III, IV విభాగాలు అందరికీ సమానం కాగా, V, VI విభాగాలు మాత్రం పీజీ తెలుగు ఉపాధ్యాయులకు సంబంధించినవిగా ఉన్నాయి. Vవ విభాగంలో (48 మార్కులకు) 10 అధ్యాయాలు పాఠ్యాంశంగా ఉన్నాయి.

1. తెలుగు భాషా పరిణామ చరిత్ర, 2. గ్రాంథిక, వ్యావహారిక భాషావాదాలు - వివిధ భాషా రూపాలు, 3. ప్రాచీన, ఆధునిక కవులు - కావ్యాలు, 4. శతక ప్రక్రియ - శతక సాహిత్య వికాసం - వివిధ శతకాలు, కర్తలు
5. జానపద సాహిత్యం - వివిధ ప్రక్రియలు - జానపద విజ్ఞానం, కళలు, 6. తెలుగు సాహిత్య ప్రక్రియలు, 7. వివిధ రాజులు - సాహిత్య పోషణ - సాంస్కృతిక వికాసం, 8. సాహిత్య విమర్శ, 9. భాషాంశాలు, 10. అనువాదం

VI వ విభాగంలో (12 మార్కులు) తెలుగు బోధనా పద్ధతుల పాఠ్యాంశాలున్నాయి. అందరు తెలుగు అభ్యర్థులకు వలె ఉన్నాయి.

ఈ పాఠ్యాంశం నుంచి గత ప్రశ్నా పత్రంలో ఇచ్చిన ఒక ప్రశ్నకు ఉదా:

**ప్రశ్న:** పంచ సంధులుండే రూపక భేదాలు
1. నాటక, ప్రకరణాలు, 2. డిమ, సమవాకారాలు, 3. వ్యాయోగ, ఈహామృగాలు 4. భాణ, ప్రహసనాలు

**వివరణ:** ఈ ప్రశ్న నిర్దేశించిన నాటకం అనే పాఠ్యాంశ విభాగం నుంచి ఇచ్చారు. అభ్యర్థులు నాటకాన్ని గురించి చదివేటప్పుడు నాటక నిర్వచనం, లక్షణాలు, తెలుగులో వచ్చిన ప్రసిద్ధ నాటకాలకు మాత్రమే పరిమితమవుతారు. నాటక సాహిత్యానికి కొనసాగింపైన దశరూపకాలను, ఆ రూపకాలలో ఉండే ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణ సంధుల గురించి లోతుగా చదవరు. ఆ కోణం నుంచి చదివిన అభ్యర్థులు మాత్రమే ఇలాంటి క్లిష్టమైన ప్రశ్నలకు సమాధానం రాసి ఉద్యోగం పొందుతున్నారు.

**ఈ) ఆదర్శ పాఠశాలల తెలుగు ఉపాధ్యాయులు (1 నుంచి 8 తరగతుల వరకు)**

2012లో తొలిసారిగా ఈ ఉపాధ్యాయుల కోసం ప్రభుత్వం పరీక్ష నిర్వహించింది. ఈ పరీక్ష కోసం నిర్ణయించిన పాఠ్యాంశాల్లో I, II విభాగాలు అందరికీ సమానం కాగా III, IV విభాగాలు మాత్రం తెలుగు ఉపాధ్యాయులకు సంబంధించినవి. III వ విభాగంలో (44 మార్కులు) ఎనిమిది అధ్యాయాలు పాఠ్యాంశంగా ఉన్నాయి.

1. ప్రాచీన, ఆధునిక కావ్యాలు, 2. తెలుగు సాహిత్య వికాసం (గద్యం) - వివిధ ప్రక్రియలు 3. వివిధ భాషా రూపాలు, 4. తెలుగు భాషా సాహిత్యంపై ఇతర భాషల ప్రభావం, 5. సాహిత్య విమర్శ, 6. భాషాంశాలు, 7. అనువాదం, 8. పఠనావగాహనం

IVవ విభాగంలో (16 మార్కులు) తెలుగు బోధనా పద్ధతుల పాఠ్యాంశం అందరు తెలుగు అభ్యర్థులకు వలె ఉన్నాయి.

ఈ పాఠ్యాంశాల నుంచి గత ప్రశ్నపత్రంలో వచ్చిన ఒక ప్రశ్న:

**ప్రశ్న:** 'సావిత్రి', 'శశిరేఖ' అనే చలం



## వ్యర్థపదాలు కాదు శబ్దపదాలు



కొన్ని పదాలు శబ్దాలని బట్టి పుడతాయి. ప్రత్యేకించి అర్థమేమీ లేకున్నా, భావానికి బలం చేకూర్చడానికి వీటిని ఉపయోగిస్తాం. ఉదాహరణకి ఇక్కడ కొన్ని వాక్యాలను ఇచ్చాం. వీటికి అనుబంధంగా తరచూ వాడే పదాలనూ ఇచ్చాం. దేనికేవి తగినవో గుర్తించండి..

.......... గంటలు, ..........నిప్పులు,

చినుకులు .........., పళ్లు ..........,

.......... నవ్వులు, .......... గువ్వలు,

.......... కృష్ణమ్మ, .......... గోదారి,

.......... అడుగులు, .......... మంటలు,

.......... చూపులు, .......... నడకలు.

(కువకువ, కణకణ, చరచర, బిరబిరా, చిటపట, భగభగా, పకపక, పటపటా, గణగణ, గబగబా, గలగలా, చురచుర)

(జవాబులు 98లో...)

రచనలు ఈ ప్రక్రియలకు చెందినవి
1. నాటకం, కథ, 2. నాటిక, నవల, 3. కవిత్వం కథానిక, 4. నవల, అనువాదం
(జవాబు: 2)

**వివరణ:** అభ్యర్థులు ఒక రచయితకు సంబంధించిన సమాచారాన్ని చదివేటప్పుడు ఏయే రచనలు, ఏ ప్రక్రియల్లో రాశాడని స్పష్టంగా గుర్తుంచుకోవాలి. ముఖ్యంగా ఆధునిక కవులైన కందుకూరి, గురజాడ, విశ్వనాథ, శ్రీశ్రీ, చలం వంటివారు అనేక ప్రక్రియలను స్పృశించారు. అందుకే వివరంగా అధ్యయనం చెయ్యాలి. చలం కూడా కథలు, నవలలు, నాటికలు, మ్యూజింగ్స్ వంటివి రాశాడు. వాటిలో 'శశిరేఖ' నవల అని తెలిసినా జవాబును స్పష్టంగా గుర్తించవచ్చు.

ఈ విధంగా తెలుగు ఉపాధ్యాయ పరీక్షల్లో విజయం సొంతం చేసుకోవాలని తపనపడే అభ్యర్థులు నిర్దిష్టమైన ప్రణాళికతో, విశ్లేషణతో, వివేచనతో చదవాల్సిన అవసరాన్ని ఈ ప్రశ్నపత్రాలు గుర్తు చేస్తున్నాయి. అలాగే అభ్యర్థులు ఈ పరీక్షలకు సిద్ధమయ్యేటప్పుడు ఈ కింది ప్రసిద్ధ గ్రంథాలను తప్పకుండా చదవాలి.

**ఉపకరించే గ్రంథాలు**

1. తెలుగు సాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మీకాంతం, 2. తెలుగు సాహిత్య సమీక్ష - జి.నాగయ్య, 3. సమగ్రాంధ్ర సాహిత్యం - ఆరుద్ర, 4. ఆంధ్ర సంస్థానాలు - సాహిత్య పోషణ - తూమాటి దొణప్ప, 5. తెలుగు సాహిత్య కోశం - తెలుగు అకాడమీ, 6. ఆధునికాంధ్ర కవిత్వం- సంప్రదాయాలు - ప్రయోగాలు - సి.నారాయణరెడ్డి, 7. తెలుగు కవితా వికాసం - కడియాల రామమోహన్‌రాయ్, 8. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు, 9. ఆధునిక ఆంధ్ర కవితా సమీక్ష - కె.వి.ఆర్.నరసింహం, 10. సాహిత్య శిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం, 11. సాహిత్య సోపానాలు - దివాకర్ల వేంకటావధాని, 12. సాహిత్య విమర్శ సిద్ధాంతాలు - వెలమల







సిమ్మన్న, 13. సాహిత్య దర్శనం - కె.వి.ఆర్.నరసింహం, 14. తెలుగు జానపద గేయ సాహిత్యం - బి.రామరాజు, 15. ఆంధ్రుల జానపద విజ్ఞానం - ఆర్.వి.ఎస్.సుందరం, 16. తెలుగు భాషా చరిత్ర - భద్రిరాజు కృష్ణమూర్తి, 17. ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు - పి.ఎస్.సుబ్రహ్మణ్యం, 18. ద్రావిడ భాషలు - పి.ఎస్.సుబ్రహ్మణ్యం
19. ఆంధ్ర భాషా వికాసం - గంటి జోగిసోమయాజి,
20. తెలుగు వాక్యం - చేకూరి రామారావు,
21. తెలుగు భాషా చరిత్ర - వెలమల సిమ్మన్న

**పరీక్షల సమయం**

ఆంధ్రప్రదేశ్‌లోనూ, ఇతర రాష్ట్రాలలోనూ ఎం.ఏ. తెలుగు వివిధ విశ్వవిద్యాలయాల్లో చదవాలనుకునే విద్యార్థులకు ప్రవేశ పరీక్షలు దగ్గరపడుతున్న తరుణమిది. మన రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలకు మూడు ప్రాంతీయ కేంద్రాల పరిధిలో ప్రవేశ పరీక్షలు జరుగుతున్నాయి. ఉస్మానియా, ఆంధ్రా, శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయాల పరిధుల్లో ఉన్న మిగిలిన విశ్వవిద్యాలయాలు కూడా ఆ మూడు విశ్వవిద్యాలయాలతో కలిసి ప్రాంతీయంగా ప్రవేశ పరీక్షలను నిర్వహిస్తున్నాయి. ఎం.ఏ తెలుగు చేరే అభ్యర్థులందరూ 100 మార్కుల ఐచ్ఛిక ప్రశ్నలు గల ప్రశ్నపత్రానికి సమాధానాలు రాయాలి. ఈ ప్రశ్నలన్నీ తెలుగు సాహిత్య చరిత్ర, తెలుగు భాషా చరిత్ర, జానపద సాహిత్యం, తెలుగు వ్యాకరణం, సాహిత్య విమర్శ - ఆలంకారిక శాస్త్రం, సంస్కృత సాహిత్య చరిత్ర, వ్యాకరణం వంటి అంశాలకు లోబడి ఉంటాయి. ఈ ప్రవేశ పరీక్షకు హాజరయ్యే అభ్యర్థులందరూ మంచి ర్యాంకులు పొందాలన్నా, విశ్వవిద్యాలయాల ప్రవేశం పొందాలన్నా పై ఆధార గ్రంథాలను చదవాల్సిన అవసరం ఉంది.





**డా॥ పి.సి.వెంకటేశ్వర్లు**
సహాయ ఆచార్యులు
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి. 94901 64963



## శాంతిపథం

గ్రాంథిక పండిత ఛాందస హృదయాల
దడపుట్టజేసిన పిడుగు- గిడుగు
ఘనమైన మన తెనుంగునకు సజీవత్వ
మిడినట్టి మొదటి ముందడుగు- గిడుగు
గ్రాంథిక వ్యవహార ప్రామాణికత్వాల
మహనీయతకు పెద్దమడుగు- గిడుగు
జాతిచేతన మంద సవరించి కీర్తిని
కురియించు వెన్నెల గొడుగు- గిడుగు

భాషకలనేత చీరయై వరలెనేని
పడుగు- పేకల మేలైన తొడుగు- గిడుగు
దెసలదెసలను నిండుచో తెలుగు వెలుగు
అసలయిన శాంతి గిడుగుకు అపుడె కలుగు

**డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ**
విశ్రాంత అధ్యాపకుడు, గుంటూరు
98669 44287

# అలుపెరగని అక్షర నేస్తాలు

**తల్లిదండ్రులు ఇచ్చిన జీవితాన్ని అర్థవంతంగా మార్చుకునే కళను నేర్పేది ఉపాధ్యాయులే. అందుకే, అమ్మానాన్నలకంటే గురువులే పూజనీయులని అంటాడు అరిస్టాటిల్. ఈ గ్రీకు తత్వవేత్త మాటల్లోని సత్యానికి సజీవ రూపాలుగా నిలుస్తున్నారు కోట పురుషోత్తం, సాకం నాగరాజ.**

నిపుణుడైన స్వర్ణకారుడి చేయి తగిలితేనే పుత్తడి... నాణ్యమైన నగై మెరుపులీనుతుంది. చిన్నారులూ అంతే. లాలిస్తూ...ఆటలాడిస్తూ... బట్టీ సిగపట్లకు దూరంగా, అతి తేలికైన - ప్రభావవంతమైన పద్ధతిలో చదువును, మానవీయ విలువలను నేర్పించే గురువు శిష్యరికంలో ఎదిగిన పిల్లలే... భావి భారతానికి నిజమైన కాపలాదారులు అవుతారు. దురదృష్టవశాత్తూ మన విద్యా విధానం ఇందుకు సహకరించదు. ఇరుకైన గోడల మధ్య కిక్కిరిసిన తరగతి గదిలో ర్యాంకులే పరమావధిగా సాగే ఉరుకుల పరుగుల చదువులు.. చిన్నారులపై విపరీతమైన ఒత్తిడిని కలిగిస్తున్నాయి. విద్యార్థుల మనోబలాన్ని దెబ్బతీస్తున్నాయి. నిస్తేజమైన నవతరాన్ని తయారు చేస్తున్నాయి. ఈ పరిస్థితిలో మార్పు తీసుకురావడానికి, ఆత్మవిశ్వాసపు పునాదులపై భవితను బంగారుమయం చేసుకునేలా విద్యార్థి లోకాన్ని చైతన్యమయం చేయడానికి నిరుపమాన కృషి చేస్తున్నారు చిత్తూరు జిల్లాకు చెందిన ఇద్దరు అధ్యాపక మిత్రులు. వారే కోట పురుషోత్తం, సాకం నాగరాజ.

వ్యక్తిత్వ వికాసానికి దోహదపడే అచ్చ తెలుగు సాహిత్యాన్ని చిన్నారులకు అర్థమయ్యే స్థాయిలో తిరగరాస్తూ పుస్తకాలను ప్రచురిస్తున్నారు ఈ అక్షర నేస్తాలు. రాష్ట్రవ్యాప్తంగా విద్యాసంస్థల్లోని పిల్లలకు వాటిని అందిస్తున్నారు. మానవీయ విలువల విశిష్టతను తేలికైన మాటల్లో తెలిపే పద్యాలనూ చిన్నారులకు చేరువ చేస్తున్నారు. స్వచ్ఛందంగా విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస పాఠాలు బోధిస్తున్నారు. స్వయంకృషితో విజేతలుగా నిలిచిన వారి జీవిత చరిత్రలనూ పొత్తాలుగా మార్చి పిల్లలకు ఇస్తున్నారు. పుస్తకపఠనంతో పిల్లల్లో ఒత్తిడి దూరమవుతుందని, కొత్త ఆలోచనలు రేకెత్తుతాయని అంటారీ మిత్రులు. అలాగే, చిన్నారుల్లో భాషాశక్తిని పెంచేందుకు నిఘంటువులనూ అందజేస్తున్నారు. ఎనిమిదేళ్లుగా ఈ కార్యక్రమాలన్నింటినీ సొంత ఖర్చులతోనే నిర్వహిస్తున్నారు. అన్నిటికీ మించి... ఏ పుస్తకాన్ని అయినా, ఎన్ని వేల మంది చిన్నారులకైనా ఉచితంగానే అందజేయడం ఈ మిత్రుల ప్రత్యేకత.

'మంచి పుస్తకాన్ని ఎంపిక చేయడం వ్యక్తిత్వం. దాన్ని ప్రచారం చేయడం చైతన్యం. చదవడం సంస్కారం. కొని చదవడం నాగరికత. కొని, చదివి, చదివించి, బహుమతిగా ఇవ్వడం గొప్ప సంస్కృతి' అన్నది ఈ మిత్రుల నినాదం. దీనిని పరివ్యాప్తం చేయడానికి శ్రమిస్తున్నారు కోట, సాకం.

**విజ్ఞానానికి పెట్టని 'కోట'**

చిననాటి అలవాట్లు చిరకాలముండు
కనుక మంచివి నేడు కల్గించుకొమ్ము

... అంటూ చిన్నతనంలో నాన్న చెప్పిన మాటలు కోట పురుషోత్తం మనసులో బీజాక్షరాలుగా నిలిచిపోయాయి. పుస్తకం చదవడం... అదీ మంచి తెలుగు పుస్తకాన్ని చదవడం అనే ఉత్తమాభిరుచిని మన చిన్నారులకు పరిచయం చేస్తే... వారి భవిత బంగారుమయం అవుతుందన్న సదుద్దేశంతో ప్రస్తుతం పురుషోత్తం చేపడుతున్న కార్యక్రమాలకు స్ఫూర్తి వాళ్ల నాన్న గారి బోధనలే. పుస్తకపఠనం అనిర్వచనీయ అనుభూతిని కలిగించడమే కాదు... జీవితంలో ఎదగడానికి అవసరమైన ప్రేరణనూ అందిస్తుందంటారు పురుషోత్తం.

పురుషోత్తం కుమారుడు అమెరికాలో చదువుకుంటున్నారు. డిసెంబరులో సెలవులు వస్తున్నాయి... ఇంటికి వస్తా నాన్నా అని అబ్బాయి ఫోన్ చేశాడు. 'నువ్వు ఇక్కడికి వచ్చి వెళ్లేందుకు రూ. లక్షన్నర ఖర్చవుతుంది. ఆ డబ్బుతో నిఘంటువులను ముద్రిస్తే జిల్లాలోని ప్రభుత్వ వసతి గృహాల్లోని పిల్లలకు ఇవ్వొచ్చు' అని పురుషోత్తం వాళ్ల అబ్బాయితో చెప్పారు. అన్నట్టుగానే ఆ సొమ్ముకు స్నేహితుల నుంచి సేకరించిన నిధులను కలిపి పదివేల మంది విద్యార్థులకు నిఘంటువులు ఇవ్వడానికి ఏర్పాట్లు చేస్తున్నారు. ఇదీ ఆయన వ్యక్తిత్వం.

కలకడ మండలం రాతిగుంటపల్లి ఆయన స్వగ్రామం. 'రోజుకో పద్యం నేర్చుకో... అది



నిన్ను సమూహం నుంచి వేరు చేసి సింహాసనంపై కూర్చోబెడుతుంద'న్న తండ్రి వెంకటయ్యనాయుడి మాటలతో పద్యాలు చదువుతూ తెలుగు భాషపై అభిమానం పెంచుకున్నారు. దాంతోపాటు అభ్యుదయ భావాలూ అలవరచుకున్నారు. తిరుపతి శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో పీజీ, ఎంఫిల్ చేశారు. అప్పుడే విద్యార్థి సంఘ నేతగా పలు ఉద్యమాల్లో పాల్గొన్నారు. ఆ తర్వాత ఎయిడెడ్ జూనియర్ కళాశాలలో అర్థశాస్త్ర అధ్యాపకునిగా పదేళ్లు బాధ్యతలు నిర్వర్తించారు. ఆ సమయంలో ఆయనలో ఎన్నో ఆలోచనలు. తరగతి గది నాలుగు గోడల మధ్య కొందరికే బోధించడంలో ఏదో వెలితి. ఇంత కన్నా ఎక్కువ మందికి సాయపడలేమా అన్న భావన. దాంతో ఉద్యోగానికి రాజీనామా చేశారు.

ఈ పరిస్థితుల్లో తెలుగు భాషోద్యమ సమితి నాయకులు సాకం నాగరాజుతో పరిచయమైంది. తర్వాత అది స్నేహంగా మారింది. ఇద్దరి ఆలోచనలూ కలిశాయి. నేటితరం పిల్లల్లో మానవీయ విలువలు పెంచడం, వారి వ్యక్తిత్వాన్ని వికసింపజేయడం, పుస్తకపఠనం వైపు వారిని మళ్లించడం కోసం కృషి చేయాలని నిర్ణయించుకున్నారు. అప్పటి నుంచి రాష్ట్రం మొత్తం పర్యటిస్తూ ప్రాథమిక పాఠశాల నుంచి విశ్వవిద్యాలయం వరకూ అన్ని స్థాయిల్లోని విద్యార్థులకు బోధిస్తున్నారు. విషయాన్ని పద్యాలతో ఆసక్తికరంగా వివరించడం వీరి పద్ధతి. 'శిలా మీరే. ఉలీ మీరే. మిమ్మల్ని మీరే తీర్చిదిద్దుకోవాలి. పండితులు కానక్కర్లేదు. సమాజానికి మేలు చేసే మంచి మనుషులైతే చాల'ని ఉద్బోధిస్తున్నారు. వివిధ అంశాలపై ముద్రించిన పుస్తకాలను పంపిణీ చేస్తున్నారు. ప్రతి ఏటా సెప్టెంబరు 11న 'పుస్తక పఠన దినోత్సవా'లను నిర్వహిస్తున్నారు.

ప్రస్తుతం పురుషోత్తం, తెలుగు భాషోద్యమ సమితి గౌరవాధ్యక్షులు. అభ్యుదయ రచయితల సంఘం జిల్లా అధ్యక్షులు. 'తెలుగు పద్యమూ - మా నాన్న', 'పుస్తకం సాక్షిగా', 'వ్యక్తిత్వ వికాసానికి సంఘటనే మూలం', 'పప్పులూ బెల్లాలూ' తదితర పుస్తకాలను సొంతగా ప్రచురించారు. వీటన్నింటినీ వేలాది విద్యార్థులకు ఉచితంగా అందిస్తున్నారు. అలాగే, మహాకవి శ్రీశ్రీ జయంతి సందర్భంగా 'విద్యార్థుల కోసం శ్రీశ్రీ' అనే రచనను వెలువరించారు. చిత్తూరు జిల్లావ్యాప్తంగా 100 విద్యాసంస్థల్లోని పిల్లలకు ఆ పుస్తకాన్ని పంచారు. 'నామిని ఇస్కూలు పిల్లకాయల కతల'ను 1500 పాఠశాలల గ్రంథాలయాలకు అందజేయడానికి ఏర్పాట్లు చేశారు. ఉపాధ్యాయ నేత కత్తి నరసింహారెడ్డి రచించిన 'టీచర్:కథాకమామీషు' పుస్తకాన్ని రెండు వేల బళ్లకు పంపించే ప్రయత్నంలో ఉన్నారు.

### అనుబంధాలకు వారధులు



నాగరాజ, పురుషోత్తం గార్ల పద్య మాధుర్యానికి మా విద్యాలయం కొత్త రూపు సంతరించుకుంది. వీరి ఉపన్యాసాలు మా విద్యార్థులకు చక్కని విజ్ఞానాన్ని అందించాయి. 'పప్పులు - బెల్లాలు' పుస్తకంలో మా విద్యార్థుల కవితలు ఉండటం వారి ప్రభావమే. వీరిద్దరూ ఏ పాఠశాలకెళ్లినా.. అమ్మ, నాన్న, అన్న, హితుడు, స్నేహితుడు తదితర అనుబంధాల్లోని ఆత్మీయతను విద్యార్థులకు వివరిస్తారు.

**- ఏ. భూపతి**

ప్రధాన అధ్యాపకుడు, సాంఘిక గురుకుల పాఠశాల/కళాశాల, సూర్యాపేట, నల్లగొండ

### ఉపాధ్యాయులకూ స్ఫూర్తి



స్వలాభం కోసమే తపించే ప్రజలున్న సమాజంలో తమ సమయాన్ని, సంపదను.. విద్యార్థుల్లో ఆత్మవిశ్వాసం, విజ్ఞానాన్ని పెంపొందించడం కోసం సమయాన్ని, డబ్బును వెచ్చిస్తున్న ఈ మిత్రులు అభినందనీయులు. పిల్లల ముఖాల్లో నిజమైన చిరునవ్వులు చూడటానికే వారు విద్యాలయాలకు వెళతారు. మాటలు చెప్పి ఊరుకోకుండా వేల పుస్తకాలు ప్రచురించి ఉచితంగా అందిస్తారు. ఆ పుస్తకాలు...విద్యార్థులకే కాదు, ఉపాధ్యాయులకూ స్ఫూర్తి కలిగించేలా ఉంటాయి.

**కత్తి నరసింహారెడ్డి,**
**ఎస్టీయూ ప్రధాన కార్యదర్శి**

మరోవైపు... తిరుపతి గజలక్ష్మి గ్రీన్‌సిటీలోని 11 వీధులకు కవులు, రచయితల పేర్లు పెట్టించారు. గురజాడ, కందుకూరి వీరేశలింగం పార్కులనూ ప్రారంభింపజేశారు. గురజాడ, గిడుగు, శ్రీశ్రీల కాంస్య విగ్రహాలను ప్రతిష్ఠించారు. రచయితల కోసం ఓ భవనాన్ని నిర్మించారు.

### తెలుగంటే తరగని ప్రేమ

అమ్మభాషంటే సాకం నాగరాజుకు వల్లమాలిన ప్రేమ. విద్యార్థులకు దాన్ని బోధించడమంటే అమితానందమాయనకు. అందుకే అధ్యాపకుడిగా పదవీ విరమణ చేశాక కూడా బోధన ఆపలేదాయన. దాంతో పాటు రచనను అభిరుచిగా కొనసాగిస్తూ పుస్తకాలను ప్రచురిస్తున్నారు.

పాకాల మండలం వరదప్పనాయుడుపేటలో వ్యవసాయదారుల కుటుంబంలో సాకం నాగరాజ జన్మించారు. దామలచెరువు ఉన్నత పాఠశాల తెలుగు ఉపాధ్యాయుడు మధురాంతకం దొరస్వామి పాఠాలతో భాషపై అభిమానం కలిగిందాయనకు. అభ్యుదయ, విప్లవ రచనలను చదివి సాహిత్యంపై మమకారాన్ని పెంచు కున్నారు. చదువు పూర్తయ్యాక శ్రీకాళహస్తి డిగ్రీ కళాశాలలో తెలుగు అధ్యాపకులయ్యారు. విధి నిర్వహణలో వేలాది విద్యార్థులకు మాతృభాష మధురిమలను పంచారు. పదవీ విరమణ చేశాక పురుషోత్తంతో కలిసి స్వచ్ఛంద బోధన చేస్తున్నారు. ప్రస్తుతం ఆయన అరసం రాష్ట్ర కార్యనిర్వాహక కార్యదర్శి.

తెలుగు కథకు వందేళ్లు నిండిన సందర్భాన్ని పురస్కరించుకుని 'తెలుగు కథకు జేజే' శీర్షికన 78 కథలతో సంకలనాన్ని తీసుకువచ్చారు నాగరాజ. గురజాడ నుంచి గోపిని కరుణాకర్ వరకూ మూడు తరాల రచయితల కథలతో దీన్ని తీర్చిదిద్దారు. మూడు వేల ప్రతులు అచ్చు వేయించి విద్యార్థులకు ఉచితంగా పంచారు. 'వర్తమాన తెలుగు కథ' పేరిట మరో సంకలనాన్నీ వెలువరించారు. లోకవ్యవహారంలో ఉన్న ఆంగ్ల కథలను తెలుగులోకి అనువదించి, బాపు బొమ్మలతో ముస్తాబు చేసి 20 వేల ప్రతులు ప్రచురించారు. వాటిని విద్యార్థులకు పంచిపెట్టారు. అమర్త్యసేన్, చుక్కా రామయ్య, బాపు, శాంతాసిన్హా, వకుళాభరణం రామకృష్ణ, వరవరరావు వంటి 50 మంది బోధన, బోధనేతర ప్రముఖుల అభిప్రాయాలతో 'ఉపాధ్యాయ వృత్తి - అనుభవాలు, జ్ఞాపకాలు' అన్న పుస్తకాన్ని ప్రచురించారు. ఉపాధ్యాయ వృత్తికి వన్నె తెచ్చిన దువ్వూరి వెంకటరమణ శాస్త్రి స్వీయ చరిత్రను సన్నిహితుల ఆర్థిక సహాయంతో ముద్రించారు. నామిని రూపొందించిన 'అమ్మకు జేజే' పుస్తక ప్రతులను వేల సంఖ్యలో ఉచితంగా పంచిపెట్టారు.

హఠాన్మరణం చెందిన సోదరుడు వెంకటసుబ్బయ్య వర్ధంతి సందర్భంగా ప్రతి ఏటా ప్రత్యేక గ్రంథాలను ప్రచురించి పంపిణీ చేస్తున్నారు. ప్రథమ వర్ధంతికి ప్రముఖుల వ్యాసాలతో 'పాత బంగారం' శీర్షికన సాహిత్య సంకలనాన్ని వెలువరించారు. ఆ తర్వాత ఏడాది 'పూలూ పళ్లూ', మూడో ఏడు 'తెలుగు బాల నిఘంటువు'లకు అక్షర రూపమిచ్చారు.

**- తెలుగు వెలుగు బృందం**
సహకారం: పి.మోహన్ కుమార్, తిరుపతి.



నాగరాజ

పురుషోత్తం

### పసి మనసులకు వికాసం

పురుషోత్తంగారి ఉపన్యాస శైలి నవ్విస్తుంది. బిడ్డల్ని కవ్విస్తుంది. తప్పుని మన్నిస్తుంది. రుజుమార్గం చూపిస్తుంది. చర్చకు తావిస్తుంది. మనసుని వికసింపచేస్తోంది. జీవిత పరమర్థాన్ని ఆలోచింపచేస్తోంది. మానవబంధాల్ని వెలికి తీస్తోంది. సంస్కారాన్ని రంగరించి పోస్తోంది. మూఢనమ్మకాలను వీడమంటోంది. అనాథలు, అన్నార్తుల దగ్గరకి రమ్మంటోంది. అదో కవితాఝరి. మధ్యమధ్యలో జరీ చీర మీద బుటాల్లా నీతిపద్యాల జల్లు, పిల్లగాలిలా, అమ్మజోలలా ఉంటుంది.

**- డా॥ ఇనగంటి భాగ్యరేఖ, ఎస్.వి. సంగీత నృత్యకళాశాల, తిరుపతి**

### ప్రచారంలోనూ పద్యాలే

పట్టభద్రులు, ఉపాధ్యాయుల నియోజక వర్గాల అభ్యర్థులుగా రాష్ట్ర శాసనమండలికి పోటీ చేశారు కోట, సాకం. వారి ఎన్నికల సామాగ్రిలోనూ తెలుగు పద్యానికే పెద్దపీట వేశారు. ప్రచారం కోసం ముద్రించిన కరపత్రాలు, పుస్తకాల్లోనూ తెలుగు భాష ఔన్నత్యాన్ని తెలిపే విషయాలను, పద్యాలను గుదిగుచ్చారు. వాటిని చదివిన తల్లిదండ్రులు తమ పిల్లలకు ఆ పద్యాలను నేర్పుతారన్న ఆశతోనే అలా చేశామని చెబుతారీ మిత్రులు.

### ఎవరు పిలిచినా...

తెలుగు భాష మీద ప్రేమ ఉండి... తమ విద్యార్థులకు ఉత్తమ విలువలను నేర్పించాలనుకునే ఏ పాఠశాల యాజమాన్యం ఆహ్వానించినా... ఎంత దూరమైనా సొంత ఖర్చుతో అక్కడకు వెళ్లి తరగతులు తీసుకుంటారు ఈ మిత్రులు. అలా ఇప్పటి వరకూ రాష్ట్రవ్యాప్తంగా 1000కి పైగా విద్యాసంస్థల్లోని చిన్నారులకు బోధించారు.

నాగరాజ - 94403 31016
పురుషోత్తం - 94402 71699

శ్రీ వాసవీదేవి ఆశీస్సులతో...

పెళ్ళంటే...
ఇంద్రధనుస్సు ఒద్దికైన రంగుల లోకం!

శ్రీ

పెళ్ళంటే...
ఏడడుగుల జీవన మకరందం!

శ్రీ

పెళ్ళంటే...
మూడు ముళ్ళ పవిత్ర బంధం!

శ్రీ

పెళ్ళంటే...
రెండు తనువులు పులకించే శుభ సంగమం!

తొలి ఊసన్ను గర్భాలయందుంచి
ఉషా గోపాలకృష్ణుల నోముల పంట 'గౌతమ్'కు
శాంతా జగదీశ్వరుల కంటి వెలుగు
సింధుకుర్తివారి నట్టింట 'నవదీప'మై వెలిగే శుభవేళ
నిండు మనసుతో లక్షింతల అక్షింతలు చల్లండి!

చిగురంత కొత్తగ - నవనీతమంత మెత్తగ
మల్లెరేకంత మత్తుగ - మానవత్వమంత ఎత్తుగ
నిత్యకళ్యాణం పచ్చతోరణంలా జరిగే వివాహమహోత్సవంలో
నిండు మనసుతో పలకండి శుభకామన!



స్వాగతం! మీకు సుస్వాగతం!

శ్రీమతి డి. జానకి
శ్రీ డి. ఆర్. నాగరాజు గుప్త
వైశెట్టి పల్లి

శ్రీమతి సి. ఉష
శ్రీ సి. గోపాల కృష్ణమూర్తి
బెంగుళూరు

కొంగుముడి సాక్షిగ
అదిగో! కన్యాదక్షిణ శృంగార జగతి స్వాగతిస్తున్నది
నవ వధూవరులారా!
పూల రెక్కలు కట్టుకోండి!
తనువులు వేరైనా మనసులు ఒక్కటై, సృష్టికళాకోశాన్ని ఏలండి.
నూరేళ్ళ దాంపత్య జీవితానికి
ఇవే ఇవే!
వాసవీమాత మంగళ శుభాశీస్సులు!
చిరంజీవ! చిరంజీవ! సుఖీభవ! సుఖీభవ!

'ఆత్మీయులు'

## ఆహ్వానం

ఏదైనా శుభకార్యానికి ఇలాంటి సృజనాత్మక ఆహ్వానాన్ని మీరూ రూపొందిస్తే... దాన్ని మాకు పంపండి. బాగుంటే ప్రచురిస్తాం. ఎంపికైన ఆహ్వానానికి చక్కని బహుమతి ఉంటుంది. తెలుగు సమానార్థకాలు లేకపోతే తప్ప అందులో ఆంగ్ల పదాలు ఉండకూడదు, తాజా ఆహ్వానం అయి ఉండాలన్నవి నిబంధనలు.

# తల్లిభాషను బతికిద్దాం



డాక్టర్ గురవారెడ్డి

నా వద్దకు హైదరాబాదో... గుంటూరో... విజయవాడ నుంచో రోగులు వస్తుంటారు. నేనేమో "నొప్పి ఎక్కడ?" అని తెలుగులో అడుగుతాను. వాళ్లేమో "హియర్..! అబౌ సిక్స్ మంత్స్ అయామ్" అంటూ ఇంగ్లిష్‌లో చెబుతారు. నేను అచ్చ తెలుగులో మాట్లాడుతుంటే వాళ్లేమో తెలుగువాడినని తెలిసి కూడా నాతో ఇంగ్లిష్‌లో మాట్లాడతారు. "డాక్టర్ దగ్గర అలా మాట్లాడితేనే గొప్ప" అన్నది వారి భావన. ఇది అందరిలోనూ ఉంది. ఎక్కువ మంది ఇళ్లల్లో పిల్లలతో ఆంగ్లంలోనే మాట్లాడుతున్నారు. అలా మాట్లాడటం హోదాకు చిహ్నంగా భావిస్తున్నారు.

మన హైదరాబాద్‌లో తెలుగు మాట్లాడేవారు చాలా తక్కువవుతున్నారు. మీరు ఏ రాష్ట్ర రాజధానికి వెళ్లినా అక్కడ వారి మాతృభాష రాకుండా ఎక్కువ కాలం బతకడం కష్టం. మన హైదరాబాద్‌లో తెలుగులో మాట్లాడకుండా, తెలుగు నేర్చుకోకుండా బతకొచ్చు. బతుకుతున్నారు కూడా. ఎందుకంటే వారితో మనమే తెలుగులో మాట్లాడం. హిందీలోనో ఆంగ్లంలోనో మాట్లాడతాం. ఇక అలాంటప్పుడు ఇక్కడికి జీవనోపాధి కోసం వచ్చిన వారికి తెలుగుతో పనేముంటుంది? ఇప్పుడు చైనాను చూడండి. వాళ్లకు చైనా భాష తర్వాతే వేరే ఏ భాషైనా! ప్రపంచంలో ఎక్కడికెళ్లినా చైనీయులు ప్రత్యేక గుర్తింపు సాధిస్తారు. తెలుగు వాళ్లకి ఏ భాషలోనైనా మాట్లాడగలిగే నేర్పు ఉంటుందని.. మనకు ఆంగ్లం, హిందీలపై పట్టు ఎక్కువని... అందుకని తెలుగువారు ప్రపంచంలో ఎక్కడికి వెళ్లినా నెగ్గుకు రాగలరని.. మొదట్లో గొప్పగా చెప్పుకునేవాళ్లం. ఇప్పుడదే మనకు భాష పట్ల ఉదాసీనత పెంచింది. క్రమేణా మాతృభాష తీయదనాన్ని మరిచిపోతున్నాం. ఆంగ్లం ప్రపంచ భాషే కావచ్చు. ఆ భాషను మన అవసరాలకు అనుగుణంగా నేర్చుకుందాం. అదే సమయంలో మన మాతృభాషను విస్మరించొద్దు. ప్రభుత్వం తెలుగును పాఠశాల, కళాశాల స్థాయి వరకూ తప్పనిసరి చేయాలి. మనం భాష కోసం ఎన్ని కార్యక్రమాలు చేసినా దాని ప్రభావం తక్కువే. అదే ప్రభుత్వం చేస్తే కచ్చితంగా సానుకూల ఫలితాలుంటాయి. ఇంట్లోనూ తల్లిదండ్రులు తెలుగులోనే మాట్లాడాలి. అలా అని పూర్తిగా అర్థం కాని తెలుగులో మాట్లాడొద్దు. మనలో ఇప్పటికే ఇమిడిపోయిన ఆంగ్లపదాలను కావాలని తెలుగులోకి మార్చొద్దు. దానివల్ల ఎబ్బెట్టుగా ఉండటమే కాకుండా... ఉన్న గౌరవం కూడా పోతుంది. వ్యవహారిక తెలుగును మాట్లాడదాం. అమ్మభాషను బతికించుకుందాం.

# తెలుగు పొత్తాలకు పండగ

**పుస్తకప్రియుల పెద్ద పండగ... విజయవాడ పుస్తక మహోత్సవ సంబరాలు అంబరాన్నంటాయి. తెలుగు పుస్తక భవితకు ఢోకా లేదని నిరూపిస్తూ అమ్మకాలు గణనీయమయ్యాయి. సంప్రదాయ సాహిత్యం నుంచి వ్యక్తిత్వ వికాసం వరకూ అన్ని విభాగాల పొత్తాలూ పాఠకుల ప్రేమలో తడిసి ముద్దయ్యాయి.**

'నా దగ్గర ఏ కొంచెం రొక్కమున్నా పుస్తకాలనే కొనుక్కుంటా. ఆ తర్వాత డబ్బు ఏమైనా మిగిలితే ఆహారం, బట్టల గురించి ఆలోచిస్తా'నని చెబుతారు ప్రముఖ డచ్ సాహితీవేత్త డెసిడేరియస్ ఎరాస్మస్. పొత్తమంటే కేవలం పుటలపై పరచుకున్న అక్షరాల కూర్పు కాదు. మానవ మేధోవికాసమనే మల్లెతీగకు ఆధారమయ్యే భావ పందిరి. ఆ పందిళ్ల కింద సేదతీరే ప్రతి ఒక్కరూ విద్యాగంధపు సువాసనలద్దుకుని సమూహంలో ప్రత్యేకంగా శోభిల్లుతారు.

మరి తెలుగు వారు ఆ ప్రత్యేకతను అచ్చ తెలుగు పుస్తకపఠనంతోనే సాధిస్తున్నారా అంటే... నిన్న మొన్నటి వరకూ 'కాదు' అనే సమాధానమే వచ్చేది. తెలుగు పుస్తకాలను కొనేవారు లేరు, చదివే వారు లేరన్న ఒక భావం... తెలుగు భాషాభిమానుల మనస్సులను నిత్యం చివుక్కుమనిపిస్తుండేది. కానీ... తెనుగు పొత్తాలకు ఆదరణ లేదన్న వాదన తప్పని తేలింది. దృశ్యమాధ్యమాల దాడిలో, ప్రపంచీకరణ వేడిలో అజంత అక్షర మాలికలు వాడిపోవట్లేదని నిరూపితమైంది. విజయవాడ స్వరాజ్యమైదానంలో జనవరి 1 నుంచి 11 వరకూ జరిగిన 24వ పుస్తకమహోత్సవం తెలుగు పుస్తక భవితకు భరోసా కల్పించింది. ప్రదర్శన జరిగిన పదకొండు రోజుల్లో 5.5 లక్షల పొత్తాలు అమ్ముడైతే వాటిలో 70 శాతం పైగా తెలుగు పుస్తకాలే.

నేషనల్ బుక్ ట్రస్ట్ సహకారంతో విజయవాడ పుస్తకమహోత్సవ సంఘం ఈ ఏడాది ప్రదర్శనను విజయవంతంగా నిర్వహించింది. 150 మంది ప్రచురణకర్తలు 258 పుస్తకశాలల్లో దాదాపు 75000 ప్రచురణలను ఈసారి ప్రదర్శనకు ఉంచారు. అంచనా కంటే ఎక్కువగా లక్షన్నరమంది వీటిని వీక్షించారు. సందర్శకులలో విద్యార్థులు, యువతీయువకుల సంఖ్య గణనీయంగా ఉంది. తాము పుస్తకాలు చదవడమే కాక, తమ పిల్లల చేత కూడా చదివించాలనుకునే తల్లిదండ్రుల సంఖ్య పెరుగుతోందని ఇక్కడ జరిగిన విక్రయాలు నిరూపించాయి. ఏటికేడాది పుస్తకాల ధరలు పెరుగుతున్నా కొత్తగా వస్తున్న ప్రచురణల సంఖ్య, ఆదరణ పొందుతున్న ప్రచురణల సంఖ్య వృద్ధి చెందుతూనే ఉండటం విశేషం.

### పుస్తకం విశ్వరూపం

బెజవాడ పొత్తాల పండగ అంటేనే పుస్తక విశ్వరూప సాక్షాత్కారం. ఒక్క రూపాయి ఖరీదు చేసే పుస్తకం నుంచి రూ50 విలువైన విజ్ఞానసర్వస్వ సంపుటాల వరకూ అన్నీ ఇక్కడి ప్రదర్శనలో కొలువుదీరాయి. అధ్యాత్మిక, ఆరోగ్య, వ్యక్తిత్వ వికాస, కాల్పనిక సాహిత్య విభాగంలో అంతర్జాతీయ స్థాయి నుంచి సాధారణ స్థాయి వరకూ వివిధ ధరలలో వివిధ మేధోస్థాయిలలో ఉన్న పుస్తకాలు లభించాయి. ఈ ఏడాది పత్రికలు నిర్వహించిన శాలలు, కేవలం కొన్ని విభాగాలకే ప్రత్యేకమైన (ఎక్స్‌క్లూజివ్) శాలల సంఖ్య పెరిగింది.

### రచయితలూ... మీకో మాట

మహోత్సవంలో పుస్తకాల అమ్మకాలను నిశితంగా పరిశీలిస్తే రచయితలకు విలువైన సూచనలు అందుతాయి.

- ప్రస్తుతం కాలక్షేపం కోసం పుస్తక పఠనం చేసే వారి సంఖ్య దాదాపుగా శూన్యం. కేవలం అవసరం కోసం, వ్యక్తిగత అభివృద్ధి కోసం పుస్తకాలను చదువుతున్నారు. పూర్వం రచయిత పేరు చూసి పుస్తకం కొనేవారు, ఇప్పుడు ముందు పొత్తం పేరు, అందులో ఉన్న విషయం చూసి ఆ తర్వాత రచయిత పేరు చూస్తున్నారు.

● పూర్వం ప్రచురణకర్తలు రచయితలు రాసిన దాన్ని పరిశీలించి నచ్చితే ప్రచురించేవారు. ఇప్పుడు పాఠకులు అడుగుతున్నదానికి అనుగుణంగా వారే విషయాన్ని, ధోరణిని సూచించి రాయించుకోవడం ప్రారంభించారు. అయితే అప్పటికీ ఇప్పటికీ పాఠకాభిరుచే తుది నిర్ణయానికి దిక్సూచి.

● గత దశాబ్దంలో ముఖ్యంగా అయిదేళ్లలో తెలుగు పుస్తకాల అమ్మకాలు పెరిగాయి. దీన్ని బట్టి చూస్తే తెలుగు పుస్తకాలను చదివే వారి సంఖ్య తగ్గిందనే వాదనలో అంత నిజం కాదంటున్నారు ప్రచురణకర్తలు. నిజానికి పూర్వం కంటే ఇప్పుడే తెలుగుపుస్తకాల అమ్మకాలు పెరిగాయంటున్నారు. అయితే... ఇటీవల కాలంలో పత్రికలు, ఇతర మాధ్యమాల ద్వారా జనస్వామ్యంలో పెరుగుతున్న మాతృభాషాభిమానమే దీనికి కారణం.

● అన్యభాషలు నేర్చుకోవడం, కొత్త విద్యల్లో మెలకువలు సాధించడంపై తెలుగు వారికి మొదటి నుంచీ ఆసక్తి ఎక్కువ తమిళం, మలయాళం, కన్నడం తదితర భాషలను తెలుగు ద్వారా నేర్పే పుస్తకాలు వేలల్లో అమ్ముడవుతున్నాయి. ఆంగ్ల వ్యాకరణ పుస్తకాలు ఎప్పుడూ వేడివేడి పకోడీలే. ఆరోగ్యం, భక్తి పుస్తకాలకు ఆదరణ రోజురోజుకీ పెరుగుతోంది. దానికనుగుణంగానే ఈ రంగంలో రాసేవారి సంఖ్యా పెరుగుతోంది. కాస్త రచనాశక్తి ఉండి తగినంత వేగంతో రాయగల రచయితలను ప్రచురణకర్తలు ప్రోత్సహిస్తున్నారు. మరోవైపు... వ్యక్తిత్వ వికాస పుస్తకాలను కొనుగోలు చేసే వారి సంఖ్య నానాటికీ వృద్ధి చెందుతోంది. ఒక మాదిరి వ్యక్తిత్వ వికాస పుస్తకాన్ని ఆరు వేల ప్రతులు అచ్చు వేస్తే ఆర్నెల్లలో రెండో ప్రచురణ అవసరమౌతోంది.

● సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధితో పుస్తక ప్రచురణల్లో వేగం ఎన్నోరెట్లు పెరిగింది. దాన్ని అందిపుచ్చుకుని ప్రపంచ సాహిత్యంలో మంచి పుస్తకాలను సాధ్యమైనంత త్వరగా పాఠకులకు అందించే ప్రయత్నం చేస్తున్నారు ప్రచురణకర్తలు.

**అనువాదం.. పాఠకాభిరుచికి అనునాదం**

ప్రదర్శనలో అనువాద పుస్తకాల సంఖ్య ఈ ఏడాది మరింత పెరిగింది. వాటికి ఆదరణ కూడా బాగుంది. అనువాదాలలో అగ్రస్థానం ఆంగ్లం నుంచి తెలుగులోకి వస్తున్న వ్యక్తిత్వ వికాస పుస్తకాలదే. పాతతరానికి చెందిన డేల్ కార్నెగీ మొదలు ఆధునిక తరానికి చెందిన రాబిన్‌శర్మ, చేతన్‌భగత్‌ల పుస్తకాల వరకూ అన్నీ అమితవేగంగా తెలుగు కావడమే కాక, పాఠకాదరణా పొందుతున్నాయి. సంస్కృతం నుంచి తెలుగులోకి స్వేచ్ఛానువాదమవుతున్న కథలు, గాథలు, పురాణాలు తదితర ఆధ్యాత్మిక పుస్తకాలు కూడా ఈ ఆంగ్లానువాదాలతో పోటీ పడుతున్నాయి.

**పాఠ్యప్రణాళికలో భాగమైతే...**

మహోత్సవంలో బాలల కోసం ఉద్దేశించిన ప్రత్యేకించిన పుస్తకాల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. అయితే ఇది ఇంకా ఆశించినంత వేగం పుంజుకోలేదు. పుస్తకాలు కొనాలనీ, తమ పిల్లలతో చదివించాలనీ ఆసక్తి తల్లిదండ్రుల్లో ఉన్నా చదివేందుకు వారికీ, చదివించేందుకు వీరికీ తగినంత సమయం, ఓపికా రెండూ ఉండటం లేదు. పాఠ్యప్రణాళికలో పాఠ్యేతర పుస్తకపఠనానికీ చోటు కల్పించాలన్న వాదన పుస్తక మహోత్సవ సందర్శకుల నుంచి వినిపించింది.



ఫొటోలు: వై.వి.సత్యనారాయణ

**సంప్రదాయ సాహిత్యానికి పెద్దపీట**

తెలుగు పాఠకులు ఆధునిక వ్యక్తిత్వ వికాస పుస్తకాలను ఎంతగా ఇష్టపడుతున్నారో అంతకన్నా ఎక్కువగా భక్తి, మంత్ర శాస్త్ర పుస్తకాలనూ ఆదరిస్తున్నారు. 18 పురాణాలు, వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ భారతాలు, కాళిదాసు కావ్యాలు, సంస్కృత వ్యాకరణ గ్రంథాలు, జ్యోతిష, మంత్రశాస్త్ర గ్రంథాలు, అర్థశాస్త్రం, సారసంగ్రహం, లీలావతీ గణితం లాంటివి చక్కటి వ్యవహారిక తెలుగులో సంస్కృత శ్లోకాలకు తాత్పర్యాలతో లభిస్తున్నాయి. సంప్రదాయాలతో కూడిన పెద్దబాలశిక్ష 108 సార్లు పునర్ముద్రణలు పొందడం... సాంప్రదాయ సాహిత్యానికి దక్కుతున్న ఆదరణకు అతి పెద్ద ఉదాహరణ.

**పాఠకుల వర్గీకరణ**

తెలుగు సాహిత్యలోకాన్ని నిశితంగా గమనిస్తున్న వారికి ఇప్పటికే స్పష్టమైన మరో కీలకమైన అంశం పాఠకుల వర్గీకరణ. దీన్ని పుస్తక మహోత్సవం మరోసారి నిరూపించింది. వ్యక్తిత్వ వికాసం, ఆత్మకథలు, జీవితగాథలు, అనువాదాలు, శాస్త్రగ్రంథాలు, పోటీపరీక్షల పుస్తకాలు, భక్తి, ఆధ్యాత్మిక, బాల సాహిత్యాలు, వేదాంతం ఇలా అన్ని విభాగాల పుస్తకాలకూ దేని పాఠకులు దానికి ఉన్నారు. అన్ని వర్గాలనూ ఆకర్షించే రచయితలు, గ్రంథాలు అరుదుగా తప్ప రావట్లేదు.

**ఇదే లోపం**

పుస్తకాల అందం, ప్రచురణలో నాణ్యత పెరిగినా, రచనా నాణ్యతలోనూ, రసస్ఫూర్తిని కలిగించడంలోనూ నేటి పుస్తకాల స్థాయి తగ్గుతోంది. పుస్తక ప్రచురణ సులభం అయిపోవడం వల్ల, 'విషయం' ఎంపికలో లోపాల వల్ల రచనల్లో ప్రమాణాలు తగ్గుతున్నాయని ప్రచురణకర్తలు అభిప్రాయపడుతున్నారు. అందుకే పాత తరం రచయితల పుస్తకాలు పునర్ముద్రణలు పొందుతూనే ఉన్నాయి.

ఆఖరుగా పుస్తకమహోత్సవంలో స్పష్టమైన మరో కీలక అంశం... ఎంత అందంగా ప్రచురించినా, ఎంత ప్రచారం చేసినా విషయం ఉంటేనే పుస్తకం పునర్ముద్రణలకు వెళ్తోంది. లేకపోతే లేదు.

**- నండూరి వెంకట సుబ్బారావు, హనుమాన్‌జంక్షన్**

# పుట్టువు



నింగి నుండి లేత వెలుగుల సోన బాగా కురియనీ
వెన్నెల పులుగు కనులు విప్పి రెండు రెక్కలు విదిలించింది
అదే మింటి నుంచి బతుకు చినుకులు పడనీ
వానకోయిల నోరు తెరచి మరిమరి గుటకలు వేసింది.

తూరుపు పసుపు వన్నె చాయ పుడమి అంచున చేరనీ
రామచిలుక కనులు తిప్పిన చిట్టి నాలుక కదిలింది
పడమర కుంకుమ దిద్దు తళుకు నేల అంచు దాటనీ
తెలి పావురం రెక్కలు ఊపి పిల్లలు గూటికి ఎగిరింది.

వేసవి నిప్పుల ఎండ కిందున తాకి కాల్చనీ
గండు కోయిల ఆకు చాటున వలపు చెలికోసం కూసింది
సీతువు అంతటా ఎముకలు కొరికే చలివేయనీ
రాయంచ మంచు కొలనులో తామర తూళ్ల తిన్నది.

గొంగళిపురుగు రూపు రోత కలిగించనీ
వెంద్రుకల బొందళం చేసుకుని పదిలంగా ఉన్నది
రెక్కలు పుట్టి అల్లాడిన సీతాకోకచిలుక ఎగురనీ
కొమ్మన వాలి పువుతేనెలు కమ్మగా తాగింది

బుర్రలో లోతట్టు ఒత్తిడి సుడిగుండమే ఏర్పడనీ
మనసి ఎద గింగురులు తిరిగి గట్టి బండరాయి అయింది
అదే పుర్రెలో నెమ్మదించిన గువ్వ కనువిందు చేయనీ
పుట్టువు బంగరు విరిసిన ఎడదలో గొప్ప అంచ మెదలింది.

**శింగిశెట్టి సంజీవరావు,** జయపూర్(ఒడిశా), 0977615642

# పాలకుల వల్లే నిర్వీర్యం



సింగమనేని నారాయణ

తెలుగు భాష అనే కాదు... అన్ని మాతృభాషలు విశిష్టమైనవే. తెలుగు మిగతా వాటికంటే గొప్పదని స్థూలంగా అంగీకరిద్దాం. అందుకు కారణాలు చూస్తే తెలుగుకు వెయ్యేళ్ల సాహిత్య పరిణామం ఉంది. ఇటీవలి పరిణామాలు భాష ఉనికికి ప్రమాద సంకేతాలనిస్తున్నాయి. యునెస్కో ప్రకారం అన్ని మాతృభాషలు ప్రమాదానికి గురవుతున్నాయి. విద్యార్థులు పరాయి భాషలో చదవడం వల్ల మాతృభాష అంతరించిపోయే ప్రమాదముందని చెబుతున్నారు. ఈ కారణంగా భాష అంతరించిపోయే పరిస్థితి ఉండదు. ఎటొచ్చీ సమస్య ఎక్కడంటే పాలక వర్గంలోనూ, బోధనలోనూ ఉంది. అధికార భాషగా తెలుగును అమలు చేయలేని దుస్థితి మనది. ఇందుకు బాధ్యత ప్రభుత్వానిదే. మాతృభాషపై ప్రభుత్వానికి ప్రేమ ఉంటే తప్ప బతకదు. మండల, పట్టణ స్థాయిల్లోనూ భావిపౌరులను ఆంగ్ల భాషా మాధ్యమంలోకి తోసేస్తున్నాం. ప్రపంచీకరణ నేపథ్యంలో ఆంగ్లభాషను వ్యాపారభాషగా మార్చేసి దేశీయ భాషలను నెట్టివేస్తున్నారు. అయినా ఇప్పటికీ దాదాపు ప్రభుత్వ పాఠశాలల్లో, కళాశాలల్లో, తెలుగులో చదివే పిల్లలే ఎక్కువ. ఉన్నత పాఠశాలల్లో 20 లక్షలు, బయట 30 లక్షల మంది వరకు చదువుతున్నారు. క్రమంగా అవి మూతపడే పరిస్థితి వస్తోంది. 7,600 ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వం విద్యార్థుల్లేక మూసేసింది. కారణం ప్రభుత్వమూ ప్రపంచీకరణకు లొంగడమే. ఇన్నేళ్లలో ప్రజలు మాట్లాడుకునే, వ్యవహరించే భాషలో పాలన సాగించాలన్న నిర్ణయంపై స్థిరపడకపోవడమే. ఉన్నత స్థాయి నుంచి కింది స్థాయి వరకు అన్ని ఉత్తర్వులు ఆంగ్లంలోనే వస్తున్నాయి. మండల స్థాయిలో ఓ ప్రయత్నం జరిగినా ఉపయోగం లేకుంది. మన ఉద్యోగులందరూ ఆంగ్లభాషా మానసపుత్రులే. తెలుగులో మాట్లాడటం ఆత్మన్యూనతగా భావిస్తారు. చివరకు చిత్రాల్లోనూ ఆంగ్లానికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చే యత్నం చేస్తున్నారు. ప్రభుత్వం సరైన రీతిలో వ్యవహరించక పోవడంతో భాష విశిష్టత దిగజారుతోంది. పాలనాభాషగా, ఉద్యోగ భాషగా తెలుగు నిర్వీర్యమైపోతుంది. పరాయిభాష వల్ల ప్రతి పిల్లవాడు మూడు నాలుగేళ్ల నుంచే చదువును కొనుక్కోవాల్సి వస్తోంది. సాధారణంగా చదువు సహజంగా వస్తుంది. ఆడుతూపాడుతూ మన భాషలో నేర్చుకోవాల్సింది పోయి.. కష్టపడి పొరుగుభాషను కొనుగోలు చేసి అందిస్తున్నారు తల్లిదండ్రులు. దీన్ని ఒక్క ఉత్తర్వుతో మార్చవచ్చు. రాష్ట్రంలోని అన్ని పాఠశాలల్లో భాషామాధ్యమం తెలుగు చేయాలని జారీ చేస్తే చాలు. అసంఖ్యాకమైన ప్రజల ఆర్థిక ప్రయోజనాలను ఆంగ్ల మాధ్యమ పాఠశాలలు దెబ్బతీస్తున్నాయి. ప్రజా ఉద్యమాలు, పోరాటాల ద్వారా మార్పు సాధించాలి. ఇంగ్లిషు ఒక భాషగా ఉంటుందంతే. దాన్ని తక్కువగా, తప్పుగా చూడకూడదు. ఆంగ్ల మాధ్యమాన్ని మాత్రమే మనం వ్యతిరేకించాలి. మేధావులు, రచయితలు అందరూ ఒక ఉద్యమంగా ముందుకు తీసుకెళ్లాలి. ఆంధ్రులది ప్రత్యేకమైన వలసతత్వం. అన్ని భాషలనూ స్వాగతిస్తారు. స్వీకరిస్తారు. అందుకే మలయాళ, తమిళవాసులకు వారి భాషపై ఉన్న భావన మన వాళ్లకు ఉండదు. మొత్తంగా పాలకుల ఆలోచనలతోపాటు బోధనాపరంగానూ మార్పులు రావాలి. అన్నింటా తెలుగును తప్పనిసరి చేస్తూ ఉత్తర్వులు వెలువడినప్పుడే అనుకున్నది సాధ్యమవుతుంది. భాషలో పరాయి భాషలు చొరబడి రూపాంతరం చెందడమన్నది సాధారణం. అలాంటి మార్పును స్వాగతించవచ్చు. కానీ పూర్తిగా భాషనే లేకుండా చేయాలనుకునే ధోరణిలో సాగుతున్న ఇప్పటి ఆంగ్లభాషా దురభిమానం మాత్రం మంచిది కాదు.

## చిరుజల్లుల వాన



సన్నగాలి ఊసులకు
సన్నజాజి
పులకరింపు!
చిరు చినుకుల
ఆగడపు ఆటకు
ఆకుల జలదరింపు!

తడిసి ముద్దయిన
ఉల్లిపాయ పిట్ట
రెక్కల రెపరెప

నీటి తుంపర!

రేలింగుకి
నీటి బొట్టుల
వెండి మువ్వల
తళ తళ!

గవాక్షపు
ఆ కొన్న చూపుల
ఆకళింపు!

మెత్తని మనస్సు
ఆర్ద్ర ఆరుద్ర పురుగు
పట్టు పుట్టపు
పేటిక!!
పదిల
పరుచుకోగలను!!!

డా॥ చాగంటి తులసి,
విజయనగరం.
99633 77672.

# బల్లకట్టు పాపయ్య

మా.గోఖలే

ఏకువజామున తొలికోడి కూసేయాల మెట్టపల్లీ పొట్టపల్లికి మయాన పార్తుండ కిట్టకాలువ గెట్టుమీన్నుంచి ఎవురయినా నిలబడి సూత్తాయింటుంటే, మెట్టపల్లి యేపుల్నించి సీకట్లో బజనపాటలు యినిపించి యింకూ సేపటికి డొంకల్లోంచి సేతిగర్ర పొడుసుకుంటు ఓ నల్లయిగ్రహం మిట్టపల్లాలు ఎక్కిదిగుతా వొచ్చొచ్చి కిట్టకావల గట్టెక్కి ఆడ గొలుసుతో కట్టేసుండ బల్లకట్టుకాడికొచ్చి నిలబట్టం తెలుసుద్దన్నమాట. ఆ యిగ్రహం బల్లకట్టు పాపయ్య.

పాపయ్య పని ఏకువజామున తొలికోడి కూసేయాల్టి నుంచి రేత్తిరి జనం తిరగాట్టం మాటుమణిగేదాకా కిట్టకాలవలో బల్లకట్టు నడపడం. బల్లకట్టు ఉద్యోగమయినాక పాపయ్య బల్లకట్టు పాపయ్యయినాడు. ఆ సుట్టుపక్కల వూళ్ల జనానికి, వుత్త పాపయ్యంటే పాపయ్య ఎవురికీ తెలవడు.

పెద్దమనిసి. నమ్మకస్థుడు. ఎవరిజోలికి పోడు. పద్దాకా బజనపాటలు పాడుకుంటా వుంటాడని వూళ్లో పదిమందీ అనుకుంటుంటే నెలకు ఆర్రూపాయల పావలా కాడికి బల్లకట్టు ఉద్యోగమయింది పాపయ్యకు.

పెళ్లాం బూసమ్మ కట్టివచ్చిన సద్దిమూట బల్లకట్టులోన బెట్టి సెక్క మూతేసి, కాత్తె సలిగా ఉంటాన దుప్పటి అటనే కప్పుకొని, బొడ్డోంచి పుగాకుపాయ తీసి వాసన సూసుకుంటా, యిప్పట్నుంచి బల్లకట్టుకు కరుసుక్కోవటం దేనికనుకుంటా కాలవగెట్టుమీన కూకుని సుట్ట ముట్టిచ్చి, జనం ఎవురన్నా వొత్తా వుండారేమోనని సుట్టుపక్కల సీకట్లో సూత్తా... ... ఆలోచనలో పడ్డాడు బల్లకట్టు పాపయ్య.



"ఇంగా జనం ఎవురూ తిరగాట్టం లేదే? ఏం జనమో, ఒక్కోపాలి కోడి కూయకతలికే వొచ్చి తపనబడ్తా కూకుంటారు. ఇంకోపాలి రేత్తిరి యిట్టా యింటికెల్దామని బయిలెల్లి సగంలెక్క బోయినాక ఎవరో ఒకడు దారి మయాన అడ్డుబడి "గెడ్డాం పట్టుకుంటా కాత్తె కాలవదాటేసెళ్ల అన్నన్నా" అంటా పానం దీత్తారు - ఏం మడ్సులో! యియ్యాల పడవలేం రాటం లేదే? రాతారి బోటు వచ్చే యాలయింది. యీ రాతారిబోటు దర్జా రవిలుబండికన్నా ఉండదు. ఒచ్చి ఒకటేమయిన బాకా వూత్తా కూకుంటారు జనాన్ని పోగుజెయ్యడానికి. యీళ్ల ఆర్బాటమేగాని యాడజనం యిట్టాంటి లంకణాల బోట్లెక్కుతేం? యీ రోజుల్లో యాడ జూసినా బస్సు బుట్టి మాజోరుమీన లగెత్తుతుంటే, యీ రాతారిబోటో రేందంటా మద్దెనా? అయినా యిప్పటికీ కొంతమంది వుండార్లె! అలవాటుమీనో, కరుజు తక్కువనో, మరదేమన్నా ఒకిటో, పయానం పది రోజుల పాటయినా బోటెక్కి పోతావుంటారు. బల్లకట్టంటే దాని దారే వేరు. కాలవకు అడ్డంగా బస్సేడపోద్దీ? ఒంతెన్లూ బిర్జీలంటే యాడబడ్తె ఆడ ఎట్టుంటై? ఇట్టాంటి కిట్టకాలవకు బల్లకట్టు లేకనేపోతే జనం అల్లాడిపోవల్సిందే ఎప్పటికయినా! అసలు పొద్దుగూకులూ యిట్ట గుక్క తిప్పుకోటానికి యాలవుద్దా బల్లకట్టు మడ్సికీ? ఓ కూరగాయల మడుసులేందీ, పుగాకు, మిరపకాయ, నెయి, ఎన్న, పాలు, పెరుగు, నాట్లజనం, కోతల జనం, ఆరేంది, యీరేంది అన్ని యాపారాలు యీ బల్లకట్టు మీన నడవాల్సిందేగా? యియాల గొల్లజనం రాలేదేందబ్బా? ఆళ్లొత్తేసరి కాలకడాలు సేతి మురుగుల్లో బల్లకట్టుమీనంతా యుద్దెంసేసి పోతారు - అదొక రకం!" అనుకుంటూ పుగాకు

మైకంలో ఏందేందో రకరకాల ఆలోసెనలు సేసుకుంటుండ బల్లకట్టు పాపయ్యకు "ఓ ఏమయ్యోవ్?" అంటూ సెవిలో టప్పున బాకా వూదినట్టు ఎవరో కాలవ ఆతలి గట్టునుంచి అరిశారు.

వులిక్కిబడి, పరకాయించి సూశాడు బల్లకట్టు పాపయ్య. జనం సాగారనుకుంటా. కిట్టకాలవ ఆతలిగెట్టున ఎవురో గెడకర్రకుమల్లె వుండ యిగ్రహం తొందరమీన గావాలు కదంతొక్కుతా అరుత్తావుండాడు.

"ఓ బల్లకట్టు పాపయ్యోవ్ - ఓ నిన్నేనయ్యోవ్? వుండావంటయ్యా ఆడా?" అనరిసింది ఆతలిగెట్టుమీన యిగ్రహం.

"ఆ ఆ, వున్నాలే - " అంటా వొళ్లు యిరుసుకుంటా లెగిశాడు బల్లకట్టు పాపయ్య.

"వున్నావంటయ్యా? నీ యిల్లు బంగారంగాను, కాత్తె దొబ్బున రానీవయ్యా బల్లకట్టునూ. పొద్దెక్కుతుండదీ" అంది యిగ్రహం గబగబ.

"ఆహc, అంత తొందరైతె ఎట్టా? కాత్తె



నిదానించవయ్యా నువు ఎవురవోగాని - యాడ బల్లకట్టు గొలుసు వూడదియ్యాలా, గెడ సేతికి తీసుకోవాలా, మరికాత్తె నిల్దొక్కుకో" అన్నాడు బల్లకట్టు పాపయ్య, సేతులకు కాత్తె నోటి ఆవిరి పడ్తా.

"ఆ, అదెంతసేపులే సార్వీసయిన మడిసికీ! గెట్టిగా రెండు తోపులు తోశావంటే అయిపాయె! రానీ రానీ దొబ్బున" అంది యిగ్రహం.

"మళ్లీ అదేమాటా! ఎంత లెక్కనించి వత్తుండా వేం?"

"యిప్పటికి రెండు కోసులు నడిత్తిని, యింగా రెండున్నర కోసులు పైసిల్కు పోవాలాయె, రానీ, రానీ" అంది యిగ్రహం.

"నీ మడిసి దొంగల్దోల! రెండు కోసులు నడ్సినోడివి బల్లకట్టుకు రెండు నిమిసాలు ఆగలేవంటయ్యా? మం దేవూరేం?"

"దనియాలపాడు, ఎవురన్నా తెల్సా ఆడా?"

"బలేవోడివి! దనియాలపాడే తెలవదంటా! వెంకటకిట్టయ్య బాగుండాడా?"

"చరెలే వెంకటకిట్టయ్య మా మేనమామేగా! ఆయనకేం రాయికిమల్లే వుంటే మడిసీ! నా పేరు రాంకిట్టయ్యలే.

గెట్టుకు బల్లకట్టు సేరీసేరకతలికే రాంకిట్టయ్య దడదడ మాంటా ఎక్కి కడ్డీమీన కూకుని, యిగ బల్లకట్టును పోనీమన్నాడు.

"పోనిత్తాలే, యింగా మడుసులెవురన్నా వత్తాండారేమో సూద్దాం వుండు" అన్నాడు బల్లకట్టు పాపయ్య అటిటుసూత్తా.

"సూ సేదేంది! యిగచరేలే! తెల్లారిపోయేదాకా యీ గెట్టుకాడే కూకో బెడ్తావెట్టా? నే నసలే సానాదూరం పోవాలంటుంటే అటిటు దిక్కుల్జూస్తా మాటినిపిచ్చుకోడేం; ఏయ్ ఏయ్ గడేసి తొయవయ్యా దొబ్బునా నీ పాపయ్య బంగారంగానూ! పుగాక్కాడ కావాలెట్టా? యింద కాల్చుకో, మడుసులెవురన్నా వొత్తావుంటే మళ్లీ తిరిగొద్దువులేగానీ నడుపు నడుపు! అంటా రాంకిట్టయ్య కడ్డీపట్టుకుని సిందుల్దొక్కాడు.

"ఎవురు జూసినా యిది గిదీ వరస, పద్దాక అటిటు బల్లకట్టు నడపటమంటే మాటలండయ్యా! కాలవ పారుదల సూడు ఎట్టతోస్తా ఉందదో?

పుగాక్కాడకేంగానీ ఓ కానీ బిల్ల కూడా వుంటే సూడు ఏందుకయినా పనికొచ్చుద్ది" అన్నాడు బల్లకట్టు పాపయ్య బల్లకట్టు నడుపుతా.

"సిల్లరేం ఉండట్టులేదే - ఎల్లుండి మళ్లీ తిరిగొత్తాగా, అప్పుడిచ్చిపోతాలే కానీ యాడికిపోద్దీ! అయితే బల్లకట్టు పాపయ్యన్నా! మనకి నెలకి జీతం ఎంతొచ్చుద్దంటా?"

"ఆc, వుంటదిలే దెగ్గిర దెగ్గిర ఆరు రూపాయిల పావలా- ఏం సాలుద్ది సచ్చీ?"

"పరవాలేదే? ఎప్పటికయినా డబ్బు డబ్బే! పైన ఏమాత్రం?" అన్నాడు రాంకిట్టయ్య.

"పైనేందీ?" అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"ఆc అదేలే, పైన కాత్తె కూత్తె సంపాదన వుంటది కావాల్నుగా? అటిటు వొత్తాపోయే జనం అదిదంటూ ఏమన్నా యియరంటయ్యా?"

"అదిదేందీ? యిప్పుడు నీ సంగతేంది సెప్పరాదూ? ఎల్లుండి సిల్లర మార్చి తెత్తా నంటుంటివి! అదిగంతే పైసంటే."

"ఆర్నీ బల్లకట్టు పాపయ్య దెబ్బతీశాడే! అయితే మాటంటే నమ్మకం లేదంటావ్? సరే నువే సూత్తావుగా ఎల్లుండీ! అయితే, నీకు పెల్లాం బిడ్డ లుండరా? వుండక యాడికి పోతారనుకో! యింటికి మళ్లీ ఎప్పుడుపోతా? రేత్తిరి బాగా పొద్దెక్కుద్దేం? మరి బల్లకట్టు పనంటే యిగనంతేగా? తెల్లారిసీకట్లో వొత్తా సద్దిబువ్వ తెచ్చుకుంటావుగామాల్ను. మరి మద్దానం బువ నీ పెల్లాం తెచ్చుద్దేం? సెప్పినమాట యింటదా నీ పెల్లాం? ఇయినక ఎట్టుంటదనుకో! పిల్ల లెంతమందీ? నీకు నలబై ఏళ్లుంటయ్యనుకుంటా - అసలు నలబయ్యన్నా లేంది బల్లకట్టు పనికి పనికిరా రనాల్చిందే- గట్టుకు చేర్నట్టుందే? మంచోడివిలో అన్నా - ఎవురో అప్పుడే తట్టలెత్తుకొస్తుండారే కోకలెగ్గట్టీ? బలే సందడి గుంటదిలే- ఆవులెల్లుండి యిత్తాలే కానీ బిల్లా- ఎల్తుండా బల్లకట్టు పాపయ్యన్నోవ్" అంటూ పటపట మిరగాయలు ఏపినట్టు మాటలు దులిపి, గెట్టుమీనకి దూకి గొల్లజనాన్ని ఓ సూపుసూత్తా, అంగలేసుకుంటా గెట్టుదిగి డొంకల్లోబడి మాయమయ్యాడు రాంకిట్టయ్య.

"ఓ బల్లకట్టు పాపయ్యన్నోయ్? యిటే వుండావంటయ్యా? నీకు పున్నెం వుంటది కాత్తె ఆందరికి దొబ్బునపోనియి బాబూ, అప్పుడే తెల్లార్తుండది! నాగరత్తీరాయే దొబ్బునా? చుబ్బక్కా, లచ్చుమ్మా రాండిరాండి - ఎంకాయిపిన్నాం ఏదే? ఓ చీతామోవ్ లగెయ్‌లగెయ్? అంటా గొల్లజనం కడాలు, గొలుసులు కొట్టుకుంటా, మట్టెలు టక్‌టక్‌మనిపిస్తా పెరుగోసన గబ్బుమనిపిస్తుంటే, రవిలు బండి పెట్టెలకుమల్లే తోసుకుంటా వొచ్చి బల్లకట్టుమీన నుంచుండారు సోల్పున మానికా, తవ్వా, పోల, గిద్దలకిమల్లే.

"అంతా వొచ్చారా యింగా ఎవురన్నా పొదలసాటునా వుండారా?" అన్నాడు బల్లకట్టు పాపయ్య గెడమీన ఒరగా ఆనుకునిసూత్తా.

"పొదల సాట్నేందయ్యోయ్? సింతచచ్చినా పులుపు సావలేదంట! యీ బల్లకట్టు

పాపయ్యకు ఏళ్లు మిగులుండా సెతురు తగ్గడం లేదే? నవుతావు దేనికే నాగరత్తీ? మరి సూడమ్మ యీ పాపయ్యకు తెల్లారిందప్పుడే సెతరాడనూ" అంది ఎంకాయి పిన్నాం.

అదేంది పిన్నాం అట్టంటదేం? గెడకర్రకుమల్లే పాపయ్య అట్టుంటే ఏళ్లు మిగల్టమేంది పాపం - యిహీ హి హీ -" అంది నాగరత్తి కొంగుచాట్న పకపకమంటూ.

"అందేంది పిల్లోవ్ అట్టిరగపడ్తుండావ్? ఆ పొళ్లుకాత్తా రాలి కాలవలో పడేను!" అంది సుబ్బక్క.

"అదేంటి చుబ్బమ్మోవ్, అట్టంటావ్? దాని పళ్లు చూసే పుల్లన్న దాన్ని కట్టుకుంటే!" అన్నాడు బల్లకట్టు పాపయ్య గెడేసి బల్లకట్టు నడుపుతా.

"సూడే ఎంకాయి పిన్నాం, యీ పాపయ్యా? నన్నంటే అన్నావుగానీ యింటికాడ, మా బూసమ్మొదినకాడ అనే వయ్యోవ్ బద్రం వొల్లంతా పిడకలు కొట్టుద్ది!" అంది నాగరత్తి.

"అయితే పద్దాకా యీ వుత్తకబుర్లేనా, లేకబోతే యియ్యాలన్నా కాత్తె పెరుగు సద్దిబువలోకి పోత్తారా!" అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"కాత్తె పొయిరాదంటే నాగరత్తీ!" అంది లచ్చుమ్మ.

"ఆc, నువు పోయరాదూ సాటుగా మూల కూకుండావుగానీ! యియ్యాలసలే నా పెరుగు తగ్గింది. ఏం మాటొచ్చుద్దో, పిన్నాం కాడ. ఏమన్నా దొరుకుద్దేమో?" అంది నాగరత్తి.

"చరే, నా సంగతి పాపయ్యన్నకే తెల్సు" అంది ఎంకాయి పిన్నాం.

"పులుపు సిచ్చుగుండది మరీ యియాల నా పెరుగు! మరీ యిదెట్ట పొయనమ్మా- కాదంటే చుబ్బక్కా?" అంది సీతాం.

"యిదిగో మద్దె మీరెందుగ్గాని కొట్టుకోటం, గెట్టొచ్చింది. దిగండి, దిగండి! మీ సంగతి యియాల నాకేమన్నా కొత్తేట్టా? రత్తమ్మ వొత్తావుంటే మిమ్మల్ని అడక్కనేపోదును. పోనీగానీ ఎవురో ఒకరు రేపన్నా కాత్తె పోసిపొండి" అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"ఓ, రేపు తప్పకుండా నలుగురం నాలుగింతలు పోసిపోతే సరిగా- దిగరేమే యింకా కూకుండారూ? రాండి, రాండి! పొద్దెక్కింది-" అంటా తోసుకుంటా గెట్టు దిగి ఎల్లిపొయ్యారు గొల్లజనం.

అటెటు సూసి దగ్గిర్లో జనం ఎవురూ లేకబొయ్యేతలికి యాప్పుల్ల యిరుసుకుని నోట్లో బెట్టుకుని, గెట్టుమీన కూకుండాడు బల్లకట్టు పాపయ్య.

సంకురేత్తిరి దగ్గిర కొస్తుండది. యిగ కోతలజనం సాగుతా రనుకుండాడు పాపయ్య. యాడ జూసినా వొడ్డగింజ అగుపిస్తా వుంటది. దొబ్బున కోతలొస్తే బాగుండుననుకుంటాడు పాపయ్య. అయినా యీ కూలిజనానికి తగువాడు కోడంతోనే సరిపోద్దిగాని పక్కవోడి మాట యినిపిచ్చుకోనే యినిపిచ్చుకోరు. అదేమంటే ఆసాములు కూలి గింజలు సరిగా కొలవటం లేదంటారు. ఎంతసెడ్డా ఆళ్లూ కూలి జనమేగా మరి? మిరబగాయ దర పెరిగిందట. పద్దాకా బల్లకట్టు తొందరేగాని ఏమన్నా యియమంటే రేపు రేవంటాడే ఎప్పుడు సూసినాయీ రంగయ్య? ఆరోరికి తోస్తే ఏమన్నా యిచ్చిపోతాండాల్సిందే గాని గెట్టిగా ఎవుర్ని మటుకేం నిలవదీస్తా, తప్పుగాదూ? బల్లకట్టు ఎక్కనియ్యకుంటానికినా యబ్బ సొమ్మెట్టా బల్లకట్టూ? యింటో సూడబోతే యీ బూసమ్మ నేనేమో మూటలు కట్టుకురాటం లేదనుకుంటంది. యిక్కడి యవారం నీకు తెలివదులే అంటే నీకు నోట్టో నాలిక లేదంటది. యింటో వుండే ఆడగూతురు గనక అదామాటన్నది. "యీ భాగ్యానికి సీకట్తోననంగా లెగెసెల్లి వూరు నిదరబోయినాక తిరిగి రావాలా?" అంటది. సీకట్తో లెగిసొస్తుంటే పంచపట్టుకు గుంజుద్ది తెల్లారినాక పోవచ్చులే అంటా. పద్దాకా మంచంలో కూకుంటానికి ఎనక తింటానికి నీకేమన్నా వుంటేగదా? ఏందో, దాని రంది దాన్దేగాని యివకాడ యవారం కాత్తెన్నా తెల్సుకోక్కర్లా? చుబ్బయన్నా అగుపియటం లేదే కాత్తె అప్పేవన్నా యిత్తాడేమో అనుకుంటుంటే? అనా వజాన ఎటెటుగానో ఆలో సెలల్లో బడిపోతుండాడు బల్లకట్టు పాపయ్య.

"ఓ బల్లకట్టు పాపయ్యన్నోవ్. రావయ్యా రావయ్యా ఆతలేపుకెల్లి అటనే కూకుండావూ?" అంటా అరుస్తా ఆతలేపు జనం గట్టెక్కటం సూసేతలికి వులిక్కిపడి లెగిసి తెడ్డు తీసుకొంటాడు బల్లకట్టు పాపయ్య.

"మీ అమ్మ రాలేదేరా కొండయ్యా? అంతలావుపనేం జేత్తుండదబ్బా యింటి కాడా!" అన్నాడు బల్లకట్టు పాపయ్య. కొడుకు కొండాయి మజ్జాన్నం బువ్వ దెచ్చి ఏపసెట్టుకింద పెట్టేతలికి.

"బట్టలు గుంజుకోవాలంట" అన్నాడు కొండాయి.

"బట్టలు యిప్పుడే గుంజుకోవాలెట్టా? నువు బువ దిన్నావంట్రా?" అన్నాడు పాపయ్య బువకాడ కూకుంటా.

"తిన్నానయ్యా, అదేమో నేను బెచ్చాలాడుకుంటంటే వొచ్చి బువ తీసికెల్లని అమ్మ కొట్టిందే!"

"అయితే ఎప్పుడూ బెచ్చాలేనంట్రా నువాడేదీ?"

"బిల్లంగోడుకర్ర సుబ్బాయి తీసికెల్లాడు!"

"చీ యదవా ఎప్పుడూ ఆటలేనంటుంటే!"

"నిన్నా, యియ్యాలేనయ్యా నే ఆడ్తుండదీ! అయ్యోవ్? బర్లోకి పంపిత్తానంటివే?"

ఎళ్దవులే బడి యాడికి పోద్ది యిదిగో యీపాలి గెట్టిగా పంతుల్తో సెప్పి బళ్లో సేరిపిత్తె సరిగా! మరి ఎప్పుడు సెప్పినాపై నొచ్చే మంచి రోజున సేరిపిత్తానంటాడేగాని మరామంచి రోజు ఎప్పుడొచ్చుదో యిన్నాలకి తేలకబోయె! సివరికి సేతిలో యావన్నా పెట్టమంటాడో ఏందో మరి! యిదిగో యీపాలి అదేదో గెట్టిగానిలేసి తేల్చుకుంటాగా, ఒరే కొండాయ్?"

"ఏందయ్యా!"

"అయితే మీ అమ్మ యింటికాడ ఏంజేసుద్దంటా?"

"బట్టలు గుంజుకోవాలంట."

"ఇప్పుడే బట్టలు గుంజాలెట్టా? బువదీసుకుని కూసేపు యిటొచ్చిపోతే కాళ్లేం అరిగిపోతయ్యా? ఒరే కొండాయ్ ఏందయ్యా! రేపు మజ్జానం మీ అమ్మనే బువపట్టుకురామను."

"రేత్తిరి అమ్మతో నువే సెప్పరాదంటయ్యా?"

"పరవాలేదులే సెప్పమంటూంటే?"

"నాకేం, అయ్య సెప్పమన్నాడని సెబుతా!"

"చా ఎదవా పోళ్లు రాల్తయి సెప్పావంటే తెల్సిందా? ఎవురో వొచ్చి అప్పుడే బల్లగట్టు మీద కూకుండరే! కాత్తె వుండవయ్యా బువదింటుండానూ- అంటా బువ

**మా.గోఖలే**

సుప్రసిద్ధ చిత్రకారులు. మాయాబజార్, పాతాళభైరవి వంటి సినిమాలకు కళాదర్శకత్వం వహించారు. గుంటూరు జిల్లా మాండలికంలో కథలు రచించిన ఖ్యాతి గోఖలేకు చెందుతుంది. కూలీనాలీ చేసుకొని బతికే కష్టజీవుల మనస్సుల్లో జొరబడి వారివారి కష్టసుఖాల్నీ, మనస్సుల్నీ, మమతల్నీ వారి భాషలోనే పరిచయం చేశారు. వస్తువులో, శైలిలో, భాషలో కొత్తదారులు తొక్కి గోఖలే ఒక ప్రత్యేక రచనా శిల్పానికి మార్గదర్శకులయ్యారు.

తీసుకురావటానికి బూసమ్మ పాలు మాల్తుండదని చిరాకుబడ్తా బువ కాణ్ణుంచి లెగిశాడు పాపయ్య.

* * *

ఓరోజు బాగా రేత్తిరయినాక బల్లకట్టు పాపయ్య యింటికెల్దామని గెట్టుదిగే సమయానికి అవతలి గెట్టునుంచి పొరుగూరు ఎల్లివస్తావుండ సుబ్బయ్య గొంతు యినిపించింది.

"రా, రా, సుబ్బయ్యన్నా- యింగా నయం, యిప్పుడే బల్లకట్టేసి గెట్టు దిగబోతుండా- ఎన్నాలయిందీ సూసీ! ఏ వూరెల్లావూ ఏంది కతా రా, రా-"

సుబ్బయ్యను యివతలిగట్టుకు సేర్చి మళ్లీ బల్లకట్టు గొలుసు బిగిచ్చాడు పాపయ్య.

"కూసేపు కూకునెల్దాం కూసో పాపయ్యా! అబ్బ నడిసి నడిసి సివరకి మనూరి సాయల కొచ్చేతలికి పోయిన పానం మళ్లీ తిరిగొచ్చిందంటే నమ్ము! కాళ్లు గుంజుతుండై. కూసేపు కూకునిపోదాంలే వుందా- ఆఁ తంగిరాల్లో బాకీవుంటే పోయినాలే కూకో, కూకో నీ పెల్లాంతో నేను సెబుతాలే!" అన్నాడు సుబ్బయ్య గట్టుమీన సాగిలపడ్తా.

"ఆఁ, అదసలే గుబులుమడిసి" అన్నాడు పాపయ్య పొద్దు సానా పోయిందనుకుంటా.

"కాదుమరీ! ఎంత సెడ్డా పెల్లామాయె. యిదిగో మనగాడి లంకపుగాకుండది ఓ పాయ సుట్టిసూడు - కూకో - నాకాడ సెకుముకి వుండదిలే."

సుబ్బయ్య, బల్లకట్టు పాపయ్యలు సుట్టలు ముట్టిచ్చి కూకుండారు సీకట్లో కోటయ్యకొండ మీద శిఖరాలకి మల్లే.

ఆ వజాన కూకుని సుబ్బయ్య, బల్లకట్టు పాపయ్యలు ఏ మ్మాట్టాడకుండా సుబ్బయ్య పాపయ్యతో సెప్పిన అస్సుల్సంగ తిది:

"పుగాకు అమ్మకం బెట్టిన మన రత్తయ్యను ఎరుగుదువుగా?" అన్నాడు సుబ్బయ్య.

"అదేంటి సుబ్బయ్యన్నా రత్తయ్యనే ఎరగనంటా?" అన్నాడు పాపయ్య.

"నీకు ఎందుకు తెలదుగానీ, అయితే యీ సంగతి యిన్నావా?" అన్నాడు సుబ్బయ్య

"అదేందో నాకేం తెలుసుద్దీ సెప్పందీ?" అన్నాడు పాపయ్య

"రత్తయ్య పెల్లాం కాంతమ్మ ఆ పొరిగింట ఈరబెమ్మం పిలుస్తే దేశాంతరాలెల్లిందంట!" అన్నాడు సుబ్బయ్య.

"చా!" అంటా నోరు దెరిశాడు బల్లకట్టు పాపయ్య.

"చా ఏంది! రెండు మూడు దినాలు కప్పిపెట్టారు. చివరకి గబ్బులెగిసింది" అన్నాడు సుబ్బయ్య సుట్టపొగ పంటిసందుల్నించి వొదుల్తా.

"అదేంది- కాంతమ్మ" అంటున్నాడు పాపయ్య యింకా తెప్పరిల్లక.

"మంచిదే మరి! ఏవయినా యివన్నీ మన మాటల్తో కట్టబడుండే యవారాలు కాదుసూడూ! యీ రత్తయ్యేమో నాలుగు డబ్బులు సంపాయిచ్చు కొద్దామని రెండు మూడు దినాలపాటు పొరుగూరు

**తిరగేద్దాం!**



మేథకి రెండువైపులా పదును ఉన్న కవి తెనాలి రామకృష్ణ. ఆయనకి ఉన్న బిరుదు కూడా అంతే! ఎటునుంచి చూసినా 'వికటకవి' అనే వస్తుంది. ఇటువంటి పదాలు మరిన్ని ఉన్నాయి. దిగువ ఇచ్చిన సూచనలని బట్టి వాటిని తెలుసుకోగలరేమో చూడండి.

1. అంతర్గతంగా ఉన్న గొడవలు.
2. వస్త్రం.
3. బంగారం.
4. ఒయ్యారము.
5. షడ్రుచుల్లో ఒకటి.
6. కాబట్టి.

(జవాబులు 98లో...)

ఎల్తావుంటాడు,మరి యీ మద్దెన ఈరబెమ్మం ఏం పసర పూశాడో ఏమో- కాంతమ్మ కాస్తా మాయమయింది?" అన్నాడు సుబ్బయ్య.

"అంతా మాయగా ఉంది!" అన్నాడు పాపయ్య.

"ఇదిగో మన్లో మాట- మనూరి రంగయ్యకు నువేమన్నా బాకీ పడ్డావంటయ్యా పాపయ్యా?" అనడిగాడు సుబ్బయ్య.

"ఆఁ వుంటే రూపాయో, రెండో వుంటదిలే" అన్నాడు పాపయ్య.

"అబ్బే ఏం లేదుగానీ, వాడి గుణం మనూళ్లో అందరికీ తెల్సిందేగదా? ఆఁ నువు ఇంటో లేనప్పుడు ఎల్లి నీ పెల్లం బూసమ్మను ఏదించుకు తింటాడంట. ఆడ్డి ఆడికి పారేయరాదూ పీడా వదుల్తుందీ- మాట్లాడుకుంటా ఎల్దాం లెగు పొద్దుపోతుండదీ" అంటూ పంచ దులుపుకుంటా లెగిశాడు సుబ్బయ్య.

"ఓ బల్లకట్టు పాపయ్యన్నేవ్? బాబ్బాబు కాత్తె బల్లకట్టు యివకాడికి రానియి నాయనా సానా పొద్దు పొయ్యొచ్చామూ" అనరిశారు ఎవరో ఆతలి గట్టునుంచి.

* * *

ఆ రేత్తిరీ, మరసనాడూ ఏకువజామునా బల్లకట్టు పాపయ్య బజన పాటలు ఎవురికీ యిన్రాలా.

మజ్జానం బువదెచ్చిన కొండాయికి బల్లకట్టు ఒప్పజెప్పి, మెట్టపల్లికి గబగబ ఎల్లి తనింటో రంగయ్య సుట్ట ముట్టించుకుపోతుంటం సూసిన బల్లకట్టు పాపయ్య ఎల్లి పెల్లాం బూసమ్మ వొళ్లు పచ్చడిజేసి బల్లకట్టు కాడికొచ్చి యిగ ఆడనే గెడకర్ర తీసుకు కూకుండాడు.

ఆ నిశిరేత్తిరి కిట్టకాలవ గట్టుకాడికొచ్చి, పాపయ్య కెదురుగ్గా నిలబడ్డది బూసమ్మ కొడుకు కొండాయితో.

"ఇంటికి ఎల్దాం రా" అంది బూసమ్మ ఏడుస్తా. "దెగ్గిర కొచ్చావంటే సంపుతా- ఎల్లు" అన్నాడు పాపయ్య.

"సంపు, సంపి యీ కిట్టకాలవలో పారెయ్యి నన్ను. నేనే పాపం ఎరగను, నీకేందో గుబులు తిరిగింది" అంది బూసమ్మ.

"ఎవురికి తిరిగిందో యియాల తేలుత్తా" అన్నాడు పాపయ్య.

"నువు ఏం దేల్చినాసరే నేను యీడే పానం వొదుల్తా" అంది బూసమ్మ.

ఆవజాన ఏం జరిగినా జరగనీ- రేత్తిరి మూడు గంటలయాలకు బల్లకట్టు పాపయ్యను ఎంటబెట్టుకొని కొండాయితో యింటికి చేరింది బూసమ్మ. అప్పట్నుంచి కొన్నేళ్లు అయ్యా, అమ్మకు బెడుస్తా రావడం కొండయ్య సూత్తావొచ్చాడు.

"ఒరే కొండయ్యా!" అని ఓ నాడు కొడుకును పిలిచాడు, మంచంలో కూకుండ బల్లకట్టు పాపయ్య.

"ఏందయ్యా?" అన్నాడు కొండయ్య.

"రేపట్నించి యిగమీదట బల్లకట్టు పని నువు సూసుకో నా పని అయిపోతుండది" అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"నా పెల్లాం బల్లకట్టు పని వొద్దంటున్నది" అని సెప్పాడు కొండయ్య.

మరసనాడు కోడితోపాటు లెగిసి, పెల్లాం కట్టబెట్టిన సద్దిమూట తీసుకుని కర్ర పొడుసుకుంటా బజనపాటలు పాడుకుంటా ఎప్పటికిమల్లే కిట్టకాలువ బల్లకట్టు వైపుగా ఎల్లాడు బల్లకట్టు పాపయ్య.



# అమ్మభాషకు అన్యాయం జరగనివ్వను

కృష్ణా జిల్లా దివి తాలూకా నుంచి బొంబాయి మీదుగా ఢిల్లీ చేరిన కృత్తివెంటి శ్రీనివాసరావు జీవితంలో, ఉద్యోగంలో చాలా ఎత్తుపల్లాలను చవిచూశారు. తాజాగా ఆయన కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టారు. ఆ పదవిలోకి వచ్చిన తొలి తెలుగువాడిగా... అమ్మభాషకు ఎలాంటి అన్యాయమూ జరగనివ్వనని అన్నారు. ఇటీవల స్వస్థలానికి వచ్చిన ఆయన 'తెలుగువెలుగు'తో ప్రత్యేకంగా మాట్లాడారు.

**తె.వె: కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శిగా మీ ప్రణాళిక ఏమిటి?**

**శ్రీనివాసరావు:** అకాడమీని సాధ్యమైనంతవరకు అన్ని ప్రాంతాలకు విస్తరింపజేయడం. ఇప్పటి వరకు ఢిల్లీ, ముంబై, కోల్‌కత్తా తదితర ముఖ్య పట్టణాలకు పరిమితమైంది. మారుమూల ప్రాంతాల్లోని సాహితీప్రియులకూ సేవలు చేరుకునేలా ఉండాలి. ఇప్పటికిప్పుడు వీలుకాకపోయినా భవిష్యత్తులో ఆ మేరకు ఎదగాలనేది ఆకాంక్ష. ఈలోగా కనీసం దేశంలోని అన్ని జిల్లా కేంద్రాల్లకైనా సేవలు అందేలా చూడాలనేది ప్రణాళిక. యువ, మహిళ, దళిత సాహితీప్రియులకు ప్రాధాన్యం ఇవ్వాలనేది నిర్ణయం. విదేశాల్లోని మన రచయితలకు అంతర్జాతీయ వేదికల ఏర్పాటుతో పాటు వారికి గుర్తింపు రావాలి. అన్నింటికన్నా ముఖ్యంగా హైదరాబాద్‌లో అకాడమీ కేంద్రం ఏర్పాటుకే తొలి ప్రాధాన్యం. తొలుత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఈ విషయమై లేఖ రాస్తా.

**అకాడమీ అన్ని భాషల పుస్తకాలు ప్రచురిస్తోంది. తెలుగు పుస్తకాల సంగతి ఏమిటి?**

సాహిత్య అకాడమీ అన్ని భాషలను ఒకేలా చూస్తుంది. తెలుగు కంటూ ప్రత్యేకం లేదు. విశ్వనాథ సత్యనారాయణ, వేటూరి ప్రభాకర శాస్త్రి, నార్ల వెంకటేశ్వరరావు తదితర అరవై మందికి పైగా సాహితీమూర్తుల జీవితచరిత్రలు ప్రచురితమయ్యాయి. అనువాద ప్రక్రియ ఎక్కువ. తెలుగు సాహిత్యం హిందీ, ఇంగ్లిష్ తదితర భాషల్లోకి తర్జుమా జరిగితే ప్రాచుర్యం అధికం. ఆ ప్రక్రియ కొనసాగుతోంది.

**రాష్ట్రంలో అకాడమీ గ్రంథాలు సరిగా అందుబాటులో ఉండవు. సాహితీప్రియులకు వాటిని ఎలా చేరువ చేస్తారు?**

ఇందులో నిజం ఉంది. సాహిత్య అకాడమీ అన్ని ప్రాంతాలకు వెళ్లి ప్రచురణలను అందరికీ అందుబాటులోకి తేలేకపోతోంది. ఇది కష్టసాధ్యం కూడా. ఆయా ప్రాంతాల్లోని పంపిణీదార్లు ముందుకు వస్తే వారి ద్వారా విక్రయించేందుకు అకాడమీ సిద్ధం. కొన్నాళ్ల క్రితం కేరళ వెళ్లినప్పుడు అక్కడి పంపిణీదార్లతో మాట్లాడి అకాడమీ పుస్తకాలు అమ్మకానికి ముందుకు రావాలని కోరా. ఎక్కడికక్కడ సంచారవాహనాల ద్వారా పుస్తక ప్రియులకు అకాడమీ చేరువ కావాలనే ఆలోచన ఉంది.

**అనువాదాల పరిస్థితి.. అందులో మన తెలుగు స్థానం?**

అనువాద ప్రక్రియ 23 భాషల్లో బాగానే సాగుతోంది. తెలుగు సాహిత్యం జాతీయ స్థాయికి బాగా చేరుకోకపోవడం బాధాకరం. అనువాదాలు సరిగా రావడంలేదు. రచయితల ధోరణులు నిలకడగా ఉండటం లేదు. హిందీ, ఆంగ్లంలోకి అనువాదం జరిగితే తెలుగుకు మంచి ప్రాచుర్యం లభిస్తుంది. ఏడాదికి 15, 16 అనువాద పుస్తకాలు వస్తున్నాయి. ఆముక్తమాల్యద ఆంగ్లంలో రావడంతో మంచి గుర్తింపు లభించింది. గోపి, కేతు విశ్వనాథరెడ్డి తదితరుల పుస్తకాలు ప్రచురితమయ్యాయి. ఆంగ్లం, హిందీ ఆచార్యులు, పండితులు శ్రద్ధ తీసుకుంటే తెలుగుకు ఉపయోగం. ప్రయివేటు ముద్రాపకులు కూడా అనువాదాలపై దృష్టి పెట్టాలి. ఎంత ఎక్కువమంది అనువాదం చేస్తే అంత ప్రయోజనం కలుగుతుంది. నిఘంటువు రీతిలో అనువాదం కాకుండా భావ వ్యక్తీకరణకు ప్రాధాన్యం ఇవ్వాలి. అప్పుడే తెలుగు సాహిత్యానికి జాతీయ స్థాయిలో మెరుగైన గుర్తింపు, వైభవం వస్తుంది. అయినా పుస్తకాలు కొని చదివే రుచి ఎందరికి ఉంది. 'సింధీ'లో పుస్తకాలు ఎవరూ కొనడం లేదు. తెలుగుతో పోల్చితే మలయాళం, కన్నడ భాషల్లో పుస్తకాల కొనుగోళ్లు బాగున్నాయి.

**తెలుగు కవులు, రచయితల పరిస్థితి ఎలా ఉంది?**

బాగుంది. ఇంకా నాణ్యత పెరగాలి. యువ రచయితలు ఎక్కువ మంది వస్తున్నా.. వాసిపరంగానే మెరుగుపడాలి.

**అకాడమీ కార్యదర్శిగా తెలుగు వారు మీ నుంచి ఏం ఆశించవచ్చు? ఏ విధంగా సేవ చేయబోతున్నారు?**

సాహిత్య అకాడమీ కార్యదర్శిగా తెలుగుకు

ప్రత్యేక ప్రాధాన్యం ఇవ్వడం కుదరదు. కానీ ఇప్పటివరకు తెలుగుకు ఏదైనా అన్యాయం జరిగి ఉంటే ఇకపై అలాంటిది లేకుండా ప్రత్యేక జాగ్రత్తలు తీసుకుంటా. తెలుగుకు ఏ లోటూ రానీయకుండా తెలంగాణ, ఆంధ్ర, రాయలసీమ... వీలైనన్ని ఎక్కువ ప్రదేశాల్లో అకాడమీ ద్వారా కార్యక్రమాలను నిర్వహింపజేస్తా. ఆంధ్రప్రదేశ్‌లో అకాడమీ ప్రాంతీయ కేంద్రాన్ని ప్రారంభించాలనే ఆలోచన ఉంది. దీనిపై 2011లోనే ప్రభుత్వానికి లేఖ రాశాం. అప్పట్లో మండలి బుద్ధప్రసాద్ చొరవ తీసుకున్నా ఫలితంలేకపోయింది. ఇకమీ

**సాహిత్య అకాడమీ కార్యకలాపాలు ఏమిటి?**

ఏడాదికి 350 కార్యక్రమాల వరకూ జరుగుతుంటాయి. కవిసమ్మేళనాలు, సెమినార్లు, అనువాదాలు ఇలా.. ప్రతిరోజూ దేశంలోని ఏదో ఒక చోట అకాడమీ కార్యక్రమం ఏదో ఒకటి జరుగుతూంటుంది.

**తెలుగు సాహిత్య అకాడమీ ఆవశ్యకత ఏంటి?**

ఇప్పటివరకు లేకపోవడం బాధాకరం. ఇప్పటికైనా ఏర్పాటు చేయాలనే ఆలోచన రావడం చాలా సంతోషాన్ని కలిగిస్తోంది. రాష్ట్ర, కేంద్ర సాహిత్య అకాడమీల సమన్వయంతో తెలుగుకు

**తెలుగు సాహిత్య అకాడమీ రూపురేఖలు ఎలా ఉండాలి?**

నిజమైన సాహితీకారులను అధ్యక్షుడిగా, కార్యదర్శిగా నియమిస్తూ అధికారులతో సహా సలహా మండలిని తీర్చిదిద్దాలి. స్వతంత్ర సంస్థగా పని చేయాలి. భాష, సాహిత్య కార్యక్రమాలను నిర్మాణాత్మకంగా, పెద్ద సంఖ్యలో నిర్వహించాలి.

**కవులు, రచయితలపై లఘు చిత్రాలు రావడం లేదు? తెలుగు వారివి లేవా?**

ఈ విషయంలో ఒక తెలుగువాడిగా గత ఏడెనిమిదేళ్లుగా బాధపడుతున్నా. అకాడమీలో

**నిరుపేద కుటుంబం నుంచి జాతీయ స్థాయికి**

ఎన్నో ఆటుపోట్లు, కష్టనష్టాలను భరిస్తూ కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి స్థాయికి ఎదిగిన శ్రీనివాసరావుది కృష్ణా జిల్లా మోపిదేవి మండలం పెదప్రోలు. 1965 అక్టోబరు 20న ఆయన జన్మించారు.

ఏడో తరగతి వరకు స్వగ్రామంలో చదివిన ఆయన మోపిదేవి ఉన్నత పాఠశాలలో పదో తరగతి చదివారు. నిరుపేద కుటుంబానికి చెందిన శ్రీనివాసరావును సోదరులు బతుకుతెరువు కోసం ముంబయి తీసుకెళ్లారు. జీవనభృతికి టైప్‌రైటింగ్‌ను ఎంచుకున్న ఆయన జాబ్‌రైటింగ్, కాంపౌండర్, కో-ఆపరేటివ్, టెలికమ్యూనికేషన్ విభాగం(1988 వరకు)లో దినసరి కూలీగా పనిచేశారు. టపాసులు, రాఖీలు, దుస్తుల విక్రయం తదితర చిన్నా చితకా వ్యాపారాలూ చేశారు. ఉత్తరాంధ్ర జిల్లాల నుంచి ముంబాయికి బియ్యం రవాణా చేసే వారికి, ముంబాయిలోని వర్తకులకు మధ్య అనువాదకుడిగా, లేఖకుడిగా వ్యవహరిస్తూ రూ.200/250 జీతానికి పనిచేశారు. ఇవన్నీ చేస్తూనే 1984లో ఇంటర్మీడియట్‌లో చేరి ఉదయం కళాశాలకు మధ్యాహ్నం పనులకు వెళ్లేవారు. ముంబాయి సిద్ధార్థ కళాశాలలో బీకాం డిగ్రీ చేశారు. ఈబీసీ ఉపకారవేతనం, ఎస్సీ, ఎస్టీల కోసం వచ్చే పుస్తకాలను గురువులు దయతలచి ఇచ్చేవారని శ్రీనివాసరావు గుర్తుచేసుకుంటారు. 1988లో కేంద్ర సాహిత్య అకాడమీలో ఎల్‌డీసీ పోస్టుకు ఎంపికయ్యారు. 1993లో ముంబాయి నుంచి ఢిల్లీకి బదిలీపై వెళ్లి కార్యదర్శికి పీఏ(హోదా లేకున్నా ప్రత్యేక అనుమతితో)గా పనిచేశారు. 1994లో కార్యదర్శికి పీఏగా, 2003లో ప్రోగ్రామ్ అధికారిగా వ్యవహరించారు. 2007లో ముంబాయి, 2008లో ఢిల్లీ ప్రాంతీయ కార్యాలయ అధికారిగా, 2009లో ఉపకార్యదర్శి (పరిపాలన) అయ్యారు. 2012 ఆగస్టు నుంచి సెక్రటరి ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తున్నారు. ఫిబ్రవరి ఒకటిన కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించనున్నారు.

ఎన్ని బాధ్యతల్లో ఉన్నా శ్రీనివాసరావు విద్యాభ్యాసాన్ని మాత్రం వీడలేదు. తిరుపతి ఎస్.వి.విశ్వవిద్యాలయం నుంచి కరస్పాండెన్స్ కోర్సు ద్వారా 1998- 2000లో ఎం.ఎ.(ఇంగ్లిషు) పూర్తిచేశారు. మధురై కామరాజ్ యూనివర్శిటీ నుంచి ఎంఫిల్ (లిటరేచర్), తిరుపతి శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో మధురాంతకం నరేంద్ర పర్యవేక్షణలో పీహెచ్‌డీ పూర్తి చేసి 2012 అక్టోబరులో డాక్టరేట్ పొందారు.

దైనా అవకాశం వస్తుందనుకుంటున్నాం.

**తెలుగువారికి ఈమధ్య కాలంలో జ్ఞానపీఠ్ పురస్కారాలు రావడంలేదు?**

దానిపై వ్యాఖ్యానించలేను.

**మన తెలుగు రచనలు సరిగా రావడంలేదు. ముఖ్యంగా సృజనాత్మక రచనలు లేవంటున్నారు? మీ అభిప్రాయం?**

ఈ పరిస్థితి ఒక్క తెలుగులోనే కాదు..దాదాపు అన్నింట్లోనూ ఉంది. కాకపోతే మలయాళంలో జి.శంకర్, శివశంకరపిళ్లై లాంటి వారు ఉన్నారు. శ్రీశ్రీ, విశ్వనాథ సత్యనారాయణ, శేషేంద్రశర్మ, పింగళి తదితరుల మాదిరి రచయితలు అరుదు. ఇప్పటి రచయితల్లో వేగం ఉంటోంది. పది, ఇరవై పుస్తకాలు రాయాలనే ఆలోచనలు తప్ప నాణ్యత, పట్టున్న సాహిత్యంపై దృష్టి సారించడం లేదు.

ఎంతో ఉపకారం జరుగుతుంది. సదస్సులు, పుస్తకప్రదర్శనలు, కవిసమ్మేళనాలు, గోష్ఠులు, చర్చలు, పుస్తక ప్రచురణలు చేయవచ్చు. పరస్పర సహకారంతో.. రచనలు అనవసరంగా మళ్లీ ముద్రణకు నోచుకోకుండా చూడవచ్చు. అకాడమీ ఉంటే ఆ భాషకు వచ్చే విలువ, గౌరవం వేరు. ఏదైనా పుస్తకాన్ని అకాడమీ ప్రచురిస్తే... అందరి ముందు తన కవితను రచయిత చదివే అవకాశం ఉంటే... ఆ రచయిత పొందే ఆనందమే వేరు. రెండు అకాడమీల పరస్పర సహకారంతో రాష్ట్రంలో మంచి కార్యక్రమాలను ఎక్కువగా, సులభంగా నిర్వహించవచ్చు. ఏదైనా అంశంపై పరస్పరం వివరాలను పంచుకోవచ్చు. కార్యక్రమం నిర్వహించాలన్నా రాష్ట్రంలో అకాడమీ అవసరమే. కేరళ, కర్ణాటక, ఒడిశాలో అకాడమీలు ఉన్నాయి.

ఆర్కీవ్స్ విభాగం ఉంది. గత రెండేళ్లుగా శ్రీశ్రీపై లఘుచిత్రం చేయాలనుకున్నాం. దర్శకుడి విషయమై జాప్యం జరిగి.. అది కాలేదు. శేషేంద్ర శర్మ, భద్రిరాజు కృష్ణమూర్తిలపై చేయాలనుకున్నా కాలేదు. కాళీపట్నం రామారావుపై చేస్తున్న చిత్రం 2, 3 నెలల్లో పూర్తవుతుంది. ఈ విషయంలో వ్యక్తిగతంగా శ్రద్ధ తీసుకుని నాలుగైదు డాక్యుమెంట్లయినా తీయిస్తాం.

**సాహితీ అకాడమీ ఫెలోషిప్‌ల సంగతి ఏంటి?**

ఇవి భాషాపరంగా ఉండవు. జాతీయస్థాయిలో పరిశీలించి ఒక్కోసారి 21 మందికి అవకాశం ఇస్తాం.

**యువరచయితలను ప్రోత్సహించడానికి కేం.సా. అకాడమీ ఏం చేస్తోంది?**

భావిసాహిత్యం యువరచయితలదే అయినం

దున వారికి అకాడమీ పెద్దపీట వేస్తోంది. వారిని ప్రోత్సహించడానికి ఢిల్లీలో యువ రచయితల పండుగను నిర్వహించాం. వారి కోసం దేశవ్యాప్త సమావేశాన్ని నిర్వహణకు ప్రణాళిక ఉంది. అకాడమీలో 2011 నుంచి యువపురస్కార్ అమలులో ఉంది. ప్రతి ఏడాది అవార్డులు ఉంటాయి. 35 ఏళ్లలోపు రచయితలు, కవులు ఎవరైనా తమ తొలి రచనను/ తనకు నచ్చిన పుస్తకాన్ని నేరుగా అకాడమీకి పంపవచ్చు. నాలుగు దశల్లో పరిశీలన ఉంటుంది. యువ రచయితల రచనలు బాగుంటే వాటిని ప్రచురించుకోవడానికి అకాడమీ ప్రోత్సాహం అందిస్తోంది. అలాగే ప్రయాణ భత్యం కింద ఏటా ఐదుగురు యువరచయితలకు రూ.15 వేల చొప్పున సాయం అందిస్తాం. వారు దేశంలోని ఏ ప్రాంతానికైనా వెళ్లి అక్కడి సాహిత్యంపై అవగాహన పెంచుకోవచ్చు. పరిశీలన చేయవచ్చు.

**బాలసాహిత్యం సంగతి ఏమిటి?**

నాలుగేళ్లుగా బాలసాహిత్యానికి క్రమంగా ప్రోత్సాహం పెరుగుతోంది. తెలుగులో రెడ్డిరాఘవయ్య, బాలశౌరిరెడ్డి(హిందీ- చందమామ)లకు పురస్కారాలు అందాయి. మంచి సాహిత్యం ఇతర భాషల్లోకి అనువాదం జరుగుతోంది.

**మహిళా సాహిత్యానికి ప్రోత్సాహం లభిస్తోందా?**

నారీచేతన ద్వారా వారికి అకాడమీ సహకరిస్తోంది.

**దళిత సాహిత్యం ఏ రీతిన ఉంది?**

రచయితలు చాలా మంది ఉన్నారు. లక్ష్మణ్‌గైక్వాడ్, బాలచందర్ ముంగేకర్ తదితరుల మాదిరిగా తెలుగు దళిత రచయితలకు గుర్తింపు రావట్లేదు. ఇతర భాషల రచయితలపై చిత్రాలు, ఆంగ్ల అనువాదాలు, ఆత్మకథలు ఇక్కడ రానందున ఆశించిన గుర్తింపు దక్కడం లేదు. దళిత సాహిత్యాన్ని ముందువరుసలోకి తీసుకొచ్చే ప్రయత్నాన్ని కొనసాగిస్తాం

**తెలుగు సాహిత్య నిర్మాతలపై పుస్తకాలు రావడంలేదు? కారణం?**

ఇప్పటివరకు 60, 70 మందికి సంబంధించినవి మాత్రమే వచ్చాయి. విశ్వనాథసత్యనారాయణ, శ్రీశ్రీ, ఆరుద్ర, దేవులపల్లి తదితరుల అనువాదాలు, వారి జీవితచరిత్రలపై ఉన్నాయి.

**సాహిత్య అకాడమీ పురస్కారాలకు ప్రమాణాలు ఏంటి?**

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాల ఎంపిక ప్రక్రియ సుదీర్ఘమైంది. మార్గదర్శకాలూ ఎక్కువే. ప్రజాస్వామ్య పద్ధతిలో, పారదర్శకంగా జరుగుతుంది. తొలుత పండితుల జాబితా తయారవుతుంది. గత మూడేళ్లలో వచ్చిన పుస్తకాల్లో ఎంపికచేసి సలహామండలి సభ్యులకు వెళతాయి. వాటిని ఆధారజాబితాగా పెట్టుకుని ఒక్కొక్కరికి రెండు చొప్పున సుమారు ఇరవై పుస్తకాలు చేరతాయి. తరువాత ప్రాథమిక ఎంపిక బృందానికి, ఆ తరువాత జ్యూరీకి వెళతాయి. ఆధారజాబితాలోనివి మాత్రమే కాకుండా... సభ్యులు ఇతర మంచి రచనలు ఉన్నాయని భావిస్తే వాటిని కూడా పరిశీలించి ప్రతిపాదించవచ్చు. పురస్కారాల కోసం రచయిత ఎవరైనా నేరుగా తమ రచనలను అకాడమీకి పంపితే వారు అనర్హులు అవుతారు.

**జానపదాలను గురించి అకాడమీ పట్టించుకుంటుందా?**

జానపదాలు అంతరించి పోకుండా ఉండేందుకు అకాడమీ అన్నికోణాల్లో దృష్టి సారిస్తోంది. మారుమూల ప్రాంతాలకు వెళ్లి ఆయా అంశాల గురించి పరిశోధకులు, నిపుణులు చెపుతుంటే కళాకారులు వాటి గురించి ప్రదర్శనలు ఇస్తుంటారు. వాటిని రికార్డు చేస్తుంటారు. భావితరాలకు జానపదాలను నిక్షిప్తం చేయడం అకాడమీ బాధ్యతగా తీసుకుంది.

**మౌఖిక సాహిత్యం సంగతి ఏంటి?**

దీనికోసం ప్రత్యేకంగా ప్రాజెక్టు ఉంది. అగర్తలాలో ఈ పథకకార్యాలయం కొనసాగుతోంది. ముఖ్యంగా గిరిజనుల సాహిత్యాన్ని మౌఖికంగా భద్రపరచడం, ఆ తరువాత ఇతర ప్రముఖ భాషల్లోకి తీసుకురావడం దీని లక్ష్యం.

**అకాడమీ ఏ సహకారాన్ని ఆశిస్తోంది?**

సాహిత్యం మరింత ప్రజలకు చేరువ కావాలన్నా, రచయితలు రాణించాలన్నా ప్రధానంగా మీడియా సహకారం అవసరం. సాహితీ కార్యక్రమాలకు తగిన ప్రాధాన్యం ఇవ్వాలి. కేరళలో ఫర్వాలేదు. ఈ లోపాన్ని అధిగమించేందుకు మీడియా భాగస్వామిగా దూరదర్శన్‌తో దాదాపు ఒప్పందం జరిగింది.

**విదేశాల్లోని భారత సంతతి రచయితల గురించి ఆలోచన ఏమైనా ఉందా?**

భారత సంతతికి చెందిన వేలాది మంది రచయితలు విదేశాల్లో బాగా రాణిస్తున్నారు. పంజాబీ రచయితలు 500 మందికి పైగా ఉన్నారు. ఒక్క యూకేలోనే సుమారు 150 మంది ఉన్నారు. అలాంటి వారు స్వదేశానికి వచ్చినప్పుడు వారిని గుర్తించి, తగిన గౌరవం ఇవ్వాలనేది అకాడమీ ఆలోచన. దీనికి తీస్‌రేదునియా అనే వేదికను తీర్చిదిద్దాలని ఆలోచన.





**నాగా వెంకటరెడ్డి**
విజయవాడ, 80085 35408

ఫొటోలు: కె. సైదేశ్వరరావు

# సుద్ద తెలుగు

మనసుపెట్టి కుదురుగా కూర్చుంటే చాలు అతని చేతుల్లో సుద్దముక్కలు అక్షర రూపాలెత్తుతాయి. పదాలు సుద్దల్లో చేరి సుద్దులూ, బుద్ధులూ నేర్చి బుద్ధిగా వర్ణాకృతుల్లో ఒదిగిపోతాయి. తెలుగిచ్చిన తెలివితో సుద్దుబుద్ధులు చూపుతున్నాడీ కళాకారుడు

జక్కనపల్లి రాముకు ఒక సుద్దముక్కని ఇవ్వండి... పదిహేను నిమిషాల్లో 'అ'గా మార్చేస్తారు. ఈ ఒక్క అక్షరమే కాదు, అచ్చులు, హల్లులు, ఒత్తులు, దీర్ఘాలు... తెలుగు వర్ణమాలకు సంబంధించిన సమస్తాంశాలకూ సుద్దముక్కలతో రూపాలిస్తారు. పాతికేళ్ల ఈ యువకళాకారుడి చేతిలో రూపుదిద్దుకున్న ఆకృతులన్నీ నయనశోభితాలే.

రాము స్వస్థలం వరంగల్ జిల్లా చేర్యాల. రెక్కల కష్టాన్ని నమ్ముకున్న పేద కుటుంబంలోని అయిదుగురు పిల్లల్లో పెద్దవాడు. బతుకు బండిని నడిపించడానికి తల్లిదండ్రులిద్దరూ హైదరాబాద్‌లో పనికి వెళ్తుంటే... ఊళ్లో అమ్మమ్మ దగ్గర ఉండి చదువుకుంటున్నారు. బీఏ పూర్తి చేసి ప్రస్తుతం ప్రైవేటుగా ఎంసీజే చేస్తున్నారు. 'మనకంటూ ఓ గుర్తింపు ఉండాలి. అప్పుడే ఈ సమాజంలో విలువ' అని సర్కారీ పాఠశాల్లో చదువుకునేటప్పుడు ఐలయ్య మాస్టారు (ప్రవృత్తి రీత్యా ఇంద్రజాలికుడు) చెప్పిన మాటలు రాముకు గుర్తుండిపోయాయి. ఆరేళ్ల కిందట సుద్దముక్కలతో ఆకృతులను చేయడం ప్రారంభించారు. మొదట చార్మినార్‌కు రూపమిచ్చారు. ఆ తర్వాత దేశభక్తి, మతసామరస్యం, జాతీయతా భావాలు ఉట్టిపడే ఎన్నో రూపాలకు ప్రాణం పోశారు.

నేటితరానికి దూరమవుతున్న తెలుగుకు తనవంతుగా ప్రచారం కల్పించడానికి సుద్దముక్కలతో తెలుగు అక్షరాలను రూపొందించాలని నిర్ణయించుకున్నారు. మొత్తం 56 అక్షరాలనూ సుద్దలతోనే సిద్ధం చేశారు. 'మన మాతృభాష తెలుగు' అన్న వాక్యంలోని ప్రతి అక్షరాన్ని సుద్దముక్కలతోనే తయారు చేసి... దాన్నే శీర్షికగా పెట్టి తన సుద్దముక్కల తెలుగు వర్ణమాలను ఒక పట్టికగా గుదిగుచ్చారు. సుద్దముక్కలను వృత్తాకార తెలుగు అక్షరాలుగా చెక్కేటప్పుడు కంట్లో పొడి పడుతుంది. వేళ్లలో సూది దిగుతూ ఉంటుంది. బ్లేడు పట్టు తప్పి చేయి తెగుతుంది. అయినా... తనకేం బాధ ఉండదంటారు రాము. చెక్కడం పూర్తయ్యాక, ఆ అందమైన అక్షరాన్ని చూసినప్పుడు కలిగే ఆనందంతో ఎంతటి నొప్పి అయినా దూదిపింజలా ఎగిరిపోతుందని చెబుతారు. కళాకృతులకు నగిషీలు చెక్కడమే కాదు... చక్కటి చిట్టికవితలనూ రాయడంలోనూ రాముకు అభినివేశముంది. తను రాసిన ఈ రెండు వాక్యాలు చూడండి. ఎంత లోతైన అర్థాన్ని ఇస్తున్నాయో!

'శ్రమకు దగ్గరగా నేను వెళ్లాను
ఆ శ్రమే నాకు ఆశ్రయమైంది'

ప్రస్తుతం... గురజాడ 'దేశమును ప్రేమించుమన్నా' గేయాన్ని సుద్దముక్కలతో రూపొందించే పనిలో ఉన్నారు రాము. సుద్ద కళాకృతులతోనే ఎప్పటికైనా గిన్నిస్‌బుక్‌లో పేరు నమోదు చేయించుకోవాలన్నది తన లక్ష్యం. అందుకోవాలని ఆశిద్దాం.

**- తెలుగు వెలుగుబృందం**

ఫొటోలు: ఎ.సంపత్

ప్రపంచ తెలుగు మహాసభల్లో నా సుద్ద అక్షరాలను ప్రదర్శించాలనుకున్నా. కానీ, ఆర్థిక పరిస్థితులు అనుకూలించక వెళ్లలేకపోయా. నా కళకు ముడిసరుకుగా సుద్దముక్కలను ఎంచుకోవడానికి కారణమూ కుటుంబ పేదరికమే. నాకంటూ ఒక ప్రత్యేకత ఉండాలన్న ఆశయంతోనే ఈ ఆకృతులను రూపొందిస్తున్నా. సుద్దముక్కలతో ఆంగ్ల అక్షరాలను తయారు చేయడం కంటే తెలుగు అక్షరాలు చేయడమే కష్టం. కానీ, తయారయ్యాక చూస్తే మన అక్షరాలే ఎంతో అందంగా ఉంటాయి. తెలుగు లిపిలోనే ఆ అందముంది.

**- రాము**



# వెండితెరకు పసిడి పాటల సొగసులు

హిందువులు గుడికి వెళ్లారు
క్రైస్తవులు చర్చికి వెళ్లారు
ముస్లిములు మసీదుకి వెళ్లారు
కానీ వీళ్లంతా సినిమాకు వెళ్లారు...

సినిమా ప్రాశస్త్యాన్ని, పావిత్ర్యాన్ని గురించి సినీప్రియుల నుంచి తరచుగా వినిపించే వ్యాఖ్య ఇది. సినిమాను శక్తిసంపన్నమైన మాధ్యమంగా బెర్నార్డ్ షా, లెనిన్, శ్రీశ్రీ తదితర మేధావులు అభివర్ణించారు. 'సినిమా కేవలం వినోద సాధనం మాత్రమే కాదు. సామాజిక ప్రయోజనానికి ఒక మహత్తరమైన ఆయుధ'మని శ్రీశ్రీ వ్యాఖ్యానించారు.

సినిమాలో అంతర్భాగమైన పాటంటే సామాన్యుడికి మరీ ఇష్టం. సినిమా పాట త్రిముఖాత్మకం. అది సాహిత్య సంగీత చిత్రీకరణల సమాహారం. అయినా ప్రధాన పాత్ర సాహిత్యానిదే. సినిమా పాటలో సాహిత్యముందనుకోవడం నేతిబీరలో నేయిలాంటిదనే విమర్శకులకు... సినిమా పాటకు ఇతర సాహిత్య ప్రక్రియలకు మించి లభిస్తున్న గౌరవం, దానిపై విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధనలే దీటైన సమాధానాలు! ప్రపంచంలో మొదటి సినిమా పాట 'జాజ్‌సింగర్' (1927) చిత్రంతో ప్రారంభమైతే, తొలి తెలుగు సినిమా పాట 'భక్తప్రహ్లాద' (1932) టాకీతో ఆవిర్భవించింది. ఇప్పటివరకు తెలుగులో నేరుగా తీసిన చిత్రాల్లోని పాటల సంఖ్య 35 వేలు పైనే. తొలి తెలుగు సినీకవి చందాల కేశవదాసు నుంచి నేటి వరకూ దాదాపు 400 మంది కవులు వీటిని రచించారు. ఇంతమందిలో పథనిర్దేశకులనదగిన వారు 12 మంది. వివిధ దశలలో తెలుగు భాషను, సాహిత్యాన్ని వారి పాటలెలా సుసంపన్నం చేశాయో పరిశీలిస్తే - తెలుగు సినిమా పాటపైనున్న అపోహలూ తొలగిపోతాయి.

## సినీ గేయ పాఠశాల సముద్రాల

'కనకతార' (1937) చిత్రంతో సినీరంగ ప్రవేశం చేసి నాలుగు దశాబ్దాల పాటు ఆ రంగంలో నిలిచిన సముద్రాల వెంకట రాఘవాచార్యులు తెలుగు సినిమా పాటకు భాషలోనూ, భావంలోనూ ఆధునికతను సంతరించిన ప్రాచార్యులు. సుమారు 80 చిత్రాలకు మాటలు, పాటలు రాసిన సముద్రాల పేరు చెప్పగానే - 'షావుకారు', 'దేవదాసు', 'విప్రనారాయణ', 'దొంగ రాముడు', 'సువర్ణ సుందరి', 'సీతారామ కల్యాణం', 'లవకుశ', 'నర్తనశాల' మొదలైన చిత్రాల్లోని ఆణిముత్యాల్లాంటి పాటలు గుర్తుకొస్తాయి. సరళమైన భాషలో పాటలను రచించి జనసామాన్యానికి రామాయణ, భారత, భాగవతాల పట్ల ఆసక్తి కలిగించారు. నేటికీ వినిపిస్తున్న ఈ పాటే దానికి తార్కాణం...

సీతారాముల కల్యాణము చూతము రారండి
శ్రీ సీతారాముల కల్యాణము చూతము రారండి...
సిరి కల్యాణపు బొట్టును పెట్టి... బొట్టును పెట్టి
మణి బాసికమును నుదుటను గట్టి... నుదుటను గట్టి
పారాణిని పాదాలకు పెట్టి... పారాణిని పాదాలకు పెట్టి...
పెండ్లికూతురై వెలసిన సీతారాముల కల్యాణము చూతమురారండి...
శ్రీ సీతారాముల కల్యాణము చూతము రారండి...

(సీతారామ కల్యాణం)

ఏ విషయాన్నైనా తెలుసుకొని సామాన్యుడి అభీష్టానికనుగుణంగా రాసే నేర్పు ఆయనకుందనడానికి 'దొంగ రాముడు' చిత్రంలో రాసిన 'రారోయి మా ఇంటికి మావో' అనే పాట చక్కని ఉదాహరణం!

మదనా... నవమదనా... స్వాగతమోయి
చిగురాకులివే - బాకులివే
చిలుక హమాయి వజీరా
వలపులతో, కులుకులతో
రాజ్యమేల రావోయ్, రస
రాజ్యమేల రావోయ్ (- 'రత్నమాల' 1948)

బుల్లియెండ, బుచ్చినీడ, వాలుమొగ్గలు మొదలైన తెలుగు పదాలతో చిన్నపిల్లల ఆలోచనా పరిధిని స్ఫురింపచేస్తూ మల్లాది వారు రాసిన ఈ గీతం తెలుగు తల్లికి శిరోరత్నం. తెలుగు సాహిత్య చరిత్రలో నన్నయకు నారాయణ భట్టులా తెలుగు సినీ గేయ రచనలో సముద్రాలకు అంత గానూ సహకరించిన విద్వత్కవి మల్లాది.

## 'విజయ'గీతాల పింగళి

అరుదైన పద ప్రయోగాలకు తెలుగు సినీకవులలో అగ్రగణ్యులైన పింగళి నాగేంద్రరావు 'విజయ' సంస్థ ఆస్థాన కవి. 'పాతాళ భైరవి', 'మాయాబజార్' మొదలైన చిత్రాల్లో పింగళి చేసిన చమత్కార పద ప్రయోగాలు జనాన్ని అలరించడంతో సినిమా మాటలకు ప్రాచుర్యం అప్పటినుండే ఆరంభమైంది. 'సాహసం సాయరా డింభకా', 'నరుడా ఏమి నీ కోరిక?', 'మోసం గురూ', 'అసమదీయులు - తసమదీయులు', 'వెయ్యండి వీర తాడు' మొదలైనవి వాటిలో కొన్ని. పాటల్లో కూడా అపురూపమైన కొన్ని ప్రాచీన కావ్యపద ప్రయోగాలను వినియోగించి వాటిని జనం నోళ్లలో నానేలా చేసిన ఘనత పింగళిదే! వైళమ (వేగముగా), లాహిరి (మత్తు), హలా (సఖీ), బాళి (కోరిక), హంతకారి (నేర్పరి) మొదలైనవన్నీ ఇలాంటివే. ఇటువంటి మాటలతో కూడిన పాటలకు కొన్ని ఉదాహరణలు -



- జలకాలాటలలో కలకలపాటలలో (జగదేకవీరుని కథ)
- స్వాముల సేవకు వేళాయె, వైళమ రారే (శ్రీకృష్ణార్జున యుద్ధం)
- లాహిరి లాహిరి లాహిరిలో (మాయాబజార్)

క్రియా పదాల్లో జన వ్యవహారానికి ప్రాధాన్యమిస్తూ మాట్లాడుకొనే రీతికి దగ్గరగా పాటలు రాసే ధోరణికి శ్రీకారం చుట్టింది కూడా పింగళే! మచ్చుకి -

- ఎచట చూచినా నీవాయె (గుండమ్మ కథ)
- ఎందుకనో నినుచూడగనే కవ్వించాలని వుంటుంది (సి.ఐ.డి)
- తెలుసుకొనవె చెల్లీ, అలా నడుచుకొనవె చెల్లీ (మిస్సమ్మ)

సినిమా పాటల్లో పింగళి చేసిన శబ్దాలంకార ప్రయోగాలు సాహితీ ప్రియుల్ని పరవశింపజేయడమే కాదు - తర్వాతి కవులకు స్ఫూర్తినిచ్చాయి కూడా!

- చందమామ చల్లగా, మత్తు మందు చల్లగా (గుండమ్మ కథ)

అనే పాటలో వసంతాగమనం సందర్భంగా మదనుని ఆహ్వానించే ఈ సన్నివేశంలో చిగురాకులు, బాకులు, వలపులు, కులుకులు వంటి అచ్చ తెలుగు పదాలతో పాటు 'చిలుక హమాయి వజీరా' (చిలుక వాహనంగా కలిగిన యోధుడా!) అనే సంబోధనలో ఉర్దూ పద వినియోగం నాడు వాడుకలో వున్న పదాలతో భాషను పరిపుష్టం చేయడమే!

అటు పౌరాణికాలకూ ఇటు సాంఘికాలకూ భాషా వినియోగంలో మార్గదర్శి అయిన సముద్రాలను ఆధునిక కవులతోపాటు ఆయన తనయుడైన సముద్రాల రామానుజాచార్య కూడా అనుసరించారు.

## మాతృభాషా తత్త్వవేది మల్లాది

తెలుగుదనానికి నిలువెత్తు రూపం మల్లాది రామకృష్ణశాస్త్రి. ఆయన బహు భాషా వేత్త. మాతృభాషపై ప్రత్యేకమైన మమకారంతో తెలుగు నుడికారంతో సినిమా పాటలను రాశారు.

తెల్లవార వచ్చె - తెలియక నాసామి
మళ్లి పరుండేవు లేరా (చిరంజీవులు, 1956)

జానపద మాతృకను తీసుకొని వాత్సల్య సూచకాలైన తెలుగు పదాలతో మల్లాది వారు ఈ పాటను అద్భుతంగా పండించారు గనుకే అర్ధశతాబ్ది దాటినా, ఇది నేటికీ వినిపిస్తోంది.

కొమ్మల మీద కోతి కొమ్మచ్చులాడింది
తెల్లతెల్లని ఓ బుల్లి యెండ
నేల మీద వాలింది - వాలు మొగ్గ లేసింది (కలిమిలేములు - 1962)

● ఈ వనిలో కోయిలనై, కోయిల పాడే గానమునై

● గానము కోరే చెలినై, నా చెవిలో నేనే ధ్వనిస్తా (గుణసుందరి కథ)

పై ఉదాహరణల్లో మొదటి దానిలో యమకాలంకారం, రెండవ దానిలో ముక్తపదగ్రస్తాలంకారం ఉన్నట్టు తెలిసిన వాళ్లకు చెప్పనక్కర్లేదు.

## జానపదాల మారాజు కొసరాజు

గ్రామీణ వ్యవసాయ పదాలతో సినీగేయాలను కూర్చి, భావితరాలు ఆ పారిభాషిక పదాలను గుర్తుంచుకొనేలా చేసిన సినీ జానపదకవి కొసరాజు రాఘవయ్యచౌదరి.

కల్లాకపటం కానని వాడా - లోకం పోకడ తెలియని వాడా

- (రోజులు మారాయి - 55)

ఇది కొసరాజు సినిమా పాటల్లో మకుటాయమానమైది, యువత ఉద్యోగాల కోసం నగరాలకు విదేశాలకు తరలిపోతున్న ఈ కాలంలో ఇలాంటి పాట పుణ్యమా అని ఏరువాక, నవధాన్యాలు, ముల్లు గఱ్ఱ, వరద గుడి, కోటేరు, ఎలపట - దాపట వంటి పదాలు భాషల్లో సజీవంగా నిలిచాయి. వారికి గ్రామీణ జీవితం పట్ల అవగాహనను, ఆసక్తిని కలిగిస్తున్నాయి. ఇంకా - ఒంపులు తిరిగి వయ్యారంగా (తోడికోడళ్లు - 1957)

చెంగు చెంగునా గంతులు వెయ్యండి (నమ్మినబంటు - 1960)

వంటి వ్యవసాయ సంబంధ గీతాలు, రాజకీయాలు, వ్యసనాలు మొదలైన వాటిపై వ్యంగ్య గీతాలు కొసరాజును చిరస్మరణీయుణ్ని చేశాయి.

## తేనెపాటల జాబిల్లి దేవులపల్లి

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి అచ్చమైన ప్రకృతి కవి, సౌందర్యోపాసకులు. 'మల్లీశ్వరి' చిత్రంలోని పాటలతో సినిమా పాటకు కావ్యగౌరవాన్ని కలిగించిన కవి.

● సడిసేయకోగాలి! సడిసేయబోకే (రాజమకుటం-1960)

● వెన్నెల వేళలోనే వేణువూదేనా (ఒక అమ్మాయి కథ-1976)

మొదలైన రసగుళికలలో తెలుగుభాష మాధురాన్ని, సౌకుమార్యాన్ని కృష్ణశాస్త్రి ఆవిష్కరించారు. ఆయన 'అమెరికా అమ్మాయి' చిత్రం కోసం రాసిన 'పాడనా తెనుగు పాట' అనే చక్కెర మాటలమూట తెలుగు వాళ్లను పులకరింపజేసింది!

## మహారాజశ్రీ శ్రీశ్రీ

వామపక్ష భావజాలంగల శ్రీరంగం శ్రీనివాసరావు తెలుగు సినిమాల్లో ఎర్రపాటల వేగుచుక్క మాత్రమే కాదు. భావాలంత పదునుగానూ పదాల్ని కూడా కదం తొక్కించగల శబ్దవిరించి. తెలుగు సినిమాపాటకు మొట్టమొదటిసారి జాతీయ బహుమతినందుకున్న మహాకవి. తెలుగు సినిమాల్లో దేశభక్తి గేయాల రచనలో అగ్రతాంబూలం ఆయనకే దక్కుతుంది.

● తెలుగు వీర లేవరా, దీక్షబూని సాగరా

(అల్లూరి సీతారామరాజు-1974)

● కలిసి పాడుదాం తెలుగుపాట (బలిపీఠం-1975)

తదితర ఉత్తేజకర గీతాలతో ఆయన తెలుగునాట చైతన్యాన్ని రగిలించారు.

శ్రీశ్రీ 'మహాప్రస్థానం', 'ఖడ్గసృష్టి' కవితా సంకలనాల్లోని అనేక గేయాలు సినిమా పాటలుగా రూపాంతరం చెంది సినిమా పాటకు కొత్త రూపునూ, ఊపునూ ఇచ్చాయి.

శ్రీశ్రీ 'వెలుగు నీడలు' చిత్రం కోసం రాసి - 'కలకానిది విలువైనది - బ్రతుకు' అనే సందేశాత్మక గీతం ఆత్మహత్యకు పూనుకొన్న ఓ వ్యక్తిని పునరాలోచింపజేసి ఆ ప్రయత్నాన్ని విరమింపజేసి ఆయువు పోసిందట! ఆయనే 'డా. చక్రవర్తి' చిత్రం కోసం రాసిన 'మనసున మనసై' అనే పాట మానవీయ సంబంధాలకు, దాంపత్య జీవితానికి అద్భుతమైన భాష్యం!

## అద్భుత ప్రతిభాశాలి, ప్రయోగశీలి ఆరుద్ర

ఒక్క చేత్తో 'సమగ్రాంధ్ర సాహిత్యాన్ని' వ్యవహార భాషలో రాసి తెలుగుకు మహోపకారం చేసిన ఆరుద్ర సినీగేయ రచనలోను తనదైన ముద్ర వేశారు. కలం పేరుతో ప్రసిద్ధులైన ఆరుద్ర పూర్తి పేరు భాగవతుల సదాశివ శంకరశాస్త్రి.

● చూడాలని వుంది అమ్మా, చూడాలని వుంది (ముద్దుబిడ్డ-1956)

అంటూ చిన్న కుర్రాడి భాషను, భావాల్ని ఒడిసిపట్టుకొని పాత్రోచితమైన భాషలో పాట రాసిన ఆరుద్ర

● నువ్వంటేనే నాకు మోజు - అలా

రాసిస్తానే దస్తావేజు ... (మా యింటి మహలక్ష్మి-1959)

అంటూ ప్లీడరు గుమాస్తా ప్రేమను వృత్తిపరమైన భాషలో చెప్పించి హాస్యాన్ని పండించారు.

మనసే గని - తరగని గని

తగ్గని గని - పనిలో పని తెలపని

ఇది తప్పని పని (బంగారు పిచ్చుక-1968)

ఇలా అంత్యప్రాసలతో, సభంగశ్లేషలతో, శబ్దచమత్కారాల్ని చూపడం ఆరుద్ర విద్య. ఈ విద్యలో వేటూరి మొదలైన వారికి మార్గదర్శకులయ్యారు. ఇంకా -

● ముత్యమంతా పసుపు ముఖమంతా చాయ...

(ముత్యాల ముగ్గు - 1974)

● రాయినైనా కాకపోతిని రామపాదము సోకగా

(గోరంత దీపం - 1978)

● శ్రీరస్తు శుభమస్తు (పెళ్లి పుస్తకం - 1991) వంటి పాటలతో ఆరుద్ర తెలుగు వారి ఆచార వ్యవహారాలకు అద్దం పట్టారు.

## సినీ వేమన ఆచార్య ఆత్రేయ

'మనసు కవి' ఆచార్య ఆత్రేయ అసలు పేరు కిళాంబి వేంకట నరసింహాచార్యులు. తేలికైన పదాలలో ఎంత బరువైన భావాలనైనా పలికించగలగడం వల్లనే ఆత్రేయ తన పాటలతో అన్ని వర్గాల వారిని గుండె లోతుల వరకు కదిలించగలిగారు. జీవితంలో ఎదురైన ఎత్తు పల్లాల దృష్ట్యా ఆత్రేయను అపర శ్రీనాథుడు అంటారు గాని, ఆయన శైలిని బట్టి సినీ వేమనే!

● అమ్మవుంటే లేనిదేమి తానే లేదు - (కలిసిన మనసులు - 1968)

● మనసు గతి ఇంతే - మనిషి బ్రతుకంతే - (ప్రేమనగర్ - 1971)

● నువ్వంటే నాకెందుకో ఇంత ఇది - (అంతస్తులు - 1965)

వంటి ఉదాహరణలు ఆత్రేయ భాషను, మాటల పొదుపును తెలుపుతాయి.

● అనుకొన్నామని జరగవు అన్నీ - (మురళీకృష్ణ - 1964)

● నవ్వినా... ఏడ్చినా... కన్నీళ్లే వస్తాయి - (మూగ మనసులు - 1964)

వంటి ఆత్రేయ సినిమా పాటల్లోని పంక్తులు తెలుగునాట నానుడులుగా, సామెతలుగా స్థిరపడిపోయాయి.

## ధీశరధి – దాశరథి

భాషాభావ సౌందర్యాలకు సమ ప్రాధాన్యమిచ్చి సినీ గేయాలు రాసిన కవి దాశరథి కృష్ణమాచార్య తెలుగు సినిమా పాటల్లో ఉర్దూ పదాలను మేళవించి మణి ప్రవాళశైలిని రూపొందించారు.

విడుదలైన తన తొలి సినిమా పాటతోనే (ఖుషీఖుషీగా నవ్వుతూ, ఇద్దరు మిత్రులు, 1961) గుర్తింపును పొందిన దాశరథి తర్వాత 'నవరాత్రి'

'రంగేళీ రాజా' మొదలైన చిత్రాలలో రాసిన పాటలలో ఉర్దూ పదాలను విస్తృతంగా వినియోగించారు. ఉర్దూ సంప్రదాయ ప్రభావంతో దాశరథి తెలుగులో ఎక్కువ ఖవ్వాలీ పాటల్ని కూడా రాశారు.

- నవ్వాలి నవ్వాలి నీ నవ్వులు నాకే ఇవ్వాలి (ఇద్దరు మిత్రులు)
- దీపాలు వెలిగె పరదాలు తొలగె (పునర్జన్మ)

మొదలైనవి దాశరథి ఖవ్వాలీ పాటలకు ఉదాహరణలు.

ఇంకా ఎన్నో భక్తి గీతాలు, అనుబంధ గీతాలు, వీణపాటలు, భావ గీతాలు రాసిన దాశరథి లలితమైన పద బంధాలకు ఆహ్లాదకరమైన అభివ్యక్తులకు పెట్టింది పేరనడానికి-

ఏ దివిలో విరిసిన పారిజాతమో (కన్నె వయసు) పాట ఒక్కటీ చాలు!

## తేటతెలుగు ధారే... సి.నా.రె.

తెలుగు సినీ కవుల్లో డా॥ సి.నారాయణరెడ్డి అంతటి విద్యావేత్త మరొకరు లేరు. అధ్యాపక వృత్తి ద్వారా అలవడిన ప్రాచీన కావ్య పరిజ్ఞానం, పద సంపద సి.నా.రె. పాటల్లో పటిష్ఠమైన భాషా ప్రయోగాలకు, ఆలంకారిక శైలికి దోహదం చేశాయి. ఆయన పుట్టి పెరిగిన వేములవాడ ప్రాంతంలోని గ్రామీణ సంస్కృతి తెలంగాణా మాండలిక సినీ గీతాలను రాయించింది.

పింగళి తర్వాత సినిమా పాటల్లో ఎన్నో మారుమూల తెలుగు పదాలను ప్రయోగించిన ఖ్యాతి సి.నా.రె.కే దక్కుతుంది. అమ్మక చెల్ల, చాంగురే, మజ్జారే, మగరేడు, వగకాడు, మచ్చె కంటి మొదలైన పద ప్రయోగాలతో పాటు పున్నమిరెమ్మ, పిండి వెన్న, పూల ఋతువు, మబ్బుల వాడ, మల్లెల మేడ, రేకు విప్పిన వయసు, నీలి కన్నుల నీడలు మొదలైన అందమైన పద బంధాలను, పద చిత్రాలను కూర్చి భాషకు కొత్త సొగసులను చేకూర్చారు.

- చిగురేసె మొగ్గేసె.. సొగసంతా పూతపూసె - ఆలుమగలు
- గోగులు పూచె గోగులు కాచె ఓ లచ్చా గుమ్మడి (ముత్యాల ముగ్గు-1975)

వంటివి సి.నా.రె. పాటల్లో తెలంగాణాలోని పల్లె పలుకు బళ్లకు మచ్చుతునకలు కాగా-

- పగలే వెన్నెల జగమే ఊయల (పూజా ఫలం - 1964)
- తోటలో నా రాజు తొంగి చూసెను నాడు (ఏకవీర - 1969)

మొదలైనవి కర్ణపేయమైన స్వర పద మధు ధారలు.

## సుందర గేయలహరి వేటూరి

సినీ గేయ రచనలో శబ్ద సౌందర్యానికీ, ఉక్తి వైచిత్రికీ, ఆలంకారిక చమత్కారాలకూ అధిక ప్రాధాన్యమిచ్చిన కవి వేటూరి సుందరరామమూర్తి. స్వర పదమైత్రి మీద అవగాహనతో ఏ రకం సినిమా పాటనైనా అవలీలగా రాయగలిగిన వేటూరి తెలుగులో ఎక్కువ పాటలు రాసిన ఘనతతో పాటు రెండవ సారి తెలుగు పాటకు జాతీయ బహుమతిని సాధించిన ఖ్యాతిని కూడా దక్కించుకొన్నారు.

- ఎవరమ్మా ఎవరమ్మా ఈ కొమ్మ - (జే గంటలు 1981)
- అలివేణీ ఆణిముత్యమా - (ముద్ద మందారం 1981)

వంటివి వేటూరి సుతిమెత్తని పద ప్రయోగాలకు ఉదాహరణలు కాగా-

వెలుగు రేకల వారు తెలవారి తామొచ్చి
ఎండముగ్గులు పెట్టంగా - (సీతారామయ్య గారి మనుమరాలు)

వేటూరి జానుతెనుగు జానపదానికి మచ్చుతునక!

- దొరలనీకు కనుల నీరు
  దొరలదీ లోకం, మగదొరలదీ లోకం (నాలుగు స్తంభాలాట 1982)
- చుక్కా నవ్వవే వేగుల చుక్కా నవ్వవే
  చుక్కా నవ్వవే నావకి చుక్కానవ్వవే (సీతాకోక చిలుక 1981)

మొదలైనవి వేటూరి శ్లేష, యమకాలంకారాలకు ఉదాహరణలు.

పిల్లనగ్రోవికి నిలువెల్ల గాయాలు
అల్లిన మోవికి తాకితే గేయాలు... (సప్తపది)

... వంటివి వేటూరి ఉక్తివైచిత్రికి మెచ్చుతునక!

శ్రీనాథకృతమైన 'హరవిలాసం' సప్తమాశ్వాసంలోని ఇతి వృత్తాన్ని తీసుకొని 'భక్త కన్నప్ప' చిత్రంలో కిరాతార్జునీయంగా వేటూరి మలచిన తీరు... పౌరాణికాల్ని జన సామాన్యానికి హృదయంగమంగా అందించవచ్చనడానికి నిదర్శనం. శంకరాభరణం, సాగరసంగమం, సిరిసిరి మువ్వ మొదలైన చిత్రాలకు ఆయన రాసిన నృత్య సంగీత ప్రధానమైన గీతాలు తెలుగు తల్లికి ఆభరణాలు!

## శిశిరంలో కోయిల సిరి వెన్నెల

తాత్వికత, భావుకత తన గేయాలకు మూల సిద్ధాంతాలుగా, సూటైన భావ ప్రకటనకు వచన ధోరణిని ఆశ్రయించిన కవి - చేంబోలు సీతారామశాస్త్రి. తెలుగు సినీ గేయ కవులలో ఇంత వరకు పది నంది పురస్కారాలను అందుకొన్న ఏకైక కవి సిరివెన్నెల.

- ఈ వేళలో నీవు ఏం చేస్తువుంటావో (గులాబీ)
- అసలేం గుర్తుకు రాదు.. (అంతఃపురం)

**ధార లేకుంటే..**



పోలాటితిప్ప జమీందారుగారికి ఓ ఉత్తరం వచ్చింది. 'అయ్యా! నేను కడు బీదరికంలో ఉన్నాను, నా దరిద్రాన్ని మాపేందుకు ఏదో ఒకదాన్ని దారాదత్తము చేయగలరు' అని. అంతే! పోలాటితిప్ప జమీందారుకి తెగ కోపం వచ్చేసింది 'ఈ ఉత్తరం పంపినవాడిని రాజ్యం నుంచి బహిష్కరించండి' అంటూ ఆజ్ఞలు జారీ చేశారు. ఇంతకీ పొరపాటు ఎక్కడ జరిగిందో చెప్పగలరా?

(జవాబులు 98లో ..)

- ఇన్నాళ్లకు గుర్తొచ్చానా వానా (వర్షం)

మొదలైనవి సిరివెన్నెల వచన ధోరణిలో సాగే గేయాలకు ఉదాహరణలు.

తెలవారదేమో స్వామీ... నీ తలపుల మునకలో అలసిన దేవేరి అలమేలు మంగకూ... (శృతి లయలు)

అన్నమయ్య రచన అనే భ్రాంతి కలిగించిన మధుర భక్తి గీతం.

మనిషిని పట్టాలు తప్పకుండా నడిపించడానికి సినిమా మాధ్యమాన్ని పవిత్రంగా ఉపయోగించుకోవాలనే పట్టుదల కలిగిన సిరివెన్నెల తెలుగు సినిమా పాట విలువలు క్షీణిస్తున్న కాలంలో సినీ రంగ ప్రవేశం చేసి తన ఉనికిని నిరూపించుకొంటున్న శిశిరంలో కోయిల!

ఈ పన్నెండుగురితో పాటు తమ గేయాలతో తెలుగు భాషను తేజరిల్లజేసిన మరికొందరు కవులూ ఉన్నారు. ఎనిమిది దశాబ్దాలుగా తెలుగు నాట ఎదురులేని సాహిత్య వినోద సాధనంగా విస్తృత వ్యాప్తి పొందిన సినిమా పాట ప్రస్తుత పరిస్థితి భాషాభిమానులకు ఆందోళన కలిగిస్తోంది!



డా॥ పైడిపాల
విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు
సినీ గేయ సాహిత్య పరిశోధకులు,
అమలాపురం. 99891 06162

# స్ఫూర్తి యాత్ర

**భాగ్యనగరపు బిడ్డలు... పాలమూరు పిల్లలు... కర్నూలు కుర్రాళ్లు... అనంతపురం ఆడపడుచులు... ఎవరైతేనేం! నవతరాన్ని తెలుగు భాష వైపు కదిలించాలన్న ఆశయం వారిది. ఆ లక్ష్య సాధన కోసం సైకిళ్లపై ఏడొందల కిలోమీటర్లు ప్రయాణించారు. పట్టణ, గ్రామీణ యువతకు అమ్మభాష వైశిష్ట్యాన్ని వివరిస్తూ వారు సాగించిన యాత్ర విశేషాలివి...**

ప్రస్తుత యువతరం అనుబంధమంతా అంతర్జాలంతోనే. చదువుకు సంబంధించిన చర్చల నుంచి స్నేహితులతో ముచ్చట్ల వరకూ అన్నీ అంతర్జాలంలోనే. కానీ, ఆ సమాచార స్వేచ్ఛాప్రపంచంలో ఆంగ్లానిదే ఆధిక్యత. దాంతో యువత ధ్యాసంతా ఆ భాష వైపే.

ఈ పరిస్థితుల్లో తెలుగును భావితరాలకు చేరువ చేయాలంటే ఒక్కటే మార్గం... అంతర్జాలంలో తెలుగు వినియోగాన్ని పెంచడం. అలా చేయాలంటే కంప్యూటర్లో తెలుగు రాయడానికి సాయపడే మన భాషా ఖతులు (ఫాంట్లు) కావాలి. దీనిపై దృష్టి పెట్టిన రాష్ట్ర సమాచార, సాంకేతిక శాఖ, సిలికానాంధ్ర, విశ్వ తెలుగు అంతర్జాతీయ వేదికలు... 18 ఖతులను రూపొందించాయి. వీటితో పాటు కంప్యూటర్లో తెలుగు వాడకానికి ఉపయోగపడే తెలుగు పదపరిష్కరిణి (స్పెల్ చెకర్) లాంటి ఉపకరణాలనూ హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం అందుబాటులోకి తెచ్చింది. వీటిని యువతకు పరిచయం చేసి, అవగాహన కల్పిస్తే... అంతర్జాలంలో మన అమ్మభాష వెలుగుతుందన్న విశ్వాసమే 'సైకిల్‌యాత్ర'కు స్ఫూర్తి.

**అంతర్జాలమే వేదిక**



ప్రాచీనమైన మన తెలుగు రేపటి తరానికి తెలియాలంటే అంతర్జాలంలో దాని వినియోగం పెరగాలి. అలా పెంచేందుకే ఈ యాత్ర చేశాం. కంప్యూటర్లలో తెలుగు వినియోగానికి ఉన్న అవకాశాలను ప్రజలకు, ముఖ్యంగా యువతకు వివరించాం.

**– అమరనాథరెడ్డి, సీఈవో, జవహర్ నాలెడ్జ్ సెంటర్**

అధికార భాషా సంఘం (అభాసం), జవహర్ నాలెడ్జ్ సెంటర్, అట్లాంటా ఫౌండేషన్ సంయుక్త ఆధ్వర్యంలో ఈ యాత్రను నిర్వహించారు. హైదరాబాద్, ముంబై, దుబాయి తదితర ప్రాంతాల్లో సాఫ్ట్‌వేరు ఇంజినీర్లు, వృత్తినిపుణులు, వ్యాపారులుగా ఉన్న దాదాపు 15 మంది యువకులు ఈ యాత్రలో భాగస్వాములయ్యారు. వీరందరికీ తెలుగు భాష, సంస్కృతులంటే వల్లమాలిన అభిమానం. దానికి సైకిల్‌యాత్రపై అనురక్తి తోడైంది.

డిసెంబరు 21, 2012న హైదరాబాద్ నెక్లెస్‌రోడ్డులోని పీవీ స్మారక స్థలం వద్ద అభాసం అధ్యక్షులు మండలి బుద్ధప్రసాద్ ప్రారంభించిన యాత్ర... 25వ తేదీ నాటికి తిరుపతికి చేరుకుంది. మరునాడు యాత్రా బృందం తిరుపతిలో భారీ ప్రదర్శన నిర్వహించింది. తర్వాత ప్రపంచ తెలుగు మహాసభల్లో పాల్గొంది.

అయిదు రోజుల్లో అయిదు జిల్లాల్లో (హైదరాబాద్, మహబూబ్‌నగర్, కర్నూలు, అనంతపురం, చిత్తూరు) 700 కిలోమీటర్ల మేర సైకిల్ యాత్ర సాగింది. రోజుకు 150 కిలోమీటర్లు ప్రయాణించారు బృంద సభ్యులు. మార్గమధ్యంలోని కళాశాలలకు వెళ్లి విద్యార్థులకు అంతర్జాలంలో తెలుగు వాడకం మీద అవగాహన కల్పించారు. అలాగే, గ్రామాల్లోని యువతతోనూ మాట్లాడారు. కంప్యూటర్లలో తెలుగు ఎలా రాయాలో సులభశైలిలో వివరించారు. యాత్రాబృందానికి జవహర్ నాలెడ్జ్ సెంటర్ ముఖ్య కార్యనిర్వాహకాధికారి అమరనాథరెడ్డి నేతృత్వం వహించారు.

**సహకారం: నాదెండ్ల తిరుపతయ్య, కర్నూలు**





### ఆంగ్లంతో పనిలేదు

అంతర్జాలంలో గతంలో మూడు తెలుగు ఖతులే ఉండేవి. ప్రస్తుతం 18 అందుబాటులోకి వచ్చాయి. వీటిపై ప్రజల్లో అవగాహన రావాలి. అంతర్జాల వినియోగానికి ఆంగ్లం ఒక్కటే అవసరం లేదు. తెలుగులో కూడా చక్కగా ఉపయోగించుకోవచ్చని మా యాత్ర ద్వారా చెప్పాం.

**– డా॥ ప్రవీణ్, ఫిజియోథెరపిస్టు**

---



### మారాల్సింది అమ్మానాన్నలే

తెలుగు ఇళ్లలో చాలా చోట్ల తెలుగు వాడకం పూర్తిగా తగ్గిపోయింది. తెలుగు మాట్లాడితే ఉద్యోగం రాదనే అపోహను చిన్నతనం నుంచే కలిగిస్తున్నారు. తల్లిదండ్రుల్లో ముందు మార్పు వస్తే.. పిల్లలు వారంతట వారే తెలుగును అభ్యసిస్తారు. అంతర్జాలంలో తెలుగులో కార్యకలాపాలు సాగించడానికి అద్భుతమైన అవకాశాలున్నాయి. యాత్ర ద్వారా వాటిని ప్రజల్లోకి తీసుకువెళ్లాం.

**– సతీష్‌కుమార్, శ్రీలిపి గ్రాఫిక్స్ నిర్వాహకులు**

---



### తెలుగులోనే విజ్ఞానం

ఒక మంచి పని కోసం ఈ యాత్ర చేపట్టాం. అంతర్జాలంలో అవసరమైన తెలుగు ఖతులు ఇప్పుడు సిద్ధంగా ఉన్నాయి. వీటిని ఉపయోగించుకోవడం ద్వారా తెలుగుభాషలోనే విజ్ఞానాన్ని పొందవచ్చు. ఇతర భాషలకు దీటుగా మన తెలుగును అంతర్జాలంలో అభివృద్ధి చేస్తున్నాం.

**– జయశంకర్, సాఫ్ట్‌వేర్ ఇంజనీరు**






## వెన్నెల కవిత్వం

నక్షత్రాల ఆకాశం
జల్లెడ పడుతున్నట్టు
వెన్నెల పిండి రాలుతుంది,
దూదిలా ఎగురుతూ
పావురమై వాలింది.

చీకటిని
నల్లపూసలా పోగొట్టుకున్నట్టు
తెల్లగా వెతుక్కుంటుంది,
పున్నమి వెన్నెల ముద్దు పెడుతున్నట్టు
కడలికాంత ఎద ఉప్పొంగుతుంది

అమృతం చల్లుతున్నట్టు
చినుకులు రాలుతాయి
మట్టి పొరలలో విత్తుకున్న విత్తనాలు
మొలకలై నిద్రలేస్తాయి,
ఏపుగా పెరిగిన వరికర్రలు
వలపు పంట సాక్షులవుతాయి,
వెన్నెల కవిత్వాన్నిస్తుంది,

నీటి ప్రవాహంలో దొర్లుతున్న
గులకరాయిలా
వెన్నెల్లో తడిసినందుకు
నాలో వెన్నెల కవిత్వమయ్యింది.

**జి.రామకృష్ణ,**
భూదాన్ పోచంపల్లి. 89774 12795

# రథసప్తమి

"అమ్మా! బడికెళ్లేటప్పుడు కాళ్లు మాడిపోతున్నాయే.. జోల్లు కొనే.." తల్లిని బతిమాలుతున్నాడు సింహాచలం.

"అలాగేలేరా.. నేను సంపాదించిన దాంట్లో మీ అయ్య తాగడానికి పోగా ఇంకేటైనా మిగిల్తే కొనుక్కుందువులే.." మొగుడు తీరుతో విసిగిపోయిన వెంకటమ్మ ఆ కోపం కొడుకు మీద చూపిస్తూ చిరాగ్గా సమాధానం చెప్పింది.

"అలక్కాదే.. మా బడిలో ఒకటో తరగతి, రెండో తరగతి పిల్లలు కూడా సెప్పులేసుకునే ఒత్తన్నారే.. అయిదో తరగతి సదువుతున్నాను, ఇంతవరకు ఎప్పుడైనా నాకు సెప్పులు కొన్నావే.." తల్లిని నిలదీశాడు సింహాచలం.

"సెప్పానుగదా.. నానైతే కొనలేను, మీ అయ్య కొంటాడేమో ఎల్లడగు" మళ్లీ అదే సమాధానం చెప్పింది.

ఇక లాభం లేదనుకుని ఏడ్చుకుంటూ, కాళ్లీడ్చుకుంటూ బడికి బయల్దేరాడు సింహాచలం.

బడికెళ్లాడే కానీ వాడి కళ్ల ముందు చెప్పుల జతే కనిపిస్తోంది.. ద్వారం దగ్గర పిల్లలంతా విడిచిపెట్టిన చెప్పులు కనిపిస్తుంటే వాడి బాధ మరింత ఎక్కువైంది.. మాస్టారు చెప్తున్న పాఠం ఒక్కముక్క కూడా చెవికెక్కడం లేదు. నీలం రంగు పట్టీలతో తెల్లగా మెరిసిపోతున్న హవాయి చెప్పులు, పెద్దవీధి పరమేశుగాడి తోలు చెప్పులు, కోదాటి రాము నల్లటి బూట్లు.. అన్ని జతలు ఎదురుగా కనిపిస్తుంటే తనకు చెప్పులు లేవన్న బాధ సింహాచలానికి మరింత ఎక్కువైంది. 'అమ్మనడిగితే తిడతంది.. అయ్యనడిగితే? కొట్టడం గారంటీ. మరెలా..? ఎలాగైనా సెప్పుల జత కొనుక్కోవాల' తనలో తానే మాట్లాడుకుంటూ మాస్టారు పాఠం చెప్తున్న విషయమే మర్చిపోయాడు సింహాచలం. 'కొడితే కొట్టాడు అయ్యనే అడగాల' నిశ్చయించుకున్నాడు. సాయంత్రం బడి విడిచిపెట్టగానే పుస్తకాల సంచి సంకనేసుకుని ఇంటికి పరిగెట్టాడు. అరుగు మీదున్న నులక మంచంలో పడుకుని చార్మినార్ సిగరెట్టు పొగలొదుల్తున్నాడు వెంకటి. మంచంకోడుకి పుస్తకాల సంచి తగిలించి మాట్లాడకుండా నిలబడ్డాడు సింహాచలం.

"బడి అప్పుడే ఒగ్గేసినారేట్రా?" కొడుకుని పలకరించాడు వెంకటి..

"నాలుగైంది ఒగ్గీరేటి?" కొంచెం విసుగు ప్రదర్శించాడు సింహాచలం.

"ఓసోస్.. ఏటీ కోపం! కలెక్టరు సదువు సదివినోడుకైనా లేదురా ఇంత సిరాకు"

"సిరాకు రాదేటి మరి.. బడిలోని పిల్లలందరూ సెప్పులేసుకునే వత్తన్నారు.. నా ఒక్కడికే లేవు.. యంటనే నాకు సెప్పులు కొనాలి నువ్వు" అడగాలనుకున్నది అడిగేశాడు.

"నువ్వేటి బుస్సీ దొరవేటి బూట్లేసుకుని తిరగడానికి.. అయినా నాకాడేముంది నీకు జోల్లు కొనివ్వడానికి.. ఒక పని సెయ్యి, ఎల్లుండి రథసప్తమి వస్తంది.. అరసవల్లి సూర్యనారాయణమూర్తి గుడికాడికి ఎల్లినావంటే కంటికి నచ్చిన జత తొడుక్కోని వచ్చీయొచ్చు.. ఎలాగుంది పన్నాగం"

"నువ్వు కొనివ్వకపోతే మానీగానీ ఇలాంటి ఎదవ పన్నాగాలు పన్నకు.. పిల్లడికి దొంగతనం నేరపడానికి సిగ్గులేదా?" మొగుణ్ని గదమాయించింది వెంకటమ్మ.

"అలాక్కాదే.. ఇకటమాడినానే.. కొంతానులాయే.."

"నీ మాటలు నమ్మితే నాకు సెప్పులు జత వచ్చినట్టే.." విసుక్కుంటూ ఇంట్లోకి వెళ్లిపోయాడు సింహాచలం.

చెప్పుల జత కావాలంటే యాభై రూపాయలైనా ఉండాలి.. ఎలాగైనా సంపాదించాలి.. ఆలోచనలో పడ్డాడు సింహాచలం. అయ్య చెప్పినట్టు గుడిలో చెప్పులు దొంగిలిస్తే.. ఛీఛీ.. కొత్తవి కొనుక్కోవాలి.. భోజనం చేస్తున్నంతసేపూ ఇవే ఆలోచనలు. 'ఎల్లుండే రథసప్తమి' అయ్య మాటలు గుర్తు తెచ్చుకున్నాడు.. కన్నుమూసినా కన్ను తెరిచినా చెప్పులనే చూస్తున్న ఆ పదేళ్ల కుర్రాడికి అదిరిపోయే ఆలోచన వచ్చింది.. చెప్పుల జత ఎలా సంపాదించుకోవడానికి అతడికి దారి కనిపించింది.. నిశ్చింతగా నిద్రపోయాడు ఆ రాత్రి.

పొద్దున్న లేచి ఎప్పటిలా బడికి వెళ్లిపోయాడు.. పాఠాలన్నీ శ్రద్ధగా విన్నాడు, సాయంత్రం బడి విడిచిపెట్టేముందు 'రేపు రథసప్తమి.. స్కూలుకి సెలవు' అన్న చల్లని కబురు మాస్టారు నోటి నుంచి వినగానే సంబరపడిపోయాడు. ఎందుకంటే చెప్పులు సంపాదించుకోవడంలో భాగంగా మరునాడు బడి ఎగ్గొట్టాలనుకున్నాడు కానీ ఆ అవసరం లేకుండానే సెలవు దొరకడంతో బెల్లం తిన్నంత సంతోషం కలిగిందతనికి. ఇంటికి వెళ్లి తల్లి దగ్గర కూర్చుని ఉల్లాసంగా కబుర్లు చెప్పాడు. అన్నం తిని అరుగు మీద పడకేశాడు, అనుకున్నది సాధించాలంటే ఆ రోజురాత్రి పన్నెండు గంటలకు నిద్ర లేవాలన్న సంగతి అతనికి తెలుసు. అందుకేనేమో.. అంతంత మాత్రంగానే నిద్ర పట్టింది.. పన్నెండో, ఒంటిగంటో తెలీదు మొత్తానికి అర్ధరాత్రే మెలకువ వచ్చింది. ఒక్క ఉదుటున లేచి చుట్టూ చూశాడు.. అమ్మ, అయ్య గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. ఇంటి నుంచి బయటపడి కళ్లు నులుముకుంటూ నడక ప్రారంభించాడు.

ప్రధాన వీధి మీదకు వచ్చేసరికి జనాలు బారులు తీరి నిల్చోవడం కనిపించింది.







రథసప్తమి రోజు ఎలా ఉంటుందో సింహాచలానికి అప్పటికే తెలుసు కాబట్టి ఎలాంటి ఆశ్చర్యం లేకుండా ఆ వరుస ఎంత వరకు ఉందో అనుకుంటూ అటూ ఇటూ చూశాడు. అక్కడికి దాదాపు కిలోమీటరు దూరం ఉంటుంది అరసవల్లి సూర్యనారాయణస్వామి గుడి.. ఇంకా వెనక్కి కనుచూపు మేర జనాల వరుస కనిపిస్తోంది.. తెల్లారేసరికి జనాల బారులు మరో రెండుమూడు కిలోమీటర్లు పెరిగి పాతబస్టాండు వరకు చేరుతుందని అతనికి తెలుసు. అందుకే ఆలస్యం చేయకుండా ముందుకు నడిచాడు.. రోడ్డంతా జనాలే, చేతిలో పువ్వులు, కొబ్బరికాయలు, అగరుబత్తీలు.. నిండా తలస్నానం చేసిన ఆడామగా ఆదిత్య దర్శనం కోసం అర్ధరాత్రి నుంచే బారులు తీరారు. కోవెలకు కిలోమీటరు దూరం నుంచే పోలీసులు కాపలా కాశారు. కార్లు, బస్సులు, ఆటోలే కాదు మోటారు సైకిళ్లను కూడా వెళ్లనివ్వడం లేదు. రోడ్డు పక్కన ఖాళీ స్థలాల్లో బళ్లు నిలిపి నడుచుకుంటూ వెళ్లాల్సిందే. వరుసల్లో వెళ్లాల్సిందే.. ఆ వరుసల్లో నిల్చుంటే తెల్లారిన తరువాత కానీ కోవెల వద్దకు చేరుకోవడం కష్టం. అందుకే వరుసల పక్కగా నడుచుకుంటూ కోవెల వైపుగా సాగిపోతున్నాడు. చిన్నపిల్లాడే కావడంతో అతడినెవరూ పెద్దగా పట్టించుకోకపోవడంతో జనాన్ని చూస్తూ, చెప్పుల జతను తలచుకుంటూ ఏదో తెలియని ఉత్సాహంతో గుండెల నిండా ఆనందంతో సింహాచలం వడివడిగా అడుగులేస్తూ కోవెల వీధికి చేరుకున్నాడు. సర్వీ కర్రలతో వరుసలు వరుసలుగా కట్టి భక్తులను అందులోంచి లోపలికి పంపిస్తున్నారు.. విద్యుద్దీపాలు పెట్టడంతో రాత్రి రెండు గంటలైనా పట్టపగల్లా కనిపిస్తోంది.. ఆలయానికి వెలుగు ప్రవాహంలా విద్యుద్దీపాలు కట్టడంతో మళ్లీమళ్లీ చూడాలనిపించేలా ఉంది. ముందు దేవుడి దర్శనం చేసుకుని పని ప్రారంభించాలనుకున్నాడు.. కానీ లైన్లో నిలబడి దర్శనం చేసుకోవాలంటే తెల్లారిపోతుంది.. అందుకే పుష్కరిణిలో స్నానం చేసొచ్చి కోవెల ఎదురుగా నిల్చుని మనసులోనే దండం పెట్టుకున్నాడు సింహాచలం.

చుట్టూ చూశాడు.. తనకు అనుకూలమైన చోటెక్కడుందో వెతికాడు. ఎక్కడా ఖాళీ కనిపించలేదు.. కొబ్బరికాయలు, పువ్వులు, సెనగలు, కాశీతాళ్లు, దేవుని పటాలు అమ్మే దుకాణాలు.. చిన్నచిన్న తోపుడు బండ్లతో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. వాటి మధ్యనే చిన్న ఖాళీ చూసుకుని తనతో తెచ్చుకున్న గోనెపట్టా కింద పరచి దానిపైన కూర్చున్నాడు. సంచిలో నుంచి పలక తీశాడు. అది పడిపోకుండా ఇటుక రాయి దన్ను పెట్టాడు. పలక మీద సుద్దముక్కతో అందంగా 'ఇక్కడ మీ చెప్పులు భద్రం' అని రాశాడు. చెప్పులతో గుడిలోకి వెళ్లకూడదు కాబట్టి బయట ఉంచాల్సిందే.. ఎక్కడపడితే అక్కడ వదిలేస్తే మళ్లీ దొరుకుతాయన్న నమ్మకం ఉండదు కాబట్టి ఎవరో ఒకరు కాపలా ఉన్న చోటైతే మంచిది. మామూలుగా అయితే ఆలయాల బయట యాచకుల దగ్గర చెప్పులు విడిచి వెళ్తారు.. సింహాచలానికి వాళ్ల నుంచి పోటీ ఉన్నా అతని వయసు, 'మీ చెప్పులు భద్రం' అంటూ పలక మీద రాయడం భక్తులను ఆకర్షించింది. ఒక్కొక్కరు అక్కడ



చెప్పులు విడిచి వెళ్తున్నారు. చుట్టూ గుట్టలు గుట్టలుగా చెప్పులు.. మధ్యలో కూర్చున్నాడు సింహాచలం.. సమయమెంత యిందో తెలీదు.. కానీ పగటి వెలుతురు కొద్దికొద్దిగా కనిపిస్తుండటంతో తెల్లవారుతోందని మాత్రం అతనికి అర్థమైంది. అర్ధరాత్రి నుంచి వరుసల్లో నిల్చుని ఆదిత్యుని దర్శనం చేసుకున్నవారు ఒక్కొక్కరుగా తిరిగొస్తున్నారు. సింహాచలం దగ్గర చెప్పులుంచినవారంతా మళ్లీ వచ్చి అక్కడున్న వాటిలో తమవి ఏవో వెతుక్కుని వెళ్తున్నారు. వెళ్లేటప్పుడు అర్ధరూపాయో, రూపాయో ఇస్తున్నారు.. ఎవరు ఎంతిస్తే అంత తీసుకుని సంచిలో వేసుకుంటున్నాడు.. దర్శనానికి వెళ్లేవారు వచ్చి చెప్పులు విడుస్తున్నారు.. దర్శనం చేసుకుని తిరిగొస్తున్నవారు తమ చెప్పులు తీసుకెళ్తున్నారు.. సింహాచలానికి ఒక్క నిమిషం కూడా ఖాళీ దొరకడం లేదు.

దర్శనం తరువాత భక్తులు ఇంద్రపుష్కరిణి దగ్గర పాయసం వండుకుని తినడం

అలవాటు.. ఆ వాసన ముక్కుపుటాలకు కమ్మగా సోకుంతుంటే సింహాచలం కడుపులో ఆకలి మొదలైంది. ఇక చాలించి ఇంటికి వెళ్లిపోదామనుకున్నాడు కానీ తన చుట్టూ గుట్టలుగా చెప్పులున్నాయి.. సాయంత్రం

**కథలోని కొన్ని పదాలకు అర్థాలు..**

జోల్లు = చెప్పులు
ఒగ్గీసినారేట్రా = విడిచిపెట్టేశారా?
మంచం కోడు = మంచం కాలు
ఇకటం = వికటం
సర్వీకర్ర = సరుగుడు కర్ర
ఇంద్రపుష్కరిణి = అరసవల్లి ఆలయంలోని పుష్కరిణి పేరు

వరకు భక్తులు వస్తూనే ఉంటారు, అంతవరకు తాను ఉండలేడు, ఇంటికి వెళ్లిపోవాలి.. పలక తీసి సంచిలో పెట్టేశాడు. కొత్తగా చెప్పులుంచడానికి వస్తున్నవారిని ఇక అక్కడ తాను కాపలా ఉండనని చెప్పేశాడు. అప్పటికే ఉన్నవన్నీ సంబంధీకులు తీసుకెళ్లేవరకు ఉన్నాడు.. అప్పటికే ఎండ నడినెత్తికొచ్చింది.

కాళ్లు పీకుతున్నా, ఆకలేస్తున్నా.. కొత్త చెప్పులు కొనుక్కోబోతున్నానన్న ఆనందంలో వేగంగా నడుచుకుంటూ ఇంటికి చేరుకున్నాడు.

సింహాచలాన్ని చూడగానే వెంకటమ్మ ఇంతెత్తున లేచింది.. "ఎక్కడికెళ్లావురా.. తెల్లారి నుంచి కనిపించలేదు.. ఇంటికాడ సెప్పి ఎల్లాలి కదా.." అంటూ తిట్ల దండకం అందుకుంది.

"రథసప్తమి కదే.. గుడికెళ్లినాను"

"ఓస్ దేవుడి మీద బక్తేనా.. లేకపోతే అయ్య సెప్పినట్లు జోల్లు దొంగతనానికెళ్లావా?"

"దొంగతనం సెయ్యాల్సిన కర్మ నాకేటే.. నాకూనీకూ ఇద్దరికీ జోల్లు కొంటాను.. అన్ని డబ్బులు సంపాదించినాను" అంటూ సంచిలోని చిల్లరంతా అరుగు మీద కుప్పగా పోశాడు.

"ఇదేట్రా.. అడుక్కొని వచ్చినావా ఏటి.. ఎదవా.."

"కాదే.. సెప్పులకు కాపలా ఉండి సంపాదించినానే.." మెరుస్తున్న కళ్లతో సింహాచలం అర్ధరాత్రి నుంచి తాను చేసిందంతా చెప్పుకొంటూ వెళ్లిపోతున్నాడు.. ఒక్క జత చెప్పుల కోసం కొడుకు ఎంత కష్టపడ్డాడో వింటూ ఏడ్చేసింది వెంకటమ్మ.

"ఎంత కష్టపడ్డావో ఏటో.. రా.. ఇంత బువ్వ తిందువు.. సాయంకాలం బజారుకెళ్లి సెప్పులు కొనుక్కుందువు" అంటూ భోజనం వడ్డించిందామె. సింహాచలం భోజనం చేస్తుంటే వెంకటమ్మ డబ్బులు లెక్కపెట్టింది..

"మూడొందల పాతిక రూపాయలు సంపాదించినావురా.. ఎదవన్నర ఎదవా.. ఎంత పెద్దోడివైపోయావురా" అంటూ ప్రేమగా తిడుతూ డబ్బులు జాగ్రత్త చేసింది.

"నువ్వూ రాయే.. నాతోని" అమ్మని పిలిచాడు.. వెంకటమ్మకి కూడా ఒక జత కొనాలన్నది అతడి ఆలోచన.

"పదరా అయితే.." బయల్దేరింది వెంకటమ్మ.. చెప్పులు కొనుక్కోవాలనుకుంటున్న కొడుక్కి బూట్లు కొనిపెట్టాలన్నది ఆమె కోరిక.






**కళ్లేపల్లి రవికుమార్**
ఉపాధ్యాయుడు, బాడాం,
శ్రీకాకుళం. 94906 55535


# ఆంగ్లంలో జీవించొద్దు!




అద్దేపల్లి రామ్మోహనరావు


తెలుగుభాష చాలా ప్రమాదకరమైన పరిస్థితుల్లో ఉంది. రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితుల వల్ల ఈ ముప్పు వాటిల్లుతోంది. రాజకీయంగా.. విద్యా విధానం అంతా కూడా ఇతర దేశీయుల అడుగు జాడల్లో నడుస్తున్న నేపథ్యంలో ఆంగ్లం అనివార్యమైపోతోంది. పూర్వం ప్రజలు అవసరం కోసం విదేశాలకు వెళ్లి ఆంగ్లం నేర్చుకున్నారు. ముందు మాతృభాషపై అభిమానం ఉంటే అసక్తిని బట్టి ఆంగ్లం నేర్చుకోవచ్చు. రెండోది సాంస్కృతికమైన మోజు. ప్రపంచమంతా ఆంగ్లం ఉండడంతో వారిని అనుకరిస్తున్నాం. ఇదిలాగే ఉంటే కొంతకాలానికి నశించిపోయే భాషల్లో తెలుగుభాష ఒకటవుతుంది. ఇది భయంకరమైన ప్రస్తుత పరిస్థితి. కన్నడ, తమిళ, మలయాళ ప్రాంతాల్లో ఉన్నటువంటి భాషాభిమానం మన వాళ్లలో లేదు. ఒక ప్రాంతంలో ఇద్దరు తమిళ, మలయాళీలు కలిస్తే వాళ్ల భాషలోనే మాట్లాడుకుంటారు, మనవాళ్లు మాత్రం ఆంగ్లంలో మాట్లాడుకోవడం విస్తుగొలిపేదే. ఆయా ప్రాంతాల్లో దుకాణాల బోర్డులు వారి భాషలో ఉండి కింద ఆంగ్లంలో ఉంటున్నాయి. కానీ ఇక్కడ ఈ స్థితి లేదు. కారణం ఆంగ్లంపై మనకున్న విపరీతమైన మోజే. మాతృభాష కంటే ఎక్కువగా దాన్నే ఆదరిస్తున్నాం.

ఈ నేపథ్యంలో తెలుగు భాషను మనం రక్షించుకోవాల్సిన అవసరం ఉంది. ఒకటో తరగతి నుంచే పిల్లలకు ఆంగ్లంలోనే పాఠ్యాంశాలు నేర్పించాలనే ధోరణి వచ్చేసింది. తెలుగుకు ప్రాచీన హోదా వచ్చిందని మనం అనుకుంటున్నాం. ఆ హోదా వల్ల ఇప్పుడు ఒరిగిందేమీ లేదు. తెలుగు గొప్పదనం ఎప్పుడూ ఉంది. సింధు నాగరికత కాలం నుంచి ఉంది. అది కాదు మనకు కావాల్సింది. వర్తమానం ఏంటనేది ముఖ్యం. ఆ వర్తమానం అనేది ఎలా వస్తుందనేది ముఖ్య విషయం. పాలనా వ్యవహారాలు తెలుగుభాషలో జరగాలి. ప్రభుత్వానికి సంబంధించిన విషయాలు, ఉత్తర్వులు అన్నీ తెలుగులోనే ఉండాలి. బోధనా భాషగా తెలుగుకు అవకాశం ఉండాలి. పరిపాలనా భాషగా తెలుగు ఉండాలి. కన్నడ, మలయాళానికి మంత్రిత్వ శాఖ అంటూ ప్రత్యేకంగా ఉంది. మన ప్రభుత్వం కూడా మంత్రిత్వ శాఖకు అంగీకరించింది. కార్యాచరణకు పూనుకోవాలి. శాఖ ఉంటే శాసనాలు చేయవచ్చు. దీనివల్ల చిన్నప్పట్నుంచి భాషపై అభిమానం ఏర్పడుతుంది. అవసరం కోసం ఆంగ్లం వాడుకోవచ్చు. ఆంగ్లాన్ని భాషగా చూడు అంతే తప్ప చిన్నప్పట్నుంచి ఆంగ్లంలోనే జీవించాలనుకోవడం మాతృభాషకు అన్యాయం చేయడమే.

# బంగారు తెలుగు




తెలుగు తల్లి నిజంగా 'కుందనపు బొమ్మే'. ఎలాగంటే, బంగారం ఎన్ని రూపాల్లో మెరుస్తుందో.. అలాగే భాష కూడా 'బంగారం' అనే పదాన్ని కలుపుకొని అన్ని 'రూపు'ల్లో మెరుస్తూ.. తెలుగుతల్లికి అలంకారశోభితమౌతోంది. బంగారం కలిసిన తెలుగు.. పలుకుబడులే పలకసరులుగా; పద్యాలే కమ్మలుగా; జాతీయాలు అందెలుగా; సామెతలు మురుగుల్లా; కథలు కాసులపేర్లుగా; గేయాలు వంకీలుగా; కీర్తనలు మువ్వల వడ్డాణంలా; సినీగేయాలు జిగినీ గొలుసుల్లా; నానుడులు ముక్కుపుడకల్లా; నుడికారాలు నాగరం, పాపిడిబిళ్లల్లా తలమానికమై... భాషను ధగద్ధగాయమానం చేస్తున్నాయి.

### కవనంలో కనకం

కంచు మోగునట్లు 'కనకంబు' మోగునా... 'కనకపు' సింహాసనమున శునకమును కూర్చుండబెట్టి... అనే వేమన, సుమతీ శతక పద్యాలు చెవులకు కమ్మగా వినిపిస్తూ తెలుగుతల్లికి రెండు కమ్మలుగా మెరుస్తున్నాయి.

### బంగారు భవిత కోసం

బాలల 'బంగారు భవిత' కోసం బంగారు గుడ్డు పెట్టే బాతు, బంగారు గొడ్డలి, పులి - బంగారు కడియం లాంటి నీతి కథల్ని బాల సాహిత్యంలో పొందుపరిచారు.

### కొంగు బంగారం

తెలుగువారి 'కొంగుబంగారమై'న వేంకటేశ్వరుని వాసము.. 'బంగారు శిఖరాల' బహు బ్రహ్మమయమూ.. అంటూ అన్నమయ్య... 'బంగారు కణికలు మింగబోరన్న మంచి పలుకే బంగారమాయెనా... అంటూ రామదాసు... కనకన రుచిరా 'కనక' వసనా నిన్ను... అంటూ త్యాగరాజు ఆలపించారు.

### రా రా కన్నయ్యా..

తెలుగింట చిన్నారులు తమ చిట్టి చేతుల్ని జోడించి.. వారి చిన్ని నోటితో 'చేతవెన్న ముద్ద...చెంగల్వ పూదండ..',
'బంగారు మొలతాడు పట్టుదట్టి' - అంటూ కృష్ణుని ప్రార్థిస్తుంటారు.

### తెలుగుతల్లికి స్వర్ణహారతి

కడుపులో 'బంగారు'.. కనుచూపులో కరుణ... 'బంగారు పంటలే' పండుతాయి... అంటూ శంకరంబాడి సుందరాచారి అర్చించిన 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ' గేయాన్ని పాడుతూ, పల్లె సీమల్ని 'బంగారు సీమ'లుగా తలపోస్తాం. నిజానికి తెలుగు భాష వెలుగు పంటల్ని పండిస్తోన్న పల్లె సీమలు.. అసలైన బంగారు సీమలే కదా!? 'పుత్తడి బొమ్మ' పూర్ణమ్మ అనే కరుణరస గేయంతో తెలుగు వారి గుండెను పిండేశారు గురజాడ. రావోయి 'బంగారు మామా' అని కొకనళ్ల వెంకటరత్నం ఓ చిన్నదాని చేత జానపద గీతాన్ని పాడించారు. "బంగారు చెంబు"తో పన్నీరు పట్టుకు పడతి రుక్మిణి వచ్చె మేలుకో - అనే మేలుకొలుపు గేయంలో, సంప్రదాయంతో బాటు, ఆనాటి వాడుక భాష కూడా మిళితమై ఉంటుంది. "బంగారు పాపాయి" బహుమతులు పొందాలి... పాపాయి చదవాలి మా మంచి చదువు - అనే లలిత గీతం తొలి తెలుగు నేపథ్య గాయని రావు బాలసరస్వతి ఆలపించి.. ఆ రోజుల్లో అమ్మాయిల చదువు ప్రాముఖ్యాన్ని చాటి చెప్పారు.

### వెండితెరకు బంగారు నగిషీలు

"బంగారు బొమ్మ రావేమే"- అంటూ ఓ సినీ కవి పెళ్లి పీటల మీదకు, పెళ్లి కూతుర్ని ఆహ్వానిస్తాడు. ఈ చల్లని లోగిలిలో.. ఈ "బంగారు కోవెల"లో.. అంటూ కుటుంబ వ్యవస్థలోని గొప్పదనాన్ని నినదిస్తాడు. మరో సినీకవి.

### ఆ నవ్వుల్లో 'హేమం'త చల్లదనం

తెలుగు తల్లులు తమ "బంగారు కొండ"ల్ని సముదాయిస్తూ నీలాలు కారితే నే చూడలేను.. పాలైన కారవే "బంగారు కనుల"- అంటూ పాడుతుంటారు. లాలి ఉయ్యాలమ్మ.. జోల ఉయ్యాలా/ చిన్ని మా అమ్మాయికి 'బంగారుయ్యాల'... అంటూ జోల పాడుతుంటారు. వాళ్లు అన్నం తినమని మారాం చేస్తే, చందమామ రావే.. జాబిల్లి రావే/ 'పైడి గిన్నె'లో పాలుపెరుగు తేవే - అంటూ ఆ చందమామని వేడుకుంటారు. వాళ్లేమైనా చిలిపి పనులు చేశారా.. 'నీ ఇల్లు బంగారం గానూ' అంటూ తీయగా శపిస్తారు. తమ పిల్లలకు 'బంగారు బాట' వేయాలని శ్రమించే తల్లిదండ్రులు 'కొత్త బంగారు లోకం'.. మాకు కావాలి సొంతం అంటూ పిల్లలు గానం చేసేలా.. తెలుగు మీద మమకారం పెంచాలి.

### సామెతల సువర్ణగని

'బంగారం లాంటి పిల్లాడు' వాడికేం.. అని తెలుగింటి బొమ్మలు తమ 'బంగారు తండ్రుల్ని' వెనకేసుకొస్తారు. తమ మనుమడిలాంటి వరుడు దొరకాలంటే ఏ పిల్లో 'బంగారు పూలతో పూజ చేస్తుండాలి' అని డాంబికాలు పలికిస్తారు. పిల్లకేం 'నిలువెత్తు బంగారం' అని పొగడగానే సరికాదు.. ఆ పిల్ల విజ్ఞతగా, మృదు మధురంగా మాట్లాడినప్పుడే 'బంగారానికి తావి అబ్బినట్లుంది' అని మెచ్చుకొని తీరతాం. కోడలి ఆగడాలు తట్టుకోలేని అత్తగారు 'ఆ మన బంగారం మంచిదైతే...అనే సామెత గుర్తుకు తెచ్చుకుని పెదవి విరిచేస్తారు. 'బంగారు పిచ్చుక'ను పట్టు/కట్టుకోవాలని చూసే దురాశాపరులు కొందరైతే... 'బంగారు పంజరం' లాంటి రాచరికపు జీవితాన్ని గడుపుతున్న ఇల్లాళ్లు మరికొందరు!! వచ్చీరాని అన్యభాషలను వచ్చినట్లుగా మాట్లాడేవారిని చూస్తే 'మెరిసేదంతా బంగారం కాదు' అనబుద్ధేస్తుంది. 'బంగారం లాంటి మాట చెప్పారండి..' అని ఏకీభవించేవారూ లేకపోలేదు. ముంజేతి 'కంకణానికి' అద్దమేల అన్నట్లు తెలుగు గొప్పదనం గురించి కొత్తగా చెప్పాల్సిన అవసరం లేదు. అయినా 'బంగారు తెలుగు' గురించి ఎంత చెప్పుకున్నా.. అది ఓ "మచ్చుతునక" మాత్రమే!!





చింతలచెరువు సువర్చల
హైదరాబాద్. 92465 99061

# అచ్చ తెలుగు పద్యకచేరి!

**ఓరుగంటిని ప్రతాపోగ్రత నటియించు**
**కాకతీరుద్రుల గన్నతల్లి**
**కొండవీట ప్రతాప తాండవంబొనరించు**
**రెడ్డివీరులగన్న దొడ్డతల్లి**
**పలనాటశౌర్యాగ్ని పరవళ్లుద్రొక్కిన**
**బాలచంద్రములను బడయుతల్లి**
**అబ్బురంబు రహింప బొబ్బిలిబీరంపు**
**బెబ్బులులంగన్న పెద్దతల్లి**
**రాజధాని విజయనగరంబు చేసి**
**మూరురాయరగండలై ముదముగూర్చు**
**వీరనరపతులనుప్రేమ వెలయగన్న**
**దివ్యమూర్తివి మాతల్లి తెలుగుతల్లి.**

కొర్నెపాటి శేషగిరిరావు కవితా శక్తిని కళ్లకు కట్టే చిన్న ఉదాహరణ ఇది. 'పుట్ట తేనియ మాధుర్య ముట్టిపడగ/ కలువపూవుల చలువలు గడలుకొనగ/ గప్పురపు దావులంతట గుప్పుమనగ/ పలుకుపలుకున దొలుకాడె తెలుగువెలుగు'.. అంటూ గుండెల నిండా ఉప్పొంగుతున్న తెలుగు భాషాభిమానాన్ని అలతి అలతి పదాలతో అక్షరీకరించిన కృతికర్త ఆయన.

గుంటూరు జిల్లా చేబ్రోలులో జన్మించారు కొర్నెపాటి. తీవ్ర ఆర్థిక ఒడిదొడుకులను ఎదుర్కొంటూ విద్యాభ్యాసం సాగించారు. తెలుగు, సంస్కృత, ఆంగ్ల భాషల్లో ప్రావీణ్యం సముపార్జించారు. చేబ్రోలు ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా వృత్తి జీవితం ప్రారంభించారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని కారాగారానికీ వెళ్లారు. ఆయన భార్య వెంకటలక్ష్మమ్మ. ఆ దంపతులకు తొమ్మిది మంది సంతానం. ప్రస్తుతం వారి మనవళ్లలో ఒకరైన చంద్రశేఖరరావు ఆశుకవిగా తాత గారి సాహితీ వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు.

కొర్నెపాటి రచనల్లో 'సతీ అనసూయ' (నాటకం, 1946), 'తెలుగు వెలుగు' (ఖండకావ్యం, 1949), 'మహాకౌలీనము' (పద్య గద్య కావ్యం, 1976) మాత్రమే ప్రచురితమయ్యాయి. 'సౌందర్యలహరి' (ఆంధ్రీకరణ), 'శివానందలహరి' (ఆంధ్రీకరణ), 'గంగాలహరి', 'ముకుందమాల', 'పండితరాయ సుభాషితములు', 'కాలపరివర్తనము' తదితర పది గ్రంథాలు ఇప్పటికీ అముద్రితంగానే ఉన్నాయి. వీటితో పాటు ఆయన రచించిన నాలుగొందలకు పైగా సమస్యాపూరణ పద్యాలకు ఆర్థిక పరిస్థితుల కారణంగా ప్రచురణ భాగ్యం దక్కలేదు. చేబ్రోలులో 'దేశోద్ధారక సాహితీ పరిషత్'ను ప్రారంభించారు కొర్నెపాటి. తెలుగు సారస్వతం, కళల పరిరక్షణకు కృషి చేశారు. 1938లో 'తెలుగు వెలుగు' లిఖిత మాసపత్రికను ప్రారంభించి కొద్దికాలం నడిపారు. తేలికైన మాటలతో ముక్కుసూటిగా భావాలను వెలువరిస్తూ కవితలు రాశారు. తెనాలి 'శారదా సాంస్కృతిక పరిషత్' నుంచి 'కవిరత్న' అన్న బిరుదును అందుకున్నారు. 82 సంవత్సరాల వయసులో 1982 మార్చి 14న తనువు చాలించారు

వాగ్దేవీ వరప్రసాదమైన రచనాశక్తికి తగిన కీర్తిని అందుకోలేకపోయిన దురదృష్టం కొర్నెపాటి వారిది. దశాబ్దాల తరబడి మట్టిలో మాణిక్యంగానే ఉండిపోయారు. ఒక సందర్భంలో ఆయన రచించిన 'మహాకౌలీనా'న్ని చదివిన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ... కొర్నెపాటి కవన ప్రతిభకు ఆశ్చర్యపోయారు. 'ఈ కవికి తెలుగు నుడికారము చాల చక్కగా తెలియును. కల్పనలాశ్చర్యముగ చేయగలడు. ఈ కథానిర్మాణములోనే ఈయన కల్పనా సామర్థ్యము విశదమగుచున్నది. ఈయన శివుని వర్ణించిన సీసపద్యమొక్కటియే చాలును. ఈయనను ఎంతయైనను ప్రశంసించవచ్చును. ఈయన చేసిన ప్రయోగాలు, వాడిన పలుకుబళ్లు, శబ్దశ్లేషలు సర్వత్రా హృదయంగమముగనున్నవి. కావ్యమంతయు నుదాత్తముగనున్నది. ఈ కావ్యమొక విలక్షణమైన, వినూత్నమైన ఆంధ్ర భాషా మహాదేవ్యలంకార'మని ప్రశంసించారు.

'తెలుగు వెలుగు' ఖండికలోనైతే తెలుగు వెలుగుల విశ్వరూపాన్నే ప్రదర్శించారు. 'దిక్కులెల్లడ మార్మ్రోcగెcదెలుcగు భేరి/ దిక్కులన్నిటి ముంచెను తెలుcగు వెల్లి' అని సగర్వంగా ప్రకటించారు. వీరి రచనలో స్వభావోక్తులు కోకొల్లలు. తెలుగు పలుకుబళ్ల క్షణక్షణోదయాలు.

కొర్నెపాటి కవితా ఖడ్గానికి రెండు వైపులా పదునే. తెలుగు సంస్కృతీ గొప్పదనాన్ని ఆకాశానికెత్తుతూనే... తెలుగు నేలపై వ్యాపించిన దురాచారాలను, సాంఘిక అసమానతలను ప్రశ్నించారు. అప్పటి సమాజంలో నిరాదరణకు గురవుతున్న వర్గాల వారి పక్షాన నిలుస్తూ, వారికి జరుగుతున్న అన్యాయాలను ఖండించారు.

గత శతాబ్దపు నాలుగవ దశకం నాటికే వెర్రితలలు వేస్తున్న ఆంగ్ల భాషా వ్యామోహంపై అక్షర శరాలు సంధించిందో కలం. 'ఆంగ్లభాషకు గౌరవమధిక మాయె! దేశభాషల మర్యాద తీసిపోయె'నంటూ బాధాతప్తమైంది ఆ కవిహృదయం. ఆ వేదన నుంచే వెలుగుచూసిందో కవితా ఖండిక.. అదే 'తెలుగు వెలుగు'. తేట తెలుగు మాధుర్యం, తెలుగు నేల గొప్పదనం, తెలుగు సంస్కృతీ ఔన్నత్యాలకు అక్షరహారతులిస్తూ, తెలుగుతల్లికి పద్యనైవేద్యం సమర్పించింది ఆ రచన. విశిష్టమైన ఆ సాహిత్య సృష్టి చేసిన స్రష్ట... కొర్నెపాటి శేషగిరిరావు. అప్రతిహత ప్రతిభాసంపన్నుడైనప్పటికీ అంతగా ప్రాచుర్యం పొందని కవిశేఖరుడు.



**స్వచ్ఛమగు దేశభాషనుబలుకువారు!**
**నిలిచి యొకచోట జీవింప నేర్చువారు!**
**కాయకష్టంబు వృత్తిగాగలుగువారు!**
**ఎట్లు పంచము లస్పృశ్యు లెఋగరయ్య!**

అస్పృశ్యతను నిరసిస్తూ ఆయన పలికిన ఈ పలుకులే ఆయన మనస్తత్వానికీ, అభ్యుదయవాదానికీ ప్రతీకలు.

స్వాతంత్ర్య పోరాట సమయంలో ఎందరో కవులు తమ రచనలతో ప్రజలను ఉత్తేజితులను చేశారు. తెల్లవారికి వ్యతిరేకంగా పోరాడేలా సామాన్యుల్లో స్ఫూర్తినింపారు. కొర్నెపాటి కూడా వారిలో ఉన్నారు. 'స్వరాజ్యదీక్ష' పేరిట 1946లో ఆయన రచించిన పద్యాల్లో... భరతమాతను దాస్యశృంఖలాల నుంచి విడిపించడానికి ప్రతిఒక్కరూ నడుంకట్టాలన్న ఆకాంక్ష కనిపిస్తుంది.

**మువ్వన్నె జండాలు మునుకొని స్వాతంత్ర్య**
**వాయుసంచయము లవ్వారివీవ**
**శాంతిఖడ్గంబుల ఝళిపించి వీరులు**
**జాతీయనాయకుల్ జయముచాట....**

ఇలా సాగే ఆ కవిత... భరతమాత మెడలో ఆంధ్రుడు వేసిన మల్లెపూదండ.

**హిందుముస్లిం సమైక్యము నందిపొంది**
**తవిలి యస్పృశ్యతాదోష మవలద్రోసి**
**పూనుడీ సర్వభారతభూమి జనులు**
**పూజ్యతమ కార్యమైన స్వరాజ్యదీక్ష!**

కులమతాల పేరిట మనలో మనం పోట్లాడుకోకుండా ఐకమత్యంతో నిలవాలని, విదేశీయులను ఎదిరించి నిలబడాలని పిలుపునిచ్చారు కొర్నెపాటి.

**పశువులేకున్న జీవనోపాధి లేదు**
**పశువులేకున్న బహుయజ్ఞఫలము లేదు**
**పశువుపశువంచు మముదూల బలుకుచుంద్రు**
**ప్రాజ్ఞతయె యిద్ది మానవా వళులయందు!**

'హీనంగా చూడకు దేన్నీ' అన్న శ్రీశ్రీ మాటలోని అంతరార్థానికి పద్య రూపం ఇచ్చిన ప్రతిభ కొర్నెపాటి సొంతం. పశువుల నుంచి చిన్న చిన్న పురుగుల వరకూ అన్నిటికీ ప్రకృతిలో సమున్నతమైన స్థానం ఉందని, వాటి గొప్పతనం వాటిదేనని ప్రతిభావంతంగా చెప్పారాయన. ప్రస్తుతం అంతర్జాతీయ చర్చనీయాంశమైన 'జీవవైవిధ్య' భావనకు ఏడు దశాబ్దాల కిందటే అగ్రాసనమేసిన ఘనత ఆయనది. ఏం పాపం చేశాయని గార్ధభం, కాకి, సాలీడు తదితర జీవులను మానవులు హీనంగా చూస్తారని విచారించారాయన.

చివరగా...

**పదముల వెంట భావములు, భావములంటి లసత్పదమ్ములున్**
**పొదలు చలంక్రియల్ గదుర ముద్దుల మూటలు(గట్టు పద్దెముల్**
**పదపదమంచు వెంటపడి పర్వులు వెట్టకయున్న సత్కవుల్**
**ముదమొదవంగ కావ్యములు పూర్తి యొనర్తురె? కీర్తినింతురే?**

కవిత్వమంటే ఎలా ఉండాలో వివరించిన ఈ పద్యాన్ని రాసిందీ కొర్నెపాటి వారే. జీవితాంతమూ ఆయన తన 'మాట'కే కట్టుబడ్డారు. నిర్దేశించుకున్న ప్రమాణాల మేరకే రచన సాగించారు. ఇలాంటి అద్వితీయ ప్రతిభాశాలులైన తెలుగు వారెందరో. అటువంటి వారి రచనలను భావితరాలకు అందించడం మన బాధ్యత.





**కొర్నెపాటి విద్యాసాగర్**
మేనేజర్, భారతీయ స్టేట్ బ్యాంక్, తాడేపల్లిగూడెం,
97049 77768



# వలసపోయిన పల్లె

జలధారతోడ పొంగులు వారు వాగు వం
కలు లేవు గద జ్ఞాపకములు తప్ప
పొలము బిడ్డల కడుపులకు ప్రేమగ నీరు
త్రాగించెడు చెరువుతల్లులేవి?
పెంచినందున తల వంచి రైతుల ముందు
నిల్చిన వరిపంట నీడలెవ్వి?
పనికి పనికి మధ్య పల్లవించిన జాన
పదములందలి గొప్ప పదములెవ్వి?

పల్లెటూరన్న విరబూయు తెల్లనైన
జాబిలి వెలుగులొకనాడు - శాపమేదొ
దగిలి అమవస చీకట్ల దారులందు
తల్లడిల్లుచున్నది నేటి పల్లెటూరు.

పల్లెటూ రనియడు హరివిల్లులోన
వృత్తులే వర్ణములుగ కన్పించె- నేడు
రంగులన్ని వెలసిన చిత్రమ్ము రీతి
పల్లె మిగిలినది అనాథ తల్లివోలె.

పల్లెలన్ని సమృద్ధిగ పల్లవించ
పాడుకున్నవి - ఒకనాడు పాటలెన్నొ
నేడు పల్లెర్లు పరిచిన బీడు భూము
లై యెడారి గీతమ్ముల నాలపించు

పాలు పెరుగుల గురుగులు పగిలిపోయె
జొన్న రొట్టె పరిమళమ్ము కన్నుమూసె
గటక రుచులెల్ల గంగలో కలిసిపోయె
తీపి గుర్తులై మిగిలె నా జ్ఞాపకాలు.

పల్లెలె పట్టుగొమ్మలని భావన సేసిన గాంధితాతయే
మెల్లగ కాలు మోపవలె మేదినిపై మరియొక్కసారి మ
త్తిల్లిన జాతిపై వెలుగులీనుటకై గత కాలమట్టు శో
భిల్లగ పల్లెటూళ్లు హరివిల్లులుగా భరతాగ్రవీథులన్.

**- తోకల రాజేశం**
ఆదిలాబాద్. 96767 61415

# తేలికగా నేర్పిద్దాం!



ఫొటోలు: బి.మరిడయ్య

బిడ్డకు అమ్మ మాటలెలా నేర్పుతుందో గమనించారా! ముద్దు మురిపాలతో, గోరుముద్దలతో ఒక్కొక్క మాటనూ పలికిస్తుంది. అలా పలుకు నేర్చిన పసివాడికి చదవడం, రాయడం నేర్పే బాధ్యత గురువులది. వారు కూడా అమ్మలానే మనసుకు ఆకట్టుకునేలా నేర్పితే... నేర్చిన అంశాలను మర్చిపోగలరా! బట్టీ కొట్టించే బోధనను పక్కనపెట్టి, సృజనాత్మకంగా పాఠాలు చెప్పే ఉపాధ్యాయుడి నేర్పు... పిల్లలపై ఎంతో ప్రభావం చూపుతుంది. తెలుగు భాషాబోధనకు దీన్ని అన్వయిస్తే... అమ్మభాషతో నేటి తరానికి అనుబంధాన్ని ఏర్పరచడం ఎంతో సులువు.

తెలుగు అక్షరం రాయకుండా స్నాతకోత్తర విద్య పూర్తి చేసే అవకాశం మన రాష్ట్రంలోనే ఉంది. దీనికి కారణాలైన అంశాల్లో...ప్రాథమిక స్థాయిలో ఆకర్షణీయంగా తెలుగు బోధన చేయకపోవడమూ ఒకటి. నిర్వేదంగా, నిరాసక్తంగా సాగే బోధన విద్యార్థిని భాషాభ్యాసం వైపు ప్రోత్సహించలేదు. పాఠం నేర్చుకుంటున్నామన్న భావం విద్యార్థికి కలగకుండా భాషాభ్యాసం చేయించాలి. ఆటపాటలతో పాఠాలు నేర్పిస్తే పిల్లలు ఉత్సాహంగా నేర్చుకుంటారు. వారిలో తెలుగుపై మమకారం ఏర్పడుతుంది. భాషాధ్యయనం పట్ల ఆసక్తి పెరుగుతుంది. అంతిమంగా మన తెలుగు వెలుగులు కలకాలం నిలుస్తాయి. ఇందుకు కావలసిందల్లా ఉపాధ్యాయుడి నేర్పు, ఓర్పు.. కొంత సృజనాత్మకత.. రేపటితరం భవిష్యత్తు నేడు మన చేతిలో ఉందన్న స్పృహ.

బి.ఇ.డి, డి.ఇ.డి చదివే వారికి ఈ కోణంలో శిక్షణ ఇచ్చి, వారితో ఆకర్షణీయమైన బోధనోపకరణాలు తయారుచేయించి, తెలుగు పాఠాలు చెప్పించాలనే ఆలోచన ఉపాధ్యాయ శిక్షకుడిగా నాకు నాలుగేళ్ల కిందట కలిగింది. నా విద్యార్థులూ ఉత్సాహంతో ముందుకు వచ్చారు.

* సంప్రదాయ విధానంలో అక్షరాలు దిద్దించే బోధన పద్ధతి మారింది. పద పద్ధతి, వాక్యపద్ధతి వంటి కొత్త విధానాలు వచ్చాయి. వీటికి అనుగుణంగా వర్ణమృత్తిక (కలర్‌క్లే)తో దళసరి అట్టమీద పెద్ద పరిమాణంలో పదాలు రాశాం. (అక్షరాకృతిలో మృత్తికను సన్నగా అమర్చాం). 'అరక' అనే పదంలో 'అ'ను పెద్దగా ప్రత్యేక రంగు మృత్తికతో రాయించి, పక్కనే అరక బొమ్మ అతికించాం. ఇలా అన్ని అక్షరాలతో వచ్చే పదాలు రాశాం. ప్రత్యేకవర్ణంతో ఉండడం వల్ల ఆ అక్షరాన్ని విద్యార్థి గుర్తుంచుకుంటాడు. రోజూ వారికి కనిపించే వస్తువుల పక్కనే ఇవి ఉండడం వల్ల ప్రత్యేకంగా ఏదో నేర్చుకుంటున్నట్లు కాకుండా 'విషయం' దానంతట అదే పిల్లల బుర్రల్లోకి చేరిపోతుంది.

* కవులు, వారి విశేషాల గురించి చెప్పడానికి 'వంశవృక్షం' పేరుతో ఓ నమూనా తయారు చేశాం. ఓ చెట్టుకొమ్మకు రెండు వైపులా ఆకులు ఉన్నట్లు థర్మోకోల్‌తో కత్తిరించి, వాటి మీద పోతన తల్లిదండ్రులు, రచనలు, గ్రామం.. వివరాలన్నీ రాశాం. కొత్తదనం ఉండటంతో విద్యార్థి ఎటువంటి అయోమయమూ లేకుండా, స్పష్టంగా విషయాన్ని నేర్చుకుంటాడు.

* ప్రాచీన కవులు తాళపత్రాల మీద రాశారని పాఠాల్లో ఉంటుంది. కానీ అవి ఎలా ఉంటాయో తెలియదు. చూసే అవ

కాశమూ ఉండదు. అసలు తాటాకుల మీద ఎలా రాస్తారనే అనుమానమూ వస్తుంది. అందుకే 'తాళపత్ర గ్రంథాలు' తయారు చేశాం. తాటాకులను సన్నగా కత్తిరించి, ఎండబెట్టి, వాటిమీద శతక పద్యాలు రాశాం. పైన వెలిసిన రంగు అట్ట వేసి 'సుమతి శతకం' అని రాశాం. ఆ పాఠం చెప్పేటప్పుడు ఉపాధ్యాయుడు ఈ తాళపత్ర గ్రంథం తీసుకువెళ్లి పద్యం చదివితే.. తరగతంతా సందడే సందడి.

* ఒకే అక్షరం వచ్చే పదాలు (చేటు, పోటు, కాటు, వేటు..) కలిపి 'పదచక్రం' తయారుచేశాం. దళసరి అట్టను వృత్తాలుగా కత్తిరించి, ఒక్కో వృత్తంలో ఒక్కో అక్షరం రాసి, మధ్యలో 'టు' రాసిన వృత్తం పెట్టాం. చక్రంలా తిప్పుతూ విద్యార్థి ఈ పదాలు నేర్చుకుంటాడు. స్వీయ అభ్యసన ఇందులో దాగి ఉన్న సూత్రం. ఇదే నమూనాలో ఋతువులు, కవికాలాదులను నేర్పించే నమూనాలు తయారుచేశాం.

* ఒకటో తరగతి విద్యార్థులకు ఆకర్షణీయంగా ఉండేలా 'అ' నుంచి 'అ' వరకు థర్మోకోల్ మీద అక్షరాలు కత్తిరించి, వాటికి రంగులద్ది, దళసరి అట్టపై అతికించాం. ఇవి చూపిస్తూ అక్షరాలు నేర్పడం ఎంతో సులువు.

* నీతిపద్యాలు, సుభాషితాలు పాఠాల్లో ఉంటాయి. వీటిలో ఉండే నీతిని గుమ్మాలకు అలంకరించుకునే ప్లాస్టిక్ తోరణాలపై తెలుపు రంగుతో రాశాం. పద్యం చెప్పాక అందులోని నీతిని పిల్లలతో చెప్పించి తరగతిలో ఈ 'సుభాషిత తోరణాలు' కడితే పిల్లలు ఉత్సాహంగా చూస్తారు. తోరణాలు అలాగే కొంతకాలం తరగతిలో ఉంచితే వాటిమీద రాసిన నీతి విద్యార్థుల మనసులో నాటుకుంటుంది.

* కవులు, రచయితల చిత్రాలు సేకరించి, వాటిని అట్టమీద అతికించి మా 'తెలుగులోకం' (తెలుగు ప్రయోగశాల)లో ప్రదర్శనగా ఉంచాం. పాఠానికి అనుగుణంగా ఆ రచయిత చిత్రాన్ని ఉపాధ్యాయుడు ఉపయోగిస్తాడు.

* కవయిత్రి మొల్ల రామాయణాన్ని రాముడికి అంకితం ఇచ్చిందనే విషయాన్ని చెప్పడానికి థర్మోకోల్‌తో చిన్న రామమందిరం, అందులో చిన్న విగ్రహాలు, మొల్ల తన రామాయణాన్ని రాముడికి ఇస్తున్నట్లు చేతిలో తాళపత్రాలు ఉండేలా నమూనా తయారు చేశాం. ఇది చూడగానే ఎటువంటి వివరణ లేకుండానే విద్యార్థికి విషయం అవగాహన అవుతుంది.

* ఇదే తీరులో 'బృందావనం', 'మన దేశం', 'చుక్కలు' నమూనాలు తయారుచేశాం. ఇవన్నీ ఆయా పాఠాలకు అనుగుణంగా తీర్చిదిద్దాం. ఇవి చూపిస్తూ పాఠం చెబితే.. ఆ పాఠం దృశ్యకావ్యంగా మారుతుంది.

* రెండు, మూడు తరగతుల పిల్లలతో కథలు చెప్పించేందుకు 'చిత్రకథ' తయారు చేశాం. ఛార్టుమీద కథ రాస్తూ అందులో వచ్చే వ్యక్తులు, జంతువుల పేర్ల స్థానంలో బొమ్మలు అతికించాం. వాటిని చూస్తూ విద్యార్థి కథ చెప్పాలి. ఉదాహరణకు.. 'ఒక అడవిలో కుందేలు, నక్క ఎంతో స్నేహంగా ఉండేవి..' అనే కథలో అడవి, కుందేలు, నక్క అని రాయడానికి బదులు వాటి బొమ్మలు అతికించాం. ఇవి చూస్తూ విద్యార్థి కథ చెప్పాలి. ప్రాథమిక విద్యార్థికి ఇదో కొత్త అనుభూతి కలిగిస్తుంది. స్పష్టమైన ఉచ్చారణ, వాక్యనిర్మాణం, ఆలోచనల్లో స్పష్టత.. దీంతో సాధ్యమవుతాయి.

* ప్రాథమిక తరగతుల్లో పిల్లల్ని ఎక్కువగా ఆకర్షించేవి గేయాలు. ఏ విషయమైనా గేయం రూపంలో చెబితే పిల్లలు ఎంతో ఇష్టంగా వింటారు. అందులోని విషయమూ ఇట్టే ఎక్కుతుంది. అందుకే పాఠ్యపుస్తకాల్లో ఉన్న గేయాలకు తోడు సొంతగా గేయాలు రాయమని ప్రోత్సహించాను. ఆ ఉత్సాహంతో తిరుపతిరావు అనే ఒక్క విద్యార్థే 25 గేయాల వరకు రాసి తీసుకొచ్చాడు. వారాల పేర్లు, అంకెలు, ఋతువులు, కాలాలు.. ఇలా ఎన్నో విషయాలు వీటిలో ఉన్నాయి. పాటతో పాఠమూ విద్యార్థికి వస్తుంది.

డామినో కార్డులు, పదకేళి, ఆచారాలు సంప్రదాయాలు.. ఇలా ఎన్నో నమూనాలు తయారు చేశాం. అట్టముక్కలు, ఛార్టు మొదలైన సాధారణ వస్తువులనే వీటన్నిటి తయారీకి ఉపయోగించాం. అతి తక్కువ ఖర్చుతోనే ఇవన్నీ తయారయ్యాయి. వీటిలో ఉన్న అంతస్సూత్రం ఒకటే.. ఆకర్షణ. సాధారణ స్థితి నుంచి విద్యార్థుల దృష్టి మరల్చి, నూతనత్వం అనిపించడంతో పాటు విద్యార్థిని స్వీయ అభ్యసనం వైపు బోధనోపకరణాలు మరల్చుతాయి. కాబోయే ఉపాధ్యాయులను ఉత్తమ మాతృభాషాబోధకులుగా తీర్చిదిద్దుతాయి.

మా కళాశాలలో ఏటా వందలాది బోధనోపకరణాలను తయారు చేస్తున్నాం. విజయవాడలోని పది పాఠశాలలకు వీటిని ఉచితంగా అందించాం. మా వద్ద శిక్షణ పొందిన వారు ఉపాధ్యాయులై... బోధనలో ఈ విధానాలను అనుసరిస్తున్నారు. ఇంతకు మించిన గురుదక్షిణ ఏముంటుంది!










**కప్పగంతు రామకృష్ణ,**
తెలుగు అధ్యాపకుడు,
విజయవాడ
90320 44115

**ఆహ్వానం**
పిల్లలకు తెలుగుపై మక్కువ పెంచేందుకు మీ పాఠశాలలో కూడా ఏవైనా ప్రత్యేక కార్యక్రమాలను విభిన్నంగా నిర్వహిస్తుంటే, వాటి వివరాలను తెలియజేయండి. ఆ స్ఫూర్తిని తెలుగు వెలుగు వేదికగా తెలుగు వారందరితోనూ పంచుకుందాం.

# ఓహో... ఒడియా

**అమ్మభాషకు అగ్రతాంబూలమివ్వడంలో ఉత్కళ సీమది ఉజ్వల చరిత్ర. కళింగ నేలపై నడక నేర్చిన ప్రతి ఒక్కరూ ఒడియా పలుకునే ప్రేమిస్తారు. పరభాషా ముట్టడి నుంచి దాన్ని కాపాడుకోవడానికి స్వచ్ఛందంగా సంసిద్ధులవుతారు. ప్రజలు, పాలకులు సమష్టి కృషితో తమ అక్షరాలను అజరామరం చేసుకుంటున్నారు.**

తనదైన భాషతోనే రాష్ట్రానికి గుర్తింపు లభిస్తుంది. రాష్ట్ర ప్రజలకు స్వీయ వ్యక్తిత్వం చేకూరుతుంది. ఒడిశా ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ అన్న ఈ మాటలు అక్షరసత్యాలు. ఒక జాతిని పరిచయం చేసేటప్పుడు దాని భాషే ప్రధాన భూమిక వహిస్తుంది. ఆ భాషపై జాతిజనులు చూపుతున్న గౌరవాన్ని బట్టి వారి సంస్కృతిని అంచనా వేయవచ్చు. దీని ప్రకారమైతే సాంస్కృతికంగా ఉత్కళం ఉచ్ఛస్థితిలో ఉన్నట్లే.

ఒడిశా విధానసభలో ఒడియా భాషలోనే చర్చలు సాగుతుంటాయి. ప్రభుత్వ కార్యాలయాల్లో రాతకోతలూ ఎక్కువ శాతం అందులోనే జరుగుతాయి. ఒడియాను రాష్ట్ర అధికార భాషగా చేస్తూ 1954లోనే చట్టం చేసింది అక్కడి ప్రభుత్వం. పాలనలో ప్రజల భాషనే వినియోగించాలంటూ 1964, 1968, 1985 సంవత్సరాలలో ప్రత్యేక ఉత్తర్వులనూ ఇచ్చింది. ఆంగ్లంలో వచ్చే దస్త్రాలను తిప్పి పంపుతానంటూ 1995లో ఆదేశపత్రం జారీ చేశారు అప్పటి ముఖ్యమంత్రి జె.బి.పట్నాయక్.



రాష్ట్ర ముఖ్యమంత్రులుగా పని చేసిన హరేకృష్ణ మెహతాబ్, నందినీ శతపథి, జానకీ వల్లభ పట్నాయక్ తదితరులు స్వయంగా ఒడియాలో రచనలు చేశారు. వాటిలో ప్రసిద్ధమైనవి ఎన్నో ఉన్నాయి. ప్రస్తుత భువనేశ్వర్ లోక్‌సభ సభ్యుడు ప్రసన్న పట్నాని అయితే కవిగా, రచయితగా సుప్రసిద్ధులు. 60కి పైగా పుస్తకాలు ప్రచురించారు. ఒడిశాలో మాతృభాషకు దక్కుతున్న ఆదరణకు పాలకుల్లోని ఈ సాహిత్యాభిలాష కూడా ఓ కారణమే.

### కొత్త వెలుగులు

ప్రాచీన ఒడియా సాహిత్యాన్ని సంరక్షించుకోవడం, భాషాభివృద్ధికి కృషి చేయడం తదితర లక్ష్యాలతో 2006లో 'ఒడియా భాషా ప్రతిష్ఠాన్'ను ఏర్పాటు చేశారు. దీనికి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి కార్యనిర్వాహక అధ్యక్షులు. మాతృభాషలో పాలన సాగటానికి సాయపడే 'ఆఫీస్ కౌనాధి', 'ప్రశాసన శబ్దకోశ', 'ఒడియా సాంస్కృతిక శబ్దావళి' పుస్తకాలను ఈ సంస్థ ప్రచురించింది. 'ఆఫీస్ కౌనాధి'లో దైనందిన పాలన వ్యవహారాల్లో రాసే ఉత్తరాల నమూనాలను ఒడియాలో పొందుపరిచారు. 'ప్రశాసన శబ్దకోశ'లో ప్రభుత్వ కార్యాలయాల రాతకోతలలో ఎక్కువగా ఉపయోగించే ఆంగ్ల పదాలకు ఒడియా సమానార్థకాలను సూచించారు.

బోండా ఆదివాసీల పాటలను 'డుడామామ్ మామ్'లో అక్షరబద్ధం చేశారు. బోండా భాషకు లిపి లేదు. మౌఖిక సాహిత్యంగా మాత్రమే ఉన్న పాటలను ఒడియాలో రాశారు.

చిన్నారుల కోసం భాషా ప్రతిష్ఠాన్ 'శిశులేఖ' అనే త్రైమాసిక పత్రికనూ నిర్వహిస్తోంది. ఈ సంస్థకు ఏడాదికి ప్రభుత్వం రూ.50 లక్షలను కేటాయిస్తోంది.

కొన్ని ప్రత్యేక ప్రాజెక్టులనూ ప్రతిష్ఠాన్ చేపడుతోంది. ఒడియా ఆదికవి సరళాదాస్ మహాభారతం పునర్ముద్రణ, తాళపత్ర గ్రంథాల పరిశోధన, ప్రచురణ, ప్రాచీన ఒడియా సాహిత్య పునరుద్ధరణ కార్యక్రమాలు ఇందులో



భాగమే. వీటి కోసం ప్రభుత్వం ప్రత్యేకంగా నిధులు ఇస్తోంది. మరోవైపు... వ్యాకరణ శిక్షణ, సాహిత్య అనువాద శిబిరాలను కూడా సంస్థ నిర్వహిస్తోంది.

**కొండంత అండ**

విలువైన రాతప్రతుల సేకరణ, పరిశోధన, ముద్రణ, జానపద సాహిత్య సేకరణ, ముద్రణ, ఉత్తమ రచనలకు ప్రతి ఏటా పురస్కారాలు, ఒడియా సాహితీ ప్రపంచంలో విశిష్ట వ్యక్తుల పేరిట స్మారక సదస్సుల నిర్వహణ తదితరాలన్నీ ఒడియా సాహిత్య అకాడెమీ బాధ్యతలు. 1957లో ఏర్పాటైన ఈ సంస్థ.. సాహితీ సదస్సులు, కవి సమ్మేళనాలు, పుస్తక ప్రదర్శనలతో రాష్ట్రం నలుచెరుగులా భాషాసేవ చేస్తోంది.

సంస్థ సమావేశాలు, ప్రత్యేక ఉత్సవాలను ఇతర రాష్ట్రాల్లో ఉన్న ఒడిశా వాసుల మధ్య నిర్వహించడం ఆనవాయితీ. స్వర్ణోత్సవాల సంబరాలను జార్ఖండ్‌లో జరిపారు.

అకాడెమీ ఇప్పటి వరకూ 400కు పైగా పుస్తకాలను ప్రచురించింది. ఒడియా సాహిత్యాన్ని ఇతర భాషల్లోకి అనువదింపజేస్తోంది. పందొమ్మిది మంది ఒడియా కవయిత్రుల కవితలకు తెలుగు అనువాదం 'అమృత' ఈ క్రమంలో వచ్చిందే. భాష, సాహిత్యాల ప్రచారానికి 'కోణార్క్' అనే త్రైమాసిక పత్రికనూ ప్రచురిస్తోంది.

**ఇదీ శ్రద్ధ**

* భాషను విస్తృతంగా ప్రచారం చేయడానికి జాతి మహనీయుల జయంతులు, వర్ధంతులను ప్రతి జిల్లా ముఖ్య పట్టణాలు, గ్రామాల్లో నిర్వహిస్తున్నారు. కలెక్టర్ పర్యవేక్షణ, సాహితీ, సాంస్కృతిక సంస్థల సమన్వయం, ప్రజల భాగస్వామ్యాలతో ఈ కార్యక్రమాలు విజయవంతమవుతున్నాయి.
* పొరుగు రాష్ట్రాల్లోని ఒడియా పాఠశాలల్లో చదువుకునే విద్యార్థుల కోసం ఉచితంగా పాఠ్యపుస్తకాలను అందజేస్తున్నారు.
* ప్రభుత్వ, ప్రైవేటు సంస్థల కార్యాలయాలు, వ్యాపార సంస్థల నామఫలకాలన్నీ ఒడియాలోనే ఉండాలన్న నిబంధనను పన్నెండేళ్ల కిందటే చేశారు. కచ్చితంగా అమలు చేస్తున్నారు.

**నిరుపమాన కృషి**

ఒడియా భాషాభివృద్ధి కోసం కొన్ని స్వచ్ఛంద సంస్థలూ విశేష కృషి చేస్తున్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఆమో ఒడిశా, ఉత్కళ సమ్మేళిని.

ప్రముఖ ఒడియా దినపత్రిక 'సంబాద్' సంపాదకులు సౌమ్యరంజన్ పట్నాయక్ 'ఆమో

**పూర్ణచంద్ర ఒరియా భాషాకోశ**



9500 పేజీల్లో 1,85,000 పదాలు, నాలుగు భాషల్లో వాటికి అర్థాలు, వాక్యాల్లో వాటిని ఉపయోగించే విధానం... వీటన్నిటి సమాహారమే 'పూర్ణచంద్ర ఒడియా భాషాకోశ'. ఒడియా భాషకు సంబంధించి అందుబాటులో ఉన్న అతిపెద్ద నిఘంటువు ఇది.

దీని రూపకర్త గోపాల్ చంద్ర ప్రహరాజ్ (1874-1945). దశాబ్దం పాటు (1930-40) ఆయన ఒక్కరే కష్టపడి దీనిని రూపొందించారు. ఒడియా లిఖిత, మౌఖిక సాహిత్యాలతో సహా స్థానిక ప్రజలు మాట్లాడే వ్యవహారికం వరకూ అన్నింటి నుంచి భాషా పదాలను సేకరించి గోపాల్ ఈ నిఘంటువును తయారు చేశారు. ప్రతి పదానికి ఒడియా, బెంగాలీ, హిందీ, ఆంగ్లాల్లో అర్థాలను ప్రచురించారు. ఆ పదాల పుట్టుకను వివరించారు. వాక్యాల్లో ఆ పదాలను ఎలా వినియోగించాలో ఉదాహరణలతో సహా తెలిపారు. మొత్తం ఏడు సంపుటాల్లో ప్రచురించారు.

గోపాల్ చంద్ర వృత్తి రీత్యా న్యాయవాది. ఒడియా భాషపై ఉన్న అభిమానంతో వివిధ సాహిత్య పత్రికల్లో ఎన్నో రచనలు చేశారు. ఆ తర్వాత సమగ్ర నిఘంటు నిర్మాణానికి పూనుకున్నారు. అప్పటి రాజులు, రాజపుత్రుల ఆర్థిక సహాయంతో ఈ భాషాకోశాన్ని ప్రచురించారు.

**వాళ్లకూ ఉన్నాడో బ్రౌన్!**

'ఒడియా స్వతంత్ర భాష కాదు. బెంగాలీలోని మాండలికమే. దాన్ని ప్రోత్సహించనక్కర్లేదు. ఒడియా మాధ్యమంలో విద్యాబోధన అక్కర్లేదు. ఒడిశాలోని అన్ని పాఠశాలల్లో బెంగాలీనే బోధించాలి'....

ఆంగ్లేయులు మన దేశాన్ని ఏలుతున్న కాలంలో బెంగాలీ మేధావుల వ్యాఖ్యలివి. ఈ వితండ వాదంతోనే వారు ఒడియా భాషను నామరూపాలు లేకుండా చేయడానికి ప్రయత్నించారు. వృత్తి ఉద్యోగాల్లో తమ ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి వారు ఈ కుట్రకు తెరతీశారు. ఒడిశా ప్రాంతంలో విద్యాధికారులుగా ఉన్న బెంగాలీయులు వారికి సాయపడ్డారు. అందరూ కలిసి ఒడిశా వాసులను వారి మాతృభాషకు దూరం చేయడానికి పూనుకున్నారు.



'స్థానికుల వ్యవహారిక భాషగా ఒడియా స్థిరపడేనాటికి బెంగాలీ ఉనికిలోనే లేదు. తూర్పు ప్రాంతపు హిందీకి చెందిన వివిధ అపభ్రంశపు రూపాల్లో బెంగాలీయులు మాట్లాడతారు'
– జాన్ బీమ్స్

అయితే... వారి వాదనలను తోసిపుచ్చి, ఒడియా గొప్పదనాన్ని, స్వతంత్రతను ఎలుగెత్తి చాటారో వ్యక్తి. జన్మ రీత్యా ఆంగ్లేయుడైనప్పటికీ ఒడిశా ప్రజలంటే అభిమానంతో వారి భాషాచరిత్రను ఆమూలాగ్రం పరిశోధించారాయన. సహేతుకమైన వాదనలతో ఒడియా ప్రాచీనతను నిరూపించారు.

జాన్ బీమ్స్... బ్రిటీష్ ఇండియాలో ఐఏఎస్ అధికారి. 1858వ సంవత్సరంలో భారత్‌కు వచ్చారు. బీహార్, పంజాబ్, చిట్టగాంగ్‌ల్లో అధికారిగా పని చేశారు. 1869లో ఒడిశాలోని బాలాసోర్ కలెక్టర్‌గా వచ్చారు. అక్కడి సంస్కృతికి ఆకర్షితులయ్యారు. ఒడియా మాట్లాడటం, రాయడం నేర్చుకున్నారు. ఒడియాలో వచ్చిన కావ్యాలు, గ్రంథాలను చదివారు. భాషా చరిత్రపై పరిశోధన చేశారు. బెంగాలీ పుట్టకముందే ఒడియాకు నిర్దిష్ట రూపం ఉందన్న విషయాన్ని నిరూపించారు.

'ఒడియా లిపి, సాహిత్యం', 'ఇతర ఆధునిక ఆర్యభాషలతో ఒడియా సంబంధబాంధవ్యాలు', 'ఒడియా' శీర్షికలతో వ్యాసాలు ప్రచురించారు. 1872 - 79 సంవత్సరాల మధ్యలో 'భారతీయ ఆర్యభాషల తులనాత్మక వ్యాకరణం' అనే పేరుతో మూడు సంపుటాలను రాశారు.

ఒడిశా' అధ్యక్షులు. జిల్లా, బ్లాక్, పంచాయితీల్లో పత్రిక సిబ్బందే ఈ సంస్థ ప్రతినిధులు. ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యార్థుల్లో మాతృభాషా జ్ఞానం పెంచడానికి 'మోఖత్తా' పేరిట ఓ కార్యక్రమాన్ని నిర్వహిస్తోంది. ప్రత్యేక పుస్తకాలను ప్రచురిస్తోంది. (ఇప్పటి వరకూ పది) అమ్మభాషను తప్పులు లేకుండా, అందంగా రాయటాన్ని ప్రోత్సహించడానికి ప్రతి ఏటా పాఠశాలల్లో 'భాషాజ్ఞానం', 'చేతిరాత' పోటీలను నిర్వహిస్తోంది. గతేడాది 1727 కేంద్రాల్లో నిర్వహించిన ఈ పరీక్షల్లో 57,648 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాలతో పాటు అన్ని వర్గాల ప్రజలకు ఉపయోగపడే 'సరళ ఒడియా అభిదాన్' (పదకోశం) లాంటి 41 భాషా పుస్తకాలనూ ఈ సంస్థ ప్రచురించింది.

'ఉత్కళ సమ్మేళిని' వందేళ్ళ సంస్థ. కవి మధుసూదన్‌దాస్ దీనిని 1903లో ప్రారంభించారు. రాష్ట్ర సరిహద్దు, రాష్ట్రేతర ప్రాంతాల్లో నున్న ఒడియా మాధ్యమ పాఠశాలల నిర్వహణ, విద్యార్థులకు పాఠ్యపుస్తకాల పంపిణీ వంటి కార్యక్రమాలను నిర్వహిస్తోంది.

'సృజనిక' అనే స్వచ్ఛంద సంస్థ... క్రీ.శ 1710 - 1942 మధ్యలో వెలువడిన 20 ఒడియా నిఘంటువులనూ 'ఈ-రూపంలో' భద్రపరిచింది. సీడీలు, వెబ్‌సైటుల ద్వారా వాటిని ప్రజలకు అందుబాటులోకి తెచ్చింది.

## ఇదీ తేడా

మన రాష్ట్రంలోని ఒడియా మాధ్యమ పాఠశాలలను రద్దు చేయడానికి 2005లో ప్రభుత్వం ప్రయత్నించింది. నోటిఫికేషన్‌ను కూడా జారీ చేసింది. తెలుగు మాధ్యమంలోనే చదువుకోవాలంటూ ఒడియా విద్యార్థులందరికీ చెప్పింది. దీనిపై ఒడిశాలో నిరసన వెల్లువెత్తింది. విద్యావేత్తలు, రాజకీయ నాయకులు అభ్యంతరాలు తెలిపారు. ఒడిశా ప్రభుత్వం రంగంలోకి వచ్చి ఆంధ్రా సర్కారుతో మాట్లాడింది. పాఠశాలలను కొనసాగించాల్సిందేనని ఒత్తిడి తెచ్చింది. దాంతో మన ప్రభుత్వం నిర్ణయాన్ని వెనక్కి తీసుకుంది.

తమిళనాడులో ఉన్న తెలుగు మాధ్యమ పాఠశాలలను రద్దు చేయడానికి అక్కడి ప్రభుత్వం సంసిద్ధమైన సంగతి అందరికీ తెలిసిందే. అప్పుడు మన రాష్ట్ర ప్రభుత్వం మాత్రం ఒడిశా మాదిరిగా పోరాడలేదు. తెలుగు పాఠశాలలను కాపాడటానికి గట్టిగా నిలబడలేదు. ఫలితంగా అనేక తెలుగు పాఠశాలలు మనకు కాకుండా పోయాయి.

పొరుగు రాష్ట్రాల కృషిని ఆదర్శంగా తీసుకుని మన భాషను మనం కాపాడుకోవడంలో తప్పేంలేదు కదా!




డా॥ తుర్లపాటి రాజేశ్వరి
విశ్రాంత ఉపన్యాసకులు,
బరంపురం 095053 07102.

# సందెపొద్దు జారనీకు



సందెపొద్దు జారనీకు
సడీ సప్పుడు సేయబోకు
సంపంగి పొదమాటున
సంగడీల సూడకుండ
సరసమాడు కుందామె
సత్వరంగ రావేమె
సరిగంచు కోకజుట్టి
సన్నజాజి పూలనెట్టి
సక్కిలాల మూటవిప్పి
సక్కంగ అందిచ్చుకుంటా
సాయం సమయంలోన
సరిజోడుగా కూసొని
సంగతులు సెప్పుకుంటం
సంజసాయ కీనీడన
సొన్నమల్లెమెరుత్తునువు
సక్కదనాల అగపడుతుంటె
సందడులు సెయ్యాలని
సంయమన పడొద్దని
సంభ్రమంత సంతోషంతో
సంతన సేకూర్చమని
సకియ వేడుకుంటనేను
సంబరాలు సేసుకుంట
సరిసరి అంటే కుదరదు
సన్నాసిని కాదునేను
సాచ్చికము కావాలా
సూరీడి సూపే గురుత
సోగులే పోగులేసి
సొబగు పెంచుతా నీకు
సేసలు జల్లుకొని
సేరువైపోదామె
సోబనముగా ఇరువురమూ
సుకాలు పొందుదామె
సుళవయ్యే పనిసేసుకు
సొగపుగ జీవిద్దాము
సొంటులేమి లేకుండగ
సంత పెంచుకుందామె
సదువు సక్కనాలనెరిపి
సరీదారులుగ సేద్దామె
సోద్దెము కాదిదినిక్కము
సాయమురా పేజోడుగ
సావాసమురాకుంటె
సొమ్మసిల్లనా సొక్కవోనా.

**వాడుకలో లేని తెలుగు పదాల అర్థాలు:**

సంగడీలు - స్నేహితులు
సొన్నము - బంగారము
స కియ - సఖి
సాచ్చికము - సాక్ష్యము
సోగులు - సొమ్ములు
సేసలు - తలంబ్రాలు
సేరువ - దగ్గర
సోబనముగ - మంగళకరము
సొగపుగ - పారవశ్యంగా
సొంటులు - తప్పులు, దోషాలు
సంత - బిడ్డలు
సరదారులు - శూరులు

- స్వప్న
గుంటూరు. 93933 61766

# చైతన్యంతోనే వెలుగు



అవంత్స సోమసుందర్

తెలుగు భాష అజంత భాష కావడం వల్ల వినసొంపుగా ఉంటుంది. సంగీతాన్నిచ్చే భాష ఇది. తమిళభాషలో అర్థం కాని భాషకు తెలుగు భాషకు చాలా వ్యత్యాసం ఉంటుంది. పర భాషల్లో ద్విత్వాక్షరాల వల్ల భాషా సౌందర్యం ఉండదు. కాని తెలుగు భాష సుందరంగా ఉంటుంది. సమాజంలో తెలుగుకు చాలా ప్రాధాన్యం ఉంది. ఇటలీలాంటి దేశాల వారు కూడా తెలుగును పొగుడుతారు. తెలుగు భాషకు వడ్డించే వారే దూరమవుతున్నారు. ఎంతో ప్రసిద్ధి చెందిన భాషగా ఉన్నా కాపాడుకోలేకపోతున్నాం. తెలుగుకు జాతీయ భాషగా గుర్తింపు తేవాలి. అందుకు సమష్టిబాధ్యతగా తెలుగు వారందరూ ఒక్కటవ్వాలి. ప్రాంతీయ విభేదాలు చూపించడం సరికాదు అనేది నా భావన. ముఖ్యంగా సంఘబలం ఉన్నప్పుడు లక్ష్యం నెరవేరుతుంది. కానీ తెలుగు ప్రజల్లో సంఘ బలం లోపిస్తుంది. ఇది పెద్దలంతా గమనించాలి.. తెలుగును ఎలా కాపాడుకోవాలనే దానిపై ఇది వరకే భాషావేత్తలు చర్చించారు. 1912లో గురజాడ అప్పారావు దీన్ని తన మేనిఫెస్టోలో కూడా చేర్చారు. వ్యావహారిక భాషను అనుసరించాలని గతం నుంచి చెబుతున్నారు. విశ్వవిద్యాలయాలు వ్యావహారిక భాషను అమలుపరుస్తున్నాయి. కానీ రాజముద్ర లేకపోవడమే బాధాకరం. సాంకేతిక విద్య కూడా తెలుగు భాషలోకి రావాలి. అలాగే ఉన్నత చదువుల్లో తెలుగుకు ప్రాముఖ్యం ఇవ్వాలి. తెలుగు వాళ్లకు ప్రాణోత్సాహం కలిగించే భాష తెలుగు కాబట్టి, తెలుగును ప్రోత్సహించాలి. కాపాడాలి. దేశంలో ఉన్న భాషలతో పోలిస్తే తెలుగు భాషకున్న గొప్పతనం ఇతర భాషలకు లేదని లోకానికి చాటి చెప్పాలి..

# తెలుగు దివ్వె



ఏదీ నా తెలుగు వెలుగు
ఎక్కడ నా తెలుగు పస

నులక జడల పాపాయి
కుచ్చు గౌనుల బుజ్జాయి
తాల(ర)ంగం తాల(ర)ంగం పాటేది
బచ్చాటల ముచ్చటేది

అమ్మా అయ్యా మాటలేవి
అప్పాబావల అందమేది
చక్కనైన మాటల చద్దన్నపు మూటలేవి
తెలుగు పలుకే బంగారమాయెనా!

ఊరగాయ ముక్క
తియ్యరుగు బద్ద
తాంద్రపోతల తీపి
చేతు నిజం తరిగిపోయిందా?

అరుగు మీద ఊసులు
రచ్చబండ తీర్పులూ
బిళ్లాకర్రా సాము కబడీ ఆటలూ
చర్రాట కోతి కొమ్మచ్చులేవి..

నానూ, పపైడ, జూకాలు, ఎత్తుగొలుసులు
నాగరమూ కానపరస, కంఠపపైడ తొడుగులేవీ

కుడిపైట, ఎడమపైట చీరల సొగసులేవి
పంచికట్టు, తలపాగ, గావంచ అందమేదీ..

ఎద్దుల మెడలో గణగణ గంటలు
కొమ్ములు, కాళ్లకున్న చిరుచిరు మువ్వల మోతలు
పువ్వుల కొరడా రువ్వగ విసురులు
ఎడ్లబండి ఏరువాక బారుల బారుల పరుగులేవి

రిట్టకాయ టక్క
మిరవంకాయ వర్ర
ఏప్పిక్క సేదు..
సింతకాయ టూర్రు పుల్ల

పలుకుబడుల సామెతలు
ఆస్వాల సొంపుల సౌరులు
అల్లో నేరళ్లు రావఁణా సెందినాలు
అచ్చ తెలుగు పంచదార పాటలు

చీకటి వెలుగుల బండి తిరిగిపోతుంది
దివ్వెను వంచితె వెలుగుపైకి లేవదా!
తెలుగు బాలలుండగ తెలుగుకు భయమెందుకు
పట్టుకొండి బాలలార! తీపితీపి తెలుగు పదాల్ని
రగిలించండి అగ్గిని వెలిగించండి తెలుగు దివ్వెని.

డా॥ జక్కు రామకృష్ణ
విజయనగరం.
94414 27386

# దేవి రహస్యం

పినాకపాణి వారసుడి కోసం చేయని ప్రయత్నం లేదు. మాయల్ని, మంత్రాల్ని, తంత్రాల్ని నమ్మాడు. చెట్టూపుట్ట, గుళ్లూగోపురాలు తిరిగాడు. దేవుళ్లకీ, దేవుళ్ల ప్రతినిధులమని చెప్పుకునే బాబాలకి మొక్కాడు.

భూలోకంలో దేవుని ప్రతిరూపాలుగా కొలిచే వైద్యుల చుట్టూ తిరిగాడు. అలోపతి, ఆయుర్వేదం, హోమియో... ఒకటేమిటి అన్ని వైద్య విధానాలనూ ఆశ్రయించాడు.

చివరికి తన నలభయ్యో పడిలో తండ్రి అయ్యే అదృష్టాన్ని దక్కించుకున్నాడు.

ఈ సంతోషాన్ని మంచి జ్ఞాపకంగా పదిలపరుచుకోవాలని కాబోలు... "ఓ మంచి పేరు సూచించవోయ్! కథలూగట్రా రాస్తావుగా!" అన్నాడు. వాడికీ నాకూ స్నేహం ఈనాటిది కాదు. చిన్నప్పుడు ఇద్దరం ఎదురెదురు ఇళ్లల్లో ఉండేవాళ్లం. మా నాన్న దగ్గర ప్రైవేటు చదవటానికి వచ్చేవాడు. ఇలా నేర్చుకున్న ఆంగ్లమే తన భవిష్యత్తుకు మంచి పునాది వేసిందని ఎప్పుడూ చెబుతూంటాడు. పై చదువులకు ఇతర దేశాలకు వెళ్లినా ఆ అభిమానం వాడిలో చెక్కుచెదరలేదు. మూడేళ్లకో, నాలుగేళ్లకో ఓ మారు పుట్టిన గడ్డకు వచ్చినప్పుడల్లా మా అందరికీ బట్టలో, వస్తువులో తెచ్చి పెడుతూ ఆప్యాయతను పంచుతుంటాడు. నేను మా ఊళ్లోనే తెలుగు ఉపాధ్యాయునిగా స్థిరపడ్డాను. వాడి తాలూకు పాత ఇంటికి అనధికార యజమానిగా కొనసాగుతూ నెలనెలా వచ్చే అద్దె డబ్బుల్ని వాడి ఖాతాలో జమచేస్తూంటాను.

"అమెరికాలో ఉన్న వాడివి స్పానిష్, లాటిన్ పేర్లు ఎంచుకోక ఈ చాదస్తం ఏమిటిరా?" అని నేను సున్నితంగా మందలించినా పినాకపాణి వినిపించుకోలేదు సరికదా... తనకు పేరు నచ్చే వరకూ నిన్ను వదలను కాక, వదలను అని ముందుగా చెప్పేశాడు.

అప్పటికే చాలా మందికి పేర్లు ఎంపిక చేసిన అనుభవం ఉన్న వాడిని ... ఇదేమంత పెద్ద పనికాదని ధీమాగా అనుకున్నాను.

బోలెడన్ని తెలుగు పేర్లు నా మెదడులో భద్రంగా ఉన్నాయి. ఆలోచించిన కొద్దీ కొత్తవి ఊరుతూంటాయి. తెలుగు పత్రికలు తరచూ తిరగేస్తూంటా. ఏ కొత్త పేరు కనిపించినా చటుక్కున నెమరవేసుకుంటా. ఏతావాతా నే చెప్పేదేమిటంటే... ఇదేమంత పెద్ద విషయం కాదని.

ఈ సందర్భంగా చాన్నాళ్ల క్రితం చోటుచేసుకున్న ఓ విషయం గుర్తుకొస్తోంది.

"మా అమ్మాయికి మంచిపేరు సూచించండి గురుగారూ! అనడిగాడట ఓ అభిమాని మధునాపంతుల వారిని. అతనూ రాజమండ్రిలోనే మకాం ఉండేవాడు.

"అభిజ్ఞ. ముచ్చటగా ఉంటుంది నాయనా!" అని ఆయన సూచించారట. "ఈ పేరు మానవ మాత్రుడెవరికయినా అర్థం అవుతుందా? మీకు ఆయన కవిత్వం నచ్చితే చదువుకోండి. ఆయన అంటే ఇష్టమైతే... వాళ్లింటికి పొద్దున, సాయంత్రం వెళ్లి ఆయన దర్శనం చేసుకోండి తప్ప... ఇలాంటి పిచ్చిపిచ్చి పేర్లు పెట్టి మా పరువు తీయకండి" అని భార్యామణి కస్సుమనే సరికి నోరుమూసుకోవటం అతగాడి వంతయ్యింది.

చివరికి ఆ పాపకి "వీర వెంకట వరలక్ష్మి" అని పేరు పెట్టారు. "అన్నవరం సత్యనారాయణ స్వామి వరప్రసాదం నా చిన్నారి. మా అమ్మ పేరు కలిసొచ్చేలా ఇలా పెట్టాను" అని భార్యామణి వివరించి చెప్పేసరికి అతగాడు మాట్లాడలేక పోయాడట.

రోజూ ఆ అమ్మాయిని 'వరం' అని పిల్చుకునేవారు. పినాకపాణికి ఇదే మాట చెప్పాను.

"మా మామగారి పేరు పెంటయ్య. అది పెట్టమంటావా?" అని విసుక్కున్నాడు. పిల్లలు పుట్టీపుట్టగానే గుటుక్కుమంటుంటే ఈ పేరు పెట్టారట. ఇప్పుడు ఆయన నిక్షేపంగా 'ఎయిటీ ... నాటవుట్'. పెద్దాయన్ని ఇంకో రకంగా గౌరవించుకోగలను గానీ... మా అబ్బాయికి ఈ పేరు పెట్టలేను. పోనీ... మా నాన్న పేరు పెడదామన్నా... 'భిక్షపతి'... వద్దొద్దు... ఇలాంటి చచ్చుపుచ్చు సలహాలు మాని మంచి పేర్లు పంపవోయ్! అన్నాడు. ఇక రంగంలోకి దూకాను.

తెలుగునాట చాంతాండంత పేర్లు పెట్టుకోవటం ఒకప్పుడు ఆనవాయితీగా ఉండేది. దేవుళ్ల పేర్లన్నీ కలిసొచ్చేలా చూసేవాళ్లు. పేరుకు ముందో, వెనకో, మధ్యలోనో... ఎక్కడో అక్కడ శ్రీను, ప్రసాద్, రమేష్, వెంకట్రావు, పద్మజ, లక్ష్మి, లాంటి పేర్లు తగిలించేవారు. ఏ సమయంలోనైనా నాలుగురోడ్ల కూడలిలో నిలబడి ఇందులో ఒక్క పేరు పిలిచినా కనీసం నలుగురైదుగురు వెనక్కి తిరిగి చూస్తారని హాస్యంగా చెప్పుకునేవాళ్లు. ఆ తర్వాత క్రమంగా ఈ పేర్లు అడుక్కుపోయి... నవలా నాయికానాయకుల పేర్లు వచ్చేశాయి. రాజశేఖరాలు, జయంతిలు, మీనాలు, లావణ్యలు... ఎనభయ్యో దశకంలో మగ రచయితల విజృంభణ కాలం వచ్చేసరికి పేర్ల సరళి కొంచెం మారింది. రేవంత్‌లు, హారికలు, లాలసలు ఇలా... భావుకత్వం ఉట్టిపడే పేర్లు చాలా వచ్చేశాయి.

ఇప్పుడొస్తున్న పేర్లు చిత్రంగా ఉంటున్నాయి. కొత్తగా ఉంటేచాలు... ఆ పేరు అర్థవంతం అవునా కాదా అనే అంశంతో సంబంధం లేకుండా పెట్టేస్తున్నారు. రెండు, మూడు అక్షరాలుంటే చాలు. పాత పేర్లను తీసుకుని ఒక అక్షరాన్ని కత్తిరించటమో, కొత్తది చేర్చటమో చేసి తయారు చేసుకుంటున్నారు. 'ఊహన'.. రుషిక.. భావుకత్వం ఉట్టిపడే 'ఊహ'., రుషి పేర్లకు అదనంగా ఒక అక్షరం చేర్చి పేరు తయారుచేశారు. క్లేశ, శ్లేష, జఘన, లలన, జిగీష్, వెనీష్ లాంటి పేర్లు ప్రచారంలోకి వచ్చేస్తున్నాయి. ఆడపిల్లలకి మగపిల్లల పేర్లు ...వాళ్లకి వీరి పేర్లు.. వేలం వెర్రిలా ఉంది వ్యవహారం.

ప్రస్తుత పరిస్థితిని పినాకపాణికి వివరించాను. "నాకు నచ్చటం ఒక్కటే ముఖ్యం. ఇతరత్రా అంశాలు నేను పట్టించుకోదలుచుకోలేదు." అన్నాడు పదిరోజుల తర్వాత ఫోన్‌లో.

అప్పటికే నాకున్న పరిజ్ఞానం మేరకు పాతిక పేర్ల వరకూ పంపాను. 'ఊహు' అన్నాడు.

తల్లిదండ్రుల పిచ్చి గానీ, కష్టపడి పనిచేస్తే పేరు ప్రఖ్యాతులు వాటంతట అవే వస్తాయి గానీ... మంచి



పేరు పెట్టుకుంటే సరిపోతుందా? గాంధీ, బుద్ధుడు, మహావీరుడు లాంటి పేర్లు పెడితే... సాత్వికంగా వాళ్లు వ్యవహరిస్తారని నమ్మకంగా చెప్పగలమా? ఆ పేర్లకున్న ఉదాత్తతను కాపాడ తారా?

అందుకే పెద్ద వాళ్లంటారు. తల్లిదండ్రులు పిల్లల్ని కనగలరు గానీ... వారి తలరాతలను కాదు కదా? అని.

చట్టవ్యతిరేక కార్యక్రమాల్లో పాల్గొన్న వ్యక్తి 'గాంధీ' అయి... గాంధీ అరెస్టు అని పత్రికల్లోనూ, టీవీల్లోనూ వస్తే ఎంత ఇబ్బందికరంగా ఉంటుంది.

"నువ్వు ఈ పాఠాలన్నీ నీ పిల్లలకి చెప్పుకో. ఇంకో వారంలో నాకు మంచి పేరు చెప్పకపోతే నీ అంతు చూస్తా. నీకూ.....నాకూ... రాం..రాం..." ఈసారి హెచ్చరిక లాంటిది చేశాడు పినాకపాణి.

ప్రభవ, విభవ, శుక్ల నుంచి క్షయ వరకూ ఉన్న 60 సంవత్సరాల పేర్లుగానీ, అశ్వని, భరణి, కృత్తిక నుంచి రేవతి వరకూ ఉన్న 27 నక్షత్రాల పేర్లు గానీ వాడికి రుచించలేదు.

దేవుళ్ల అష్టోత్తరాలు, సహస్రనామాలు అక్కరకు రాలేదు.

సనక, సనందన, సనత్కుమార లాంటి బ్రహ్మనిష్టులు గానీ...మరీచి, అత్రి, పులహ, పులస్త్య, కృతు లాంటి ప్రజాపతుల పేర్లు... వశిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసుడు లాంటి గురుపరంపరలో ఉన్న పేర్లు...

'ఇప్పటికే కొన్ని కోట్లమంది పెట్టుకుని ఉంటారు' ... వద్దు అనేశాడు.

పోనీ... నదులు, నదీ సంగమాల పేర్లు పనికి వస్తాయోమోనని...వరుణ, వితస్థా, కౌశిక, కుశావర్త, శతధృ, రేరా, రేవతి, సరయు, మందాకిని, బహుధా, పుష్కర, అలకనంద, గోమతి, వైరోచిని లాంటివి కొన్ని సూచించాను.

దేశంలో కొలువైన పుణ్యక్షేత్రాల పేర్లు పినాకపాణిని సంతృప్తి పరచలేదు.

"జన్మరాశి బట్టి పేరు పెట్టదలుచుకోలేదు. ఈ జాతకాలను, అవి వేసే వారి పైనా లేశమైనా నమ్మకం లేదు నాకు " సూటిగా చెప్పేశాడు.

కొందరు కొత్తపేర్లు వాడటానికి అవలంబించే పద్ధతినే నేనూ అనుసరించబోయాను. అది రిజర్వేషన్‌చార్టుల్లో, టెలిఫోన్ డైరక్టరీల్లో కొత్త పేర్ల కోసం వెదకటం...

ఆ తర్వాత పినాకపాణి నుంచి సానుకూల స్పందన కనిపించలేదు.

రోజురోజుకీ నాలో అసహనం పెరిగిపోతోంది. ఇంత వరకూ ఇలాంటి పరిస్థితి నాకెప్పుడూ ఎదురుకాలేదు.

కౌరవ సంతతి నూర్గురు. దుర్యోధన, దుశ్శాసన, దుర్వావహ, దుర్ముఖ... ఇలా ... బహుశా ఈ పేర్లు పిల్లలకెవరూ పెట్టుకుని ఉండరు. కసిగా అనుకున్నాను.

ఓ స్పూను నేలమీద పడేసి అది చేసే శబ్దంతో చింగ్ అనో, టింగ్ అనోవైనా వాళ్లు ఆ పేరు పిల్లలకి పెడతారని, తల్లి పురిటినొప్పులు పడుతూ అరిచే అరుపులు 'బాబోయ్', 'అమ్మోయ్' అన్న పేర్లు రష్యా వాళ్లు పెడతారని హాస్యస్ఫోరకంగా చెప్పుకోటం గుర్తుకొచ్చింది.

చివరి ప్రయత్నంగా రాత్రంతా ఆలోచిస్తూండిపోయాను.

తెల్లవారుఝామున ఓ పేరు చటుక్కున మెరిసింది. అది మెయిల్ చేశాను. ఎందుకో తెలీదు. గుండెల్లో బరువు దిగినట్టనిపించింది. ప్రశాంతంగా నిద్రకు ఉపక్రమించాను.

* * *

"మీ స్నేహితుడికి పేరు తెగ నచ్చేసిందట? ఉదయం ఫోన్ చేశాడు. ఇంతకీ ఏ పేరు పంపారేమిటి?" ఆసక్తిగా అడిగింది మా ఆవిడ గాఢ



కథ

నిద్రలో ఉన్న నన్ను నిద్రలేపుతూ.

మెల్లగా చెప్పాను.

'అది దేవరహస్యం'.

"నేను తెలుసుకోకూడదా?" అడిగింది."అని కాదు గానీ... దాని వల్ల కొన్ని చిక్కులున్నాయి". తప్పించుకోబోయాను.

"మీ కథల్లా అర్థం కాకుండా మాట్లాడకండి." విసుక్కుంది.

ఇక నోరుతెరవక తప్పింది కాదు.

"పినాకపాణి నన్ను ఒక రకంగా ఇబ్బంది పెట్టలేదు. వాడు పెట్టిన పరీక్షలో నెగ్గలేనేమోనన్న మానసిక వ్యథ చాలా అనుభవించాను. బోలెడంత విలువైన సమయం వృథా అయ్యింది." "ఇదంతా నా కెందుకు? అసలు విషయం చెప్పండి" గద్దించింది మా ఆవిడ.

"పేర్ల గురించి ఆలోచిస్తుంటే తెలుగు వ్యాకరణంలో విభక్తులు గుర్తుకొచ్చాయి. కిన్, కున్, యొక్క... ఇలా పేర్లు పెట్టుకుంటే బావుంటుందన్న చిలిపి ఆలోచన కలిగింది.

పినాకపాణి కొడుకు దుడ్డుముక్కలా ఉంటాడుగా. బకాసురుడు వాడికి తగిన పేరనిపించింది. అక్షరాలు కత్తిరించి తయారుచేశాను. 'బక్' అన్న పేరు.

ఆమె ఆసక్తిగా వింటోంది.

"విశ్వనాథన్... విఎస్ ధన్‌గా మార్చుకున్నట్టు.. బహుశా ఇంటిపేరుతో కలుపుకుని 'హెచ్.ఎం.బక్' అయితే బాగుంటుందనుకున్నాడేమో! భవిష్యత్తులో హంబక్ అనే పేరుతో ఆ పిల్లగాడు ప్రాచుర్యం పొందుతాడేమో!

'పుర్రెకో బుద్ధి... జిహ్వకోరుచి' అన్నారు పెద్దలు.. పినాకపాణికి నచ్చింది. నాకంతేచాలు" చెప్పుకుపోతున్నాను.

ఇంకా నేను మాట్లాడటం పూర్తికాలేదు.

ఆమె వంటింట్లోకి జారుకుంది.

అసలు మా ఆవిడ నోట్లో నువ్వు గింజ నానదు. రేపో మాపో ఈ విషయం పాణి చెవిన పడి తీరుతుంది.

అప్పుడు నా పరిస్థితి...?

భయంతో నా గుండె జారింది.





పార్థసారథి చిరువోలు
హైదరాబాద్, 99088 92065

# అమ్మకు పద్య పుష్పాలంకరణ







*తల్లిదండ్రులందు దయ లేని పుత్రుండు*
*పుట్టనేమి వాడు గిట్టనేమి*
*పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

*ఈ పద్యాన్ని తాత్పర్యంతో సహా నేర్చుకున్న, అర్థం చేసుకున్న పిల్లలెవరైనా... మలివయసులో అమ్మానాన్నలను వృద్ధాశ్రమాలకు పంపగలరా? సంస్కారం అడ్డుపడదూ! ఇలాంటి పద్యాలెన్నింటి ద్వారానో నవతరాన్ని సంస్కారయుతం చేస్తున్నారు పరవస్తు ఫణిశయన సూరి.*

పరవస్తు చిన్నయసూరి... ధరామండలంపై తెలుగు భాష వినిపించినంత కాలం ఈయన పేరు ప్రకాశిస్తూనే ఉంటుంది. అలాంటి సాహితీమూర్తి మునిమనవడు ఫణిశయన సూరి. (అయిదో తరం). ప్రస్తుతం విశాఖపట్నంలో పుష్పాలంకరణ వ్యాపారంలో ఉన్నారు. 'పరవస్తు పద్యపీఠా'న్ని స్థాపించి, తెలుగు పద్యాన్ని కొత్తతరానికి చేరువ చేస్తున్నారు.

వివాహాలు, శుభకార్యాలకు పుష్పాలంకరణ చేయడం ఫణిశయన వృత్తి. ప్రతి ఏటా సింహాచలం దేవస్థానంలోనూ పుష్పాలంకరణ చేస్తుంటారు. మొదటి నుంచి తెలుగు సాహిత్యంపై ముఖ్యంగా పద్యసంపదపై మక్కువ ఎక్కువ. చిన్నయసూరి వారసత్వమే దీనికి కారణమేమోనని అంటారు ఫణి. తాతగారి పేరిట ఏదైనా పీఠాన్ని స్థాపించి సమాజహితమైన కార్యక్రమాలు నిర్వహించాలన్నది ఆయన లక్ష్యం. దాని కోసం, తన సంపాదన నుంచి దాచుకున్న రూ.5 లక్షలను పక్కన పెట్టుకున్నారు. ఏ పీఠం నెలకొల్పాలి. ఏం కార్యక్రమాలు చేపట్టాలని ఆలోచిస్తున్నప్పుడు... తనకు అత్యంత ఇష్టమైన పద్యం గుర్తుకు వచ్చింది. నేటితరానికి అది దూరమవుతున్న తీరు కళ్ల ముందు కదిలింది. వెంటనే నిర్ణయం తీసుకున్నారు. గత ఏడాది ఏప్రిల్‌లో 'పరవస్తు పద్యపీఠా'న్ని ప్రారంభించారు.

వేసవి సెలవుల్లో ప్రతి సాయంత్రం రెండు గంటల పాటు పిల్లలకు పద్యాలను నేర్పేవారు. మొదట్లో స్థానికంగా తనకు తెలిసిన వారి పిల్లలకే బోధించే వారు. సెలవులు పూర్తయ్యాక ద్వారాకనగర్ పౌరగ్రంథాలయంలో ప్రతి ఆదివారం ఉచిత శిక్షణ ప్రారంభించారు. అప్పటికే ఆయన దగ్గర పద్యాలు నేర్చుకున్నవారు, నేర్చుకుంటున్న వారి ద్వారా పీఠం గురించి తెలుసుకున్న దాదాపు 120 మంది పిల్లలు 'మేమూ నేర్చుకుంటా'మంటూ ముందుకు వచ్చారు. ఉదయం తొమ్మిది గంటల నుంచి పన్నెండు గంటల వరకూ శిక్షణ సాగేది. పద్యం నేర్చుకున్న ప్రతి పిల్లవాడికీ సూరి... రూ.పది ఇస్తారు. ఇలా ఎన్ని పద్యాలు నేర్చుకుంటే అన్ని

పదులన్న మాట. పద్య పఠనంపై పిల్లల్లో ఆసక్తి, పోటీతత్వాన్ని పెంచడానికే ఈ చిరు పారితోషికమని చెబుతారు సూరి.

ఆ తర్వాత ఎంవీపీ కాలనీలోని గాయత్రీ కళాశాలలో రెండు నెలల పాటు శిక్షణ కొనసాగించారు. ఇప్పటివరకూ మూడుచోట్ల శిక్షణ



**మూడొందలకు పైగా...**

పద్యాలతో ఎంతో నేర్చుకున్నా. 'చదువది ఎంత కలిగినా'... దీంతో చదువు విలువ తెలుస్తుంది. మన ప్రవర్తన ఎలా ఉండాలో కూడా ఈ పద్యం చెబుతుంది. 300లకు పైగా పద్యాలను చెప్పగలను. వాటి ద్వారా ఇప్పటి వరకూ రూ.3300 గెలుచుకున్నా.

**– వి.శోభిష్, 9వతరగతి, విశాఖపట్నం.**



**రెండు నెలల్లో 63**

రెండు నెలలుగా పద్యాలను నేర్చుకుంటున్నా. ఇప్పటికి 63 నేర్చుకున్నా. వాటిని చక్కగా పాడగలను. ఇంకా నేర్చుకోవాలనుకుంటున్నా.

**– పి.జాహ్నవి, 8వతరగతి, పెందుర్తి**

కేంద్రాలు ఏర్పాటు చేసి 500 మందికి పైగా పిల్లలకు పద్యాలు నేర్పించారు. వారిలో 300 మంది అయితే ఒక్కొక్కరూ వంద పద్యాల వరకూ ఆలపిస్తారు. రెండో తరగతి నుంచి పదో తరగతి వరకూ చదువుతున్న పిల్లలు సూరి శిష్యులు. ఆణిముత్యాల్లాంటి 108 పద్యాలను ఎంపిక చేసి వారికి బోధిస్తున్నారు. పసివారికి ఉత్తమ నడవడిక నేర్పడమే ప్రమాణంగా పురాణాలు, శతకాలు, ప్రబంధాలు, చాటువులు, నాటకాల నుంచి ఈ పద్యాలను సేకరించారు. ఈ పద్యాల పుస్తకాలను పిల్లలకు ఉచితంగా అందిస్తున్నారు. పద్యాలను ఎలా ఆలపించాలో నేర్పడంతో పాటు వాటి తాత్పర్యాలనూ విడమరచి చెబుతారు.

ఇప్పటి వరకూ పీఠం కార్యక్రమాలకు రూ.3 లక్షలు వెచ్చించారు. అందులో రూ.50 వేలు దాతలు ఇచ్చినవి. మిగిలిన సొమ్మంతా సూరి సొంతమే. పీఠం కోసం విరాళాలు ఇవ్వాలని సూరి ఎవరినీ అడగరు. వీలైనంత వరకూ సొంత డబ్బుతోనే అన్నీ చేస్తారు. ఎవరైనా స్వచ్ఛందంగా ముందుకు వచ్చి నిధులు సమకూరిస్తే తీసుకుంటారు.

**త్వరలో 'తెలుగు బడి'**

విశాఖలో పదివేల మంది పిల్లలకు వంద పద్యాలు నేర్పాలన్నది పీఠం లక్ష్యం. పద్యాలను నేర్చుకోవడం వల్ల పిల్లల్లో జ్ఞాపకశక్తి, ధారణశక్తి పెరుగుతుంది. నంది తిమ్మన 'మ', 'న' అనే రెండు అక్షరాలతోనే పద్యం చెప్పారు. అలాంటి వాటిని పిల్లలకు నేర్పడం వల్ల వారి ఉచ్చారణ శక్తి మెరుగవుతుంది. ఏ పదాన్నైనా సులభంగా పలకగలుగుతారు. ఏ భాషనైనా సులువుగా నేర్చుకోగలుగుతారు. పద్యాల వల్ల మరో ముఖ్యమైన ప్రయోజనం... వ్యక్తిత్వ వికాసం. 'తల్లిదండ్రులందు' పద్యం భావాన్ని అర్థం చేసుకున్న వారెవరూ అమ్మానాన్నలను అగౌరవపరచరు. పద్యాలను నేర్చుకోవడానికి పిల్లలే అమితాసక్తి చూపుతున్నారు. దీనికి చిన్న ఉదంతం చెబుతా. నవంబరు నాలుగున విశాఖలో కుండపోత వర్షం. కాలు బయటపెట్టే పరిస్థితి లేదు. అయినా... 60 మంది చిన్నారులు గొడుగులు వేసుకుని మరీ తరగతులకు వచ్చారు. నేను ఆశ్చర్యపోయా. మా దగ్గరకు వస్తున్న వారిలో ఆంగ్ల మాధ్యమంలో చదువుకుంటున్న పిల్లలూ ఉన్నారు. వారికి తెలుగు చదవడం, రాయడం రాదు. అయినా... పద్యాల కోసం తెలుగును నేర్చుకుంటున్నారు. పిల్లలకు మాతృభాష గొప్పదనాన్ని కూడా పద్యరూపంలోనే వివరిస్తున్నా. ఎన్ని భాషలు నేర్చినా తెలుగును మాత్రం నిర్లక్ష్యం చేయకూడదని 'తెలుగు బాల' శతకంలోని పద్యం ద్వారా నేర్పుతున్నా. పద్యానికి రూ. పది ఇవ్వడం కూడా పిల్లల్లో ఆసక్తి పెంచాలనే. ఒక్క పద్యం నేర్చుకున్న పిల్లవాడు అంతటితో ఆగిపోడు. తన తోటి వారికన్నా ఎక్కువ నేర్చుకోవాలన్న తపన కనబరుస్తాడు.

నా భార్య సుజాత. పద్యపీఠం కార్యక్రమాలకు పూర్తి మద్దతు ఇస్తారు. మా పిల్లలు మారుతీరాం, వంశీకృష్ణ, కనకమహాలక్ష్మి... ఎనిమిది, ఏడు, నాలుగో తరగతులు చదువుతున్నారు. ముగ్గురికీ 150 పద్యాల వరకూ కంఠతా వచ్చు. ప్రతిరోజూ నిద్ర లేవగానే ఏదో ఒక పద్యం చదువుతారు. భగవంతుడి ఆశీస్సుల వల్ల ఆర్థికంగా ఇబ్బందులు లేవు. పద్యపీఠం కార్యక్రమాలను నిరంతరం కొనసాగిస్తూనే ఉంటా. త్వరలో 'తెలుగుబడి'ని ప్రారంభించాలని అనుకుంటున్నా. మన విద్యావిధానం వల్ల మాతృభాషకు దూరమవుతున్న పిల్లలకు అచ్చ తెలుగును బోధించడమే ఆ బడి లక్ష్యం. తెలుగు నుడికారాలు, జాతీయాలు, సామెతలు... అన్నింటినీ చిన్నారులకు నేర్పాలి. అప్పుడే మన భాషకు వెలుగు.

**– ఫణిశయన సూరి, 94406 82323**



**ఇష్టం పెరుగుతోంది**

పద్యాలను నేర్చుకున్న కొద్దీ ఆసక్తి పెరుగుతోంది. మొదట్లో సాధారణ పాఠాలు చదివినట్లు పద్యాలను చదివే దాన్ని. ఇప్పుడు వాటినెలా ఎలా పాడాలో తెలుసుకున్నా. ఇప్పటికి 35 పద్యాలను నేర్చుకున్నా.

**– అశ్విని, ఏడో తరగతి, జీవీఎంసీ పాఠశాల, మధురానగర్**

ప్రపంచ తెలుగు మహాసభల నేపథ్యంలో పద్యపీఠం ఆధ్వర్యంలో డిసెంబరు 12న విశాఖ 'కళాభారతి'లో 'తెలుగు పద్య విజయం' పేరిట ఓ కార్యక్రమం నిర్వహించారు. ఇందులో పాల్గొన్న చిన్నారులు... ప్రాచీన, ఆధునిక కవుల వేషధారణలతో వేదికపైకి వచ్చారు. తిక్కన, పోతన, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, మొల్ల, రాయప్రోలు, విశ్వనాథ సత్యనారాయణ, జాషువ, జంధ్యాల పాపయ్య, చిలకమర్తి, చిన్నయ సూరి తదితరుల వేషధారణలతో మధురాతిమధురంగా పద్యాలను ఆలపించారు. నంది పురస్కార గ్రహీత మీగడ రామలింగస్వామి ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. ఇందులో పాల్గొన్న మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు, సినీ రచయిత గొల్లపూడి మారుతీరావు, ఏయూ విభాగం విశ్రాంత ఆచార్యులు కోలవెన్ను మలయవాసిని తదితరులు చిన్నారుల ప్రతిభకు ముగ్ధులయ్యారు.





**పులఖండం శ్రీకాంత్,**
విశాఖపట్నం, 9912672775

తెలుగువారు స్వేచ్ఛాప్రియులు, చేసే ప్రతి పనీ అందంగా ఉండాలని కోరుకునే రసజ్ఞులు. పూర్వం నుంచి ఇదే వరుస. వేసే ముగ్గుల్లోనూ, గీసే గీతల్లోనూ, రాసే అక్షరాల్లోనూ అందాన్నే కోరుకుంటారు. అందుకే మన ముగ్గులు అంత సుందరంగా, అక్షరాలు అంత సొగసుగా ఉంటాయి. ఏమాత్రం మారుస్తామన్నా ఒప్పుకోరు. ఎప్పటినుంచో వస్తున్న అందాల అక్షర సుందరుల్ని నాశనం చేస్తావా అంటూ తిరగబడతారు. ఎందరో శిల్పులు, లేఖకులు అందించిన అందాలను మాపేస్తావా అంటూ నేడు చదువుకున్నవారే ఎదురు తిరుగుతున్నారు. ఇప్పుడేం కష్టమొచ్చిందని మారుస్తావంటూ విసుక్కుంటున్నారు. అందుకే 150 సంవత్సరాలుగా ఉద్యమం సాగుతున్నా, ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంది.

శాసనసభ్యుడు పప్పూరి రామాచార్యులు తెలుగు లిపి సంస్కరణ అవసరాన్ని వివరిస్తూ 1957లో సభలో ఒక తీర్మానం ప్రవేశపెట్టారు. అప్పుడు అక్కడే ఉన్న వావిలాల గోపాలకృష్ణయ్య లేచి సవరణ ప్రతిపాదించారు. మన లిపి సంతరించుకున్న సహజశీల సౌందర్యం చెడకుండా, పఠన లేఖనాదులకు ఇబ్బంది కలగకుండా లిపిని సంస్కరించాలన్నారు. సవరణ నెగ్గింది. బిల్లు బిల్లుగానే నిలిచిపోయింది. దీన్నిబట్టి మన తెలుగువారు ఎంతటి సౌందర్యాభిలాషులో తెల్లమవుతుంది. సాంకేతిక ప్రగతిని వినియోగించుకోవాలని ఆరాటపడే భాషాభిమానుల హృదయాల్లో ఆ సవరణకనుగుణంగా లిపిని మార్చే విధానం ఎలా అనే సమస్య బతికే ఉంది!

అప్పటి కృష్ణా పత్రిక సంపాదకుడు ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ 1944 నుంచీ ప్రయత్నాలు చేశారు. '69' డిసెంబరులో తెలుగులిపి సంస్కరణ అనే పుస్తకాన్ని ప్రచురించారు. అందులో ఈ సంస్కరణ ఆవశ్యకత ఎన్ని రకాలుగా ఉందో వివరించి, సంస్కరణ విధానం కూడా సూచించారు.

'మన లిపి సామాన్య ప్రజల దృష్టిలో ఒక సమస్యగా కన్పించడంలేదు'. నిజమే- బాగా చదువుకున్న వాళ్ళు, తెలుగుభాషకు ప్రాచీన హోదా కావాలని యుద్ధంచేసినవాళ్ళే ఈ విషయం ఎత్తితే ఏమంటున్నారు? 'అబ్బే... ఎందుకండీ! ఇప్పుడున్న లిపికి కష్టమేమివచ్చింది? కావాలంటే రెండు మూడు అక్షరాలు కొత్తవి పెట్టుకుందాం. అవి లేకుండా కూడా నడిచిపోతుంది కదా' అని రాగాలు పోతున్నారు. అందుకని ఈ ఉద్యమం ప్రభుత్వం చేపట్టాలి. లేదంటే సమర్ధ పత్రికాధిపతులు చేపట్టాలి. ఎలాగంటే-

ఒకప్పుడు మనకు రూపాయి, అర్ధరూపాయి, పావలా, బేడ, అణా, అర్ధణా, కాణీ, దమ్మిడీ... ఇలా ఉండేవి. అదీ రూపాయికి 192 పైసల పాతపద్ధతిలో. అప్పుడు ప్రజలు వాటికలవాటుపడ్డారు. అవే వాడుకున్నారు. లెక్కల్లో తేడాలేదు. కానీ ప్రభుత్వం దశాంశపద్ధతికి మార్చాలనుకుంది. చెప్పి చేసిందా? మొదట ప్రజలు కంగారుపడ్డారు. తరువాత వీటికీ అలవాటుపడ్డారు. నయాపైసలు పైసలైపోయాయి. ఇప్పటివారికైతే పాతమానం అర్థమే కాదు. వాటినెలా ఉపయోగించారో అర్థంకాక ఆశ్చర్యపోతారు. ఈ మార్పు కొలమానం, తులామానంలో కూడా వచ్చింది. వీసెలు పోయి కిలోలు వచ్చాయి. మానికలు పోయి లీటర్లు వచ్చాయి. బడిలో కూడా గణితబోధన సులభమైంది. అయితే ఇదంతా జాతీయస్థాయిలో అయింది కాబట్టి సరిపోయింది. మన ప్రభుత్వం మాత్రమే చేయాలంటే అయ్యేదికాదు.

రాష్ట్రంలో ఆర్థికంగా చూసినప్పటికీ ఈ నూతన




## రెక్కలు



చీకట్లో
కన్ను కొట్టకు
పోస్టు చేయని
ప్రేమలేఖ రాయకు
వెలుతురు
ప్రయత్నం



ఏడుస్తూ
పుడ్తాం
చస్తూ
ఏడుస్తాం
దుఃఖం
ఆసరా

చిన్నవే
అణువులు
విస్ఫోటన
విశ్వమంత
అక్షరం
అణువు



లిపిమార్పు మంచి పొదుపునకు దారితీస్తుంది. ఎందుకంటే ఇప్పుడు 27 పంక్తులు పడుతున్న పేజీలో అదే పరిమాణ అక్షరాలు 36 పంక్తులు పడతాయి. ముద్రణలో ఎంత కాగితం కలిసివస్తుందో చెప్పండి! విద్యార్థులందరికీ ఉచిత పుస్తకాలు పంచిపెడుతున్న ప్రభుత్వానికి కొన్ని కోట్ల ఖర్చు ఆదా అవుతుంది. దినపత్రికల వాళ్లూ అదే పేజీలతో ఎక్కువ వార్తలను ప్రచురించవచ్చు. ఎలాగంటారా...

కింద, పైనా వత్తులకు గాను పంక్తికీ పంక్తికీ మధ్య ఒకటిన్నర పంక్తి జాగా వదిలేస్తున్నాం. అంటే ఈ వత్తులు లేని ఆంగ్ల అక్షరాలు మూడు పంక్తులు పట్టే స్థలాన్ని తెలుగులో రెండు పంక్తులే ఆక్రమిస్తున్నాయి. కారణం... కింద వత్తులివ్వడం. పోనీ పంక్తుల మధ్య జాగా పూర్తిగా ఉపయోగిస్తున్నామా అంటే అదీలేదు. సామాన్యంగా మనం వాడే భాషలో పంక్తికి సరాసరి రెండు వత్తులుండవచ్చు. ఆ రెండింటికోసం మొత్తం ఖాళీగా వదిలేస్తున్నాం. మనం వత్తుల అందాలమీద చాపల్యం వదిలేస్తే, లిపిని మార్చుకోవడం పెద్ద సమస్యేమీ కాదు. పైగా ఎక్కువ అక్షరాలు నేర్చుకునే బాధ నుంచి పిల్లల్ని విముక్తి చేసినవాళ్లమవుతాం. తమిళం, ఆంగ్లం, హిందీలా మనమూ అక్షరం పక్కన అక్షరం రాసుకుంటూ పోవచ్చు... పైగా శాస్త్రీయంగా.

ఉదాహరణకు ఒక పదం 'రక్తం' తీసుకుందాం. లిపి శాస్త్రయుక్తంగా ఉంటే, మనం రాయాల్సింది 'రక్‌తము'. కానీ మనం రాస్తోంది 'రక్తము'. ముందు పలకాల్సిన హల్లు... తర్వాత, తర్వాత హల్లు... ముందు. పొల్లుకు తలకట్టు ఇస్తున్నాం. తలకట్టు ఉండాల్సినచోట పొల్లు ఇస్తున్నాం. అయితే ఈ విషయం అలవాటుపడిన మనకు అర్థంకాదు. మిగిలిన భాషలవాళ్లు ఎలా రాస్తున్నారో చూడండి. తమిళంలో హిందీలో ఆంగ్లంలో. వీటన్నింటిలో కకారం... ముందు, తకారం... తర్వాత. కావాలంటే రాతలో ఇప్పుడున్న పద్ధతిని ఉపయోగిద్దాం. అచ్చులో మాత్రం లిపిని మార్చుకుందాం.

అచ్చు యంత్రాలు రాక ముందు మన అక్షరాలు మరోకలా ఉండేవి. అక్షరం మారింది. వత్తు మారింది. పూర్వం వలపల గిలక ఉండేది. హిందీలో 'ర'వత్తులా ఉపయోగించేవాళ్లు. మనకు తెలియకుండా ఇలా ఎన్ని మార్పులు వచ్చాయో ఒకసారి శాసనాలలోకి వెళ్తే తెలుస్తాయి. నన్నయ్యనాటి లిపి మనకు అర్థమయ్యీ కాకుండా ఉంటుంది. ఇంకా ముందుకు వెళ్తే అది వేరే భాష అయినట్లు కన్పిస్తుంది. కాబట్టి మనిషి కట్టూబొట్టూ లాగానే లిపికి కూడా మార్పు అవసరం.

ఇప్పుడు వస్తున్న శాస్త్రీయ విజ్ఞానమంతా తెలుగులో కావాలంటే, మన లిపిలో కొన్ని అక్షరాలు కొత్తగా చేర్చాలి. బ్యాంక్, ల్యాప్ వంటి పదాలు తెలుగులో రాయాలంటే సరైన అచ్చు లేక మనం పడుతున్న పాట్లు అందరికీ తెలిసినవే. టెలివిజన్... తెలుగులో తప్పులేకుండా రాయాలంటే శాసనాల్లోకి వెళ్లి వెతుక్కోవలసిందే. సునామీ తెలుగులో రాయాలంటే దంత్య తాలవ్య 'చ', 'జ' లు మళ్లీ తెచ్చుకోవలసిందే. మనం రోజూ తాగే 'కాఫీ' తెలుగులో రాయాలంటే... సరైన హల్లు లేదు మనకు. ప్రస్తుతానికి కొన్ని అక్షరాల స్వరూపాలు మార్చాలి. కింద ఇచ్చే వత్తులు ఐకారంతో సహా అన్నిటినీ వదిలేయాల్సిందే. ఇందుకు పత్రికలు ప్రయోగాలు తిరిగి మొదలుపెట్టాలి. ఈసారి నిరంతరంగా ప్రయత్నించాలి. ప్రభుత్వం, పత్రికలు పట్టించుకుంటే ఇదో సమస్య కాదు. ఓపిక ఉండాలంతే.

ఇప్పటిదాకా ఈ ఉద్యమంలో పాల్గొన్న మహనీయుల స్ఫూర్తితో ఇంకో అడుగు ముందుకేద్దాం.



# మార్చుకుంటే మేలెంతో



**డా॥ చింతలపూడి వెంకటేశ్వర్లు**
విశ్రాంత ఉపాధ్యాయులు,
ప్రకాశం జిల్లా, 94937 75700.



ఊహలకు
అందదు
పరిస్థితులకు
లొంగదు
కాలం
భలే కిలాడి



ఎంత పెద్ద
ప్రపంచం
వీక్షించే
కన్నులు రెండు
సుఖ
దుఃఖాల్లోంచే



ఏ కృతి
రాయగలవు?
ప్రకృతి
లేకుండా
కవిత్వం
ప్రకృతి

# అదిగదిగో అర్థక్రాంతి... అలనాడే



కొత్తరూపాయి వస్తుందట కణకణమని
కొత్తకాయితాలు వస్తాయట కిసకిసమని
ప్రతియేడూ కొత్త రూపాయి,
కొత్తకాగితం, కొత్తవాసన.
పాతవెధవ పోతాడు
కొత్తవెధవ వస్తాడు.
శతాబ్దాల సన్యాసి వస్తాడు
సాలుసరి సన్యాసి వస్తాడు
రూపాయి బాసికం కట్టుకుని
ఊరేగుతున్న ఈ పెళ్లికొడుకుల
పెళ్లాలతాళ్లు పెటుక్కున తెగుతాయి
నవశకం విరుస్తుంది
అక్కడ ఉదయిస్తాడు నాసృజనకర్త

– దుర్గానంద్

(కాగితానికీ కండరానికీ యుద్ధం - కవిత. సృజనకర్త శంఖారావం)

1982లో, అంటే 30 ఏళ్ల క్రితమే 'సృజనకర్త శంఖారావా'న్ని వినిపించిన ఈ కవి దుర్గానంద్. ఈయన ఈ పుస్తకానికి ముందుమాటగా 'ఇంధనా'న్ని సమకూర్చారు. అందులో ఇటీవల చర్చ జరుగుతున్న 'ఈనాడు అర్థక్రాంతి' సూత్రధారి అనిల్‌బొకిల్ ప్రతిపాదనల సారమంతా ఇమిడ్చారు. అది కవి కన్న కల కాదు. క్రాంతదర్శి అయిన కవి ఆచరణాత్మకంగా ప్రతిపాదించిన కరెన్సీ రద్దు సిద్ధాంతం. కవితాత్మకంగా వ్యక్తీకరించిన కల. కరెన్సీ తాత్కాలికం కావాలి అంటారు దుర్గానంద్. 'వీటిని (వస్తువులు) మోసుకువెళ్లటం కష్టం అని చెప్పి కరెన్సీని ఒక టోకెన్‌గా, టిక్కెట్‌గా చెలామణి చేశారు. నిజానికి ఆ టోకెన్‌ను శ్రామికుడికి భోగ్య వస్తువులు అందించిన తర్వాత చింపి వేయాలి. కానీ దాన్ని చింపకుండా శాశ్వతంగా ఉంచడం వల్ల కరెన్సీ అనే కృత్రిమ ధనికుడు సమాజంలో తయారయ్యాడు. రైల్లో ప్రయాణం తర్వాత స్టేషన్ మాస్టర్ టిక్కెట్టును చింపివేస్తాడు. చింపివేయకపోతే, వాడు ఆ టిక్కెట్‌ను తీసుకొని మళ్లీ బండి ఎక్కుతాడు'.

- దుర్గానంద్, ఇంధనం.

'విద్య వేరు, చదువు వేరు' అన్నారు విశ్వనాథ. అలానే మానవ సమాజాన్ని నడిపే నిజమైన ధనం ఏది అని ప్రశ్నించుకొని కరెన్సీ ధనం కాదు అంటారు దుర్గానంద్.

'పని ఉందీ మెతుకుందీ
పసచెడకుందీ నాణెం,
మెతుకును పనితో అతికే దసలే
మెదడే మనిషికి లేదంటా'

- (మినీ కవితలు, దుర్గానంద్ సృ.శం.)

'కరెన్సీ ధనానికి కాగిత చిహ్నామె
కాగితపూజయె ధనపూజా!
మ్యాపుచూచి దేశమిదేనని
మతిపోయిన వాడేయను' (- అదే పుట-67)

"మానవ సమాజం బిల్డింగు కాదు, ప్రవాహమని నేనంటున్నాను... సమాజాన్ని గురించి మా దృష్టికోణం వేరు, తర్కం వేరు, ఈప్స వేరు, అభిశంసనం వేరు, ప్రతిక్రియ వేరు. ఇప్పటి వ్యవస్థ ధ్వంసంలోనే ఉంది. లంచగొండితనం, నల్లధనం, ఆస్తి విలువలూ మొదలైనవన్నింటినీ మీరు ఏ ఆర్థిక దోషాలు అంటున్నారో వాటిని మేము ఆర్థిక దోషాలు అనక కరెన్సీ దోషాలు అంటున్నాం. ఆ మాటతోనే సమస్యకు వేరే పరిష్కారాన్వేషణ జరిగినట్టయింది... ప్రతిదీ ప్రవహిస్తుంది. ఈ ప్రపంచమంతా ప్రవాహమయం. Every thing is a flow and every bit is its foe. The same in several. జీవితం మరణంలోకి ప్రవహిస్తుంది. లాసు ప్రాఫిట్‌లోకి ప్రవహిస్తుంది.. పోతే కరెన్సీ ఎలాగూ ప్రవాహమే కదా! ఎలా అయితే జాగృతీ నిద్రలు ఒకే ప్రవాహానికి రెండు కొసలో అలాగే కరెన్సీ - ప్రవాహానికి లాస్, ప్రాఫిట్ రెండు కొసలు. నష్టపడ్డవాడు నష్టపడ్డట్టు కాదు, లాభపడ్డవాడు లాభపడ్డట్టు కాదు. కరెన్సీ ప్రవాహం అనుకున్నప్పుడు, కరెన్సీలో ప్రవాహ దిశల్ని నిర్దేశించమని ఈ సిద్ధాంతం చెపుతుంది. కరెన్సీ ధనంకాదు, ధనాన్ని మోసుకెళ్లే వాహనం మాత్రమే అనేది తెలుసుకుంటేగాని కరెన్సీ రద్దును గురించి, ఈ సిద్ధాంతం చేసే తర్కం అర్థం కాదు. అసలు మానవ సమాజాన్ని నడుపుతున్న ధనాలు ఏమిటి? మానవ సమాజాన్ని శరీరం, బుద్ధి, హృదయం, ఆత్మా నడుపుతున్నాయి. శరీరం అంటే శ్రమ, బుద్ధి అంటే ఆలోచనాశక్తి, హృదయం అంటే సంవేదన, ఆత్మ అంటే సమానత్వం. ఇవి సమాజాన్ని నడుపు మూలతత్త్వాలు'

- దుర్గానంద్, ఇంధనం

నా శిల్పంతో మెప్పించి తెచ్చుకున్న గంజిమెతుకు,
నా శాస్త్రంతో మెప్పించి తెచ్చుకున్న చింకిపాత
నా చెమ్మట ధారవోసిన దానికి లభించిన కూలిగింజ
నా గుండె కార్చి దానికి పారిన కన్నీరు
అన్నీ చెల్లాచెదురైపోయినాయి
'ఎందుకు తన్నావ్ గాడిదా!
..నీకేమొచ్చింది అన్నాను..'
'అవి నీ ధనాలా! కాదు, కాదు, నేనే నీ ధనాన్ని
నా ధనాల్ని మోసిమోసి! నా ప్రియమైన కంచరగాడిదా!
నీవే ధనమైపోయావా? ఎందుకింత మారిపోయావ్?
తరతరాలుగా నీ ధనాల్ని మోస్తున్నాను
మోసిమోసి ఇప్పుడు నేనే ధనమైపోయాను
గడ్డపారతో పెకలించి తీసిన
బొడ్డురాయి దేవుడు కాలేదా! అలాగేనేనూనూ
'అయ్యో ఈ గాడిదకు పొగరెక్కింది
ఈ కంచరగాడిదను, ఈ కరెన్సీ గాడిదను
డిసెంబరుకు తరిమేసి
జనవరికింకో కొత్తగాడిదను తెచ్చుకుంటాను'

(కంచరగాడిద - కవిత -దుర్గానంద్ స్వ.శం)

ప్రభుత్వం ప్రవేశపెట్టే లోటుబడ్జెట్‌కు అర్థం లేదంటాడు దుర్గానంద్. ఈ దేశపు జానాభాయే, వారి శక్తియుక్తులే ఈ దేశపు ధనమంటాడు.

జనుము, బొగ్గు, పెట్రోలులాగా
జనాభా కూడా ఒక సంపద,



నీగ్రోవానిది నల్లశరీరం
నిగనిగమనడం లేదా ఇప్పుడు
- (అదే పుట - 59)

తొట్టెలోని బకెట్టు నీరు
తోడిపోస్తే లోటయ్యింది,
ఆ బకెట్టు నదిలో వేస్తే
అవుతుందా నది నీటికి లోటు
- (అదే పుట-63)

వ్యక్తి ఆర్థికం తొట్టెలాంటిదే
వ్యక్తికి లాసూ ప్రాఫిట్టు,
ప్రభుత్వ జలధికి లోటేమిటి?
పారేనీటికి కన్నీరా! - (అదేపుట-63)

మిగులున్నచోట మిగులూ లేదు
తగులన్న చోట తగులూ లేదు
బడ్జెట్టొక బ్రహ్మపదార్థం
బాధ అంకె, జీవిత లంకె
- (అదే పుట - 64)

కరెన్సీ వల్ల పెరిగే బాధలకు 'ఇంధనంలో' ప్రత్యామ్నాయం చెబుతారు దుర్గానంద్. "ధనంపైన ఆవరించిన ఈ పొగమంచును పటాపంచలు చేయాలంటే ఈ కరెన్సీని చింపేయాలి? ఎలా? మళ్లీ మనం వెనక్కు వెళ్లి బార్టరు పద్ధతిని ప్రవేశపెట్టాలా? వస్తుమార్పిడి పద్ధతి చేపట్టాలా? అదీ ఇప్పుడు అసంభవం. సమాజం చాలా పెరిగిపోయింది. కరెన్సీని పూర్తిగా తీసివేయలేం. కాబట్టి మధ్యేమార్గాన్ని ఒకటి అవలంబించాలి. దాని పని అయిపోగానే పూర్తిగా అప్పటికప్పుడే చింపివేయకుండానూ, బొత్తిగా ఎత్తేయకుండానూ ఒక సంవత్సరం మేరకు దీన్ని ఉంచవచ్చు. ఒక సంవత్సరం మేరకు పాత కరెన్సీ మార్పు చెందుతుంది. అప్పుడు తరతరాల ధనికుడు ఉండడు. సాలుసరి ధనికుడు ఉంటాడు."

అనిల్ బొకిల్ సమస్త వ్యవహారాలూ బ్యాంకుల ద్వారా జరగాలంటున్నారు. దుర్గానంద్ ఇటువంటి ఆచరణాత్మక సమస్యల పరిష్కారాన్ని తన అముద్రిత గ్రంథం "నూతన ఆర్థిక సిద్ధాంత ప్రతిపాదన- వివరణ"లో చెప్పారేమో! ఆయన కుమారుడు అంబికానంద్ దాన్ని త్వరలో ప్రచురిస్తామని ఆశపెడుతున్నారు. 'ఇంధనం'లో మాత్రం తమ సిద్ధాంతం కమ్యూనిజం కన్నా ఎందువల్ల మెరుగో చెప్పారు దుర్గానంద్.

"కమ్యూనిజం అసలు ధనికుణ్ని సహించదు. ఇది సాలుసరి ధనికుణ్ని సహించుతుంది. దీనికి గాడ్‌మైండ్ కూడా ఉంది. మానవుని సంవేదనలను, అనుభూతిని ఇది కాపాడుతుంది. అందువల్ల దీన్ని 'కమ్యూనిజం ప్లస్ గాడ్' అనికూడా అనవచ్చు. ఇది రెవెన్యూ నుంచి రైతునూ, సిండికేట్ నుంచి శిక్షకుణ్ని, ప్రజానాయకుల నుంచి ప్రజల్ని, కార్మిక నాయకుల నుంచి కార్మికులను వేరు చేస్తుంది. అసలు ప్రజల, అసలు కార్మికుల రాజ్యం ఏర్పడుతుంది. అప్పుడది అసలైన సృజనకర్తల రాజ్యం అవుతుంది. ఈ మధ్యవర్తులు ఉండరు. శ్రమజీవి ఒక సృష్టికర్త, శాస్త్రవేత్త ఒక సృష్టికర్త, కవి ఒక సృష్టికర్త, తాపీవాడు ఒక సృష్టికర్త. వీళ్లదప్పుడు సృష్టికర్తల రాజ్యం అవుతుంది."

దుర్గానంద్ అసలు పేరు చక్రాల దుర్గానందరాజు. కులవ్యవస్థ మీద నమ్మకం లేని ఆయన తన పేరులో కుల వాచకాన్ని తొలగించుకున్నారు. ఆయన 1927, జనవరి 12న గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, మోదుకూరులో జన్మించారు. బీఏ సాహిత్యరత్నం చేశారు. హిందీ, సంస్కృతాలను రావల్పిండి, లాహోర్‌లలో అభ్యసించారు. నూజివీడు డి.ఎ.ఆర్.కళాశాల్లో హిందీ ఉపన్యాసకునిగా పదవీ విరమణ చేశారు. దయానందుడు, కబీరు రచనలతో పాటు మార్క్సిజాన్ని బాగా అధ్యయనం చేశారు. ఆయన రాసిన 'నూతన ఆర్థిక సిద్ధాంత ప్రతిపాదన వివరణ' ఇంకా ప్రచురితం కాలేదు. ఆయన అభ్యుదయ కవితాసంకలనం 'అంతర్గోళాలు' (1956), మధూలిక (1958), జూనాప్రణయగాథ (1962), చిరంతన (1971), ఘెరావ్ కవితలు (1974), డ్రీమ్స్ కాలనీ, ఆంగ్ల కవితా సంకలనం (1977), ముద్దుమాటల బాలల శతకం తేనెటీగ (1979) మొదలైన కవితలను రాశారు. జాషువా ఫిరదౌసీని హిందీలోకి, రవీంద్రుని గీతాంజలిని తెలుగులోకి అనువదించారు. సూరదాసు పదాలను తెలుగులో రచించారు. దానికి 1967లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవార్డును ఇచ్చింది. 'రంగపతి' అనే నవలను, 'పుష్పవృష్టి' అనే ఆంగ్ల తెలుగు నిఘంటువునూ నిర్మించారు. అముద్రితంగా ఎనిమిది నవలలు, నాలుగు పౌరాణిక నాటకాలు ఉన్నాయి. విశ్వనాథ సత్యనారాయణకి జ్ఞానపీఠ బహుమతిని నిర్ణయించిన కమిటీలో ఆయనా సభ్యులు! వీరు 1985 మే 7న పరమపదించారు. ఇటీవలే ఆయన కవితా సంకలనం, అంతర్గోళాలు, సృజనకర్త శంఖారావం పునర్ముద్రణ పొందాయి.



దుర్గానంద్ పొందాల్సినంత ఖ్యాతిని పొందలేకపోయారు. అభ్యుదయ, ఆచరణీయ భావాలను దుర్గానంద్ లాంటి ఎందరో రచయితలు సృజించారు. అటువంటి వారి కృషిని గుర్తించి, గౌరవించి మన భాష ఔన్నత్యానికి ఉపయోగించుకోవడమే వారికి నిజమైన నివాళి.


డా॥ వై.కామేశ్వరి
హైదరాబాద్
94417 78275

# జీవిత చక్రం



ఉద్యానవనంలోని రంగులను, అందాలను చూస్తూ కదలడం ఆగిపోయిన గాలితెమ్మెర ఉలిక్కిపడి ఒక్కసారిగా కదిలింది. పూలతో బరువెక్కిన సన్నని కొమ్మ, వయ్యారంగా ఊగి రాఘవ ముక్కును తాకింది.

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు రాఘవ. చుట్టూ చూశాడు.

పక్కనే స్టాండు వేసి ఉన్న సైకిల్ చక్రం ముందుకు కదిలించాడు. చక్రం ముందుకు తిరిగింది. దాన్నే గమనిస్తున్న అతని మనసులో అది తన జీవిత చక్రమేమో అనిపించింది. చక్రం తిరుగుతూనే ఉంది - కానీ ఉన్న చోటనే ఉంది. తన జీవితమూ అంతే.

పీజీ పూర్తయింది. ఉద్యోగాన్వేషణ చేస్తూనే ఉన్నాడు. పరీక్షలు రాస్తూనే ఉన్నాడు. ఇంటర్వ్యూలకు హాజరు అవుతూనే ఉన్నాడు. ఏ మాత్రం అభివృద్ధి లేదు. జీవిత చక్రానికి ఇంకా స్టాండు తీసే అవకాశం రాలేదు. వేగంగా పరిగెడుతూనే ఉన్నాడు. అయినా ఉన్న చోటునుంచి అంగుళమైనా కదల్లేదు.

గాలి మళ్లీ ఒకసారి వీచింది. పూలకొమ్మ మళ్లీ రాఘవ ముక్కును తాకింది. రాఘవకు పొలమారి దగ్గు వచ్చింది.

దగ్గుతో బాధ పడుతున్న నాన్న కళ్లముందు కదలాడాడు. "రాఘవా, ఈ రోజు ఆదివారం కదా! నాకు తోడుగా దుకాణంలో పనిచేయరా!" అనేవాడు.

"లేదు నాన్నా, హోమ్ వర్క్ ఉంది, నా మిత్రునింటికెళ్లి చేసుకుంటాను'' అంటూ వెళ్ళిపోయేవాడు రాఘవ.

"నాన్నకు సాయం చేస్తూ ఉండొచ్చు కదా" అని తల్లి ఎప్పుడైనా అడిగితే, ఇంతోటి పంచర్ దుకాణంలో ఇద్దరూ పనిచేయాలా?'' అనేవాడు తాను.

నాన్న పంచర్ దుకాణం నడుపుతూనే ఇంటిని పోషిస్తున్నాడు. సైకిళ్ళకు పంచర్లు వేస్తూ, గాలికొడుతూ, ఆ వచ్చిన డబ్బుతోనే కుటుంబం గడుపుతూ ఉన్నాడు.

రాఘవ ఫీజులు, జేబు ఖర్చులు అన్నీ నాన్నే సమకూరుస్తాడు. రాఘవకు పంచర్ దుకాణం పట్ల గానీ, నాన్న వృత్తిపట్ల గానీ చిన్నచూపులేదు. కానీ తానే ఒక మంచి ఉద్యోగం చూసుకొని, తల్లిదండ్రులను ఆ బాధల నుండి విముక్తి చేయాలని ఆలోచన.

ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నాడు శాయశక్తులా కానీ స్టాండు వేసిన సైకిలు ఎంత శక్తితో తొక్కినా ముందుకు కదలదు. ఉద్యోగాల వేటలో ఉత్తర దక్షిణలు బాగా అవగతమయ్యాయి రాఘవకు.

అయినా ఉడుకు రక్తం, ఉత్సాహం తగ్గలేదు. ఉద్యోగాల వేట మానలేదు.

గత కొద్ది రోజులుగా నాన్న అనారోగ్యంతో బాధపడుతూ ఉన్నాడు. పాడు దగ్గు గుండెల్ని పిండేస్తోంది. నాన్నకు తెలిసిన ఒకే ఒక విద్య - సైకిల్ పంచర్లు వేయడం. ఎక్కడి నుంచో ఉస్సురుమంటూ సైకిలు నెట్టుకుంటూ వచ్చిన వ్యక్తిని అరగంటలో సైకిలెక్కి, నవ్వుతూ రివ్వున సాగిపోయేలా చేయగల నిపుణుడు నాన్న. ఇంతకాలం చదువులు, ఉద్యోగాలు అంటూ తిరిగి, నాన్న గురించి ఆలోచించలేదు.

అకస్మాత్తుగా నాన్న అనారోగ్యంతో నడుస్తున్న సైకిలు మూలన పడింది. నిలువ ఉన్న డబ్బు కాస్తా అయిపోవచ్చిందని అమ్మ అంది.

ఎన్నో ఆలోచనలు మదిలో సుడులు తిరుగుతున్నాయి రాఘవకు. తోటంతా కలియజూసాడు- మనసులోని ఒత్తిడిని తగ్గించుకోవాలనే ఉద్దేశంతో.

చిరుగాలికి గడ్డిపూలు కదలాడుతూ కబుర్లాడుకుంటున్నాయి. పొదల వెనకాల అక్కడక్కడా యువజంటలు లోకాన్నే మరిచిపోయి ముచ్చట్లాడుకుంటున్నాయి. తాత, మనవడు కేరింతలు కొడుతూ బంతితో ఆడుకుంటున్నారు.

ప్రపంచం నిండా ఎంత ఆనందం! ఎంత సంతోషం! తన కుటుంబంలో మాత్రం కొరవడింది. డబ్బు లేకపోవడం చాలా సమస్యలకు, బాధలకు కారణం.

తనకు ఉద్యోగం దొరుకుతుందా? తమ సమస్యలకు పరిష్కారం లభిస్తుందా? అమ్మా నాన్నల జీవితాల్లో సుఖం, కళ్లల్లో సంతోషం చూడగలుగుతాడా?

నన్ను కన్న తృప్తి ఆ దంపతుల కళ్ళలో తాను చూడగల్గుతాడా? ఎన్నో ఆలోచనలు....

డబ్బులుండీ కూడా కొన్ని సమయాల్లో ఇబ్బందులు తప్పవేమో!

నిన్న, నాన్నకు మందుల కోసమని వెళ్తే మందుల దుకాణం తెరవలేదు. ఎన్నోసార్లు తలుపుకొట్టీ, పిలిచీ విసుగుచెందాడు తాను.

చేతిలో డబ్బులు ఉన్నాయి. మందులు దొరకడం లేదు. అవి లేకపోతే నాన్నకు ఇబ్బంది. దగ్గు బాగా సతాయిస్తోంది. కొన్నిసార్లు మనమీద మనకే విరక్తి కలిగే సందర్భాలొస్తుంటాయి.

ఏమి చేయాలో అర్థం కాని రాఘవ ఇంటికెళ్లిపోదామనుకున్నాడు.

చివరి క్షణంలో ఇంటికి మరోపక్క ఉన్న తలుపు దగ్గరికి వెళ్ళి పిలిచాడు.

మందుల షాపతను వచ్చి తలుపు తెరిచాడు.

"మీ కాలింగ్ బెల్ నొక్కి, తలుపుతట్టి, వందసార్లు పిలిచాను. పలకలేదేమిటండీ'' అడిగాడు రాఘవ.

'పండుగ రోజు కదా! ఇంట్లో ఉన్నాం.

కాలింగ్ బెల్ పనిచేయడం లేదు. అటువైపు నుంచి పిలిస్తే వినిపించదు" మందులిచ్చాడు.

చేతిలో డబ్బుండీ కూడా నరకం అనుభవించాడు రాఘవ ఆ క్షణంలో.

గడియారం చూసుకున్నాడు రాఘవ

"అమ్మా, ఇంటర్వ్యూకి వెళ్లొస్తాను"

"ఈ ఉద్యోగం నీకు రావాలి నాన్న. దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు" దేవుడి పటం దగ్గరి కుంకుమ రాఘవకు పెట్టి దీవించింది.

మంచంలో ఉండి, దగ్గుతో ఆశీర్వదించాడు నాన్న.

గుండె నిండిన ఆత్మవిశ్వాసంతో సైకిల్ బైటికి తీశాడు రాఘవ. తాను డిగ్రీ చదివేటప్పుడు నాన్న కొనిచ్చిన కొత్త సైకిలది.

ఆ సైకిలంటే తనకెంతో ప్రేమ, తన ఆప్తమిత్రుడుగా భావిస్తాడు దాన్ని.

సైకిలు గాలిపోయి ఉంది.

"పంచరయిందేమోరా, నేను పంచర్ చేస్తానాగు" మంచంలోంచి లేవడానికి ప్రయత్నించాడు నాన్న.

కానీ, లేవలేకపోయాడు.

గుమ్మంలో నిల్చున్నాడు రాఘవ.

బైట స్టాండు వేసి ఉన్న సైకిలు - నాకు పంచర్ వేస్తే నీకు సర్వీస్ చేయడానికి సిద్ధం అన్నట్లుగా.

లోపల నాన్నకు లేచే ఓపిక లేకపోయినా పంచర్ వేసి కొడుకును పంపాలనే ఆరాటం.

రాఘవకు తప్పనిసరైంది...

పంచర్ సామాన్లు బైటపెట్టి, సైకిల్ ట్యూబు విప్పి పంచర్ వేశాడు. పంపుతో గాలికొట్టాడు.

గాలి తగ్గిపోయిన సైకిలును కష్టంగా నెట్టుకుంటూ వచ్చాడొక వృద్ధుడు. ఆయన వయసుకు సైకిల్ తొక్కడమే ఎక్కువ.

"గాలి తగ్గింది బాబూ, కాస్తచూడు"

"నాకు కుదరదు, పని ఉంది."

అందామని అనుకున్నాడు రాఘవ. తాను గాలి కొట్టకపోతే ఆ ముసలివాడు మరో దుకాణందాకా నెట్టుకుంటూ వెళ్లాల్సిందే.

"పాపం" అనిపించింది రాఘవకు. మాట్లాడకుండా గాలి కొట్టాడు.

రాఘవ సామాను లోపల పెట్టి ఇంటర్వ్యూకు వెళ్లాలనుకున్నాడు. ఆ ముసలివ్యక్తి దగ్గరగా వచ్చి, చేతిలో రూపాయి బిళ్ల ఉంచాడు.

ఆశ్చర్యపోయాడు రాఘవ.

గాలి కొట్టి డబ్బులు తీసుకోవడం నాన్నకు, ఆ దుకాణానికి కొత్తేం కాదు.

"కానీ తనకు కొత్త"



కథ

"తన జీవితంలో తాను సంపాదించిన తొలి రూపాయి. అలాగే కూలబడి, ఆ రూపాయి వంకే చూస్తూ కూర్చున్నాడు. తాను కూడా రూపాయి సంపాదించగలడు. ఉద్యోగం చేసి డబ్బు సంపాదించాలనుకున్నాడే కాని, ఇలా పాత సైకిళ్లకు గాలి కొట్టి కాదు.

అయినా ఇది కూడా సంపాదనే కదా!

కష్టపడితేనే వచ్చిన సొమ్ము కదా!

పంచర్ కోసం మరో సైకిలు వచ్చి ముందు ఆగింది. సాయంత్రం వరకూ పంచర్లు చేస్తూ, గాలి కొడుతూనే ఉన్నాడు. మూడొందలకు పైగానే సంపాదించాడు.

డబ్బులు పోగు చేసి సాయంత్రం తండ్రి చేతిలో పెడుతూంటే ఏదో విజయం సాధించిన గర్వం.

"వద్దురా రాఘవా! నువ్వు ఈ పంచర్ల పని చేయొద్దు. ఉద్యోగం చేయాలిరా!!" నాన్న కళ్ళు నీటి చెలమలయ్యాయి.

"ఉద్యోగం వస్తుందా?"

రాని ఉద్యోగం కోసం తిరుగుతూ, వస్తున్న డబ్బును వద్దనుకోవాలా?

అకస్మాత్తుగా అతని మదిలో ఒక మెరుపు.

మందుల దుకాణంలో లాగా, ఎంతకూ తెరవని తలుపు ముందు నిలబడి వృథా ప్రయత్నం చేయడం కంటే, పక్కనే ఉన్న మరో ద్వారాన్ని వెతకడం వల్ల ఫలితం లభిస్తుందేమో.

కర్తవ్యం బోధపడింది రాఘవకు...!

మూడు సంవత్సరాల్లో పెద్ద సైకిలు షాపు, మోటారు వాహనాల విడిభాగాల దుకాణం సంపాదించాడు. తనకింద పనిచేసే నలుగురు కుర్రాళ్లు, పదిమంది లోనూ గౌరవంగా 'సేటూ' అనే పిలుపు సంపాదించాడు.

తన కష్టార్జితం తొలి రూపాయి. తన 'బతుకుసైకిలు'కు స్టాండు తీసింది. ఆ తర్వాత ముందుకు దూసుకుపోవటమే తప్ప, బ్రేకు వేయాల్సిన అవసరం రాలేదు.

గుర్తుగా రాఘవ దుకాణం ముందు సైకిలు స్టాండు ఉంటుంది ఎప్పుడూ.





**ఎస్.నాగేందర్ రావు**
ఉపాధ్యాయుడు, ఇల్లెందు, ఖమ్మం 99638 22520

# భాషాబాంధవులు

**మన భాష తెలిసిన చివరి వ్యక్తిగా మనమే మిగిలిపోవడం ఎంత దయనీయం. మన కథలు ఎవరితో పంచుకుంటాం? మన పాటలు ఎవరి కోసం పాడతాం? మన సంప్రదాయాల విలువ ఎవరికి అర్థమవుతుంది? ఇలాంటి పరిస్థితుల్లో ఎన్నో భాషలు క్షీణిస్తున్నాయి. దీనివల్ల ఆ భాషతో పాటు అది పొందుపరుచుకున్న అమూల్య జ్ఞానసంపద కూడా ప్రపంచానికి అందకుండా పోతోంది. ఇలాంటి వాటిని కాపాడటానికి ప్రయత్నిస్తున్నారు ఇద్దరు శాస్త్రవేత్తలు.**

డేవిడ్ హారిసన్, గ్రెగొరి ఎండర్సన్ అనే ఇద్దరు భాషా శాస్త్రవేత్తలు అమెరికాలో "లివింగ్ టంగ్స్" అనే సంస్థను నడుపుతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా క్షీణదశలో ఉన్న భాషల్ని సేకరించటమూ, ఆ భాష మాట్లాడే ప్రజల్లో అవగాహన కలిగించి దాని రక్షణకు పాటుపడటమూ ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ఏడు వేల భాషలు మాట్లాడే ప్రజలు ఉన్నారు. వీటిలో 90 శాతం భాషలను మాట్లాడే వారి సంఖ్య లక్షకు లోపే. పది లక్షలకు మించి మాట్లాడే వారున్న భాషల సంఖ్య 150 - 200 మాత్రమే. 46 భాషలకు సంబంధించి.. వాటిని మాట్లాడగలిగే వారు ప్రస్తుతం ఒక్కొక్కరే ఉన్నారు.

మరో ప్రమాదకరమైన విషయం... ప్రతి రెండు వారాలకూ ఒక భాష అంతరించిపోతోంది. ఈ లెక్కన 2100 నాటికి నేటి భాషల్లో సగానికి సగం అదృశ్యమైపోతాయి. చాలా సందర్భాల్లో ఈ భాషలు... ఆ భాష మాట్లాడే ఆఖరు వ్యక్తితో పాటు కాలం చేస్తున్నాయి. లిపి లేని భాషల విషయంలో ఇది మరింత ఎక్కువ.

అండమాన్ దీవుల్లో ఇటీవల ఇద్దరు వ్యక్తులతో పాటు "కోరా", "బో" అనే రెండు భాషలు మరణించాయి. ఆంగ్ల భాషాధిపత్యం ఈ పరిస్థితికి ముఖ్య కారణం. ఐర్లాండు దేశ జాతీయ భాష ఐరిష్. 1922లో ఆ దేశం ఏర్పడినపుడు రెండులక్షల యాభైవేల మంది ఆ భాషను మాట్లాడేవారు. ఇపుడు కేవలం ముప్ఫై వేల మంది మాట్లాడగలుగుతున్నారు. ఒక దేశ జాతీయ భాష పరిస్థితే ఇలా ఉంటే, అల్ప సంఖ్యాక జాతుల గురించి చెప్పేదేముంది.

**అరుదైన జ్ఞానం**

దక్షిణ అమెరికాలోని బొలీవియా దేశంలో 'కల్లావాయా' అనే జాతి ఉంది. ఆ జాతి ప్రజలు మూలికా వైద్యంలో సిద్ధహస్తులు. మొక్కలు, జంతువులు, ఇతర ఖనిజ లవణాల్ని వైద్యానికి వాడే కిటుకులెన్నో వారికి తెలుసు. ఈ రహస్యాలు తండ్రి ద్వారా పిల్లలకు మాత్రమే సంక్రమిస్తాయి. ఇలా నాలుగువందల ఏళ్ళుగా ఇవి తరతరానికీ దిగుమతి అవుతున్నాయి. కానీ ఇప్పుడు 'కల్లావాయా' మాట్లాడే వారు వందమంది కన్నా ఎక్కువ మిగల్లేదు. ఈ భాష అంతరిస్తే నష్టం ఆ జాతికి మాత్రమే కాదు. వారి వైద్య విజ్ఞానం కూడా శాశ్వతంగా ఎవరికీ తెలియకుండా పోతుంది. పర్యావరణంతో మమేకమై జీవించే ఎన్నో జాతుల భాషలు ఇలా అంతరిస్తున్నాయి. దాని వల్ల ఎంతో అరుదైన విజ్ఞానం ప్రపంచానికి తెలియకనే సమసిపోతోంది. ఒక జాతి తమ మాతృభాషను అనాథగా వదిలేసే ఈ పరిస్థితి ఎందుకు తలెత్తుతోంది?

సామ్రాజ్యవాద విషప్రభావం దీనికి ఒక కారణం. కాలగతిలో ఒక జాతిపై మరో జాతి ఆధిపత్యం సాధిస్తుంది. ఆధీనంలో ఉన్న జాతుల వారు పై స్థాయికి చేరాలంటే ఆధిపత్య భాషను నేర్వడం తప్పనిసరి అవుతుంది. ఫలితంగా వారిలో మాతృభాష పట్ల నిర్లక్ష్యం మొదలవుతుంది. బ్రిటీష్ వారి కబంధ హస్తాల్లో శతాబ్దాల పాటు నలిగిపోయిన దేశాల్లో నేడు ఆంగ్ల భాష ఏ రీతిన వేళ్లూనుకుందో చూస్తున్నాం కదా.



**హవాయీ చిన్నారులు!**

కొన్ని సందర్భాల్లో ఆధిపత్య ప్రభుత్వ విధానాలు కూడా ముఖ్య పాత్ర పోషిస్తాయి. రష్యన్ భాష మాత్రమే వాడాలన్న సోవియట్ ప్రభుత్వ నిర్బంధం వల్ల సైబీరియా ప్రాంతంలో ఎన్నో అరుదైన భాషలు బలయ్యాయి. అమెరికాలో గత ఐదొందల ఏళ్ళలో 115 స్థానిక భాషలు

అంతరించాయి. అక్కడి స్థానిక జాతుల యువకులు మాతృభాషల్ని త్యజించి ఆంగ్లం వైపు మొగ్గు చూపడమే అందుకు కారణం.

ఇలా ఒక భాష లుప్తమవటానికి కొన్ని తరాలు కూడా అవసరం లేదు, ఒక తరం నిర్లక్ష్యం చాలు అంటున్నారు హారిసన్, గ్రెగొరీలు. వీరి లివింగ్ టంగ్స్ సంస్థ తరపున భాషల పునురుద్ధరణకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీరు అంతరించిపోతున్న భాషలు గల జాతుల్లో కొందరు యువకుల్ని ఎంపిక చేస్తున్నారు. వారిని మాతృభాష నేర్చుకునేలా ప్రేరేపిస్తున్నారు. పెద్దవాళ్ళు మాట్లాడేటప్పుడు దాన్ని రికార్డు చేసే సాంకేతిక సహాయం కూడా అందిస్తున్నారు. ఇది చాలా చిరు ప్రయత్నమే. "ముందు కొన్ని అపోహలు తొలగిపోవాలి. అందరూ ప్రపంచీకరణను సాకుగా చూపించి భాషలకు తిలోదకాలిచ్చేస్తున్నారు. కానీ అదొక్కటే కాదు. ప్రజల భావాలు, వారి సాంఘిక మనస్తత్వమూ కూడా కారణాలే. ప్రజల్లో చైతన్యం రావాలే కానీ ఎంత అవసాన దశలోని భాషైనా మళ్ళీ బతుకుతుంది" అంటున్నారు హారిసన్. దీనికి ఆయన హవాయి భాషనే రుజువుగా చూపిస్తున్నారు.



అరుణాచల్‌ప్రదేశ్‌లోని పశ్చిమ కమెంగ్ జిల్లా తుంగ్రి గ్రామంలో స్థానికులు దోర్జీ ఖండు థోంగ్‌డాక్, లాము నోర్బులతో డేవిడ్ హారిసన్, గ్రెగొరిల ముఖాముఖి

**'హవా'యి**

హవాయి దీవులను అమెరికా 1898లో స్వాధీనం చేసుకుంది. అపుడు హవాయి భాషను అన్ని ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల్లో నిషేధించారు. ఆంగ్లం అధికార భాషగా మారింది. హవాయి భాష పరిస్థితి అధ్వానమవుతూ వచ్చింది. 1986 నాటికి ఆ భాషను కేవలం యాభై మంది పిల్లలు మాట్లాడగలిగేవారు. అప్పుడే స్థానికులంతా కలిసి భాషా సంరక్షణకు ఉద్యమించారు. మాతృభాషపై నిషేధాలు తొలగిపోయేలా కృషి చేశారు. మళ్లీ పాఠశాలల్లో హవాయి భాషా బోధన మొదలైంది. 2005 గణాంకాల ప్రకారం ఇప్పుడు ఇరవై వేల మందికి పైగా హవాయి భాషను మాట్లాడుతున్నారు. ప్రజా చైతన్యం ఎంతటి మార్పును తీసుకు రాగలదో ఇంతకన్నా మంచి ఉదాహరణ ఏముంది!

వ్యవహారిక భాషగా అంతరించిపోయిందనుకున్న హిబ్రూను అసమాన పోరాటాలతో తిరిగి బతికించుకున్న యూదుల మాతృభాష అభిమానమే స్ఫూర్తిగా ముందడుగు వేస్తే... ప్రతి జాతీ తన ఆనవాళ్లను శాశ్వతంగా నిలుపుకోగలుగుతుంది.

- తెలుగువెలుగు బృందం

# పద పంచాయతీ

'తెలుగు వెలుగు' యజ్ఞంలో భాగంగా జన వ్యవహారంలోని ఆంగ్లశబ్దాలకు మంచి తెలుగు మాటలను సమకూర్చే ప్రయత్నం చేస్తోంది. ఇందులో భాషాభిమానులందరూ భాగస్వాములు కావాలన్నదే మా ఆకాంక్ష, విన్నపం.

సరైన తెలుగు సమానార్థకాలు లేక ఎన్నో ఆంగ్ల శబ్దాలను యథాతథంగా వాడాల్సిన దుస్థితి. దీన్ని సరిదిద్దడంలో మీ అందరి పాత్ర కీలకం. తరచూ ప్రసార సాధనాల్లో వస్తున్న పదాలను ఇక్కడ ఇస్తున్నాం. ఇవే కాదు... మీ దృష్టిలో ఉన్న ఇతర ఆంగ్ల పదాలకూ తెలుగు సమానార్థకాలను పంపవచ్చు.

మీ సౌకర్యం కోసం వాటికి నిఘంటు అర్థాలనూ జోడించాం. చక్కని ప్రత్యామ్నాయ తెలుగు పదాల్ని సూచించండి. పక్కన పద వివరణ కూడా రాస్తే ఎంపికకు తేలిగ్గా ఉంటుంది. ఒకప్పుడు వాడుకలో ఉండి ఇప్పుడు వినిపించని మంచి తెలుగు మాటలైనా కావచ్చు. తెలుగులో స్థిరపడిపోయిన అన్యదేశ్యాలైనా కావచ్చు. మీరు కసరత్తు చేసి సృష్టించిన కొత్త పదాలైనా కావచ్చు. ఏదైనా పదం వీనులవిందుగా ఉండాలి. తేలిగ్గా పలకగలగాలి. మూలశబ్దం స్ఫూర్తి ప్రతిఫలించాలి. మన నుడికారం వినిపించాలి. మక్కికి మక్కి అనువాదం కూడదు. కఠిన సంస్కృత శబ్దాలు సామాన్య జనంలోకి త్వరగా చొచ్చుకుపోలేవు. అందువల్ల తేటతెలుగు మాటలే పంపండి.

ఇతర ద్రావిడ భాషల్లోని సమానార్థకాలకు కొద్దిపాటి మార్పులతో తెలుగుదనాన్ని తేగలిగినా మంచి ప్రయత్నమే అవుతుంది. మీ పదాలను తెలుగు వెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, హైదరాబాద్- 501512 చిరునామాకు పంపవచ్చు. లేదా **teluguvelugu@eenadu.net**కు మెయిల్ చేయవచ్చు.

- **Accessories (N)** =A thing that can be added to something else in order to make it more useful, versatile, or attractive ఉపకరణాలు.
- **Accidental (A)** = Happening by chance, unintentionally, or unexpectedly. ఆకస్మికమైన, అకస్మాత్తుగా, నిష్కారణమైన, ప్రమాదవశాత్తు.
- **Artificial(A)** = Made or produced by human beings rather than occurring naturally, typically as a copy of something natural కృత్రిమమైన, కల్పితమైన.
- **Asset(N)** = Property owned by a person or company, regarded as having value and available to meet debts, commitments, or legacies. ఆస్తి, ధనసర్వస్వం, భౌతిక సంపద.
- **Attorney(N)** = A person appointed to act for another in business or legal matters. న్యాయవాది, వ్యవహారం చూసేవాడు, అధికారదత్తుడు.
- **Audition(N)** = The act of hearing or listening; hearing.స్వర పరీక్ష.
- **Bail** = The temporary release of an accused person awaiting trial, sometimes on condition that a sum of money be lodged to guarantee their... జామీనుపత్రం, జామీను ఇవ్వడం.
- **Basic(N)** = The essential facts or principles of a subject or skill. ప్రాథమిక, ప్రధాన, మూల, మౌలిక.
- **Centralized(V)** = Concentrate (control of an activity or organization) under a single authority: "a vast superstructure of centralized control". కేంద్రీకృత.
- **Consolidate(V)** = Make (something) physically stronger or more solid. ఘనీభవింపచేయుట, గట్టిచేయుట, కూర్చుట, చేర్చుట, సంఘటితం చేయు.
- **Consultancy(N)** = A professional practice that gives expert advice within a particular field. esp. business. సంప్రదింపు సంస్థ, సలహా సంస్థ.
- **Cooperative(N)** = A farm, business, or other organization that is owned and run jointly by its members, who share the profits or benefits. సహాయకారి, తోడ్పడునట్టి, సహకార.
- **Depreciation(N)** = A reduction in the value of an asset with the passage of time, due in particular to wear and tear. అరుగుదల, తరుగుదల, ఆర్థికమాంద్యం.
- **Depressive(A)** = Causing feelings of hopelessness, despondency, and dejection. అధైర్యపరిచే, నిరాశకర, నిరాశజనక..
- **Diagnostics(A)** = Concerned with the diagnosis of illness or other problems. రోగలక్షణం, రోగనిర్ణయకారి, రోగస్వభావం తెలియజేసేది.
- **Dormitory(N)** = A large bedroom for a number of people in a school or institution. శయ్యాగారం, వసతిగృహం.
- **Enrollment(N)** = The number of people enrolled, typically at a school or college. చేరినవారి సంఖ్య, భర్తీ
- **Eradicate(V)** = Put an end to; destroy. నిర్మూలించు, నాశనంచేయు.
- **Experimental(A)** = (of a new invention or product) Based on untested ideas or techniques and not yet established or finalized. ప్రయోగాత్మక, ప్రయోగిక, ప్రయోగ విధానం
- **Generic(A)** = Characteristic of or relating to a class or group; not specific: "chevron is a generic term for all goat's milk cheese". జాతిసంబంధమైన, వర్గసంబంధమైన.
- **Governance(N)** = The action or manner of governing. పరిపాలన ఏలుబడి.
- **Identification(N)** = The action or process of identifying someone or something or the fact of being identified: "tagged with a number for identification" గుర్తింపు, అభిజ్ఞానం, నిర్ధరణ, రుజువు, ఆనవాలు.

- **Implantation(N)** = The action of implanting or state of being implanted. నాటుట, ప్రతిష్ఠాపన.
- **Insulation(N)** = The action of insulating something or someone. వ్యాప్తి నిరోధకం, వేరుగా పెట్టుట, ఏకాకితత్వం.
- **Intensity(N)** = Exceptionally great concentration, power, or force. కావలసినంత, గాఢత, తీక్షత.
- **Interaction(N)** = Reciprocal action or influence: "interaction between the two countries". అన్యోన్యక్రియ, ఒకదానిపై మరొకటి పనిచేయుట.
- **Irregular (A)** = Not even or balanced in shape or arrangement, A member of an irregular military force. అవ్యవస్థిత, నియమవిరుద్ధ, అస్తవ్యస్త.
- **Junction(N)** = A point where two or more things are joined. కూడలి, సంగమం, కలయిక.
- **Justify (V)** = Show or prove to be right or reasonable. సమర్థించు, సమ అంతరం, నిరూపించు.
- **Kitchen (N)** = A room or area where food is prepared and cooked. వంటిల్లు, వంట విభాగం.
- **Laboratory(N)** = A room or building equipped for scientific research, or teaching, or for the manufacture of drugs or chemicals. ప్రయోగశాల, వస్తుపరిశోధనా కేంద్రం.
- **Legend (A)** = A traditional story sometimes popularly regarded as historical but unauthenticated, Very well known: "his speed was legend". ఇతిహాసం, పురాణ కథ, కీర్తినార్జించిన వ్యక్తి.
- **Locomotive(A)** = Of, relating to, or effecting locomotion: "locomotive power". గమనశక్తి గల, చలనశక్తినిచ్చే
- **Metropolitan(A)** = Of, relating to, or denoting a metropolis, often inclusive of its surrounding areas: "the Boston metropolitan area". రాజధాని సంబంధమైన, మహానగరి సంబంధి.
- **Mobilization (N)** = act of assembling and putting into readiness for war or other emergency: "mobilization of the troops". సమీకరణ.
- **Modular(A)** = Employing or involving a module or modules in design or construction. నిర్మాణ క్రమజాలం.
- **Monitoring (V)** = Observe and check the progress or quality of (something) over a period of time; keep under systematic review. పర్యవేక్షణ, పరీక్షణం, అనుశ్రవణం.
- **Nominal (A)** = Existing in name only. నామమాత్ర, పేరుకు మాత్రమే, అవాస్తవిక, నామార్థకమైన.
- **Numerical(A)** = Of, relating to, or expressed as a number or numbers. సంఖ్యాసంబంధమైన, అంకాత్మక. సంఖ్యాత్మక.
- **Occupancy (A)** = The proportion of accommodations occupied or in use, typically in a hotel, The action or fact of occupying a place. స్వాధీనత, ఆక్రమణ, శాశ్వత జిరాయితీ.
- **Ornament (V)** = A thing used to adorn something but usually having no practical purpose, that which adds grace or beauty; embellishment; decoration; adornment. అలంకరించుట..
- **Outer(A)** = Outside; external. Further from the center or inside: "the outer hall at the main entrance". బయటి, బాహ్య, బాహ్యమైన.
- **Placement(N)** = The action of putting someone or something in a particular place or the fact of being placed. The action of finding a home, job, or school for someone. కొలువు(లో చేరటం), నియామకం, సంస్థితి.
- **Postmortem (N)** = An examination of a dead body to determine the cause of death. an examination of the body made after the death of the patient; శవపరీక్ష, మరణాంతర పరీక్ష.
- **Presentation(N)** = The proffering or giving of something to someone, esp. as part of a formal ceremony ;సమర్పణ, బహూకరణ.
- **Probation(N)** = The process or period of testing or observing the character or abilities of a person in a certain role, for example, a new employee. అర్హతానిర్ణయకాలం, పరిశీలనలో ఉంచుట.
- **Process(N)** = A series of actions or steps taken to achieve an end. కార్యవిశ్లేషణ, క్రమం/ప్రక్రియ.
- **Provision(N)** = The action of providing or supplying something for use. సిద్ధంచేయుట, జాగ్రత్తచేయుట
- **Qualifiers(N)** = A match or contest to decide which individuals or teams qualify for a competition or its final rounds. అర్హులు, అర్హత పొందినవారు.
- **Recent(A)** = Having happened, begun, or been done not long ago or not long before; belonging to a past period of time comparatively close to the present. కొత్తగా, ఇటీవల, నవీన, అప్పుడే జరిగిన.
- **Rectified(V)** = Put (something) right; correct: "mistakes made now cannot be rectified later". దిద్దుబాటైన, చక్కపెట్టిన.
- **Remote(A)** = (of a place) Far away; distant. సుదూర, సుదూర అనుసంధానం.
- **Revelation(N)** = A surprising and previously unknown fact, esp. one made in a dramatic way. బయటపెట్టడం, తెలియజేయటం
- **Reversion (N)** = A return to a previous state, practice, or belief. పదవి తగ్గింపు, యథాస్థితికి వచ్చు.
- **Saturation(N)** =The degree or extent to which something is dissolved or absorbed compared with the maximum possible, usually expressed as a percentage. పరిపూర్ణస్థితి, సంతృప్తీకరణ.
- **Solicitors(N)** = A person who tries to obtain business orders, advertising, etc.; a canvasser. అభ్యర్థించే వ్యక్తి, న్యాయవాది.
- **Solvent(N)** = The liquid in which a solute is dissolved to form a solution. ద్రావకం, ద్రావణి.
- **Source(N)** = A place, person, or thing from which something comes or can be obtained. మూలం, ఉత్పత్తి స్థానం, ఆధారం.
- **Squad(N)** = A small number of soldiers assembled for drill or assigned to some special task. పటాలం, ఆకస్మిక పరీక్షా దళం.
- **Sterilization(N)** = To make free from live bacteria or other microorganisms. క్రిమిరాహిత్యకరణం.
- **Streamline(N)** = A line along which the flow of a moving fluid is least turbulent, Design or provide with a form that presents very little resistance to a flow of air or water, increasing speed and ease of movement. క్రమబద్ధం చేయు, జాలువారే రూపమిచ్చు.
- **Suspension(N)** = The action of suspending someone or something or the condition of being suspended, *in particular*, The temporary prevention of something from continuing or being in force or effect. తాత్కాలిక తొలగింపు/నిలుపుదల.
- Terminal(N) = An end or extremity of something, in particular. తుది, అంత్య, చిట్టచివరి.







## నోబెల్ తారలు

సాహిత్యంలో నోబెల్ బహుమతి సాధించిన ప్రముఖ రచయితలందరి ప్రసిద్ధ రచనలను ఒక్కచోట చేర్చిన పార్థసారథి గారి ప్రయత్నం అభినందించదగింది. ఈ పుస్తకంలో 1903 నుంచి 2007 వరకు నోబెల్ పురస్కారం పొందిన రచయితల గురించి క్లుప్తంగా వివరించి వారు రాసిన కథానికల్లో ఉత్తమమైన వాటిలో ఒకదాన్ని ఇచ్చారు. రుడ్‌యార్డ్ కిప్లింగ్, విలియం బట్లర్ ఈట్స్, అల్బర్ట్ కామూ, జాన్ స్టీన్‌బెక్, ఐజాక్ బాషెవిస్ సింగర్, వి.ఎస్.నాయిపాల్, డోరిస్ లెస్సింగ్ వంటి ప్రముఖుల రచనలను చక్కని తెలుగులో అనువదించారు. పార్థసారథి గతంలో కూడా పలు ఆంగ్ల కథలను అనువదించి ఉండటం వల్ల ఆ అనుభవం ఇందులో స్పష్టంగా కనిపిస్తోంది. కథానికల్లో వ్యక్తుల, ప్రాంతాల పేర్లు తప్ప ఎక్కడా ఇది అనువదించిన కథ అనే భావమే కలుగకుండా చేశారు. కథల్లో ఇద్దరు వ్యక్తుల మధ్య జరిగే సంభాషణలకు (నేటివిటీ) ప్రాంతీయత జోడించి ఆసక్తికరంగా రాశారు. ఇందులోని కథలన్నీ దేనికవే ప్రత్యేకం. అన్నీ ఆసక్తి కలిగించేవే. మనలో చాలా మంది నోబెల్ బహుమతి గురించి విని ఉంటాం. కానీ దాని చరిత్ర ఎక్కువ మందికి తెలియదు. పుస్తకం ప్రారంభంలో నోబెల్ బహుమతి ఏర్పాటు వెనుక గల నేపథ్యాన్నీ వివరించారు.

ఈ కథనాలు చదివితే ప్రపంచంలోని పలు దేశాల చరిత్ర, ఆచార, సంప్రదాయాలు, నమ్మకాలపై ఒక అవగాహనకు రావచ్చు. ఆఫ్రికన్ల జీవన విధానం, ఫ్రెంచి విప్లవం, నాజీల అరాచకాలు, రెండో ప్రపంచ యుద్ధ కాలంలో సామాన్య ప్రజల అగచాట్లు, పెరల్ హార్బర్‌పై జపనీయుల దాడి వంటి అంశాలన్నీ కథానికల్లో ఉన్నాయి.

ప్రసిద్ధ రచయితల గురించి సమాచారం సేకరించడం చాలా కష్టమైన పని. పైపెచ్చు వాళ్ల రచనలు లభించకపోవచ్చు. గతంలో వీటిలో కొన్ని విపుల, ప్రజాశక్తి పత్రికల్లో ప్రచురితమైనా వాటన్నిటినీ ఒకచోట చేర్చడం బాగుంది. అలాగే ఎంతో ప్రతిభావంతులైనప్పటికీ

**రచయిత: ముక్తవరం పార్థసారథి, పుటలు: 290, వెల రూ. 250, ప్రతులకు: అన్ని నవోదయ పుస్తకకేంద్రాల్లో**

నోబెల్ బహుమతి పొందని లియో టాల్‌స్టాయ్, మార్క్ ట్వేన్, మాక్సింగోర్కీ, జేమ్స్ జాయస్, వర్జీనియా వూల్ఫ్, సామర్సెట్ మాం వంటి రచయితల గురించి కూడా ప్రస్తావించారు.

**- విశిష్ట బిల్లాడి**

## 'అమృత గాథాజ్యోతులు' ఆంధ్ర రచయితలు




తెలుగువారి సర్వప్రాంతాల చరిత్రలోని స్వర్ణఘట్టాల్నీ 'ఆంధ్రపురాణ' మహా కావ్యంగా మలచిన మహాకవిగా మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి సుప్రసిద్ధులు. అటు ఆంధ్ర దేశ చరిత్రను కావ్యంగా మలచి; ఇటు ఆధునిక తెలుగు కవుల చరిత్రను 'ఆంధ్ర రచయితలు' అనే గ్రంథంగా తీర్చిదిద్దడం వల్ల వర్తమాన కాలానికి వారి సాహిత్య జీవన చిత్రణల్ని హృదయస్థం చేసుకోవడానికి వీలవుతుంది. 'పద్యానికి నన్నయ, గద్యానికి చిన్నయ'

**రచయిత: మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, పుటలు: 439, వెల:రూ.350, ప్రతులకు: మధునామూర్తి, 49-12-13/2, లలితానగర్, విశాఖపట్నం 16.**

అనేది నానుడి. అయితే ఆ నన్నయ్యే ఆంధ్రభారతం అవతారికలో 'మృదుమధుర నవార్థ భాసుర వచన రచనా విశారదులైన మహాకవు'లని పేర్కొన్నారు. స్పష్టభావ ప్రకటన, చిన్నచిన్న వాక్యాలు, శైలీ సౌందర్యం ఉండటం వల్ల 'ఆంధ్ర రచయితల్లో' వచన రచనా సువాసనలు గుబాళించాయి.

ఈ గ్రంథం తొలిసాలుగా వేటూరి ప్రభాకరశాస్త్రి పీఠికతో 1950లో వచ్చింది. 1973లో మళ్లీ వెలుగు చూసింది. ప్రతి ముఖ్య సాహిత్య చరిత్ర గ్రంథం వెనుక ప్రామాణిక ఆకరగ్రంథంగా వినియోగపడింది. సుమారు నాలుగు దశాబ్దాల తర్వాత రెండో భాగాన్నీ కలుపుకొని ఇప్పుడు ఇలా మొత్తం పొత్తం వెలువడటం ప్రయోజనదాయకం. ప్రథమభాగం చిన్నయసూరితో ప్రారంభమై తుమ్మల సీతారామమూర్తి చౌదరితో ముగియగా, రెండోభాగం ములుగు పాపయారాధ్యులతో మొదలై వావిళ్ల రామస్వామి శాస్త్రులతో ముగిసింది.

కందుకూరి వీరేశలింగం, గురుజాడ శ్రీరామమూర్తి వంటివారు రాసిన కవిచరిత్రలు ప్రాచీన కాలానికి చెందినవి కాగా ఈ గ్రంథం 19, 20 శతాబ్దాలకు చెందినవారివి. కందుకూరి వంటి ఆనాటి వారు తాళపత్ర గ్రంథాలు, శాసనాలు వంటివి అధ్యయనం చేసి మరీ రాయవలసి వచ్చింది. కాగా మధునాపంతుల వారి రచనా కాలానికి ముద్రిత గ్రంథాల సంఖ్యా పెరిగింది. రచయితల సంఖ్యా పెరిగింది. ఆచితూచి రాసిన అంచనాలు, ఆంతరంగిక అర్థాలు కల వాక్యాలతో చిన్న వ్యాసాలుగా ఉండటం దీని విశేషం. శాస్త్రిగారి దూరదృష్టికి మచ్చు వాక్యాలివిగో- 'ఒక పద్యకవుల చరిత్రములే సంధానించినచో యావజ్జీవము చరిత్రాన్వేషణము చేసి పరిశోధకులు సంపుటముల కొలది విమర్శనములు రాసిన పండితులు మున్నగువారు చరిత్రకెక్కక మఱుగుపడవలసినదేనా?' అని ప్రశ్నిస్తూ తమ గ్రంథానికి ఆంధ్ర 'రచయితలు' అని నామకరణం చేసి మనల్ని సమాధానపరిచారు.

కొక్కొండ, గిడుగు, పూండ్ల, గురజాడ, కందుకూరి, కొమఱ్ఱాజు, వేలూరి, మల్లంపల్లి, చిలుకూరి, పింగళి, సురవరం, గుర్రం, వంగూరి, భమిడిపాటి, శ్రీపాద'లు', మాడపాటి, తిరుపతి వేంకటకవులు, వేంకటపార్వతీశ్వర కవులు- ఇటువంటి 113 మందివి ముఖ్య జీవన చిత్రణలు గల విలువైన గ్రంథం ఇది. తరువాత వచ్చే ముద్రణలో అయినా ఆయా రచయితల లభ్యచిత్రాలు ప్రచురిస్తే భవిష్య తరానికి సాహిత్య ముద్రలతో వారిని దర్శించుకోవడానికీ వీలుంటుంది.

**- శతకీర్తి**

## సాహితీ పిపాసి జీవన మథనం



భూమి... సకల అద్భుతాలకు మూలం. దీన్ని ఆవరించి ఉన్న ప్రకృతి మహా గొప్పది. వర్ణించడానికి విశేష ణాలు, అలంకారాలు అవసరం లేనంత చరిత్ర కలిగింది. ఎవరు దీన్ని నిర్మిం చారో... ఎవరు నడుపుతున్నారో... అంతా మాయ. నేల, తరువు, వాయువు, జలం ఈ నాలుగు పాత్రలతోనే జగన్నాటకమంతా నడుస్తోంది. వీటి ప్రాకృతిక నియమాలకు అను గుణంగా తమలో మార్పులు చేసుకుంటూ... మార్పు చెందుతూ వస్తున్న జీవులన్నీ భూమిపై మనుగడలో ఉన్నాయి. అయితే... బుద్ధిలోనూ, గుణంలోనూ అగ్రస్థానంలో ఉన్నామని విర్రవీగే ఒక్క జీవి మాత్రం నియమాలను ఉల్లంఘిస్తోంది. కూర్చున్న కొమ్మను నరుక్కుంటోంది. ఫలితాలు అనుభవిస్తోంది.... అదే మానవ జాతి. మనిషి ఎప్పుడు పుట్టాడో తెలియదు. ప్రస్తుత రూపాన్ని ఎలా సంత రించుకున్నాడో తెలియదు. ఎన్ని కాలాలు... ఎన్ని వందల సంవత్స రాలు గడిచాయో తెలియదు. ప్రకృతిపై పైచేయి సాధించే ఆరాటంలో మాత్రం జాతి ముగింపునకు బీజం వేసుకున్నాడు. ముఖ్యంగా పారి శ్రామిక విప్లవం తర్వాత తప్పుమీద తప్పు చేస్తూనే ఉన్నాడు. సంధి కాలంలోని దాదాపు వంద సంవత్సరాలను తన కళ్లతో ప్రత్యక్షంగా వీక్షిస్తూ ముందుకు సాగిన ఓ సాహితీ పిపాసి, వేద పక్షపాతి అను భవాల రూపమే ఈ 'శతాబ్ది'.

**రచయిత: దాశరథి రంగాచార్య, పుటలు: 294, వెల: రూ.175, ప్రతులకు: అన్నీ విశాలాంధ్ర పుస్తకాలయాలు**

రాజరికం, బలం, చదువు, సాంకేతికతల పేరిట తోటివారిని బానిసలుగా మార్చిన గతంపై మండిపడుతూ... స్వేచ్ఛ కోసం పరి తపించిన సమూహాలను కీర్తిస్తూ సాగిన రచన ఇది.

12 ఏళ్లప్రాయంలోనే ఉద్యమ పంథాలో ప్రవేశించి, అనంతర కాలంలో వేదాలను అనుసృజించిన దాశరథి రంగాచార్య... భారత స్వాతంత్ర్య పోరాట క్రమాన్ని తనదైన శైలిలో అక్షరబద్ధం చేశారు. గత కాల సంఘటనలకు తన అనుభవాలను జోడిస్తూ.... ప్రస్తుత మార్పును మేళవిస్తూ...ఏది మంచిదో చూపుతూ దారి వేసే ప్రయత్నం చేశారు.

ప్రకృతికి అనుగుణంగా మసలిన పూర్వీకుల జీవన విధానాన్ని వివరిస్తూ... ఆ విలువలను మనం అందిపుచ్చుకోవాల్సిన అవసరాన్ని ఎత్తిచూపారు. పాశ్చాత్య మోజును వీడాలని, వినిమయ విపణి విష వలయం నుంచి తప్పించుకోవాలని సూచించారు. మండువేసవిలో నీటి ఊటలున్న ఇసుకలో నడుస్తున్న అనుభూతిని చక్కటితేట తెలు గులో ఆసాంతం కలిగించారు.

**- బొజ్జ ఎల్లయ్య**

## 'సమాలోచనాత్రయం' - విమర్శా పారిజాతం



అక్షరానికి అభ్యుదయం జోడించి మనోనేత్రాన్ని తెరిపించే అక్షర మందారం 'సమాలోచనాత్రయం'

సమాజంలో అదృష్టం కలిసి రానివాళ్లు, ఏ తప్పూ చేయకుండానే శిక్ష అనుభవించేవాళ్లూ లోహ రాక్షసుల పదఘట్టనలో నలిగి అణగిపోయేవాళ్లు.. ఎందరో! బతుకు నిష్ఠురమై ఆత్మహత్యకు పూనుకునేవారూ! అనాథలూ, అభాగ్యులూ! అశాంతులూ! వీరి ఆక్రందనలో విప్లవశంఖం వినిపిస్తుందన్న శ్రీశ్రీ విశ్వాసాన్ని, వాణిని, తనదైన బాణీలో స్పష్టం చేశారు మాదిరాజు రంగారావు.

శ్రీశ్రీ ఆరంభించిన నవ్యమార్గం గురజాడ ప్రగతి వారసత్వాన్ని అందుకొని ఆ తర్వాత అభ్యుదయ కవిత్వంగా స్థిరపడింది. మార్క్స్ సమసమాజ లక్ష్యంగా మరో ప్రపంచమై నూతన వ్యవస్థా నిర్మాణానికి దారి తీసింది. మరో ప్రపంచం వ్యక్తిగతమైంది కాదు. సమాజగతమైంది. మార్పు కోరేది. సర్వ ప్రజల సమానత్వంతో, సౌభాగ్యంతో నిర్దిష్టమైన మార్పు సిద్ధాంతాలకు అత్యంత సమీపంగా వర్తించే లక్ష్యంగా కలిగింది - అంటూ రంగారావు అభ్యుదయ పంథాను అక్షరాక్షరంలో సద్విమర్శ చేశారు.

కాలాంతరాన సమాజం ముందు నిలిచేది కవి సృజన మాత్రమే. అది సమాజ ప్రగతి రూప చిహ్నంగా ఆదర్శం అవుతుంది. సృజన రూపం, కవి వ్యక్తిత్వం, సమాజ నేపథ్యం, మూడింటి సమాకలనంతో చేసే సమాలోచనంలోనూ కొన్ని అంశాలు జారిపోవచ్చు. తప్పిపోవచ్చు. అయితే కొత్తవి చేరవచ్చు. అనుకోనివి చోటు చేసుకోవచ్చు. ఈ విధంగా సమాలోచన క్షేత్రం విస్తరిస్తుంది. బయటికి కనిపించే భౌతిక క్షేత్రానికి సంబంధించినవే, లోపలి మనస్తత్వ రూపానికి సంబంధించినవే సృజన సమయంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పనిచేస్తాయి - అంటూ తనదైన శైలిలో విమర్శ కొనసాగించారు.

**రచయిత: మాదిరాజు రంగారావు, పుటలు: 242, వెల: రూ150, ప్రతులకు అన్నీ నవోదయ పుస్తకకేంద్రాల్లో**

దాశరథి పునర్నవంలోని కాల్పనిక పార్శ్వాన్ని సామాజిక స్ఫూర్తి, విశేష చిత్రితాంశాలను స్పృశించారు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సృజన 'రామాయణ కల్పవృక్షం'లోని తాత్త్విక ప్రకాశాన్ని, లోకహిత ధర్మాన్ని, కథన రమణీయతను, సంవేదన హృదయాన్ని, రచనా శిల్పాన్ని, వర్ణన, ఆత్మ అనుభూతి, ఆధ్యాత్మిక శిఖరాలను అనుభవైక నైవేద్యంగా విమర్శా శిల్పంతో 'సమాలోచనాత్రయం' ఆవిష్కరించారు. నవ్య సంప్రదాయం, కాల్పనిక పార్శ్వం, అభ్యుదయం ముప్పేట కలిసిన త్రివేణీ సంగమరూపం 'సమాలోచనాత్రయం'.

**- హేమసాయి**

# కొండ అద్దమందు...

## క్రాంతిదర్శి



**సంకలనం: హెచ్.రమేష్‌బాబు, తన్నీరు శ్రీనివాస్, పుటలు: 224, వెల: రూ.600, ప్రతులకు: అన్నీ విశాలాంధ్ర, నవోదయ పుస్తక కేంద్రాల్లో**

వెండితెరను స్వర్ణమయం చేసిన మార్గదర్శి కె.వి.రెడ్డి. వెలుగు తెర ఉన్నంత వరకూ ఆ మహనీయుని ఆలోచన, క్రమశిక్షణ, నైపుణ్యాలు రాబోయే తరాలకు మార్గదర్శకమే. దర్శకులకు దళపతిగా నిల్చి ఎన్నో సంస్థలకు, నటీనటులకు నూరేళ్ల ఆయుష్షునిచ్చిన ఆదర్శదర్శకుడు. స్క్రిప్టు రాయడం, చిత్రీకరించడం ఎలాగో చూపిన పెద్ద బాలశిక్షవంటి మహనీయుడు. కె.వి.రెడ్డి సినీజీవితాన్ని అతి దగ్గరగా చూసిన ఎందరో మహనీయుల అభిప్రాయాల సంకలనం ఈ బంగరు రంగుల తెలుపు - నలుపు చిత్రాల పుస్తకం. అసమానమైన ప్రతిభ, మంత్రముగ్ధుల్ని చేసే చిత్ర రంగ కళానైపుణ్యాలు అన్ని కలబోసుకున్న తెలుగు సినిమా చరిత్ర అనుకోవచ్చు. ఏది ఏమైనా ఇటువంటి కర్మయోగులు, కష్టజీవుల, కళానిపుణుల చరిత్ర చదివి తీరాల్సిందే.

**- వై.శివరామప్రసాద్**

## తెలుగు గజళ్ల గజ్జల సవ్వడి



**రచయిత: పెన్నా శివరామకృష్ణ, పుటలు: 115, వెల: రూ. 70, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో.**

ఉర్దూ భాషకు ప్రత్యేకాలంకారంగా భాసిస్తున్న కవితా రూపం - 'గజల్'. సి.నా.రె తెలుగు గజళ్ల ప్రభావం, స్ఫూర్తితో గజల్ రచనకు శ్రీకారం చుట్టిన పెన్నా శివరామకృష్ణ తన 'శిశిర వల్లకి' సంపుటిలోని గజళ్లను ఉర్దూ గజళ్ల ఒరవడి, అడుగుజాడల్లోనే రాశారు. ప్రేమ సంబంధితాంశాలపై రాసిన, పాడిన గజళ్లను ఆయన ఎక్కువగా ఇష్టపడటమే ఇందుకు కారణం కావొచ్చు. గజల్ మూలతత్వాన్ని, స్వభావాన్ని గుర్తించి, గౌరవించి ఆ సంబంధాంశాలనే వస్తువుగా స్వీకరించి సంప్రదాయం, సంరక్షణ, పరిపోషణ పట్లనే రచయిత తన మమతానురాగాలు చాటుకున్నారు. ఉర్దూ గజళ్ల ఫణితిలో రాసిన 76 తెలుగు గజళ్లతో 'శిశిర వల్లకి'ని వెలువరించిన కవి, రచయిత, విమర్శకుడు, అధ్యాపకుడు శివరామకృష్ణ అభినందనీయుడు.

**- ఎ.వి.జనార్దనరావు**

## రుచికరమైన వంటకాల్లో విహారం!




**సంపాదకులు: డా.డి.చంద్రశేఖర రెడ్డి. పుటలు: 263, వెల: రూ.200, ప్రతులకు: ఎమెస్కో బుక్స్, దోమల్ గూడ, హైదరాబాద్.**

మనసు కళ్లెంలేని గుర్రంలాంటిది. ముఖ్యంగా ఆహారాన్ని ఆస్వాదించే విషయంలో మనసు మనమాట వినదు. జిహ్వ చాపల్యం, విచక్షణను మరిపించి రుచిగా ఉండే పదార్థాలకేసి లాగేస్తుంది. దాంతో అజీర్తి, ఆరోగ్య సమస్యలు దాడి చేస్తాయి. సాత్విక ఆహారం తీసుకోగలిగితే ఆరోగ్యం బాగుంటుంది. ఇలా ఆలోచించిన ఆధ్యాత్మిక గురువు సద్గురు జగ్గీవాసుదేవ్ సాత్వికాహార లాభాలను విశదం చేశారు. వంటల్లో రుచికి ఉల్లి, వెల్లుల్లి, ఇంగువ ఉపయోగిస్తాం. వీటి వల్ల ఎన్నో ఆరోగ్య సమస్యలు. ఇందుకు బదులుగా ఇతర దినుసులతో రుచికరమైన వంటకాలను వండడం ఇందులో చక్కగా వివరించారు. 200 రకాల వంటకాలకు రంగుల ఛాయా చిత్రాలు అదనపు ఆకర్షణ. ఆరోగ్య ప్రేమికులైన భోజనప్రియులకు ఈ గ్రంథం ఓ వరం.

**- రమాసుందరి**

## హృద్యమైన పద్యం



**రచయిత: డా॥ మన్నవ భాస్కరనాయుడు, వెల: రూ 75, ప్రతులకు: రచయిత, 780/ఎ, వాసవీనగర్, ముత్యాలరెడ్డిపల్లి, తిరుపతి.**

ఏ సాహిత్య ప్రక్రియ అయినా హృదయ సంబంధమైనదే. కవిత్వం హృదయానికి మరికాస్త చేరువగా ఉంటుంది. డా.మన్నవ భాస్కరనాయుడు హృదయాన్నే కేంద్రంగా పెట్టుకుని సాగించిన పద్యప్రవాహమే ఈ 'హృదయోదయం'. స్వాగత, సంశయ, భాషా, సమయ, జ్ఞాన, కళా, మేధ, ఉదయ, హృదయోదయ పేరిట మొత్తం 9 ఖండాలుగా ఈ పుస్తకాన్ని విభజించి 475 పద్యపుష్పాలతో అల్లిన పద్యకవితాపుష్పమాల ఇది. పద్యం పండితులది, వచనం సామాన్యులదైన కాలంలో వచనాన్ని పద్యాన్ని కలిపి అందరికి అర్థమయ్యే భాషలో రాయడం విశేషం. ఛందోబద్ధమైన కవిత్వానికుండే గ్రాంధిక మార్మికతల్ని ఛేదించుకుని వచ్చి వాడుక మాటల మధుర భావ మంత్రజలాన్ని పాఠకుల మీద చిలకరించినట్లున్నాయి. ఇందులోని పద్యాలు. నిజానికి ఇందులో వస్తువు సందర్భోచితంగా మారినా, హృదయ కేంద్రంగానే సాగింది.

అధునిక కవితా ప్రక్రియల మధ్య పద్యమెక్కడో బక్కచిక్కిపోతున్న కాలంలో కొత్త పద్య లక్షణాలతో పద్యాన్ని సైతం తొలి వరుసలో తేగలిగినంత శక్తిమంతమైన పద్య కావ్యం మన్నవ భాస్కరనాయుడి హృదయోదయం.

**- జావేద్**




## కాలదోషం పట్టని అపురూపమైన కథలు

పంచతంత్ర కథలను ఎన్ని సార్లు చదివినా కొత్తగానే అనిపిస్తుంటాయి. ఆలోచింపజేస్తుంటాయి. ప్రతి కథా ఓ గొప్ప అనుభూతిని మిగులుస్తుంది. తాజాగా నవ్య వారపత్రిక సంపాదకుడు జగన్నాథశర్మ అయిదు అధ్యాయాలలో 46 కథలను ఏర్చి కూర్చి తేటతెలుగులో మనముందుంచారు. పుస్తకం ఆద్యంతం ఆసక్తిగా చదివిస్తుంది. ప్రతి కథనూ సులభశైలిలో అందరినీ ఆకట్టుకునే రీతిలో, చక్కటి బొమ్మలతో అందించారు. పిల్లల్లో విచక్షణా జ్ఞానాన్ని పెంచే కథలివి. వ్యక్తిత్వ వికాసానికి దోహదపడుతూనే, జీవిత సత్యాలను బోధిస్తాయి. విద్యలోని గొప్పదనాన్ని వివరిస్తూనే... ఉపాధ్యాయుల బాధ్యతలను గుర్తుచేస్తాయి..నిత్యజీవితంలో ఎదురయ్యే అనేక సమస్యలకు, ఈ కథలు చక్కటి పరిష్కారాలను చూపుతాయి. ప్రతి తరగతి గదిలోనూ ఇలాంటి కథలను బోధించాలి. పిల్లలూ, బాలసాహిత్యాన్ని అభిమానించేవారు తప్పక చదవాల్సిన పుస్తకమిది.

**- డి.శ్రీనివాసరావు**

**రచయిత: ఎ.ఎన్.జగన్నాథ శర్మ; పుటలు: 196; వెల: రూ.160; ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని శాఖలలో.**




## అగ్నియుగపు నిప్పు కణికలు

భారత స్వాతంత్ర్య సంగ్రామం అనగానే గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ తదితరులే గుర్తుకు వస్తారు. అయితే.. దాస్య విముక్తి కోసం విప్లవ శంఖాన్ని పూరించి అమరులైన ఖుదీరాం బోస్, మదన్‌లాల్ ధింగ్రా, కనైలాల్ దత్తా, ప్రీతిలత వదేదార్, వైకుంఠ శుక్లా, బిర్సా ముండా లాంటి ధీరోదాత్తుల గురించి చాలా కొద్దిమందికే తెలిసుండొచ్చు. వారి పోరాట స్ఫూర్తి నైతిక విలువలు, దేశభక్తి... ఇవేవీ చాలామందికి తెలియవు. చరిత్ర పుటలకెక్కని భారతమాత ముద్దుబిడ్డల గురించి నేటితరానికి తెలియజేయాలన్న సత్సంకల్పంతో ఆల్ ఇండియా డెమొక్రటిక్ స్టూడెంట్స్ ఆర్గనైజేషన్ (ఏఐడీఎస్ఓ) చేసిన ప్రయత్నమే ఈ 'భారత స్వాతంత్ర్య సంగ్రామ విప్లవ వీరులు - వీరగాథలు'. ఇందులో 14 మంది వీరుల చరిత్రలను సంక్షిప్తంగా, హృద్యంగా అందించారు. ప్రతిఒక్కరూ తప్పక చదవాల్సిన పుస్తకమిది. చరిత్రను తెలుసుకోవడానికి కాదు... కొత్త స్ఫూర్తిని నింపుకోవడానికి!

**- ఆర్.భాస్కర్**

**పుటలు: 132; వెల: 50, ప్రతులకు: డి. రాఘవేంద్ర, ఏఐడీఎస్ఓ, 804-బి, కుషాల్ టవర్స్, ఖైరతాబాద్, హైదరాబాద్.**

## కొత్త పొత్తాలు



**తెలుగు సాహిత్యంలో హాస్యం,** రచయిత: డా॥ పి.ఎల్.ఎన్.ప్రసాద్, వెల: రూ.20, పుటలు:111, ప్రతులకు: పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.




**మూఢనమ్మకాల విముక్తి,** రచయిత: బొర్రా గోవర్ధన్, వెల: రూ.40, పుటలు: 72, ప్రతులకు: రచయిత, శాంతినికేతన్, నాగారం, గుంటూరు




**రెండు రెమ్మలు,** రచయిత: ఎస్.ఆర్.పృథ్వి, వెల: రూ.40, పుటలు: 40, ప్రతులు: పి.ఉషారాణి, 3-866, రామకృష్ణనగర్, రాజమండ్రి.




**విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు,** రచయిత: డి.కె.ప్రభాకర్, వెల: రూ.45, పుటలు:104; ప్రతులకు: జయంతి పబ్లికేషన్స్, విజయవాడ




**ఇంకెన్నాళ్లు...,** రచయిత: వేదాంతం లక్ష్మీప్రసాదరావు, వెల: రూ.60, పుటలు: 80, ప్రతులకు: సాత్విక్ బుక్స్, 320, విజయనగర్ కాలనీ, హైదరాబాద్

**యాత్రాదీపిక (వరంగల్ జిల్లా),** రచయిత్రి: పి.ఎస్.ఎం.లక్ష్మి, వెల: రూ.60, పుటలు:128, ప్రతులకు: రచయిత్రి, బి.391, శ్రీకృష్ణానగర్, యూసఫ్‌గూడ చెక్‌పోస్టు, హైదరాబాద్




**నాగార్జున సాగర్** ప్రచురణ: నాగార్జున కళాభారతి ప్రచురణ వెల: రూ.100, పుటలు: 154, ప్రతులకు: ప్లాట్‌నెం.2, స్వగృహ అపార్ట్‌మెంట్, భాగ్యనగర్ కాలనీ, కూకట్‌పల్లి, హైదరాబాద్




**మన(భాష)గోడు:** సంకలనకర్త: గుత్తికొండ అహల్యాదేవి, వెల: అమూల్యం; పుటలు: 88, ప్రతులకు: సంకలనకర్త, బ్రాంచి పోస్టుమాస్టర్, జంగంగూడెం, నూజివీడు, కృష్ణా.



రామోజీ ఫౌండేషన్

# తెలుగు వెలుగు

మాసపత్రిక




## 'యువకలం'

ఉత్సాహం పరవళ్లు తొక్కే యువతా కలం పట్టండి. మీ మేధకు పదును పెట్టి, దానికి సృజనాత్మకతను రంగరించి... తేటతెలుగులో అక్షరరూపం ఇవ్వండి. మీకు సంబంధించిన అంశాలపై రచనలను మాకు పంపండి. ఎంపికైన వాటిని 'తెలుగు వెలుగు' పత్రికలో ప్రచురిస్తాం. వాటికి బహుమతులూ ఉంటాయి. ఏదైనా కళాశాలలో ఇంటర్ నుంచి పీజీ వరకూ చదువుతున్న విద్యార్థులకు మాత్రమే ఈ పోటీ.

చదువులు, స్నేహాలు, అల్లరి, ఆటలు, పాటలు, ప్రేమ, ఉద్యోగాన్వేషణ, అధ్యాపకులతో అనుబంధం, ఉన్నత చదువుల కోసం ప్రణాళిక, సేవాకార్యక్రమాల్లో మమేకం, నూతన సృజనల్లో భాగస్వామ్యం, కళాశాల వాతావరణం, కుటుంబ జీవితం, సామాజిక అనుబంధాలు... అంశం ఏదైనా సరే విద్యార్థి జీవితాన్ని ప్రతిఫలించాలి. కళాశాల యువత ఆలోచనలు, కలలు, కోరికలను అక్షరీకరించాలి. ఎన్ని బాగుంటే అన్నీ ఎంపిక చేస్తాం. వీలువెంబడి ప్రచురిస్తాం.

**కవరుపై 'యువకలం పోటీలకు' అని రాసి మీ రచనలను తెలుగువెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, హైదరాబాద్- 501 512 చిరునామాకు పంపవచ్చు.**

teluguvelugu@eenadu.netకు మెయిల్ చేయవచ్చు. లేదా మీ సమీపంలోని ఈనాడు కార్యాలయంలో ఇవ్వచ్చు.

పోటీ పూర్తి నియమ నిబంధనలు
తెలుగువెలుగు పత్రిక జనవరి సంచికలో..

## మాటకట్టు - 2 సమాధానాలు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | ల | 2 వా | లం | | 3 పో | | 4 గుం | 5 జ | | 6 త | |
| మ | | క్కు | | 7 పా | రా | ణి | | 8 య | వ | ని | క |
| 9 ని | 10 జం | | 11 ఆ | రా | టం | | 12 అ | మ్ము | | భీ | |
| | 13 ఋ | స | | డు | | 14 శ | య్య | | 15 మ | | 16 ఆ |
| 17 పై | కం | | 18 పా | | 19 మూ | ల్యం | | 20 అ | ర | ణ్యం | లో |
| రు | | 21 ఘం | ట | 22 సా | ల | | 23 మూ | | ల్బు | | చ |
| | వా | 24 టా | | లు | | 25 గం | డో | 26 లం | | 27 సో | న |
| 28 మా | | 29 రా | జ్యం | | 30 పూ | ట | | 31 బో | ది | య | |
| 32 సం | 33 భ | వం | | 34 మే | లు | | 35 చే | ద | | 36 గం | 37 గ |
| | ర్తృ | | 38 మె | డ | | 39 చో | | 40 రా | 41 వి | | ర |
| 42 తా | హ | నా | తు | | 43 వీ | రు | లు | | 44 వి | 45 రా | ళం |
| | రి | | 46 కు | బే | రు | డు | | 47 ఇం | ధ | నం | |

*** 'మా'తో రథసప్తమి**

జవాబులు:

1. మాఘమాసము, 2. అర్కపత్రము, 3. పరమాన్నము,
4. రథంముగ్గు, 5. గొబ్బెమ్మలు

*** పాలుపోవడం లేదా!**

జవాబులు: 1 నీటిపాలు /నేలపాలు /బూడిదపాలు, 2 విన్నపాలు, 3 పాలుపోక, 4 పాలుపంచుకుని, 5 సగపాలు, 6.పాలుపడు

*** శరత్ నవలలు**

జవాబులు:

1. మనదేశం (1949), 2. దేవదాస్ (1953), 3. అర్ధాంగి (1955), 4. తోడికోడళ్లు (1957), 5. బాటసారి (1961), 6. వాగ్దానం (1961)

*** ధార లేకుంటే..**

జవాబు: నీటిని ధారగా వదులుతూ దానం చేసే క్రతువుకి 'ధారాదత్తము' అని పేరు. దానాన్ని సూచించేందుకు ఈ పదాన్ని వాడతాము. కానీ 'దార' అంటే భార్య అని అర్థం. 'దారాదత్తము' అంటే భార్యని వేరొకరికి అప్పగించడం. జమీందారుగారి కోపానికి ఇదీ కారణం.

*** తిరగేద్దాం!**

జవాబులు: 1. లుకలుకలు, 2. వలువ, 3. మిసిమి, 4. కులుకు, 5. పులుపు, 6. కనుక

*** వ్యర్థపదాలు కాదు శబ్దపదాలు**

జవాబులు:

గణగణ, కణకణ, చిటపట, పటపట, పకపక, కువకువ, బిరబిరా, గలగలా, గబగబా, భగభగా, చురచుర, చరచర (వరుస క్రమంలో)

*** ఒత్తులు తేలికే!**

జవాబులు:

- గ, ఘ, చ, ఛ, ఝ, ట, ఠ, డ, ఢ, థ, ద, ధ, ప, ఫ, భ, శ, ష, స, హ, ళ, క్ష (తలకట్టు తీస్తే ఒత్తులుగా మారేవి) - ఖ, జ, బ, ఙ, ఞ, ఞ. (మార్పు లేకుండానే ఒత్తులుగా వాడదగ్గవి)

KRSA101M241







# On your next vacation, take a break from planning.

**Introducing SpiceJet Holidays. Great destinations, happier holidays.**

Now on www.spicejet.com, get exciting holiday packages to destinations like Colombo, Dubai, Goa, Kathmandu, Kochi and Malè. The packages include your flight tickets, hotel bookings and sight-seeing tours. Optional add-ons available on select packages. So go on, take that much needed break.



SPICEJET HOLIDAYS

Choose from over 50 holiday packages to 21 destinations.
Special Dubai Shopping Festival package also available on request.

**For bookings visit http://holidays.spicejet.com**
**For more details, call:1800 209 2434**

spicejet

Package cost may vary depending on air fare applicable at the time of booking. Terms and conditions apply, for details log on to http://holidays.spicejet.com



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| పుస్తకం సంఖ్య | KRSA101M241 |
|---|---|
| పుస్తకం పేరు | తెలుగు వెలుగు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |